# పురాణనామ సంగ్రహము



సాధు లక్ష్మీ నరసింహ శర్మ



# పురాణనామ సంగ్రహము

సోధు. లక్ష్మీనరసింహ శర్మ

సోల్ డిస్ట్రిబ్యూటర్స్
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
అబిడ్స్, హైదరాబాదు - 500 001.

NAVODAYA BOOK HOUSE
STREET OPP. ARYA SAMAJ, KACHIGUDA,
HYDERABAD-500 027. ☎ : 4652387

Puraana Naama Sangrahamu

By: Sadhu Lakshmi Narasimha Sarma

ప్రథమ ముద్రణ : 1982 (సాధు ప్రచురణలు, కాకినాడ - శ్రీ తిరుమల, తిరుపతి దేవస్థానం వారి ఆర్థిక సహాయంతో ప్రచురించారు.)

ద్వితీయ ముద్రణ : 1997



ముఖచిత్రం: వాసు




వెల: రూ. 80-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్, అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం, కాకినాడ, గుంటూరు, అనంతపురం, హన్మకొండ, తిరుపతి.

ముద్రణ:

# ★ మనవి

తీర్థ రూపులైన మా తాతగారి రచన ఇది. అయన బళ్ళారి పట్టణంలో వార్లా హైస్కూలులో పండితులుగా 1930 నుండి 1965 వరకు పనిచేసిరి. 1965 సెప్టెంబరులో సర్వీసు తుదిరోజులలో ఉండగానే తమయాభైనాల్గవ ఏట మరణించిరి.

అయన బళ్ళారిలోనే కాక రాయలసీమలోను, మైసూరు రాష్ట్రములోను పలుచోట్ల థియాసఫిస్టుగానూ, హిందూమతోపన్యాసకులుగాను సుపరిచితులు. రామకృష్ణ పరమ హంస, వివేకానందస్వామి, వీరిప్రబోధములతో ప్రారంభమైన హిందూమత పునరుజ్జీవన స్రవంతిని, టాగూరు, ప్రేమచంద్, ఉన్నవవారూ తెలుగుభావకవులూ లేవదీసిన సాహిత్యస్రవంతిని వెనుకబడిన రాయలసీమలోను రాయలసీమనానుకొన్న మైసూరు జిల్లాల్లోను ప్రవహింపజేసిన వారాయన.

అయన ఛాందస హిందూ అచారాలనూ, కాలానుగుణ్యంగామార్చని హిందూ ధోరణులనూ నిరసించేవారు. భారతీయభూమిలో వేళ్ళూనని పాశ్చాత్యానుకరణను "అధునాతనత"నూ చూసి బాధపడేవారు. అయన నిత్యాన్వేషి. నవ్యత్వాన్ని ఆహ్వానించేవారు. యువకుల్లో నవ్యత్వాన్ని ప్రోత్సహించేవారు. సకల మతాలనూ గౌరవించేవారు.

బాల్యంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని స్వగ్రామమైన మణేసముద్రం (అనంత పురంజిల్లా) విడిచి, మైసూరు, బెంగుళూరులలో వేదాభ్యాసం చేశారు. ఆ రోజుల్లోనే స్వాతంత్ర్యోద్యమఫలితంగా దేశంలో బయలుదేరిన సాహిత్య, మతపరములైన ధోరణులు అయన మనస్సుపై ప్రగాఢమైన ముద్రవేసినవి. మైసూరు వాసుదేవాచార్యులవద్ద సంగీతశిక్షణారంభము (అది తృటిలోనే అగిపోయినది) వీణాశేషణ్ణగారి కచేరీల అస్వాదన, మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారి కార్యకలాపాల దర్శనము, మైసూరు అస్థాన కార్యకలాపాల ప్రేక్షకత్వం ఇవన్నీ అయన్నెంతో ప్రభావితంచేశాయి. అనేక యిబ్బందుల్లో బాల్యంగడిపి విద్వాన్ పూర్తిచేసి సుమారు ఇరవయ్యవఏట అయన బళ్ళారిలో సంస్కృత పండితులుగా స్థిరపడినారు.

ఉపాధ్యాయులుగా ఏనాడూ అయన విద్యార్థులకు పాఠ్యప్రణాళికను మాత్రం వల్లెవేసి, అయిందనిపించి, తృప్తిపడేవారుకారు. విద్యార్థుల వ్యక్తిత్వాన్ని పెంపొందించే సాహిత్యాభిరుచి కల్గించే కార్యక్రమాల నెన్నిటినో అయన చేబట్టేవారు. అందుకే విద్యార్థుల్లో అయనపట్ల ఉపాధ్యాయ భావమేకాదు. నిజమైన గురుభావముండేది.

నిత్యాన్వేషకుడుగా అయన రామకృష్ణ పరమహంస బోధలు, తరువాత ఆదిశంకరుల అద్వైతం, తర్వాత అరవిందుల Life Divine, జిడ్డు కృష్ణమూర్తి, బెర్ట్రెండ్ రస్సెల్ మొదలైన తత్వశాస్త్రధోరణులకాకర్షితులై, వాటి నాకళింపజేసుకొని తత్త్వష్టార్తులకు సరళంగానూ, అవేశంతోనూ బోధిస్తూండేవారు. శ్రీ బళ్ళారి రాఘవాచార్యులు, శ్రీ కల్లూరు సుబ్బారావుగారు మొదలైన పెద్దలతో మా తాతగారికి సాన్నిహిత్యముండేది.

వారీయన్ను ప్రోత్సహించేవారు. కన్నడ సాహితీవేత్తలు శ్రీ బేంద్రె, డీ.వీ. మొదలైన వారికీయన గౌరవపాత్రులు.

సాహిత్యంలో రామాయణ భారతాలు కాళిదాసు భవభూతి మొదలు, టాల్‌స్టాయ్, టాగూరు, ప్రేమచంద్, గోర్కీ మొదలైన మహనీయుల రచనల్ని అధ్యయనంచేసి అయాస్వారస్యాలను ఇతరులకు చెప్పేవారు.

ఆయన ఎన్నో రచనలు చేశారు. అనువాదాలు చేశారు. ఒక్కటీ అచ్చుకాలేదు. ఇది 1938 నాటికి ముందు రచన. ఆశ్రయ విద్యలు సరిపడకనో, అందుబాటులోని ప్రచురణకర్తల తోడ్పాటు లేకనో ఇది వెలుగు చూడలేదు.

ప్రసంగ వంశంగా ఇది మాయింటచూసిన కొందఱు ప్రోత్సహించి, పిల్లలలో బొత్తిగా నశిస్తున్న పౌరాణిక సంప్రదాయపరిచయానికిది బాగా పనిచేస్తుందని పెద్దలు శెలవిచ్చినందున దీన్ని ప్రచురించినాము. ఇందులో లేనివి కొన్ని అనుబంధంగా చేర్చినాము.

దీన్ని పరిష్కరించుటలోను, అనుబంధము తయారు చేయుటలోను అనేక పురాణ గ్రంథములు తోడ్పడినవి. ముఖ్యంగా పేర్కొనవలసినవి శ్రీ వేమూరి శ్రీనివాసరావు (1926) ప్రకటించిన "పూర్వగాధాలహరి", నందలాల్ డేగారు (1927) ప్రకటించిన Geographical Dictionary of Ancient and Medieval India అన్న గ్రంథాలు.

భాష నాటి కోలారు అనంతపురం ప్రాంతాల శిష్టుల భాష. దానిని మేము మార్చలేదు. తెలియనివి యధాతధంగా ఉంచినాము. పాఠకులూ, పండితులూ ఎత్తిచూపితే ముందు ముద్రణలో సవరించుకొందుము. ఒక్కొక్క పేరుకూ ఏయే పురాణాల్లో ఏయే చరిత్ర ఉందో సాకల్యంగా వివరిస్తూ పరిపూర్ణమైన రెఫరెన్సు గ్రంథాన్ని తెలుగులో తేవలసిన అవసరమున్నది. తగువీలు కల్పించి ప్రభుత్వమూ, అర్షసంప్రదాయానికి ప్రాపుకాదల్చుకొన్న సంపన్నులూ, సంస్థలూ సహకరిస్తే రెండవముద్రణలో ఎదుగుదల చూపుతాము.

కోరినంతనే సహాయమందజేసిన తిరుపతి దేవస్థానంవారికి కృతజ్ఞులం. మా తండ్రిగారి మిత్రులూ, సహోద్యోగులూ అయిన శ్రీ T.S. కుమారస్వామిగారికి, శ్రీ L.V. సుబ్బారావుగారికి, ప్రచురణలో స్వామ్యంవహించిన బంధుమిత్రులకూ కృతజ్ఞతలు.

కాకినాడ - 1
27-11-81.

సాధు లీలావతి

★ మొదటి ముద్రణకు.

★ ★ ★

'ఆమ్నాయ సరస్వతీ'
"వేదభాష్య విశారద"
"వేదభాష్యాలంకార"
దేవాదాయ శాఖ మత సలహా సంఘ సభ్యులు,

10-3-103,
తూర్పు మారేడ్ పల్లి,
సికింద్రాబాద్.

# శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రి

ఆస్థాన విద్వాన్, తిరుమల తిరుపతి దేవస్థానము
ఆస్థాన విద్వాన్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

అనంతపురం జిల్లాలో మణేసముద్రం అను గ్రామ వాస్తవ్యులు సాధు లక్ష్మీ నరసింహాశర్మగారు చాల విద్యలలో ప్రవేశం కలవారు, ఉత్తములు. వారు లోకవ్యవహారంలో వ్యవహరింపబడు చాలపదములకు వేదములు మున్నగువాటికి అనేక ఉద్గ్రంథములనుండి పూర్వవృత్తములను, సంప్రదాయ సిద్ధములగు విషయ విశేషములను చిరకాలము కృషిచేసి గ్రంథరూపమున లోకమునకు అందించినారు.

ఈ గ్రంథములో అనేకములగు విషయములు మనకు తెలియనివి, తెలుసుకోవలసినవి ఆశ్చర్య జనకములైనవి కలవు. స్థాలీపులాక న్యాయముగా వారి కుటుంబీకులు తీసుకొనిరాగా వారి ముఖమునుండి ఏతద్గ్రంథస్థవిషయములను వినియుంటిని.

వీరి అనంతరం వీరిపుత్రులు సాధు సుబ్రహ్మణ్యం శర్మగారు మరికొన్ని విషయ ములనుచేర్చి ఆధునికులకు మనోరంజకమగురీతిని స్థలవిశేషము మేపు వగైరాలతో గ్రంథమును పూర్తిచేసిరి. ఈ గ్రంథములోని అనేక విషయములను లోకమునకు తెలియుట అవసరమని యోచించి తిరుమల తిరుపతి దేవస్థానము ప్రధాన ఆఫీసరువారు గ్రంథమునకు కొంత ద్రవ్యసహాయము గావించి గ్రంథ ప్రకటనకు మహోపకారము చేసిరి.

ఆస్తిక మహాశయులు వీరి అందరి శ్రమలను ఏతద్గ్రంథ పఠనముచే సార్థకము చేయుదురుగాక. ఆచంద్రతారార్కము ఈ గ్రంథము చదువరులకు సంతోషదాయక మగుగాక!

ఉ॥ గ॥ శాస్త్రి
24 - 1 - '82

# ప్రశంస

**కళాప్రపూర్ణ డా. దివాకర్ల వేంకటావధాని**
ఎం.ఏ.,(ఆనర్సు)పి.హెచ్.డి.

కీ॥శే॥ సాధు లక్ష్మీనరసింహశర్మగారు పలు భాషలలో గొప్ప పండితులై, బహురంగములలో నసాధారణమైన కృషిసల్పి, సంఘ శ్రేయమునకై పాటుపడిన మహనీయులు. వారు అనంతపుర మండలమందలి ఘణే సముద్రమునకు చెందిన వారయ్యును, మైసూరు, బెంగుళూరు పట్టణముల కేగి, వేదాభ్యాసము గావించి, సంగీతమునందు కూడ కొంత పరిచయము సంపాదించిరి. వారు ఇరువదవ ఏట విద్వత్పరీక్షలో నుత్తీర్ణులై బళ్ళారి నగరము నందలి వార్డా ఉన్నత పాఠశాలలో సుమారు ముప్పది అయిదు సం॥లు సంస్కృత పండితులుగా పనిచేసి యుండిరి. వీరు రాయలసీమలోను, మైసూరు రాష్ట్రమునందును బ్రహ్మసమాజ మతమును గూర్చియు, హిందూమతమును గూర్చియు, రామకృష్ణ వివేకానందుల ప్రబోధములను గూర్చియు పెక్కు ఉపన్యాసము లొసంగి యుండిరి. జగద్గురు శంకరాచార్యుల వారు అరవింద యోగి, జిడ్డు కృష్ణమూర్తి, బెర్ట్రాండ్ రసెల్ మున్నగువారి తాత్త్విక ప్రబోధములను క్షుణ్ణముగా అవగాహనము చేసికొని జన సామాన్యమునకు బోధించుచుండెడి వారు. వేద సంస్కృతములందు పండితులై మూఢాచారములను నిరసించి, కాలానుగుణముగా సంఘ సంస్కారమునకు పాటుపడిన విశాలభావ సంపన్నులు శ్రీ శర్మగారు, వారు రచించిన గ్రంథములెన్నో కలవట. అందు 1938వ సం॥నకు ముందే రచింపబడిన ఈ ప్రశస్త గ్రంథ మొక్కటే వారి మనమరాలైన సాధు లీలావతిగారి కృషిచే ముద్రితమై వెలుగు చూచుట సంభవించినది.

సంస్కృతమునందలి పురాణములన్నియు తెలుగున కనువదింపబడియున్నవి. వాని యందలి విజ్ఞానమపారమైనది. ఇప్పటి విద్యార్థులకు వానినన్నిటిని పఠించుటకు తగిన తీరికగాని, ఓపికగాని లేకున్నది. పాఠ్యగ్రంథములను చదువునపుడు అందందు పురాణములందలి వ్యక్తులయు, కథా సన్నివేశములయు, వృత్తాంతములు సూచితము లగుచుండును. ఆ వృత్తాంతములనెఱుంగుటకు పురాణాది విజ్ఞానమెంతో యవసరము. అచ్చటి సందర్భమును పూర్తిగా తెలిసికొనుట కాయా పూర్వగాథలను గూర్చి యెఱుగ వలసిన ఆవశ్యకత ఎంతో యుండును. ఆ అవసరమును తీర్చుటకు 'పూర్వ గాథాలహరి' అను గ్రంథ మొకటి కలదు. అసమగ్రమైనను అది పాఠశాలలో తెలుగు, సంస్కృతములను బోధించు నుపాధ్యాయులకునుఁ వానిని నేర్చుకొను విద్యార్థులకును పెక్కు విధములనుపయోగపడుచున్నది. కొన్ని విషయములందు లభింపనపుడు జిజ్ఞాసువులు నిరాశపడవలసి వచ్చుచుండును. పురాణనామ సంగ్రహమును ప్రశస్తమైన యీ గ్రంథము ఆ లోపమును కొంతవరకు తీర్ప జాలుననుటలో సందేహములేదు.

శ్రీ లక్ష్మీనరసింహ శర్మగారు బహు భాషా కోవిదులును, సంస్కృత పండితులు నగుటచే ననేక గ్రంథములు చదివి పూర్వగాథా సముద్రమని చెప్పదగిన ఈ

గ్రంథమును సిద్ధము చేసియుండిరి. పురాణములందు పేర్కొనబడిన స్త్రీ పురుషులయు, తీర్థప్రదేశాదులయు, నామముల సంఖ్య వేలకు మించి యుండును. "ఏ వ్యక్తి ఎవరు? ఏ ప్రదేశ మెచ్చట నున్నది? వాని ప్రాముఖ్యమేమి?" అను విషయములను తెలిసికొన వలయునన్న సర్వపురాణములను తిరుగవైచి కాలము వ్యయము చేయవలసిన అక్కఱలే కుండ శ్రీ శర్మగారీ గ్రంథమును రూపొందించి యుండిరి. ఇందు పౌరాణిక వ్యక్తులను గూర్చియు, వారి చరిత్రలను గూర్చియు, అందలి తీర్థప్రదేశాదులను గూర్చియు, వివిధ మతముల సారాంశమును గూర్చియు, మాత్రమే కాక సంస్కృతాంధ్రముల యందలి కవులను గూర్చియు, తత్కృతులను గూర్చియు సంగ్రహముగా చెప్పబడియున్నది. ఈ గ్రంథమునకు పురాణనామ సంగ్రహమను పేరున్నను పురాణేతర నామములను గూర్చికూడ ఇది వివరించుచున్నది. ఇందు చెప్పబడిన విషయముల సంక్షిప్తముగానే యుండవచ్చును. కాని అవి ఏ గ్రంథమునందున్నవో సూచన లభించును. కావున జిజ్ఞాసువులా గ్రంథములను పఠించి ఆయా విషయములను గూర్చి సమగ్ర జ్ఞానము పొందవచ్చును. ఇందలి ఆరోపములన్నియు నిఘంటువు నందువలె అకారాదిక్రమమున కూర్పబడి యుండుటచే నేదైన కావలసిన వారు సులభముగ అది ఎచ్చటనున్నదో తెలిసికొని తద్వృత్తాంతము నెఱుంగుట సులభ సాధ్యమగుచున్నది. గ్రంథకర్తగారు పరిశీలించిన గ్రంథములను చూచినచో వారు పడిన శ్రమ ఎంత అపారమైనదో, వారు సమకూర్చిన విషయమెంత విస్తృతమైనదో తెలియవచ్చును.

నిజమున కిట్టి గ్రంథములు ఒక్కరికి సాధ్యములగునట్టివి కావు. బహుపండితులు కలసి చేయవలసిన కృషి యిది. అయినను గ్రంథకర్త గారు విశేష శ్రమ కోర్చి, ఈ గ్రంథమును రచించి, ఆంధ్రుల నధమర్ణులను గావించియున్నారు. ప్రస్తుతము బాల బాలికలలో పూర్తిగ లోపించి ఉన్న పౌరాణిక సంప్రదాయ పరిజ్ఞానమునకీ గ్రంథమెన్నో విధముల తోడ్పడగలదు. ఆంగ్లమునందును, తెలుగునందును, తదితరభాషలందును ఇట్టి గ్రంథములను చూచి యిందులేని విషయములను కూడ చేర్చి పరిష్కర్తలు దీని కొక విధమైన సమగ్రత్వము నాపాదించి యున్నారు.

ఇందలి భాష సులభ సుందరముగా నున్నది. కోలారు, అనంతపురము, బళ్ళారి మున్నగు ప్రాంతములందలి శిష్టుల భాషయే ఇందు వాడబడి యున్నది. దాని నర్థము చేసికొనుట కెవ్వరును శ్రమపడవలసిన అవసరములేదు. శ్రీ శర్మగారు రచించిన గ్రంథములముద్రితములైన వింకను ఎన్నో కలవట. వారి విజ్ఞాన సంపదను, విశాల హృదయ భావములను పరిశీలించినచో వానిని సత్వరమే ముద్రింపవలసిన అవసరమున్నదని తోచకమానదు. సర్వోపయోగకరమైన యిట్టి ప్రశస్త గ్రంథమును రచించిన శ్రీ శర్మగారికిని, దానిని పరిష్కరింపజేసి ముద్రితము గావించిన సాధు లీలావతి గారికిని, గ్రంథ ముద్రణకు ధనసహాయ మొనరించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికిని జిజ్ఞాసువులు కృతజ్ఞతా బద్ధులైయుందురు.

- దివాకర్ల వేంకటావధాని

# సంజ్ఞలు

అ : అయువంశస్థుదు
అం : అంగదేశపురాజు
ఇ : ఇక్ష్వాకు వంశస్థుడు
ఉరా : ఉత్తర రామాయణము
ఉహ : ఉత్తర హరివంశము
కల్కి : కల్కిపురాణము
కా : కాశ్యుని వంశస్థుడు
కాశీ : కాశీ ఖండము
కు : కురుని వంశస్థుడు
కూర్మ : కూర్మ పురాణము
ఛాన్దో : ఛాన్దోగ్యోపనిషత్తు
చూ : చూడుము
జై.భా. : జైమిని భారతము
ద : దనువంశస్థుడు, దానవుడు
ది : దితి వంశస్థుడు, దైత్యుడు
దే.భా. : దేవీ భాగవతము
నరి : నరిష్యంతుని వంశస్థుడు
నా : నామాంతరము
పద్మ : పద్మ పురాణము
పా : పాంచాలదేశపు రాజు
పు : పూరుని వంశస్థుడు, పౌరవుడు
ప్రి : ప్రియవ్రతుని వంశస్థుడు
బ్రహ్మ : బ్రహ్మపురాణము
బ్రహ్మాం : బ్రహ్మాండ పురాణము
బ్ర.వై. : బ్రహ్మవైవర్త పురాణము
భాగ : భాగవతము
భార : భారతము
మ : మగధదేశపు రాజు
మత్స్య : మత్స్య పురాణము
మార్కం : మార్కండేయ పురాణము
య : యదువంశస్థుడు, యాదవుడు
ర : రక్కసుడు
రామా : రామాయణము
ఋ : ఋషి
లింగ : లింగపురాణము
వరాహ : వరాహ పురాణము
వామ : వామన పురాణము
వాయు : వాయు పురాణము
వి.రా. : విచిత్ర రామాయణము
వేంక : వేంకటాచల మహాత్మ్యము
విష్ణు : విష్ణుపురాణము
వై : వైకృతము
శివ : శివపురాణము
స్కాంద : స్కాంద పురాణము
హర : హరవిలాసము

★ ★ ★

# పురాణ నామసంగ్రహము

## అ

**అంగజుడు** : మన్మథుడు

**అంగదపురము** : హిమవత్పర్వతమునకు సమీపమున ఉండెడి యొక పట్టణము, లక్ష్మణుని కొమరుడగు అంగదునిచే నిర్మింపబడెను. (రామా)

**అంగదుడు** : (1) వాలికొడుకు-,
(2) ఇ॥ శ్రీరాముని తమ్ముడగు లక్ష్మణుని పెద్దకొడుకు, ఇతడు అంగదపురమును నిర్మించెను. (రామా)

**అంగదేశము** : గంగాసరయూ నదీసంగమ ప్రాంతదేశము, ఇచ్చట రుద్రుడు తపము చేయుచుండు సమయంబున అతనికి మన్మథుడు కామవికారము కలుగజేయ ప్రయత్నింప రుద్రుడు కోపించి, మూడవకన్ను తెరచిచూచి మన్మథుని భస్మము చేసెను. నాటినుండి మన్మథుడు అంగము లేనివాడై అనంగుడు అన బరగెను. అతని అంగము ఇచటి భూమిలో కలసిపోయినందున దీనికి అంగదేశము అను పేరుకలిగె. (రామా)

**అంగన** : ఉత్తరపు దిక్కున నుండు ఆడయేనుగు.

**అంగమొలివేల్పు** : శివుడు.

**అంగారకుడు** : ఏకాదశ రుద్రులలో ఒకడు. భూపుత్రుడు. నవగ్రహములలో ఒకడు. నా॥ భౌముడు, కుజుడు, మంగలుడు. (బ్ర. వై) (పద్మ)

**అంగార వర్ణుడు:** సోమశ్రవస్తీర్థమున అర్జునునితో యుద్ధము చేసి అతని ఆగ్నేయాస్త్రముచే దహింపబడి అవల చిత్రరధుడను నామముచే పరగిన యొక గంధర్వుడు. ఇతని యుపదేశమున పాండవులు ధౌమ్యుని పురోహితునిగా కొనిరి. భార్య కుంభీనస. (భార)

**అంగిరసుడు**
**అంగిరుడు** : (1) బ్రహ్మ మానస పుత్రులలో నొకడు. ఇతనికి బృహస్పతి, ఉతథ్యుడు లేక సంవర్తుడు అను నిరువురు కొడుకులును, యోగసిద్ధి అను నొక కూతురును కలిగిరి. ఈ యోగసిద్ధి అష్టవసువులలో ఒక్కడగు ప్రభాసుని వివాహము చేసికొని అతని యందు విశ్వకర్మను

గనెను. తొల్లి అగ్నిదేవుడు దేవతలతోడి యలుకచే హవ్యంబుల వహింప నొల్లక వనమునకుచన, దేవతలు అధిక తపో విజృంభితుడగు అంగిరసుని అగ్నిపదమునందు వుంచిరి. అంత కొంతకాలమునకు అగ్ని మరలిరాగా అంగిరసుడు అతనిని ప్రథమాగ్నియయి యుండుమని తాను అతనికి ప్రథమ పుత్రుడు అయి అగ్నిసాహాయ్యమున రేజరిల్లె. ఈ రూపమున నతనికి శివయను భార్యయందు బృహజ్జ్యోతి బృహత్కీర్తి, బృహన్ముఖుడు. బృహన్మతి, బృహద్భానుడు, బృహస్పతి, బృహద్బ్రహ్మ, అనునేడుగురు కొడుకులును, అనుమతి, రాక, సినీవాలి, కుహువు అర్చిష్మతి హవిష్మతి, మహామతి అనునేడుగురు కూతులును పుట్టిరి. వీరును వీరిసంతతి వారందరును అగ్నిస్వరూపులయి ఉందురు. (భార)

(2) ఇ॥ ఉల్మకుని కొడుకు. అంగుని తమ్ముడు, భార్య స్మృతి.

**అంగుడు** : (1) ఉల్మకుని జ్యేష్ఠపుత్రుడు భార్య సునీధి. కొడుకు వేనుడు. (విష్ణు)

(2) యయాతి నాల్గవ పుత్రుడగు, అణువు యొక్క వంశస్థుడయిన బలికి పెద్ద కొడుకు. (భార)

**అంజన** : ఒక యప్సరస, ఈమె శాపముచే కామరూపిణియగు వానరముగ పుట్టెను. ఒకనాడు ఈమె మానుష రూపము ధరించి ఉండునపుడు, వాయువుచూచి మోహించి ఈమెయందు హనుమంతుని కనెను. ఈమె కేసరి అను వానరుని భార్య. కుంజరుడు అను వాని కూతురు. (శివ) (రామా)

**అంజనీ పర్వుడు** : ఘటోత్కచుని కొమరుడు. ఇతడు భారత యుద్ధమున అశ్వత్థామతో చంపబడెను. (భార)

**అంజనము** : పడమటి దిక్కునందలి మగయేనుగు.

**అంజనావతి** : ఈశాన్య దిక్కునందుండెడి ఆడయేనుగు.

**అంతకుడు** : యముడు.

**అంతరిక్షుడు** : ద॥ మురాసురుని కొడుకు. ఇతడు శ్రీకృష్ణునిచే చంపబడెను

**అంతర్ధానుడు** : నా॥ విజయాశ్వుడు. పృథుచక్రవర్తి కొడుకు. ఇతనికి ఇరువురు భార్యలు. మొదటి భార్యయగు శిఖండి వసిష్ఠుని శాపముచే భూమి యందుపుట్టి త్రేతాగ్నులయిన పావకుడు పవమానుడు శుచి అను మువ్వురు పుత్రులను

కనెను. వీరు బాల్యమునందె చనిపోయిరి. రెండవభార్యయగు నభస్వతికి హవిర్ధానుడు అనుకొడుకు పుట్టెను. (విష్ణు)

**అంతశ్శిల** : వింధ్యపర్వతమునుండి వెలువడెడి యొకనది.

**అంతిసారుడు** : పు॥ చూ॥నా॥ మతిసారుడు.

**అంధకుడు** : (1) యదుసాత్వతుని కొడుకులలో ఒకడు. ఇతనికి భజమానుడు కంసురుడు శుచి కంబళబర్హిషుడు అనునలుగురుపుత్రులు (2)దను పుత్రుడు, ఇతడు శివునిచే చంపబడెను. (భాగ)

**అంధుడు** : (1) మహస్వానిపౌత్రుని పుత్రుడు (2) ఉప॥ విప్రచిత్తు కొడుకు.

**అంధ్రము** : తెనుగు దేశము.

**అంబ** : (1) పార్వతి (2) కాశిరాజు కూతురు. ఈమెకన్యగా ఉండునపుడు తండ్రియగు కాశిరాజుచే స్వయంవరమున సాల్వునకు ఈయంబడి యుండినను భీష్ముడు బలాత్కారమున ఈమెను ఈమె చెల్లెండ్రగు అంబికాంబాలికలను యుద్ధమునందు శత్రురాజుల నందఱను ఓడించితెచ్చి తనతమ్ముడగు విచిత్రవీరునకు వివాహముచేయబోవు నెడ ధర్మశాస్త్రజ్ఞులు అంబ పూర్వమే తండ్రిచే దత్త అయినందున ఆమెను పరుల వివాహమగుట ధర్మము గాదని చెప్పగా ఆమెను భీష్ముడు సాల్వరాజు నొద్దకుపంప సాల్వరాజు తన్ను పెండ్లియాడనని ధిక్కరించినందున ఆమె చచ్చి రెండవ జన్మమున శిఖండిగ ద్రుపదరాజునకుపుట్టి భీష్ముని భారతయుద్ధమున పడవేసెను. చూ॥ శిఖండి (భార)

**అంబరీషుడు** : (1) ఇ॥ తండ్రి మాంధాత. కొడుకు యౌనాశ్వుడు (2) రెండవ నాభాగుని కొడుకు. నభగుని పౌత్రుడు. ఇతడు కేవలము హరిభక్తుడు. ఒకప్పుడితడు ద్వాదశి వ్రతము చేయు చుండు నవసరమున దుర్వాసుడను మహర్షి యతనియొద్దకువచ్చి భోజనమునకై ప్రార్థింపబడి, యమునయందు స్నాన మాచరింప బోయి, అందుండి శీఘ్రముగా రామింజేసి ద్వాదశిగడియ మీరక మున్న ఆహారము పుచ్చుకొనవలసి యుండుటవలన ఈ యంబరీషుడు బ్రాహ్మణుల యనుమతిని జలపానముచేసె. అది తెలిసికొని దుర్వాసుడు కోపించి అంబరీషుడు భస్మమగునటులు తన జడ యొకటి తీసివైచె. అది విష్ణువు ఎరిగి అంబరీషునికాపాడుటకు తనచక్రమును పంపెను. అంత ఆ చక్రము, ఆ జడకను భస్మము చేసినదేకాక దుర్వాసుని తరుముటకు ఆరంభింపగా అతడు మూడులో

ములు తిరిగి తిరిగి వేసారి బ్రహ్మరుద్రులచే జారవిడువంబడి భక్తపరాధీనుండగు విష్ణువుచే అంబరీషుని పాలికి పనుపబడ అతడు చక్రమును స్తుతించి దుర్వాసుని కాపాడెను. ఈయంబరీషునకు విరూపుడు, కేతుమంతుడు, శంభుడు అను మూవురు కొడుకులు. (రామా) (భాగ)

**అంబష్ఠదేశము** : ఉశీనరుని కొడుకగు సువ్రతుడు నిర్మించిన రాజ్యము. ఈ దేశస్థులు అంబష్ఠులు అనంబడుదురు.

**అంబాత్రయము** : జ్ఞానాంబ భ్రమరాంబ · మూకాంబ.

**అంబాలిక, అంబిక** : అంబ చెల్లెండ్రు. కాశిరాజు కూతులు. విచిత్రవీర్యుని భార్యలు. వీరలలో అంబిక జ్యేష్ఠురాలు. విచిత్రవీర్యుని మరణానంతరము దేవరన్యాయమున వీరియందు సత్యవతి యాజ్ఞనొంది వ్యాస మహర్షి ధృతరాష్ట్ర పాండు రాజులను పుట్టించెను. (భార)

**అంబిక** : పార్వతి.

**అంశుమంతుడు** : ఇ॥ (1) తండ్రి అసమంజసుడు. కొడుకు దిలీపుడు (2) సూర్యుడు. (బ్రహ్మ)

**అంశుమాలి** : సూర్యుడు

**అకంపనుడు** : ర॥ సుమాలి కొడుకు. జనస్థానమున ఖరదూషణ త్రిశిరసులు రామునిచే చంపబడిన వృత్తాంతమును వీడు రావణునకు తెలియజేసెను. లంకను రాముడు ముట్టడివేసినపుడు పశ్చిమ ద్వారమున హనుమంతునిచే వీడు చంపబడెను. (రామా)

**అక్రూరుడు** : య॥ శ్వఫల్కుని పెద్ద కొడుకు. ఇతడును వృష్ణివంశస్థుడగు సాత్యకియు పినతాత పెత్తాత బిడ్డలు. (భాగ)

**అక్రోధనుడు** : కు॥ అయుతాయువు కొడుకు. (భార)

**అక్షమాల** : అరుంధతి.

**అగస్త్యభ్రాత** : అగస్త్యుని సహోదరుడు. ఇతనికి గర్భమునందే జ్ఞానము కలిగినందున వ్యవహారార్హుడు కాడాయెను. కనుక ఇతనికి వ్యవహార నామములేదు. పేరిచే తెలిసికోదగనివానిని అగస్త్యభ్రాత అందురు.

**అగస్త్యుడు** : ఇతడొక మహర్షి. మిత్రావరుణులు సముద్రపుగట్టున సంచరించుచుండి ఊర్వశిని చూచి కామింప వారికి వీర్యములు స్ఖలితములై ఘటమున ఉనుప

బడగా అందు అగస్త్యవసిష్ఠులు పుట్టిరి. ఇతని యాశ్రమము వింధ్యపర్వత సమీపమున. ఈతని కథలనేకము కలవు. వాతాపి ఇల్వలుడు అను నిరువురు రాక్షసులు బ్రాహ్మణులను మిగుల హింసించుచుండిరి. రాక్షసులు కామరూపులు గనుక ఇల్వలుడు సాధారణముగా ఒక బ్రాహ్మణ రూపము ధరించి వాతాపిని మాంసముగ వండి తనయింట పితృకార్యమనుచు బ్రాహ్మణుని ఎవ్వనినైనను పిలిచి భోజనము పెట్టి భోజనానంతరము బ్రాహ్మణ భుక్తశేషమును భుజియించుటకు రమ్మనువాని వలెనే వాతాపిని పిలుచును. వాడు అపుడు ఆ బ్రాహ్మణుని పొట్టచించుకొని వెలుపలికి వచ్చును. ఈ సంగతిని అగస్త్య మహర్షి యెఱిగి ఒకదినము ఇల్వలుని యింటికి బ్రాహ్మణార్థము వచ్చెను. అప్పుడు ఎప్పటి తెఱంగున ఇల్వలుడు చేయగా అగస్త్యుడు "వాతాపే జీర్ణోభవ" అనెను. అంత వాతాపి నశించెను. ఇల్వలుడు అగస్త్యునిపై పడిరాగా అతని కోపముచే భస్మమాయెను. మఱియు తొల్లి ఒకప్పుడు మేరు వింధ్యపర్వతములకు ఒకనిమిత్తము వివాదము కలిగి వింధ్యపర్వతము సూర్య చంద్ర గతులకు అడ్డముగ పొడవెదుగ లోకమునకు అలజడి పొడమ అదితెలిసి దేవర్షులు అగస్త్యుని చెంతకుపోయి పొడమిన విపత్తును విచారింపుడని వేడగా అమ్మహామహుడు బయలు వెడలి తన శిష్యుడగు వింధ్యము కడకురాగా ఆ పర్వత శ్రేష్ఠుడుఅగస్త్యునకు దండప్రణామము నొనర్చుటకు నేలమట్ట మయ్యెను. అప్పుడు అగస్త్యుడు వింధ్యునింగని నేను దక్షిణమునకు పోయి మరలివచ్చుదనుక నీవిచ్చట ఈ ప్రకారమే ఉండు మని పలికిపోయెను. వింధ్యము అది మొదలు ఇదివఱకును ఆ ప్రకారముననే క్రిందపడి ఉన్నదని ప్రసిద్ధి.

వెండియు ఇతడు కాలకేయుల నిమిత్తము సముద్రము నందలి జలమును ఆపోశనముగ తీసికొనెనని పురాణకథ. చూ॥ కాలకేయులు.

మఱియునహుషుడు దేవేంద్రత్వమును అనుభవించుచుండినపుడు ఒకనాడు వేదములంగూర్చియు బ్రాహ్మణులం గూర్చియు నిర్లక్ష్యముగ మాటలాడినందున వానిని సర్పమగునట్లు అగస్త్యుడు శపియించెనని చెప్పియున్నది. అగస్త్యుడు పులస్త్యునికి హవిర్భుక్కు అను భార్యయందు పుట్టినట్లు కొన్నిచోట్ల అగపడుచున్నది.

(ఉ. రామా) (భార) (స్కాం)

**అగజాత** ; పార్వతి

**అగస్తి** : అగస్త్యుడు

**అగ్గి** : అగ్నిదేవుడు

**అగ్గికంటి** ; శివుడు

**అగ్గిచూలి** : కుమారస్వామి

**అగ్ని** : అష్టదిక్పాలకులలో ఒకడు. ఇతనిదిక్కు పూర్వదక్షిణము. భార్య స్వాహాదేవి. పట్టణము తేజోవతి. వాహనము మేషము. ఆయుధము శక్తి. ఇతడు అష్టవసువులలో ఒక్కడై వసువుల కందఱకును రాజై ఉండును. అనలుడు అనియు ఇతనికి నామము కలదు. కొందరు అగ్నిని బ్రహ్మ జ్యేష్ఠపుత్రుడందురు. అతని నామము అభిమానాగ్ని. కుమారస్వామి అగ్నిపుత్రుడని కొన్నిచోట్ల చెప్పబడి యున్నది. చూ. పార్వతి. కాశియందు విశ్వానరుడు అను ఋషికి ఇతడు కుమారుడై పుట్టినందున ఇతనికి వైశ్వానరుడు అనునామము కలదు. చూ. అంగిరసుడు. (త్రేతాగ్నులు - ఆహవనీయము దక్షిణాగ్ని గార్హపత్యము. ఇవిక్రమముగా వేదికి పూర్వదక్షిణ పశ్చిమ దిక్కులందు ఉండును.) (పంచాగ్నులు - పైమూడగ్నులును సభ్యము అపసధ్యము. కడపటి రెంటును వేదికి ఈశాన్య దిక్కునందు ఉండును.) (స్కాం) (భార)

**అగ్నిచయనము** : ఇది యొక యజ్ఞకర్మము. తపుడు అను వహ్నియొక్క కపట వృత్తి నిపుణులయిన పదియేవురు పుత్రులు యజమానుల యజ్ఞ ఫలములను అపహరించుచుండుటచే ఇది వారి శాంత్యర్థము యాగములయందు చేయబడును.

**అగ్నిదేశ్యుడు** : ఇతనిచే ద్రోణాచార్యుడు ధనుర్విద్యాపారంగుడయ్యె.

**అగ్నిద్యోతనుడు** : వివాహ నిమిత్తము కృష్ణుని వద్దకు రుక్మిణిచే పంపబడిన బ్రాహ్మణుడు. (భాగ)

**అగ్నిభువు** : కుమారస్వామి.

**అగ్నిమిత్రుడు** : (మ) పుష్యమిత్రుని కొడుకు. శృంగులలో ఒక్కడు.

**అగ్నివర్చస్సు** : సూతుని శిష్యుడు. గొప్పపౌరాణికుడు.

**అగ్నివేశుడు** : ఇక్ష్వాకుని తమ్ముడగు అరిష్యుని వంశస్థుడయిన దేవదత్తునికొడుకు. ఇతడు కానీనుడై జాత కర్ణుడు అను మహర్షియై వెలసె. ఇతని వలన అగ్నివేశ్యాయనము అనుబ్రాహ్మణకులము కలిగెను. (భార్య)

**అగ్నిష్టోమము** : వసంతకాలమందు ఐదుదినములలోచేసి ముగించెడి యాగము.

**అగ్నిష్టోముడు** : చక్షుర్మనువు కొడుకు. అగ్నిష్టుతుడు.

**అగ్నిష్వాత్తులు** : పితరులలో ఒకభేదము చూ॥ పితరులు.

**అగ్రజన్ముఁడు** : బ్రహ్మ.

**అఘాసురుడు** : బృందావనమున కృష్ణునిచే చంపఁబడిన బకాసురుని తమ్ముఁడు. అజగరాకారమున వీఁడు కృష్ణుని మింగగా అతఁడు వీనికంఠద్వారమున ఊపిరి వెడల నీయక శరీరము పెంచి వీనిని చంపెను. (భాగ)

అచ్చరలు : పై॥ చూ॥ అప్సరసలు

**అచ్యుతకృష్ణానిధి** : సిద్ధాంత కల్పతరువు అను గ్రంథమునకు కృష్ణాలంకారము అను వ్యాఖ్యానము వ్రాసిన యొకపండితుఁడు.

**అచ్యుతుడు** : విష్ణువు.

**అచ్ఛోద** ; ఒక పుణ్యనది. ఇది తొలుత మరీచిసందనులగు పితృగణముల యొక్క మానస కన్యకగాపుట్టి తన పితరులచే నిర్మితమగు అచ్ఛోదము అను సరోవర తీరమున సహస్ర దివ్యవర్షములు తపస్సుచేసి పితరుల మెప్పింపగా వారలు దివ్యాలంకారభూషితులై ప్రొడసూపిరి. అంతట ఆమె తనతండ్రులగు వారలలో మావసుఁడు అనువానిని తనపతిగా కోరెను. ఈ వ్యభిచారముచే ఆమె యోగ భ్రష్టయై స్వర్గమునుండి క్రిందికిపడెనుగాని భూమినంటక మధ్యముననిలిచె. అది దుర్మతియై కోరినను ధీరతచే మావసుఁడు తనమనమును చలింప నీయకుండటంజేసి యక్కార్యము ప్రవర్తిల్లిన దినము అమావాస్య అని పరగె. పితృసంబంధమగునది కావున ఆ దినము పితరులకు ముఖ్యము. ఆ దినమునందు వారలకు చేసెడు స్వల్పక్రియలనైనను వారు అక్షయములుగ భావించి తృప్తినొందుదురు. అట్లు అచ్ఛోద తల్క్రిందుగాపడి పితరులను అందఱను పలుచందముల వినుతించి నా వ్యభి చారమును మన్నించి నాకు మరల గతులు కలుగునటులు కరుణింపుడని వేడఁగా ఆ పితరులు దానింజూచి నీవిపుడు దేవతలు చేసెడు కర్మఫలములను అనుభవించు చుండి యిరువది యెనిమిదవ ద్వాపరమున మీనయోనియందుపుట్టి సత్యవతి అని పేర్కొనంబడి తొలుత పరాశరమహాముని తేజమున వ్యాసమహామునిని కని పిదప శంతనుని భార్యవై విచిత్రవీర్యుఁడు చిత్రాంగదుఁడు అను యిరువురు పుత్రులను కాంచి కడపట అచ్ఛోద అను పుణ్యనదివి అయ్యెదవని చెప్పి అంతర్హితులయిరి. (బ్రహ్మ)

**అచ్ఛోదము** : ఇది ఒకసరస్సు. ఇందు అచ్ఛోద అనునది ఉద్భవిల్లెను. ఈ నదీ తీరమునందు కుబేరుని వనమగు చైత్రరథము ఉండును. (బ్రహ్మ)

**అంజకుడు** : పురూరవుని వంశస్థుఁడగు జహ్నుని పౌత్రుఁడు.

**అజగరుడు** : రహస్యమయిన పరమహంస ధర్మమును ప్రహ్లాదునకు బోధించిన యొక మహర్షి. ఇతడు కావేరీతీరమున సహ్యపర్వత తటమునందు ఉండెను.

**అజగవము** : శివుని విల్లు.

**అజమీఢుడు** : పు॥ తండ్రి హస్తి. కొడుకులు బృహదిషుడు నీలుఁడు, ఋక్షుడు. ఈతని వలన బార్హదిష పాంచాల కౌరవ వంశములు కలిగెను.

**అజాత శత్రువు** : (1) శైశునాగులలో ఆరవరాజు. తండ్రి బింబిసారుఁడు. ఇతఁడును ఇక్ష్వాకు వంశస్థుఁడగు బృహద్బలుని వంశజుడైన శాక్యమునియు ఒక కాలముననే ఉండునట్లు తెలియును. (2) ధర్మరాజు.

**అజామిళుడు** : కన్యాకుబ్జ నగరమునందు ఉండిన యొక విప్రుడు. ఇతఁడు మహా పాతకుఁడయ్యును అంత్యకాలమున నారాయణ నామధేయుఁడగు నిజ పుత్రస్మరణ మూలముగ నారాయణాభిధానము నుడువుటచే యమకింకరుల యొద్ద నుండి విష్ణుదూతలచే విడిపింపఁబడెను. "ఆ॥ బిడ్డ పేరుపెట్టి పిలుచుట విశ్రామ కేళినైన మిగులఁగేలినైన బద్యగద్య గీత భావార్థములనైనఁ గమలనయనుఁ దలఁపఁగలుష హరము" (భాగ)

**అజితుఁడు** ; (1) బ్రహ్మ (2) విష్ణువు (3) శివుడు.

**అజుఁడు** : (1) ఇ॥ తండ్రి రఘువు. కొడుకు దశరథుఁడు. కొందఱు రఘు మహారాజునకు పృథుశ్రవుడు అనునొక కొడుకుఉండినట్లును అతనికి అజుఁడు పుట్టినట్లును చెప్పుదురు. విదర్భరాజు కూతురగు ఇందుమతీ స్వయంవరమునకు పోవునపుడు, ఇతఁడు మార్గమున ఒక ఋషిశాపముచే ఏనుగై ఉండిన యొక గంధర్వుని చంపఁబోవఁగా ఆ మృగము తన పూర్వగంధర్వరూపమును తాల్చి యితనికి అనేకాస్త్రములను ఉపదేశింపగా ఆ యస్త్రముల సాహాయ్యము వలన ఇతఁడు ఎల్లరాజుల జయించి స్వయంవరమున ఇందుమతిని వివాహమాయెను. (2) మి॥ ధృతుడు (3) బ్రహ్మ (4) శివుడు (5) విష్ణువు (6) మన్మథుడు. (రఘు)

**అడిదము సూరన** : ఇతఁడు కవిజనరంజనము అను నొక కృతి తెనుగున చేసెను. అది తాను పడసిన నామమును అన్వర్థము చేయుచున్నది. దీనిని పిల్లవసుచరిత్రము అని చెప్పుదురు. మఱియు ఇతఁడు ఆంధ్రనామశేషము అనెడి యొక నిఘంటువు వ్రాసి ఉన్నాఁడు.

**ఆదిదానవుఁడు** : అంధకుని కొడుకు. వీఁడు స్వస్వరూపమున యుద్ధమున మరణము నొందకుండునట్లును వేరురూపము చెంది మరణము కలుగునట్లును వరమునుఁ బొందియుండెను. కనుక ఒకప్పుడు పార్వతివలె రూపము ధరించి శివుని మోసము చేయరాఁగా అది అతడు యెఱిగి వీనిని చంపెను.

**అణుహుఁడు** : బా॥ విభ్రాజుని కొడుకు. ఇతడు శుకుని కూతురగు కీర్తిమతినిఁ వివాహమాయెను.

**అతనుడు** : మన్మథుడు.

**అతలము** : తెల్లని చాయ కలిగిన యొక యధోలోకము. ఇందు కొన్ని పన్నగములు ఉండును.

**అంతికాయుడు** : ర॥ రావణుని కొడుకు. వీఁడు బ్రహ్మవలన అవధ్యకవచమును పొందియుండెను. లక్ష్మణునిచే బ్రహ్మాస్త్రముతో చంపఁబడెను. (రామా)

**అతిచాంద్రుడు** : ఇ॥ చూ॥ నా॥ ఇంద్రుఁడు

**అతిథి** : శ్రీరాముని కొడుకగు కుశుని కొడుకు. (మత్స్య)

**అతిరథుడు** : అం॥ సత్యకర్మని కొడుకు. ఇతఁడు గంగగట్టున పడియుండిన కుంతీపుత్రుఁడగు కర్ణుని తనపుత్రునిఁగా పెంచుకొనెను. భార్య రాధ. (భాగ)

**అత్రి** : బ్రహ్మ మానసపుత్రులలో ఒక్కఁడు. భార్య అనసూయ. ఇఁతడు తనతపోబలముచే త్రిమూర్తుల యంశములందు సోమదుర్వాసదత్తాత్రేయులను కొమరులుగ పడసెను. [(మార్కం) (భాగ)]

**అదితి** : కశ్యపుని భార్య. దక్షుని కూతురు. కొడుకులు ఆదిత్యులు. [భ.మై) (మార్కం)]

**అదృశ్యంతి** : (1) అరుంధతి (2) శక్తి భార్య. పరాశరుని తల్లి. (లింగపు)

**అద్రిక** : ఒక యప్సరస.

**అద్వయవాది** : జైనుల దేవత.

**అద్వైతము** : ఇది స్మార్త మతము. బ్రహ్మమని అవిద్యయని రెండు పదార్థములు కలవు. అందు బ్రహ్మము జ్ఞానానందాత్మకము నిర్వికారము నిరవయవము నిత్యము నిర్దోషము విభువు. (సత్యము – కాలత్రయముచే బాధింపఁదగనిది. నిర్వి

కారము - రూపాంతరము లేనిది. నిరవయవము - అవయవములులేనిది. నిత్యము-కాలత్రయములయందు ఉండునది.)

అవిద్య- అపారమార్థికము. సదసద్విలక్షణము. జడముసాకారము. సావయవము. అనాంతము. అజ్ఞానరూపము. అపారమార్థికము - మిథ్యాభూతము. బ్రహ్మతత్వ జ్ఞానముచేత నివర్తించునది. ఇది వ్యావహారికసత్త అని చెప్పఁబడుచున్నది. వ్యవహారదశలో సత్తుగా తోచును కాని పరమార్థముకాదు. సదసద్విలక్షణము- సత్తనగా బ్రహ్మము. అసత్తనఁగా తుచ్ఛమయిన శశశృంగాది: పరమార్థిక సత్తయిన బ్రహ్మముకంటెను ప్రమాణసిద్ధముగాన తుచ్ఛముకంటెను విలక్షణమైనది. బ్రహ్మమువలె పారమార్థికముకాదు, తుచ్ఛమువలెప్రమాణములకు అవిషము కాదు.

ఈయవిద్య సత్వరజస్తమోరూపగుణత్రయాత్మకము. దీనికి ఆచ్ఛాదకశక్తి విక్షేపశక్తిఅని రెండు శక్తులు ఉన్నవి. ఆఛ్ఛాదకశక్తి కలయవిద్యచేత అవరింపఁబడిన బ్రహ్మమునకు చీకటిలోఉన్న మనుష్యునకువలె స్వస్వరూప జ్ఞానముచెడి విక్షేపరూపమయిన దేవతిర్యఙ్మనుష్యాది భేదజ్ఞానము కలుగుచున్నది. ఈ దేవాది భేదములు అన్నియు అవిద్యాపరిణామములుగాని పరమార్థములుకావు.

ఈ చైతన్యరూపమయిన బ్రహ్మము. శుద్ధచైతన్యము మాయావచ్ఛిన్నచైతన్యము అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము వృత్త్యవఛ్ఛిన్న చైతన్యము విషయావచ్ఛిన్న చైతన్యము అని అయిదు భేదములుగలది. శుద్ధమైన బ్రహ్మస్వరూపమునకు ఈ భేదములు అవిద్య మొదలుగాఁగల యుపాధులచేత కలుగుచున్నవి., అందు శుద్ధ చైతన్యము అనునది శుద్ధ బ్రహ్మస్వరూపము. మాయావచ్ఛిన్న చైతన్యము అను నది ఈశ్వరుఁడు. అతఁడె జగత్స్రష్ట్యాదికర్త సర్వాంతర్యామి సగుణ బ్రహ్మము.

అంతఃకరణావచ్ఛిన్నచైతన్యముఅనునది జీవుఁడు. ఆకాశగతములయినసూర్యాది తేజములు తటాకాదులయందు ప్రతిబింబించునట్లు తేజోమయమయిన బ్రహ్మచైతన్యము అవిద్యాపరిణామములయిన అంతఃకరణములయందు తోచును. అట్టివి ప్రతిబింబములు. అవియెజీవులు. సూర్యాది బింబములకును జలములయందు తోచునట్టి ప్రతిబింబములకును భేదములేనట్లు, బ్రహ్మజీవులకు భేదములేదు. ప్రతిబింబ భూత జీవులకును అంతఃకరణ రూపోపాధిభేదమేకాక స్వరూపభేదములేదు.

వృత్త్యవచ్ఛిన్న చైతన్యముఅనునది అంతఃకరణపరిణామరూపవృత్తులయందు ప్రతిఫలించు చైతన్యము. ఇదియే జ్ఞానము అని చెప్పఁబడుచున్నది. ఇది ప్రత్యక్షాదిభేదములచే అనేక విధములు కలదిగా ఉన్నది.

విషయావచ్ఛిన్న చైతన్యము ఘటపటాదులు. ఇందు మాయావచ్ఛిన్న చైతన్యమైన యీశ్వరుడు మొదట సృజింపగల ప్రాణి వర్గముల తారతమ్యమునకు హేతువగు కర్మములను తోడుచేసికొని మాయను వశపఱచికొని నామరూపాత్మకమైన అపరిమితశక్తియుక్తమైన సకల ప్రపంచమును సృజియింప సంకల్పించి మొదట ఆకాశాది పంచభూతములను అపంచీకృతములను పుట్టించెను. అందు ఆకాశమునకు శబ్దమును వాయువునకు శబ్దస్పర్శములును, తేజస్సునకు శబ్దస్పర్శ రూపములును. అప్పునకు శబ్దాదులతోడ గంధమును గుణములు.

పృథివి అప్పు తేజము వాయువు ఆకాశము అను పంచభూతములును, గుణత్రయాత్మకమయిన యవిద్యయొక్క కార్యములుగాన ఇవియు త్రిగుణాత్మకములు, సత్వగుణయుక్తములు అయిన యీ భూతములచే త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు అనెడి జ్ఞానేంద్రియములు మనోబుద్ధ్యహంకార చిత్తములు అనెడి యంతఃకరణ పరిణామములును పుట్టుచున్నవి. రజోగుణ యుక్తములు అయిన యీ భూతములచేత వాక్పాణిపాదపాయూపస్థములు అనెడి కర్మేంద్రియములు పుట్టు. రజోగుణముతో కూడిన భూతములచేత ప్రాణాపానవ్యానోదాన సమానములు అను పంచప్రాణములు పుట్టుచున్నవి.

ఈ పంచభూతములచేతను జ్ఞానకర్మేంద్రియములచేతను పంచప్రాణములచేతను మనోబుద్ధులచేతను సూక్ష్మశరీరము పుట్టుచున్నది. ఈ శరీరము లింగశరీరము అని చెప్పఁబడును. ఈ శరీరము పరలోక యాత్రకు అనుకూలమై మోక్షపర్యంతము ఉండునది.

తమోగుణముతోడ కూడిన యపంచీకృత భూతములచేత పంచీకృతభూతములు పుట్టుచున్నవి. పంచీకరణము అనగా ఆకాశాది పంచభూతములను మొదల ప్రత్యేకము రెండుగా భాగించి అందు ఒక్కొక్క యంశమును నాలుగేసిగా భాగించి ఆ నాలుగింటిలో ఒక్కొక్కభాగమును భాగింపని యొక్కొక్క సగముతోఁజేర్చి కలపగా పంచీకృత భూతములు ఏర్పడియె. అందు ఆకాశార్ధమును కడమ భూతములలో ఎనిమిదింట ఒక్కొక్క భాగమును చేర్పగా పంచీకృతాకాశము. ఇట్లు వాయ్వాదులను ఊహింపవలయును.

ఈ పంచీకృత భూతములచేతనే అండములును వానికి లోఁబడిన పదునాలుగు లోకములును జరాయుజాది దేహములును పుట్టుచున్నవి. (జరాయుజములు — జరాయువు వలన పుట్టునవి. మనుష్యాదులు, జరాయువు-గర్భముతిత్తి, అండజ ములు - అండము వలన పుట్టినవి - పక్షిసర్పాదులు. అండము - గ్రుడ్డు. స్వేదజములు - చెమటవలన పుట్టునవి - నల్లి మొదలైనవి. ఉద్భిజ్జములు - భూమిని చీల్చుకొని పుట్టునవి - వృక్షాదులు)

ఇట్టి ప్రపంచమునకు మూలప్రకృతి పరిణామ్యుపాదాన కారణము. ఘటము నకు మన్నువంటిది. పరిణామి అనగా ఒకరూపమునుండి మఱియొక రూపమును పొందునది, బ్రహ్మము ప్రపంచమునకు వివర్తోపాదాన కారణము: అనగా వెండి అను భ్రాంతికి శుక్తివలె ప్రపంచ భ్రమమునకు అధిష్ఠానము. (అధిష్ఠానము - స్థానము) పరమార్థమయిన బ్రహ్మమునందు ప్రపంచమునకు అధ్యాసము కలుగు చున్నది. (అధ్యాసము - భ్రమము)

ఇట్టి ప్రపంచరూప కార్యముల నాశము ప్రళయము అనబడును. అది నిత్య ప్రళయము నైమిత్తిక ప్రళయము ప్రాకృతప్రళయము ఆత్యంతిక ప్రళయము అని నాలుగు విధములు కలది. అందు ఆత్యంతిక ప్రళయము బ్రహ్మసాక్షాత్కా రముచేత అవిద్యారూపకారణముతోడ సకలప్రపంచ నివృత్తి (బ్రహ్మసాక్షాత్కా రము - తనకును బ్రహ్మమునకును ఐక్యప్రత్యక్షము) ఈ సాక్షాత్కారము శ్రవణమనన నిదిధ్యాసనములతో గూడిన వేదాంత వాక్యములచేత కలుగుచున్నది. (శ్రవణము - ఆచార్యునివలన న్యాయయుక్తములు అయిన యర్థములను వినుట. మననము - విన్నయర్థములందు విరోధశంకలు కలుగునప్పుడు వానిని పోగొట్టునట్టి మానసికమగు యుక్తివిచారము. నిదిధ్యాసనము - అనాదివాసనచేత విషయముల యందు ప్రవర్తించి ఉండునట్టి మనసును విషయములనుండి యీడ్చి ఆత్మయందు కదలనీకనిలుపుట) ఇది సాక్షాత్కారరూపమయిన బ్రహ్మైక్య జ్ఞానమునకుచేరి న కారణము. ఈజ్ఞానము పాపక్షయముచేత కలుగుచున్నది. కర్మానుష్ఠానముచేత పాపక్షయము కలుగును.

ఈ శ్రవణాదులయందు మోక్షేచ్ఛగలవారికే అధికారము. ఆమోక్షేచ్ఛయందు నిత్యానిత్యవస్తు వివేకము విషయఫల వైరాగ్యము శమదమోపరతి తితిక్ష

సమాధానము శ్రద్ధ అనునవి ప్రయోజకములు. (శమము - అంతరింద్రియ నిగ్రహము, దమము - బహిరింద్రియ నిగ్రహము. ఉపరతి - చాంచల్యములేదు. తితిక్ష - ఓర్పు. సమాధానము - ఒకచోటనే మనసు నిలుపుట. శ్రద్ధ - గురువుల యందును శాస్త్రములయందును విశ్వాసము)

నిర్విశేషమైన బ్రహ్మమును సాక్షాత్కరింప సామర్థ్యములేనివారు సవిశేష బ్రహ్మోపాసనము చేయవలయును. వీరికి సగుణ బ్రహ్మోపాసనముచేత మనసు స్వాధీనపడగానే నిర్విశేష బ్రహ్మము తానే తోచును. సగుణబ్రహ్మోపాసనము చేయువారు అర్చిరాదిమార్గముగా బ్రహ్మలోకమునుపొంది అందుశ్రవణాదులచేత సాక్షాత్కారముకలిగి బ్రహ్మముతోడ మోక్షమును పొందుచున్నారు. కర్మనిష్ఠులు ధూమమార్గముగ పితృలోకమునుపొంది అందుసుఖానుభవములుచేసి మరల పుణ్య పాపానురూపముగా మనుష్యాదియోనులయందు పుట్టుచున్నారు. నిషిద్ధకర్మములను ఆచరించువారు రౌరవాదినరకములనుపొంది అందుపాపానురూపంగా దుఃఖము లను అనుభవించి మరల కుక్క నక్క మొదలుగాగల తిర్యగ్యోనులయందు స్థావరాదియోనులయందునుపుట్టి నశించుచున్నారు. నిర్గుణ బ్రహ్మోపాసనము చేయువారు ప్రారబ్ధకర్మములను మాత్రము అనుభవించి కడమపుణ్య కర్మములను మిత్రులయందును పాపకర్మములను శత్రువులయందును విడిచి కైవల్యమునుపొంది నిరతిశయానందమును అనుభవించుచున్నారు.

**అద్వైతానందుఁడు** : వేదాంతసారముఅను వేదాంతగ్రంథమునకు వ్యాఖ్యానముచేసిన యతడు. సదానందుని గురువు.

**అధర్ముడు** ; వరుణునికి జ్యేష్ఠాదేవియందు పుట్టిన కొడుకు. ఇతని భార్య నిరృతుని కూతురయిన వాంస కుమారులు భయుడు మహాభయుడు మృత్యువు. చెల్లెలు సురనిందని.

శ్రీ భాగవతమున అధర్ముడు మృషను వివాహమైనట్లును ఆమెయందు దంభుడు అను కొడుకును మాయఅనుకూతురును కలిగినట్లను వారికిఇరువురకు లోభుడనుకొడుకును నికృతి అనుకూతురును పుట్టినట్లును వారికి క్రోధుడు వాంస పుట్టిరనియు వారికి కలియుదు రుక్తియు పుట్టిరనియు వారికి మృత్యువు భీతియు కలిగిరనియు ఆ మృత్యువునకు భీతియందు నిరయుడు యాతనయు పుట్టిరనియు చెప్పబడి యున్నది.

విష్ణుపురాణమునందు అధర్మునికిని హింసకును అనృతుడు అను కొడుకును నికృతి అను కూతురును పుట్టినట్లును, నికృతియందు అనృతునికి భయుడు నరకుడు అను నిద్దరు పుత్రులును మాయ వేదన అను నిద్దరు పుత్రికలును జన్మించినట్లును అందు భయునికి మాయయందు మృత్యువు అను వాడును నరకునికి వేదన యందు దుఃఖుడు అనువాడునుపుట్టినట్లును చెప్పబడియున్నది. మఱియు మృత్యువునకు వ్యాధి జర శోకుడు తృష్ణ క్రోధుడు అనువారుపుట్టి లోకమును నాశముచేయుచుందు రనియు చెప్పబడియున్నది.

**అథర్వాణాచార్యులు**; వ్యాకరణమునుగూర్చి అనేక కారికలు వ్రాసినట్టు తెల్లమగు చున్నదిగాని ఆ గ్రంథము ప్రత్యేకముగా దొరకినదికాదు. ఇతడు భారతమును తెనిఁగించినట్లును తెలియబడుచున్నది.

**అధిష్ఠానపురము** ; చేదిదేశమున ముఖ్యపట్టణము. (భాగ)

**అధోక్షజుడు** ; విష్ణువు.

**అధశ్శిరస్సు** : లంచముతీసికొనువారికై ఉండునరకము. (గరుడ)

**అధ్యాత్మ రామాయణము** ; రామునిని ఆత్మస్వరూపముగాను, సీతను మోక్షలక్ష్మిగాను నిరూపించి రామకథను ఆత్మవిషయముగ చెప్పు గ్రంథము. ఇది విశ్వామిత్రునిచే చేయబడినది. ఇది తెనిగింపబడి ఉన్నది.

**అధ్యాత్మలు** : ఇది పదమూడు విధములగు వాయువులు. పిండాండమునందును బ్రహ్మాండమునందును ఉండును.

**అధ్వని** ; బళ్లారి జిల్లాయందు ఉండెడి ఒకపట్టణము దీనిని ఇపుడు ఆదవాని అందురు. (స్థల)

**అనంగుడు** ; మన్మథుడు. చూ॥ అంగదేశము.

**అనంతకవి** : ఇతడు భోజరాజీయము అను ఒక తెనుగు గ్రంథమును వ్రాసి ఉన్నాడు.

**అనంతవిజయము**; యుధిష్ఠిరుని శంఖము

**అనంతవ్రతము** ; ఇది భాద్రపద శుక్లచతుర్దశియందు కాలస్వరూపుడైన అనంత పద్మనాభుని ఉద్దేశించి, సలుపబడు ఒకవ్రతము. ఇదిమహదైశ్వర్యప్రదముఅని అరణ్యవాసకాలమున పాండవులకు శ్రీకృష్ణుడు చెప్పినట్లు చెప్పబడుచున్నది.

**అనంతుడు** : (1) ఆదిశేషువు (2) విష్ణువు (3) రుద్రుడు

**అనమిత్రుడు** : య॥ యుధాజిత్తుని పుత్రుడు. ఇతనికి కొడుకులు నిమ్నుడు, శిని, పృశ్ని, అను మువ్వురు.

**అనరణ్యుడు** : (1) ఇ॥ చూ॥ నా। అనేనస్సు (2) ఇ॥ తండ్రిత్రసదశ్యుడు, లేక వసుదుడు. కొడుకు ఆహర్యశ్వుడు. రావణుడు ఇతనితో యుద్ధముచేసి ఇతనిం గూల్చగ ఇతడు నన్ను నొప్పించినందులకై లృశ్లకుము నావంశమునపుట్టబోవు రాముడు నిన్ను చంపును అని పలికి మృతినొందెను. (భా) (ఉ.రా)

**అనర్ఘరాఘవీయము** ; } మురారిచేత చెయబడిన ఒకసంస్కృత నాటకము

**అనలుఁడు** : (1) మాలికొడుకు. విభీషణుని యనుచరుఁడు. (2) అగ్ని (3) శకుని వంశజుడగు నిషధుని కొడుకు. (మత్స్య)

**అనలురు** ; దేవతాభేదము, వీరు నలుపది తొమ్మండ్రు అందు అమానుఁడు మొదటివాడు. అతని కొడుకులు పావకుఁడు, పవమానుఁడు, శుచి అను మువ్వురు. వారి కొడుకులునలువది అయిదుగురు. చూ॥ అగ్ని.

**అనసూయ** : అత్రిభార్య. సీతాదేవి శ్రీరామునితోకూడ దండకారణ్యము నందలి అత్రిమహర్షి ఆశ్రమమునకుపోయినపుడు ఈమె సీతకు స్త్రీ ధర్మములు అనేకములు ఉపదేశించి ఆమెను దీవించి సౌమంగల్యమునకు లోపమురాకుండునట్లు అంగరాగ మాల్య వస్త్రాభరణములను ఇచ్చెను. (రామా)

**అనాయువు** : నా॥ అనుగు. తండ్రిదక్షప్రజాపతి, మగడు కశ్యపుడు (భార)

**అనిరుద్ధుడు** ; (1) కల్పాదియందు బ్రహ్మను పుట్టించుటకై నారాయణుడు ఎత్తిన యవతారము. (2) ప్రద్యుమ్నునకు రుక్మిణికూతునందు పుట్టినకొడుకు. ఈతఁడు బాణాసురుని కొమార్తెయగు ఉష అను దానిని పెండ్లియాడెను.

**అనిలుఁడు** : (1) అష్టవసువులలో ఒక్కడు (2) వాయువు. భార్య శైవ. కొడుకులు పురోజనుడు విజానగతి (3) ర॥ మాలికొడుకు విభీషణుని యనుచరుడు (మత్స్య)

**అనీకుఁడు** ; య॥ వసుదేవుని తమ్ముడు.

**అనుగ** ; చూ॥ నా॥ అనాయువు.

**అనుగీత** : ఇదివేదాంతవిషయమైన ఒకగ్రంథము. భారతమునందు అశ్వమేధ పర్వమున ఉన్నది.

**అనుతాపకుడు** : దనువు పుత్రుడు.

**అనుపదేవుడు** ; య॥ (1) దేవకుని కొడుకు (2) య॥ అక్రూరుని రెండవకొడుకు.

**అనుపమ** ; దక్షిణ పశ్చిమమున ఉండెడి ఆడఏనుకు

**అనుమండు** : చూ॥ నా॥ హనుమంతుడు.

**అనుమతి** : ధాత భార్యలలో ఒకతె.

**అనువు** ; (1) కురువశుని కొడుకు (2) కపోతలోముని కొడుకు.

**అనుహ్లాదుడు** : ది॥ హిరణ్యకశిపుని కొడుకు (భాగ) మత్స్య

**అనూరుడు** : కశ్యపప్రజాపతికి వినతయందు పుట్టినకొడుకు. ఈతని తమ్ముడు గరుడుడు - అనూరుడును గరుడుడును అండజములు. అందు అనూరుడు ఉండిన యండమును అతనితల్లియైన వినత తనసవతి కద్రువకు తనకంటెముందు పుత్రులు కలిగిరి, అను నసూయచే త్వరపడి అవియించినందున దేహము సంపూర్ణముగాక తొడలు మొదలుక్రింది భాగములేనివాడైపుట్టెను. ఇట్లు తన్ను వికలాంగునిగా చేసి నందులకు అతఁడు కోపగించి తల్లిని ఆమె సవతికి దాసియగునట్లు శపించి, ఆ శాపమును గరుడుడు మాన్పును అని వెంటనే పలికి సూర్యుని రథము తోలుటకు వెళ్లెను. నా॥ అరుణుడు. భార్య శ్యేని. కొడుకులు సంపాతి జటాయువు.

(భార)

**అనేనస్సు** : (1) ఆయువుయొక్క పుత్రుడు. కొడుకు శుద్ధుడు. తమ్ముడు నహుషుడు. (2) ఇ॥ కకుత్స్థుని కొడుకు నా॥ అనరణ్యుడు. సుయోధనుడు.

(భార)

**అన్నంభట్టు** : ఈతడు తర్కసంగ్రహము అను ఒకగ్రంథమును చేసెను. దానికి నీలకంఠ దీక్షితులు వ్యాఖ్యానముచేసి ఉన్నారు.

**అన్నపూర్ణ** : కాశియందుండు విశ్వేశ్వరుని భార్య.

**అపభ్రంశము** ; గొల్లలు మొదలగువారు మాటలాడు ప్రాకృతభాషా భేదము.

**అపర్ణ** : పార్వతి. ఈమె ఆకులుగూడ భుజింపక అనేకవేల సంవత్సరములు రుద్రునికూర్చి తపము ఆచరించినందున ఈమెకు ఈ పేరుకలిగెను. (హర)

**అప్పకవి** : ఇతడు నన్నయభట్టీయమును అనుసరించి విరివిగా తెనుగు వ్యాకరణమును పద్యకావ్యముగా రచించెను. ఇతడు శాలివాహన శకము 16 వ శతాబ్దమున కృష్ణాతీరమునందలి కామెపల్లియందు ఉండెను.

**అప్రతిరథుడు** : పు॥ మతిసారుని మూడవ కొడుకు. కణ్వుని తండ్రి. (భాగ)

**అప్రతిష్ఠము** : ఇది ఒక నరకము. ఇందు సంఖ్యాతీతంబులగు ఘటీయంత్రములు ఉన్నవి. వానిచే పాపులు అనేక సంవత్సరములు త్రిప్పంబడుచు రక్తమాంసంబులను క్రక్కుచు ఉందురు.

**అప్సరసలు** : దేవతాభేదము. మేనక రంభ ఘృతాచి తిలోత్తమ మొదలగువారు. అప్సరసలు కశ్యపునికి మునియందు పుట్టినట్లును చెప్పుదురు. (భాగ)

**అబ్బయామాత్యుడు**: ఆంధ్ర కవులలో నొకడు. ఇతడు అనిరుద్ధుని చరిత్రమును పురూరవ చరిత్రమును కూర్చెను.

**అబ్జజుడు** : (చూ) బ్రహ్మ.

**అబ్జుడు** : (1) చంద్రుడు (2) ధన్వంతరి. సముద్రమునందు పుట్టినందున వీరికి ఈ నామముకలిగెను.

**అభయుడు** : ధర్ముని కొడుకులలో ఒకడు.

**అభిజిత్తు** ; య॥ చూ॥ నా॥ దవిద్యోతుడు.

**అభిధాన చింతామణి** ; జైనుల సిద్ధాంతములకు ఒకనిఘంటువు. ఇది హేమచంద్రునిచే వ్రాయబడినది.

**అభిధానరత్నమాల** : హలాయుధునిచే రచియింపబడిన ఒకనిఘంటువు

**అభిమన్యుడు** ; అర్జునునికి సుభద్రయందు చంద్రుని అంశమున పుట్టిన కొడుకు; విరటుని కూతురగు ఉత్తరను పెండ్లాడెను. ఈతడు భారతయుద్ధమునందు మూడవనాడు పద్మవ్యూహముభేదించి లోపలికి దూఱి యుద్ధముచేయునవసరమున అసహాయుడైనందున అనేకశత్రువులచే ఏకకాలమున ఎదిరింపబడి చంపబడెను.

ఈతడు చనిపోయిన కాలమున భార్య గర్భిణిగనుండి ఆవల పరీక్షిత్తును కనెను. (భార)

**అభిసారులు** : వీరు కాశ్మీరమునకు సమీపమున ఉండిన ఒకదేశపు కాపులు.

**అభ్రమువు** ; తూర్పుదిక్కున ఉండెడి ఆడఏనుగు.

**అమరసింహుఁడు** : నామలింగాను శాసనముచేసిన ఒకజైన పండితుడు. ఈతడు విక్రమార్కుని కాలమున ఉండినట్లు తెలియబడుచున్నది.

**అమరనసూరన** : ఒకఆంధ్రకవి. ఈతడు కృష్ణదేవరాయలు ప్రభుత్వ ప్రారంభమునందు ఉండినట్లు ఊహింపబడుచున్నది. ఇతఁడు పింగళి వంశస్థుడు. ఇతడు రచించిన కావ్యములు రాఘవపాండవీయము కళాపూర్ణోదయము ప్రభావతీ ప్రద్యుమ్నము అనునవి. అందు మొదటిది రాఘవ పాండవుల చరిత్రములను శ్లేషభంగిచే చెప్పును. సులభశైలిచే శోభిల్లుచు ఉన్నది. రెండవది అతివిచిత్రమగు నానానౌకల్పితకథచే కొనియాడదగి మృదుశైలియును కలిగి వఱలుచున్నది. కడపటిది మృదు పాకమును, చక్కని స్వభావోక్తులను కలిగి వినువారి వీనులకు తేనియ లొలుకుచున్నది. వెనుకటి కవులలో ఇతఁడు సర్వతోముఖచాతుర్యుఁడు అని చెప్ప నొప్పును.

**అమరావతి**; ; ఇంద్రుని రాజధాని

**అమరుకము** : ఇది ఒకసంస్కృత శృంగారకావ్యము. కొందఱు దీనిని అమరుక కవి చేసినట్లు చెప్పెదరు. మఱికొందఱు ఆదిశంకరులు సరస్వతీదేవిని జయించు నిమిత్తము పరకాయప్రవేశముచేసి శృంగార శాస్త్రజ్ఞానము కనినపుడు ఈగ్రంథము చేసినట్లు చెప్పుదురు. ఇందుకొన్ని శ్లోకములు తెనిగింపఁబడి యున్నవి.

**అమవసువు** ; నా॥ విజయుడు. పురూరవుని కొడుకు. (భార)

**అమావాస్య** ; పిత్రుదినము. చూ॥ అచ్ఛోద.

**అమితాశ్వుఁడు** ; ఇ॥ చూ॥ నా॥ బర్హిణాశ్వుడు.

**అమ్మిక** : చూ॥ నా॥ అంబిక, పార్వతి.

**అమృతమథనము** : కృతయుగమున ఒకప్పుడు దేవతలును అసురులునుకూడి మందర పర్వతమును కవ్వముగాజేసి దానిక్రిందికి ఆధారముగ విష్ణువును ప్రార్థించి కూర్మముగా నునిచి వాసుకిని కవ్వపుత్రాడుగా అమర్చి చిలికిరి. అందు తొలుత విషము పుట్టి నాలుగు దిక్కుల నిప్పులు చల్లుచు వ్యాపింపగా దానిని రుద్రుడుమింగి

గొంతులోపల కదలకుండ నిలిపెను. మఱియు, అందు లక్ష్మి, చంద్రుడు, ఉచ్చై శ్రవము కౌస్తుభము,పారిజాత కల్పవృక్షములు కామధేనువు అమృతమును కమండలము నందుఉంచికొనిన వైద్యశాస్త్ర గురువు అగు ధన్వంతరియు బయలువెడలి వచ్చిరి.

ఇంతకుముందు ఒకప్పుడు ఐరావతమును ఎక్కికొని ఇంద్రుడుపోవుచుండ, అతనికి ఐశ్వర్యప్రదాయకమయిన ఒకపూలదండను దూర్వాసుడు ఇయ్య, దానిని తగినట్లు గౌరవముగా ఇంద్రుడు పుచ్చుకొననందున, అతనికి కోపముఁగలిగి ఇంద్రునకును దేవతలకును ఐశ్వర్యపదవి తప్పిపోవునట్లు శపియించెను. అందుమీద దైత్యులు దేవతలను బలహీనులుగా ఎఱింగి తొందరపెట్ట, దేవతలుపోయి విష్ణువుతో మొరలిడిరి. అపుడు విష్ణువు దేవతలకు బలము కలుగ జేయుటకై పాలసముద్రమును చిలికి అమృతము వారికిప్పించెను , అని పురాణ ప్రసిద్ధము.

**అమృతాంశుడు** : చూ॥ చంద్రుడు. ఈతని దేహము అమృతస్వరూపమనియు, ఆ యమృతమును కళలరూపముగా దేవతలుపానము చేయుదురనియు ప్రసిద్ధి.

**అయుతజిత్తు** : య॥ సహస్రజిత్తు తమ్ముడు.

**అయుతాయువు** : (1) కు॥ రథికుని కొడుకు. (2) సింధుద్వీపుని కొడుకు. ఋతుపర్ణుని తండ్రి నా॥ భంగాసురుఁడు. (విష్ణు)

**అయోధ్య** : ఇది కోసలదేశమున సూర్యవంశపురాజులకు రాజధాని, ఇది సరయూనదీతీరమున ఉండెను.

**అయోముఖి** : దండకారణ్యమందు ఉండిన ఒకరక్కసి. లక్ష్మణుఁడు దీని ముక్కు చెవులు స్తనములుఁగోసి పంపెను.

**అయోముఖుడు** : దనుపుత్రులలో ఒక్కఁడు.

**అయ్యలార్యుడు** : ఒక ఆంధ్రకవి. ఇతఁడు భాస్కరకవికి మిత్రుఁడు. భాస్కర రామాయణమున యుద్ధకాండ శేషము ఇతనిచే తెనిగింపఁబడెను.

**అరజ** : శుక్రుని కొమార్తె. చూ॥ దండకారణ్యము. (ఉ.రా)

**అర్ధచంద్రకము** : భారతయుద్ధమునపుడు కురుసేనకు ఇది ఒక విడిదల.

**అరిష్టనేమి** : (1) ఇతడు ఒకప్రజాపతి; సగరచక్రవర్తికి అనేక మోక్షధర్మములు ఉపదేశించెను అనిప్రసిద్ధి (2) మి॥ కురుజిత్తు కొడుకు.

**అరిష్టుడు** : (1) దనువు పుత్రుడు. (2) వృషభరూపియైవచ్చి కృష్ణునిచే చంపఁబడిన ఒకయసురుడు. (3) మిత్రునకు రేవతియందు పుట్టిన పెద్దకొడుకు. (విష్ణు)

**అరుంధతి** : (అరంజ్యోతి) కర్దముని కూతురు. వశిష్ఠునిభార్య మహాపతివ్రత కనుక ఇప్పటికిని పెండ్లినాటిరాత్రి ఔపాసనానంతరము నక్షత్రరూపమునఉండు నీమెను పాతివ్రత్యనిష్ఠకై పెండ్లికొమార్తెకు చూపుదురు.

**అరుణాచలము** : పంచలింగ క్షేత్రములలో ఒక్కటి. దీనినే తిరువణ్ణామలై అందురు.

**అరుణాశ్వుడు** ; ఇ॥ బర్హిణాశ్వుని రెండవ కొడుకు.

**అరుణాస్పదము** ; ఆర్యావర్తమున వరుణానదిమీద ఉండెడి యొకపట్టణము (మార్కం)

**అరుణి** : దనువు పుత్రుడు. (వరా)

**అరుణుడు** : ద॥ మురాసురుని కొడుకు శ్రీకృష్ణునిచే చంపబడెను. (2) అనూరుఁడు (3) సూర్యుఁడు (భాగ)

**అర్కుడు** : (1) పు॥ చూ॥ నా॥ ఋషుడు. (2) సూర్యుఁడు (3) ఇంద్రుఁడు.

**అర్చి** : పృథుచక్రవర్తి భార్య.

**అర్చికపర్వతము**; వైడూర్య పర్వతమునకు నామాంతరము.

**అర్చిరాది మార్గము** ; ఇది సగుణ బ్రహ్మోపాసకులు బ్రహ్మ లోకమునకుపోవు మార్గము. ఆ మార్గము మొదట సూర్యలోకముగుండను అవల విద్యుల్లోకము గుండను ఉండును.

**అర్జుని** : (1) బాణాసురుని కూతురు. (2) బాహుద అనునది.

**అర్జునుఁడు** : (1) కు॥ పాండుమహారాజునకును కుంతీదేవికిని దేవేంద్రు ప్రసాదమున పుట్టిన కొడుకు. పాండవ మధ్యముఁడు. భారతయుద్ధమునందు ఒకనాడు ఏడు అక్షౌహిణుల బలమును చంపినట్లు చెప్పుదురు. ఈతనికి ధనువుగాండీవము; శంఖముదేవదత్తము; నరుడను దేవర్షి భూభార నివృత్తి కొఱకు అర్జునుడయి భూమియందు అవతరించినట్లు చెప్పుదురు. ఇతనికి అర్జునుఁడు ఫల్గుణుఁడు, విజయుఁడు, పార్థుడు, కిరీటి, శ్వేతవాహనుడు, బీభత్సుడు, కృష్ణుడు సవ్యసాచి, ధనంజయుడు అని పది నామములు. అర్జునుడు ద్రోణాచార్యునివద్ద విలువిద్య నేర్చుచు ఉండు కాలమున అతని కొడుకు అగు అశ్వత్థామ ఇతనికి చీకటిలో అన్నము పెట్టవద్దని వంటవానికి దిట్టముచేసి ఉండెను. ఒకప్పుడర్జునుడు భోజనము చేయు నవసరమున ఆకస్మికముగ గాలిచే దీపము ఆరిపోయెను. అంత అర్జునుడు భోజనము నిలుపక భుజించి అభ్యాసమువలన విలువిద్యయు చీకటియందు సాధింప

వచ్చును అని తలంచి అట్లే చీకటియందు విలువిద్య సాధకముచేసెను. పాండవులు అరణ్యవాసము చేయుచుండు కాలమున అర్జునుడు పాశుపతాస్త్రమునకై రుద్రునిం గూర్చి ఘోరతపంబు ఒనరించుచుండగా, ఆయన కోరికను తీర్చ రుద్రుడు కిరాత వేషమును తాల్చికొని అతడుండువనమునకు వచ్చి మూకుడు అనుదైత్యుని సూకర రూపమునుతాల్చి చని అర్జునుని బాధింపుమనగా వాడు అట్లే చేసెను. అప్పు డర్జునుడు ఆకిరాత వేషమును ధరించిన రుద్రుడు వలదు వలదని చెప్పుచుండగా ఆ మాటలు చెవినిపెట్టక వింటి బాణము సంధించి దానిని వేసెను. అందులకు రుద్రుడు అలిగి అర్జునునితో కొంతసేపు పోరాడి అతని సాహసమునకు మెచ్చి అతడు కోరిన పాశుపతాస్త్రమును ఇచ్చి చనియెను. (భార)

(2) కృతవీర్యుని కొడుకు. చూ॥ కార్తవీర్యార్జునుడు

**అర్ధనారీశ్వరి** : శివుని యర్ధాంగమును కైకొన్న ఈశ్వరి. తొల్లి భృంగి అను గణనాథుడు మోక్షాపేక్ష కలవాడై పార్వతిని వదలి శివునకు మాత్రము సేవసేయు చుండగా పార్వతి భక్తుండు తన్ను అవమానించెను అని కోపించి శక్తిస్వరూపిణి యయి అతని శరీరమునందలి రక్త మాంసములపీల్చి మూర్ఛిల్లచేసెను. అది యెరిగి భక్త పరాధీనుడు అగు శివుడు భృంగిని అనుగ్రహించి తన దండాయుధ మును పూతకోలగా యిచ్చివేసెను. అంతట పార్వతి దేవునికి భక్తునియందు కల ప్రేమ తనయందు లేక పోయెను కదాయని ఖిన్నురాలై కేదారము అను పుణ్యక్షేత్రమునందలి గౌతముని యాశ్రమమునకు పోయి ఆయన యుపదేశము వలన అచ్చట ఆవిర్భవించి వుండెడు కేదారేశ్వరుని ఉపాసించి ఆదేవుని యనుగ్రహ ముచే సాక్షాత్కరించిన పెనిమిటిచే అర్ధాంగమునుపొంది అర్ధనారీశ్వరి యయ్యెను.

**అర్ధనారీశ్వరుడు** ; అర్ధదేహము స్త్రీరూపముగాగల యీశ్వరుడు. చూ॥ అర్ధనారీశ్వరి. (శివ)

**అర్బుదపర్వతము**: ఇది ఆనర్తదేశములకు సమీపమున ఉండును. ఇందుండు జనులు అర్బుదులు అనబడుదురు.

**అలంబస** : ఇక్ష్వాకువంశస్థుడైన తృణబిందువు భార్య. విశాలునితల్లి. (విష్ణు)

**అలంబసుడు** : (1) ర॥ బకాసురుని తమ్ముడు. ఘటోత్కచునిచే చంపబడెను.

(2) ర॥ జటాసురుని కొడుకు. ఘటోత్కచునిచే చంపబడెను. (భార)



**అలకనంద** ; గంగాశాఖలలో ఒక్కటి.

**అలకాపురము** : కుబేరుని రాజధాని.

**అలర్కుడు** : కా॥ కువలయాశ్వుని కొడుకు. మిక్కిలి ప్రసిద్ధికెక్కిన రాజు. ఇతనికి దత్తాత్రేయుడు యోగమార్గమునుపదేశించెను. కొడుకు సన్నతి. (మార్కం)

**అల్లసాని పెద్దన్న** : ఒకగొప్ప ఆంధ్రకవి. ఇతడు బళ్లారి కడప జిల్లాల ప్రాంతముల యందు దూపాడు అను దేశంబున దొరాళ అను గ్రామము వాసస్థలముగా కలవాడు. ఈయన శాలివాహన శకము 1430 సంవత్సరమున జన్మించినట్లు తెలియబడుచున్నది. కృష్ణదేవరాయలవారి ఆస్థానపండితులు, యెనమంద్రలోను యీతడు ఒక్కడు అయివుండినదికాక ఆరాజుచే ఆంధ్రకవితా పితామహుడు అను బిరుదాంకము సహితము పడసెను. ఈతనికృతి స్వారోచిషమనుసంభవము. ఇది మిక్కిని ప్రౌఢకావ్యము

**అవంతి** : ఉజ్జయినికి నామాంతరము.

**అవక్రీతుడు** : రు॥ భరద్వాజుని కొడుకు. ఇతడు గురుముఖముగా చదువక తపస్సుచేసి వేదములనేర్చి కడుగర్వితుడై రైభ్యుని కోపానలమునబుట్టిన రాక్షసునిచే చంపబడి రైభ్యపుత్రుండగు, అర్వావసుని ప్రార్థనచే దేవతలవలన పునర్జీవితుడయ్యెను. (భార)

**అవీక్షిత్తు** : కరంధముని కొడుకు. ఈతని జననకాలమున దుష్టగ్రహవీక్షణలేనందున యితనికి అవీక్షిత్తు అని పేరుపెట్టిరి. ఈతని కొడుకు మరుత్తు అను చక్రవర్తి. (మార్కం)

**అశన** : బలిభార్య - బాణాసురుని తల్లి. (భాగ)

**అశోకవర్ధనుడు** : చంద్రగుప్తుని పౌత్రుడగు మగధదేశపురాజు.

**అశోకుడు** : దశరథుని మంత్రులలో ఒక్కడు.

**అశ్మకుడు** ; (1) ఇతనితండ్రి కల్మాషపాదుడు. ఈతనితల్లి యితని ప్రసవింప ప్రయాసపడుచుండ వశిష్ఠుడు రాతితో గర్భముగీచి శిశువును బయటికితీసినందున యితనికి అశ్మకుడు అనుపేరు కలిగెను. కొడుకు మూలకుడు లేక నారీకవచుడు. (2) ఒక విప్రవరుడు. ఒకప్పుడు విదేహరాజగు జనకుడు బంధువియోగమున విషాదమునొంది గృహము తొరంగి వెడలువాడు అయ్యెను. అప్పుడతనికి ఈ

అశ్మకుడు సంసారస్వరూపము నెరింగించి ఆత్మతత్వము బోధించి స్వకర్మ ప్రవర్తనయందు అనురాగము పుట్టించెను అని ప్రసిద్ధి. (భాగ) (విష్ణు)

**అశ్వతీర్థము** : గంగతోడ కాల అనెడునది సంగమము అగు స్థానమునవుండు నౌకతీర్థము. ఇది రుచికునకు సత్యవతిని యిచ్చుటకునై గాధి కోరిన వేయి హయములు ఉత్పత్తి అయినచోటు కనుకదీనికీ పేరుకలిగెను. (భార)

**అశ్వత్థామ** : ద్రోణుని కొడుకు. ఇతని తల్లి కృపి. ఇతడు చిరంజీవి. భారత యుద్ధమున కడపటినాటి రేయి పాండవుల శిబిరముచొచ్చి నిద్రించువారల నందరను దయలేక హత్యచేసెను. అందు ద్రౌపది పుత్రులయిన ఉపపాండవుల దయలేక హత్యచేసెను. ఈతడు అర్జునునిచే అవమానింపబడెను. ఇతడు బాలవధచేసినందులకై వ్యాసునిచే దుర్గంధరక్తదిగ్ధదేహుండు అనునట్లు శపింపబడెను. పాండవుల మీదికి క్రోధముచే యితడు లోకమునందు యెక్కడ పాండవులను పేరులేక వుండునట్లు ఒకయస్త్రము ప్రయోగింపగా అది ఉత్తర గర్భమందున్న అభిమన్యుని కొడుకగు పరిక్షిత్తుని దహింపను ఆరంభించెను. అపుడు పరీక్షిత్తునాశము పొందకుండునట్లు శ్రీకృష్ణుడు రక్షించెను. ఇతడు కామక్రోధాదులయంశమున జనించినవాడు. (భార)

**అశ్వపతి** : (1) మద్రదేశపురాజు. ఇతడు సంతానకాంక్షచే పదునెనిమిదివేండ్లు సావిత్రిని కొలిచి ఆదేవియనుగ్రహంబున సావిత్రి అను కుమార్తెను పడసెను. చూ॥ సావిత్రి,

(2) కేకయదేశపురాజు. కూతురు కైకేయి. కొడుకు యుధాజిత్తు. అశ్వసేనుడు తక్షకుని కొడుకు. వీనిని ఖాండవదహన సమయమున చావకుండ దేవేంద్రుడు రక్షించెను. పిదప వీడు నాగాస్త్రమై కర్ణునిచే విడువబడి అర్జునుని కిరీటమును అపహరించి అర్జునునిచే చంపబడెను. (భార)

**అశ్వినీదేవతలు** : సూర్యుని కూతురు అబడబారూపమును పొందిన సంజ్ఞాదేవి యొక్క నాశికయందు పుట్టిన అమడలు. వీరు దేవవైద్యులు అతిరూపవంతులు అని ప్రసిద్ధి (భార)

**అష్టకాదులు** : అష్టకుడు ప్రతర్దనుడు వసుమనుడు, ఔశీనరుడైన శిబి అను నలువురు. వీరు యయాతిదౌహిత్రులు యయాతి వలన అనేక నీతులను యెరింగిరి.

**అష్టకుడు** : విశ్వామిత్రుని కొడుకులలో నొక్కడు, (భార)

**అష్టగ్రామము** : మైసూరు సీమలోనుండు ఒకజిల్లా.

**అష్టదిక్పాలకులు** : యింద్రుడు తూర్పు: అగ్ని పూర్వదక్షిణము యముడు దక్షిణము; నిరుతి దక్షిణ పశ్చిమము. వరుణుడు పడమర: వాయువు పశ్చిమోత్తరము కుబేరుడు ఉత్తరము: ఈశానుడు పూర్వోత్తరమును పాలించువారు.

**అష్టదిగ్గజములు** : ఐరావతనము, పుండరీకము. వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము, అను మగఏనుగులును. అభ్రముపు, కపిల, పింగళ, అనుపమ, తామ్రపర్ణి, శుభదన్తి, అంగన, అంజానావతి, అను ఆడేనుగులును; క్రమముగా తూర్పు మొదలగు ఎనిమిది దిక్కుల యందును ఉండును.

**అష్టపది** : ఇది జయదేవునిచే సంస్కృతమున రచింపఁబడిన గోవిందగీత· కృష్ణలీలలు గురించి చెప్పును. నా॥ గీత గోవిందము.

**అష్టమూర్తులు** : బ్రహ్మయొక్క భ్రూమధ్యమునుండి వెలువడిన రుద్రునియొక్క రూపములు. ఈ అష్టమూర్తులకు వేరువేరు నామములును స్థానములును కలవు.

| నామము | స్థానములేకరూపము | భార్య | పుత్రుడు |
|---|---|---|---|
| భవుడు | జలము | ఉష | శుక్రుడు |
| శర్వుడు | మహి | సుకేశి | అంగారకుడు |
| ఈశానుడు | వాయువు | శివ | హనుమంతుడు |
| పశుపతి | వహ్ని | స్వాహా | శంభుడు |
| భీముడుఁ | ఆకాశము | దిశ | స్వర్గము |
| ఉగ్రుఁడు | స్వధర్మ నిష్ఠుడైన బ్రాహ్మణుడు | దీక్ష | సన్తానుడు |
| మహాదేవుడు | సోముఁడు | రోహిణి | బుధుఁడు |
| రుద్రుడు | సూర్యుఁడు | సువర్చల | శనైశ్చరుడు |

**అష్టవసువులు** : (భారతమున చెప్పియుండు ప్రకారము) ప్రజాపతియొక్క కొడుకులు; వీరు, ధరుడు ధ్రువుడు సోముఁడు అహుఁడు అనిలుఁడు అగ్నిప్రత్యూషుడు ప్రభాసుడు అను నామములు కలవారు. (ఇతర పురాణముల ప్రకారము) వీరు, దక్షప్రజాపతి కొమార్తెలలో పదుగురు అయిన ధర్ముని భార్యలలో ఒక్కరగు వసువునకు పుట్టిన యనమండ్రుదు కొడుకులు. భారతమున ''ఆపుడు'' అను వానికిఁ బదులు ధరుడు అనియు ధర్ముడు లేక అధ్వరుడు అనువానిఁ బదులు ఆపుడు అనియు చెప్పియున్నది. వీరు ఒకప్పుడు వసిష్ఠుని హోమధేనువును అపహరించి అతనిచే శపింపపడి మర్త్యలోకమునందు మనుష్యస్త్రీ రూపధారిణియై శంతనుని భార్యగా నుండిన గంగాదేవికి జన్మించిరి. అపుడు వారిలో మిక్కిలి అపరాధియగు ప్రభాసుడు తక్కిన ఏడుగుర చతుర్థాంశమునుపూని భీష్ముఁడు అను పేర బహుకాలము జీవించి మహాశూరుడును ధర్మవేత్తయును అయివుండెను. (భార)

**అష్టావక్రుడు** : రు॥ ఏకపాదునికి సుజాతయందు పుట్టిన కొడుకు. ఇతఁడు గర్భమున ఉండు కాలమున అనవరతము శిష్యులచే వేదాధ్యయనము చేయించుచుఉండు తనతండ్రితోశిష్యులు నిద్రలేమింజేసి జడమతులై చదువు తప్పచదువు చున్నారనిన, కోపగించి నీవు అధ్యయనంబునకు వక్రముగా పలికితివి కావున అష్టవక్రుండవై జన్మింపుము అని కొడుకునకు శాపమిచ్చెను. ఇతఁడు అతితేజస్వియును లోకపూజితుడును అయిఉండెను. ఈతని కురూపముచూచి ఒకప్పుడు రంభాద్యప్సరసలు నవ్వినందున, వారు దొంగలచే పట్టువడునట్లు శపింపఁబడిరి. అది కారణముగా కృష్ణనిర్యాణానంతరము గోపికారూపులై ఉండిన అతని భార్యలుఅగు నప్సరసలు అర్జునునివెంటవచ్చు నవసరమున దొంగలచే పట్టువడిరి. (భార) (విష్ణు)

**అనంగుడు** : య॥ అక్రూరుని తమ్ములలో ఒకడు.

**అసమంజసుడు** : సగరునికిని కేశినికిని పుట్టిన కొడుకు. కడుదుర్మార్గుడైనందున తండ్రిచే రాజ్యభ్రష్టుడుగా చేయబడెను. కొడుకు అంశుమంతుడు.

**అసి** : కాశిప్రక్కను ప్రవహించునట్టి ఒకనది.

**అసిక్ని** : (1) రెండవ దక్షుని భార్య. ఈమెకు అరువండ్రు కొమార్తలు. (2) ఒకానొక ఏరు. (భాగ) (శివ)

**అసితుడు** : ఒకపౌరాణికుడు. సగరుని తండ్రి. (రామా)

**అసురులు, అసురులు:** అమృతములేనివారు. దేవతలకు విరోధులు. వీరు దైత్యులు లేక దానవులుగాఉందురు. దైత్యులు హిరణ్యాక్షుడు హిరణ్యకశిపుడు, బలి, బాణాసురుడు మొదలగువారు. దానవులు శంబరుడు, తారకుడు, విప్రచిత్త, నముచి, అంధకుడు మొదలగువారు.

**అసిపత్రము** : ఇదివేయి యోజనముల వలయముగల ఒకనరకము. అతితీక్షణములు అగుసూర్యకిరణములును, అగ్నికుండములును, ఖడ్గములను పోలు పత్రములుగల వృక్షములును కలిగి ఉండును. ఈ నరకము అనుభవించువారు ఆక్కడి మృగపక్ష్యాదులచే పీడింపఁబడి ఆ యసిపత్రంబులచే తునుకలుగా చేయబడుదురు.

**అస్తి** : జరాసంధుని కూతురు. కంసుని పెద్దభార్య (విష్ణు)

**అస్త్రహృదయము** : సకలరిపు నాశమును యశస్కరమును అయిన ఒక విద్య. ఇది రుద్రుడు స్వాయంభువునకు ఇచ్చినట్లును అతడు చిత్రాయుధుడనునొక గంధర్వునకు ఇచ్చినట్లును, అతడు తన దౌహిత్రి అగు మనోరమకు యియ్యగా ఆమె స్వరోచికి ఇచ్చినట్లును స్వారోచిషమనుసంభవమునందు చెప్పబడి యున్నది.

**అహంయాతి** : పూ॥ సమ్యాతి కొడుకు. భార్య కార్తవీర్యార్జునుని చెల్లెలు అగు భానుమతి. (భార)

**అహల్య** : ఈమె ముద్గలుని కూతురు. గౌతమ మహర్షి భార్య. దేవేంద్రునితో జారత్వము చేసినందున భర్త ఈమెను శిలయగునట్లు శపించెను. తరువాత బహుకాలమునకు శ్రీరాముడు సీతను పెండ్లాడుటకై మిధిలాపట్టణమునకు బోవుచుండి గౌతమాశ్రమము ప్రవేశించి పాషాణమును మెట్టగానే ఆశాపము తీరెను. (రామా)

**అహిక్షేత్రము** : ఉత్తర పాంచాలములకు రాజధాని.

**అహుడు** : అష్టవసువులలో ఒక్కడు. ఇతని కొడుకు జ్యోతి. విష్ణుపురాణమున అహుని ఒకవసువుగా చెప్పలేదు. ఆపుని చెప్పిఉన్నది ఆపుని కొడుకులు స్థఘ్నుడు, శ్రముడు, శ్రాంతి, ధుని అని ఉన్నది.

**అహోబలపతి** : ఇతడు ఒకపండితుడు. ఆంధ్రవ్యాకరణమునకు, సవిస్తరముగా సంస్కృతభాషలో వ్యాఖ్యానమువ్రాసి యున్నాడు. అది అహోబల పండితీయము అనియు కవిశిరోభూషణము అనియు చెప్పబడును.

**అక్షిత్రయము** : మీనాక్షి, కామాక్షి, విశాలాక్షి.

**అక్షుడు** : ర॥ రావణుని కొడుకు; హనుమంతునిచే చంపబడెను.

## ఆ

**ఆంగిరసుడు** : చూ॥ బృహస్పతి.

**ఆంజనేయుడు** : చూ॥ నా॥ హనుమంతుడు.

**ఆంధ్రదేశము** : గోదావరీ కృష్ణానదులకు నడుమనుండు దేశము దీనినే త్రిలింగ దేశము అందురు. సుతపుని కుమారుడైన బలి తనయుడైన ఆంధ్రుడు పాలించిన దేశము. అంగుడు, కళింగుడు వంగుడు, సింహుడు, పులింద్రుడు ఆంధ్రుని సోదరులు. వీరు తూర్పుదేశములను పాలించిరి. (భాగ)

**ఆంధ్రభృత్యులు** : శూద్రకుని వంశస్థులైన మగధదేశపు రాజులు. వీరు శాలివాహనశక ప్రారంభమున నన్నూరు సం॥ రములు రాజ్యముచేసినట్లు తెలియబడుచున్నవి. వీరియనంతరము ఆభీరులు, గర్ధభులు, శకులు, యవనులు మొదలైనవారు ఏలుచుండిరి.

**ఆంధ్రము** : ఆంధ్రదేశవ్యవహారభాష. దీనిదే తెనుగు లేక తెలుగు అందురు. ఈ భాష కణ్వమహర్షి మొదలగువారిచే ప్రవర్తితము అయినది అని చెప్పుదురు.

**ఆంధ్రశబ్ద చింతామణి** : ఆంధ్రభాషకు నన్నయభట్టారకునిచే రచింపబడిన వ్యాకరణము. ఇది సంస్కృత భాషయందు ఉండును.

**ఆంధ్రులు** : ఆంధ్రదేశస్థులు, పంచద్రావిడులలో ఒక తెగవారు.

**ఆంబికేయుడు** : చు॥ ధృతరాష్ట్రుడు.

**ఆకూతి** : (1) సర్వతేజస్సుని భార్య, చక్షుర్మనువు తల్లి (2) స్వాయంభువునకు శతరూపవలన పుట్టిన కొమార్తె, ఈమె యక్క ప్రసూతి. ఆకూతి ప్రజాపతిని పెండ్లాడి అతనివలన యజ్ఞుడు, అనుకుమారుని దక్షిణయను కూతును కనియెను. (భాగ)

**ఆగమము** : ఈశ్వర ప్రోక్తములయి విశేషధర్మములను చెప్పునట్టి శాస్త్రములు, అవి శైవాగమములు, వైష్ణవాగమములు యని రెండువిధములు కలవి. ఈ యాగమములయందు ముఖ్యముగ దేవాలయాది ప్రతిష్ఠలును దేవార్చనాది క్రమములును,

చెప్పబడుచున్నవి. శైవాగమము పాశుపతము అని, వైష్ణవాగమములు పాంచ రాత్రము వైఖానసము అని చెప్పఁబడును.

సోమకాసురుడు వేదములును సముద్రములోనికి ఎత్తుకొనిపోయిన యవసర మున విష్ణువు తనపూజార్థమైన పూజావిధమును శాండిల్య ఋషికి అయిదు రాత్రులలో ఉపదేశముచేసినందున ఆయాగమములకు పాంచరాత్రము అను పేరు కలిగెను. శైవాగమమునందు, శివుడు (పశుపతి) లోకులు తన్ను పూజచేయు విధ మును పార్వతికి తెలియచేసినట్లు చెప్పఁబడియున్నది.

**అగ్నీధ్రుడు** : ప్రియవ్రతునికిని సుకన్యకును పుట్టిన పదుగురు కొడుకులలో పెద్దవాడు. ఇతని భార్య పూర్వచిత్త (ఇతని సహోదరుల గురించి చూ॥ ప్రియ వ్రతుడు) ఇతనికి తనతండ్రి జంబూద్వీపమును ఇచ్చెను. దానిని ఇతడు తన కొడుకులగు నాభి, కింపురుషుడు, హరి, ఇలావృతుడు, రమ్యుడు, హిరణ్వంతుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అను తొమ్మండ్రకు పంచి ఇచ్చెను. అదెట్లనిన నాభికి హిమవంతమునకు దక్షిణదేశము అగు భరతఖండము, కింపురుషునికి దానికి ఉత్తరమున హేమకూటపర్వతమునకు దక్షిణమునఉండు ఖండము. హరికి హేమకూట పర్వతమునకు ఉత్తరమున నిషధపర్వతమునకు దక్షిణమునఉండు నైషదము, ఇలావృతునికి నిషధపర్వతమునకు ఉత్తరమున మేరువును మధ్యప్రదేశముగాగల ఇలావృతము అను ఖండము. రమ్యునికి ఇలావృతమునకు నీలాచలమునకును నడుమనుండు ఖండము హిరణ్వంతునికి దానికి ఉత్తరమున సేతుపర్వతమునకు ఈవలఉండు శ్వేతఖండము, కురువునకు శ్వేతపర్వతమునకు ఉత్తరమున శృంగవంతముచే చుట్టబడిన ఖండము, భద్రాశ్వునికి మేరువునకు తూర్పుననుండుఖండము, కేతుమాలునికి మేరువునకు పశ్చిమముననుండు ఖండమును ఇచ్చెను. ఇవియే నవఖండములు; నవవర్షములు అనియు అనబడును.

(విష్ణు) (భాగ)

**ఆగ్నేయ పురాణము** : ఉపపురాణములలో ఒకటి. ఇది భృగుప్రోక్తము. యజ్ఞాది అగ్నివిషయములు కలది. దీని గ్రంథసంఖ్య 15000

**ఆచారకాండము** : ఇది విజ్ఞానేశ్వరీయము అనెడు ధర్మశాస్త్రములలో ఒకకాండము. ఇందు నాలుగు వర్ణములవారును ఆచరింపవలసిన ధర్మములు చెప్పబడి ఉండును. బ్రాహ్మణునకుయజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతి

గ్రహము, అనుషట్కర్మములను నియమించి ఉండును. క్షత్రియునకు ప్రజాపాలనము, దానము, యజ్ఞము, వేదాధ్యయనమును, వైశ్యునకు స్థలజలములయందు ధాన్య రత్నముల వ్యాపారము, ధనమును వడ్డిరూపమున పెంచుట, పైరుపెట్టుట, అను నీయారు కర్మములు ఏర్పరచి ఉండును. శూద్రునకు మీదచెప్పిన మూడువర్ణముల వారికిని శుశ్రూషచేయుట ముఖ్యమగు ధర్మముగ కావించి యుండును. వేదమంత్రములచేతను గర్భాదానమంత్రములచేతను సీమంతహోమముచేతను జాతకర్మము, నామకరణము అన్నప్రాశనము చౌలము ఉపనయనము మొదలగు కర్మములచేతను ద్విజులకు మాతృగర్భవాసాది దోషములు తొలగును. బొడ్డుకోయక మునుపు పురుష ప్రజకు జాతకర్మము అనుసంస్కారము చేయవలసినది. (జాతకర్మము - పుట్టుకనుగూర్చి శిశువునకు చేయునొకసిద్ధి) బిడ్డపుట్టిన పదియవనాడుగాని పండ్రెండవనాడుగాని పుణ్యతిథియందు సుముహూర్తమున సునక్షత్రమున నామకరణము చేయవలయును. నాల్గవమాసమున శిశువునకు సూర్యదర్శనము చేయింపవలయును. ఆరవమాసమున అన్నప్రాశనము చేయింపవలయును. ద్విజాదులకు పుట్టిన సం॥ రమున నైనను, మూడవ సం॥ రముననైనను వేదోక్త ప్రకారము చౌలకర్మనుచేయవలసినది. (చౌలము-సిగను ఉంచుట) గర్భధారణము మొదలుకొని బ్రాహ్మణునకు ఎనిమిదవ సం॥ రమునకు క్షత్రియునకు పదునొకండవ సం॥ రమునకు, వైశ్యునకు పండ్రెండవ సం॥ రమునకు, ఉపనయనము చేయవలయును. పై చెప్పిన కాలములయందు ఉపనయనముచేయ సరిపడనియెడల బ్రాహ్మణునకు పదియారేండ్లవరకును, క్షత్రియునకు ఇరువది రెండు సం॥ రములవరకును, వైశ్యునకును ఇరువది నాలుగు సం॥ రముల వరకును, ఉపనయనము రెండపక్షమున చేయవచ్చును. మొదటి మూడువర్ణములవారికి మీదచెప్పిన కాలములయందు ఉపనయనము చేయనియెడల వారు గాయత్రికి అర్హులుగాక వ్రాత్యులు అగుదురు. అట్టివారు వైదిక కార్యములకును ఉపయోగింపరు. మరియు అట్టివారితో యిచ్చుకోలు పుచ్చుకోలు చేయతగదు.

**అణిమాండవ్యుడు**: చూ॥ నా॥ మాండవ్యుడు.

**ఆత్రేయుడు** : చూ॥ చంద్రుడు.

**ఆదితేయులు** : అదితి సంతతివారు ఇది దేవతలకు నామాంతరము

**ఆదిత్యహృదయము** : ఇద ఒక స్తోత్రవిశేషము. దీనిని పఠించువారికి సూర్యానుగ్రహము కలుగును. ఇది రావణుని చంపుటకై అగస్త్యుడు రాముని కి ఉపదేశించెను.

**ఆదిత్యుడు** : చూ॥ సూర్యుడు.

**ఆదిత్యులు** : అదితియందు కశ్యప ప్రజాపతికి పుట్టిన కొడుకులు. వీరుపన్నిద్దఱు. ధాత, మిత్రుడు, అర్యముడు, శక్రుడు, వరుణుడు అంశుమంతుడు, భగుడు, వివశ్వంతుడు, పూషుడు, సవిత, త్వష్ట, విష్ణువు, వీరలలో విష్ణువు ఇంద్రుడు. వీరు వైవస్వతమన్వంతరమున ఆదిత్యులుగాఉండి చక్షుర్మన్వంతరమున తుషితులుగా ఉండునట్లు తెలియవచ్చుచున్నది. కల్పాదియందు బ్రహ్మచే సృజింపబడిన జయులు అనబడు ఈపన్నిద్దరు సృష్టియందు ఇచ్ఛలేక బ్రహ్మయాజ్ఞను అతిక్రమించినందున వీరుప్రతిమన్వంతరమున పుట్టునట్లు శపింపబడిరి. ఈద్వాదశాదిత్యనామములు సూర్యునికి నామాంతరములై ఉండును.

**ఆదినాథుడు** : జయినగురువు. మొదటి తీర్థకారుడు.

**ఆదిశేషువు** : కశ్యపప్రజాపతికిని కద్రువకును పుట్టిన పుత్రులలో జ్యేష్ఠుడు. ఇతడు తనతల్లియైన కద్రువ వినత యడల చేసిన యక్రమమునకు ఓర్వజాలక, (చూ॥ కద్రువ) గంధమాదనము బదరికాశ్రమము గోకర్ణము మొదలగు దివ్యక్షేత్రములయందు మహాతపమాచరింపగా బ్రహ్మ అతని సత్యనిష్ఠకును ధైర్యమునకును మెచ్చి భూభారమును వహించునట్టి శక్తినిప్రసాదించి గరుడునితో సఖ్యము గలిగి ఉండుమని చెప్పెను. అతడు అట్లేచేయుచుండెను, మరియు అతడు ఈశ్వరప్రసాదముచే విష్ణువునకు పానుపై వేయిపడగలతో భూమిని మోయుచు నాగులకు, అందరకు రాజై ఉండును. ఇతనికి భృగుమహర్షి శాపమువలన బలరామావతారము కలిగెను.

**అధూర్తరజుడు** : కుశుని మూడవ కొడుకు. ధర్మారణ్యమును కట్టినవాడు. ఇతని కొడుకు రాజర్షియైన గయుడు.

**ఆనందగిరి** : శాలివాహన శకము తొమ్మిదవ శతాబ్దమునందు ఉండిన ఒక సంస్కృత గ్రంథకర్త ఇతడు శంకర దిగ్విజయమును వ్రాసెను. ఇది తెనిగింపబడినది.

ఆనకదుందుభి : చూ॥ నా॥ వసుదేవుడు కృష్ణుడు పుట్టినప్పుడితని ఇంట దుందుభులు మ్రోగెను. (హరివం)

ఆనకుడు : య॥ వసుదేవుని తమ్ముడు. (హరివం)

ఆనర్తము : ఇదియవనసముద్రతీరమున ద్వారకకు సమీపమునఉండు నొక దేశము. ఇందు శర్యాతి కొడుకు అగు ఆనర్తుడు కుశస్థలి అనుపట్టణమును నిర్మించెను. అతనిపేర ఈ ప్రాంతము ఆనర్తము అనబరగె.

ఆనర్తుడు : శర్యాతి కొడుకు ఇతని కొమరుడు రైవతుడు. అతడు కుశస్థలి ఆను పురమును నిర్మించెను. (భాగ) (మత్స్య)

ఆనీకుడు : య॥ వసుదేవుని తమ్ముడు అగు అనీకుని రెండవ కొడుకు.

ఆనగొంది (అనెగొంది) : ఋష్యమూక పర్వత సమీపమునందు ఉండు నొక పట్టణము.

ఆపస్తంబుడు : ఇతడు ఒకమహర్షి. యజుర్వేద విహితకర్మముల గూర్చి సూత్రము చేసెను. అది ఆపస్తంబ సూత్రము అనబడును.

ఆపుడు : అష్టవసువులలో ఒక్కడు. చూ॥ వసువులు. (మత్స్య)

ఆభీరము : సింధునదికి పడమట ఆర్యావర్తముతో చేరికగా ఉండు నొక దేశము.

ఆభీరులు : ఆభీరదేశస్థులు.

ఆయతి : మేరువుకు కుమార్తె. మగడు ధాత. కొడుకు మృకండుడు. (బ్రహ్మ)

ఆయువు : పురూరవుని కొడుకు. ఇతని పుత్రులు నహుషుడు క్షత్రవృద్ధుడు, రజి, రంభుడు, అనేనసుడు అని ఐదుగురు. (భార) (బ్రహ్మం)

ఆయుష్మంతుడు : ద॥ ప్రహ్లాదుని కొడుకులలో ఒక్కడు. (మత్స్య)

ఆరంజ్యోతి : చూ॥ అరుంధతి

ఆరాధ్యులు : లింగధారి బ్రాహ్మణులు చూ॥ బసవడు. వీరు బసవ పురాణమును ప్రమాణముగాగొని వీరభద్రుని ఉపాసింతురు.

ఆరణి : అయోదుడు అగు ధౌమ్యుని శిష్యుడు,

ఆర్య : పార్వతి

**ఆర్యభట్టు** : శాలివాహన శకము మూడవశతాబ్దమునందు వుండిన యొక గొప్ప జ్యోతిష్కుడు.

**ఆర్యావర్తము** : హిమవద్వింధ్యమధ్యగత దేశము. ఆర్యులుండినతావు పూర్వము నందలి భరతఖండపు రాజులెల్ల యిందే యుండిరి.

**ఆర్యులు** : వేదములయందు చెప్పబడినవారు. వీరు తొలుత సరస్వతి దృషద్వతి నదులమధ్యప్రదేశమునందుండి పిదప ఆర్యావర్తమునందుఎల్ల వ్యాపించిరి. ఈ దేశము నందలి యాచారవ్యవహారములు అన్నియు వీరెకల్పించినవారు.

**ఆశౌచము** : ఇది రెండుతెరగులు. జాతాశౌచము. మృతాశౌచము. జాతాశౌచ మును వృద్ధిపురుడు అనియు చెప్పుదురు: బ్రాహ్మలలో పిత్రాదిసపిండులు మృతు లైరేని ఆశౌచము పదిదినములు. క్షత్రియులకు పండ్రెండు దినములు. వైశ్యులకు పదునైదు దినములు శూద్రులకు మూప్పది దినములు. చూడాకర్మ విహీనులు అగు శిశువులు మృతిపొందిన ఆశౌచము ఒకదినము. చూడాకర్మము ఒనర్చిన పిదప ఆశౌచము మూడు దినుములు. పైవర్ణములవారు జాతాశౌచమునుకూడా మృతాశౌచమువలె ఆచరింతురు. మృతుడు యమపురమున నుంపబడెడి పండ్రెండు దినములవరకు ప్రథమ దివసము మొదలు పిండ ప్రదానము చేయవలయు అది వానికి పాథేయమగును. ఆ పండ్రెండు దినముల వరకు వాడుమృతిపొందిన స్థలమునుండి గృహపుత్రకళత్రాదులను వీక్షించు చుండును. అట్టిస్థలమునందు వుట్టికట్టి అందుపది దినముల వరకు ప్రేత తృప్త్యర్థము ప్రత్యహము పాలువుంచవలయును. పదునొకండవ దినము పైశాచా దిక బాధానివృత్యర్థము వృషోత్సర్జనముచేసి పదనొకండు బ్రాహ్మణులకు భోజనము పెట్టుదురు.

**ఆశ్రమములు** : చూ॥ వర్ణాశ్రమములు.

**అశ్రితుడు** : దుష్యంతుని పౌత్రుడు, ఇతనికి పాండ్యుడు చోళుడు, కేరళుడు అని ముప్వురు పుత్రులు. వీరు ప్రత్యేకవంశకర్తలయి నిజనామములు వెలయ జనపద ముల కావించిరి.

**అశ్వలాయనుండు:** ఇతడు ఒకమహర్షి ఋగ్వేదవిహితకర్మములను గుఱించి సూత్ర ములు చేసెను. అది ఆశ్వలాయన సూత్రమనబడు.

**అవపళ్ఖాండే శ్వరుడు** : కాశియందలి యొకదేవత. ఒకప్పుడు కాశీవిశ్వేశ్వరుడు ఒక కల్లుకుండనుండి ప్రత్యక్షమై ఒక యీడిగ వానికి, వానిభార్యకును మోక్షము ఇచ్చినట్లు చెప్పియున్నది.

**ఆహూకి** : దేవకుని మేనయత్త.

**ఆహూకుడు** : య॥ దేవకునితండ్రి. 2) భిల్లవంశజుడు శివభక్తుడు. భార్య ఆహుక. వీరే శివు నను(గ్రహమున తరువాతి జన్మలో నలదమయంతులైరి.

**ఆస్తీకుడు** : జరత్కారునికి వాసుకి అను సర్పరాజు చెల్లెలైన జరత్కారువు నందుపుట్టినముని, జనమేజయుని సర్పయాగముననుండి వుడిగించి తక్షకాదులను కాపాడెను. తక్షకుడు జనమేజయుని సర్పయాగమునకు భయపడి (చూ॥ పరీక్షిత్తు) ఇంద్రుని యొద్దకుపోయి శరణువేడగా, అతడు తక్షకునికి అభయము ఒసంగి తనవద్ద ఉంచికొనివుండెను. అట్లయినను మంత్రబలము దైవబలమునుగూడ మించి ఉండును. కనుక ఈ సర్పయాగ హోతలమంత్రములు హోమములోనికి ఇంద్రు నితోకూడా తక్షకుని ఈడ్చెను. అపుడు ఆస్తీకుడు జనమేజయుని ప్రార్థించి తక్షకుని నిలిపెను. (భార)

## ఇ

**ఇందీవరాక్షుడు** : నలనాభుడు అను గంధర్వరాజు కొడుకు. వరూధిని తమ్ముడు. ఇతడు కపటోపాయముచే ఒకఋషియొద్ద ఆయుర్విద్యనేర్చికొని పరిహసించి నందున అతడు యితనిని అసురుడగునట్లు శపించెను. ఆ శాపము స్వరోచివలన వదలెను. (మార్కం)

**ఇందుడు** : చూ॥ నా॥ 1) చంద్రుడు 2) అతిచాంద్రుడు. శాశ్వతుని కొడుకు

**ఇందుమతి** : విదర్భరాజు కూతురు. అజుని భార్య. దశరథుని తల్లి.

**ఇంద్రజి, ఇంద్రజిత్తు ఇంద్రజిత్తుడు** : ర॥ రావణుని కొడుకు. అతిమాయావి. పదునాల్గు సంవత్సర ములు నిద్రాహారములు లేనివారిచేతనే యితడు చంపబడునటుల వరము పొందియుండెను. కాన అట్లుండిన లక్ష్మణునిచే చంపబడియెను. చూ॥ మేఘనాథుడు.

ఇంద్రద్యుమ్నము: ఒకానొక సరస్సు. ఇది యింద్రద్యుమ్నుడు అను రాజుదానము చేసిన గోవుల గొరిశల త్రొక్కుడుచేత యేర్పడినది. ఇంద్రద్యుమ్నుడు ఇంద్రసదనమున నుండగా బహుకాలమునకు అతని కీర్తి లోకమున మాసెను. అంత అతనిని అమరులు భూమికి త్రోయగా అతఁడు మార్కండేయుని పాలికి చని నన్నెఱుంగవే అని అడుగగా అతఁడు తాను ఎఱుగననియు, తనకంటె పెద్దయయి హిమశృంగ శైలవాసియయియుండు ప్రవాళకుండు అను ఘూకము ఎఱుంగవచ్చుననియుచెప్పి, అతనివద్దకుపోయిరి. అంత అతఁడును తానుఎఱుంగను అనగా అతని ప్రేరణచే ఈ యింద్రద్యుమ్న సరస్సునందు ఉండిన నాళీకజంఘుడు అను ఒక బకము చెంతకు పోయి అతని మూలముగ ఆ కొలనియందుండుయుగంధరుడు అను కచ్ఛపమును అడుగ అది కొంతసేపు తలచుకొని కన్నుగవయందు అశ్రుతతులు తొరగ "ఉ॥ అక్కట నేనెఱుంగనె మహాగుణ భూషణునమ్మహాత్ము, నిక్కడ బెక్కుమాఱుల కనేక భయంబుల బొందుచుండగా, నక్కటికంబుతోదదగ నాతఁడు గైకొని కాచె గాదెపెం, పెక్కిన .యన్నరేశ్వరుని నెన్నటికిన్మఱువంగవచ్చునే, అమ్మహాత్ముండు బహువిధయజ్ఞచక్షి, ణార్థముగ విప్రవరులకు నర్థినిచ్చు, గోగణంబుల గొరిజల గ్రొస్సియయ్యె, గాదె యీసరోవరము జగన్నుతముగ అని పలికెను. ఇది జగన్నాధమునందు ఉండును. (భార)

ఇంద్రద్యుమ్నుడు: ఋషభుని పౌత్రుడు. భరతుని పుత్రుఁడు అగు సుమతి కొడుకు. ఇతఁడు ఒకనాఁడు కడునిష్ఠతో ఉండువేళ అగస్త్యుడు అచ్చటికిరాగా అతనికిలేచి ప్రత్యుత్థానము ఒనరింపనందున అతఁడు ఇతనిని మత్తగజేంద్రుడు అగునట్లు శపియించెను. అట్లు గజమై సంచరించుచుండి ఒకదినము పిపాసాతురుఁడై ఒక కొలనిలోనికి నీర్పుత్రావ దిగగా అందు ఒక మకరిచే ముంగాళ్ళ రెండుపట్టుపడి నీటిలోనికి ఈడ్వఁబడెను. అంత ఆగజము పూర్వజన్మ జ్ఞానముచే విష్ణుపరాయత్తచిత్తయై అతనిని నుతిచేయ అతడు తనచక్రముచే ఆ మకరినిచంపి గజేంద్రుని కాపాడెను. గజేంద్రుడును తన పూర్వరూపమును పొందెను. (భాగ)

ఇంద్రప్రమిత : వ్యాస శిష్యుడు అగు పైలుని శిష్యుడు. ఇతడు ఋగ్వేద సంహితను చతుర్విధము కావించి బాష్కలుడు బోధ్యుడు యాజ్ఞవల్క్యుడు పరాశరుడు మాండూకేయుడు అగ్నిమతి అనువారికి ఉపదేశించెను.

**ఇంద్రప్రస్థము** : పాండవులకు రాజధాని. ఢిల్లీపట్టణమునకు కొంతదవ్వున ఉండును. నా॥ ఖాండవ ప్రస్థము.

**ఇంద్రవతి** : గోదావరిలో కలిసెడి ఒక ఉపనది.

**ఇంద్రవాహనుడు** : ఇ॥ చూ॥ కకుత్థ్సుడు.

**ఇంద్రసేన** : (1) మౌద్గల్య మహర్షి భార్య. (2) చూ॥ ద్రౌపది (3) నలుని కూతురు.

**ఇంద్రసేనుడు** : (1) నలునికొడుకు (2) ధర్మరాజు సారథి (3) నరిశరుని కొడుకు.

**ఇంద్రావరజుడు** : చూ॥ ఉపేంద్రుడు.

**ఇంద్రుడు** : దేవతలకు రాజు. పూర్వదిక్పాలకుఁడు. ఇతఁడు కశ్యప ప్రజాపతికిని అదితికిని పుట్టిన కొడుకు. ఈయనరాజధాని అమరావతి, ఆయుధము వజ్రము, భార్య - శచీదేవి, ఏనుగు - ఐరావతము, సభ - సుధర్మ, గుఱ్ఱము - ఉచ్చైశ్రవము, సారథి - మాతలి, ఉద్యానవనము - నందనము, కొడుకు జయంతుడు.

ఒకప్పుడింద్రునకు కీడుచేయతలంచి త్వష్ట మూడు తలలవానిని ఒక్కని సృజియించి విశ్వరూప నామధేయుంజేసి పంపగా అతఁడు ఇంద్రపదవి కోరి ఘోర తపంబు చేయుచున్న దానికి భయంపడి ఇంద్రుడు అతనివి తెగజూచెను. (ఈ బ్రహ్మహత్య పాపమును ఇంద్రుడు ఒకవిషమవ్రతంబు ఆచరించి సముద్ర, తరు, ధరణీ, స్త్రీ జనంబులయందు విభాగించి పెట్టెను. అదిసముద్రమందు నురుగు, చెట్లయందు బంక, భూమియందు చౌఁడు, స్త్రీలయందు రజస్సును, అయిఉండును) అంతత్వష్టమిగుల అలిగి ఇంద్రుని మ్రింగజాలెడు వానిని ఒక యసురుని వృత్రుడనువానిపుట్టించి వానినితనతపోమహిమచే మహాతేజోవంతునిచేసి ఇంద్రునితో యుద్ధముచేయపంపగా వాడుపోయి ఇంద్రుని మ్రింగెను. అపుడు ఇంద్రుడు తనశరీరమును సంకుచితముగాచేసి వెడలివచ్చియు వానితేజస్సునుచూచి వెఱచి వృత్రునితోడ సఖ్యంబు కల్పింప మునిగణంబులను పంపెను. అంత వృత్రుడును మునిజనంబులచే ఆర్ద్రంబైనదానను శుష్కంబైనదానను తరువునను పాషాణమునను అస్త్రశస్త్రంబులను దివంబునను నిశిని వధ్యుండు కాకుండునటుల

వరముపొంది ఇంద్రునితో మిత్రభావంబును చెంది యుండెను. పదపడి ఇంద్రుఁడు ఒకనాడు సంధ్యాకాలమున సముద్రతీరమున వృత్రునితోడ విహరించుచు ఉండు నపుడు ఆర్ద్రమును శుష్కమునుగాని సముద్రపు నురుగును తనవజ్రాయుధమునందు చేర్చి తనకు సహాయముగ విష్ణువు అందు ప్రవేశింపగా రేయును పగలునుగాని సంధ్యాసమయంబున ఆ యసురుని చంపెను. అట్లు శత్రుసంహారముచేసినను అది కపట స్వభావంబున కావించిన వధంబుగాన ఇంద్రునకు బ్రహ్మహత్యాపాతకంబు సంప్రాప్తమై దేవరాజ్యమునకు అర్హుడుకాకపోయెను. అప్పుడు కొంతకాలము నహుషుడు ఇంద్రత్వమునుపొంది దేవరాజ్యమును పాలించుచుండెను. పిమ్మట ఇంద్రుఁడు అశ్వమేధయాగముచేసి యాబ్రహ్మహత్య పోగొట్టుకొని దేవరాజ్యాధిపత్యమును మరల పొందెను. మఱియు ఇంద్రుడు గౌతమముని భార్యయయిన అహల్యతో జారత్వముచేసినందున గౌతమ మహర్షి ఇంద్రుని దేహమున సహస్ర యోనులు ఏర్పడునట్లును వృషణహీనుడగునట్లును శపియించెను. అంత ఆ ఋషిని ఇంద్రుడు మిగుల వేడికొనగా అతఁడు అనుగ్రహించి చూచువారికి ఆయోనులు కన్నులుగా అగుపడునట్లు ప్రసాదించెను. అది కారణముగ ఇతడు సహస్రాక్షుడు అనబరగె. మఱియు దేవతలు ఇంద్రునకు నిర్గతములైన వృషణములకు బదులు మేషవృషణములను తెచ్చి అంటించిరి, అని పురాణప్రసిద్ధి. దీనినిబట్టియే ఏదేని తొందర పొసగినప్పుడు ఇదియేమిమేషాండము అని జనులు వాడుదురు. తొల్లిపర్వతములకు అన్నిటికినీ ఱెక్కలు ఉండెను అనియు, వానివలన కలిగెడు బాధలసహింపజాలక ఇంద్రుడు ఆ ఱెక్కలను తెగగొట్టెను అనియు, పురాణ ప్రసిద్ధి కనుక ఇంద్రునకు గోత్రభిత్తు అను పేరు కలిగెను.

చ్యవనుడు అశ్వినీదేవతలకు యజ్ఞభాగమును కల్పించినపుడు ఇంద్రుడు అతనిపై వజ్రాయుధము వేయబూనగా అది ఆ ఋషి తపోమహిమవలన ఇంద్రునిచేయి వదలదయ్యెను. కనుక ఇంద్రునికి దుశ్చ్యవనుడు అను పేరుకలిగెను. ఈతడు వాస్తు శాస్త్రముకు అధిదేవత.

**ఇతిహాసములు** : రామాయణ భారతములు. ఇవి ఛందోబద్ధములయినను కావ్యనాటకాదులవలె కఠిన శైలికలవికావు. ఇవి సాక్షాద్విధిరూపములుగాక చరిత్రములను చెప్పుచు మనుష్యులకు తెలివి పుట్టించుచున్నవి.

**ఇధ్మవాహుడు** : ఋ॥ అగస్త్యుని పౌత్రుడు అగు తేజస్వి. (భార)

ఇనుఁడు : చూ॥ నా॥ సూర్యుడు.

ఇల : (1) దక్షప్రజాపతి కూతురు కశ్యపుని భార్య. (2) వైవస్వత మనువుకూతురు బుధునిభార్య పురూరవునితల్లి. ఈమెవసిష్టుని ప్రయత్నంబున హరి కరుణచే పురుషుండై సుద్యుమ్నుడు అనంబరగెను. చూ॥ సుద్యుమ్నుడు.(3) వసు దేవుని భార్య.

ఇలిబిల : తృణబిందువునకు అలంబసయందు పుట్టిన కూతురు. మగఁడు విశ్రవసుడు. కొడుకు కుబేరుడు.

ఇలావంతుడు : అర్జునునకు ఉలూపియందు పుట్టిన కొడుకు.

ఇల్వలుడు : విప్రచిత్తికిని సింహికకును పుట్టిన దానవుడు. వాతాపి తమ్ముడు. అగస్త్యునిచే భస్మమాయెను. చూ॥ అగస్త్యుడు – వాతాపి. (భార)

ఇషుమంతుడు : య॥ వసుదేవుని తమ్ముడైన దేవశ్రవసుని రెండవ కొడుకు.

ఇళ : చూ॥ ఇల

ఇక్షుమతి : ఒకానొకనది. ఈనదిమీద కుశధ్వజుని రాజధాని అగు సాంకాశ్య పురి ఉండెను.

ఇక్ష్వాకువు : ఇతడు వైవస్వతమనువు కొడుకు. ఇతనికి వికుక్షి, నిమి, దండ కుడు, విశాలుడు, మొదలగు పుత్రులు అనేకులు పుట్టిరి.

## ఈ

ఈశానుడు : (1) శివునికి నామాంతరము. అష్టమూర్తులలో ఒక్కమూర్తి. (2) అష్టదిక్పాలకులలో ఒక్కఁడు. ఇతని దిక్కు పూర్వోత్తరము.

ఈశ్వరరాజు : కృష్ణదేవరాయని పితామహుఁడు

ఈశ్వరుడు : సర్వాంతర్యామి అయిన భగవంతుడు. ఈ పేరు సాధారణముగా సగుణబ్రహ్మ స్వరూపమును తెలియజేయును. వైష్ణవులు విష్ణువునకు ఈశత్వము కలుగజెప్పుదురు, అప్పుడుమోక్షస్థలము కైలాసము. స్మార్తులు బ్రహ్మకుఈశత్వము కలుగఁ జెప్పుదురు. అప్పుడు మోక్షస్థలము బ్రహ్మలోకము. శాక్తేయులు శక్తికి

కలుగఁ జెప్పుదురు. వీరి మోక్ష లోకములు, ఆయా యుపాసనా దేవతల బట్టి ఉండును.

**ఈశిమడు** : పు॥ నా॥ రైభ్యుడు.

## ఉ

**ఉగ్రశ్రవసుడు**
**ఉగ్రశవుడు** : రోమహర్షణుని కొడుకు. సూతకులజుడు. ఇతడు శౌనకాది మహర్షులకు సకల పురాణేతిహాసములు చెప్పినవాడు. మఱియు ఇతడు నైమిశారణ్య వాసులగు మహామునులవలన బ్రహ్మసనంబు పడసి పురాణములు చెప్పుచుండగా అచ్చటికి తీర్థయాత్ర చేయుచు బలరాముడువచ్చి తన్ను చూచి ప్రత్యుత్థానముచేయక కూర్చుండియున్న ఈతనిపై కోపించి తనచేతిదర్భలతో గొంతుకోసి చంపి బ్రహ్మసనస్థుడు అగుట చేతలేవకున్నవాడు కావున ఇతనిని చంపుట పాతకంబు. ఇందులకు ప్రతిక్రియ విచారింపుము అని మునులు తన్ను వేడుకొనగా బ్రతికించి వారిచే మన్నన వడసి చనియెను. (భాగ) (భార)

**ఉగ్రసేనుడు** : (1) య॥ మధురాపురిరాజు. దేవకునియన్న. కంసుని తండ్రి. చూ॥ కంసుడు (2) కు॥ అభిమన్యుని పౌత్రుడు. జనమేజయుని తమ్ముడు. (3) య॥ కృష్ణుని వంశస్థుడు అగు సుబాహు కొడుకు.

**ఉగ్రాయుధుడు** : పు॥ కృతికొడుకు. శంతనుని మరణాంతరము అతని భార్యయగు సత్యవతిని పరిగ్రహింప యత్నించి భీష్మునిచే చంపబడెను. (హరి)

**ఉగ్రుడు** : శివునకు నామాంతరము. అష్టమూర్తులలో ఒక్కమూర్తి.

**ఉచ్చైశ్రవము** : అమృత మథనమపుడు పాలసముద్రమునందు పుట్టిన గుఱ్ఱము ఇంద్రవాహనము. గుఱ్ఱములకు రాజు. (భార) (భాగ)

**ఉజ్జయిని** :
**ఉజ్జిని** మాళవదేశమునకు ముఖ్యపట్టణము (ఉజ్జైని=మిక్కిలి గెలుపుకలది) నా॥ అవంతి. దీనియందు మహాకాళేశ్వరుడు అనునామధేయముతో శివుడు ప్రసన్నమయి ఉన్నాడు అనియు ఇచ్చట ఒకమహాకాళి యుండి కోరిన వరములను దయచేయును అనియు ప్రసిద్ధి. ఈ పట్టణమున విక్రమార్కుడు మొదలగు రాజులు ప్రభుత్వము చేసిరి.

**ఉతథ్యుడు** : అంగిరసుని కొడుకు. బృహస్పతి సహోదరుడు. భార్య మమత. కొడుకు దీర్ఘతముడు. ఉతథ్యుని భార్యయందు బృహస్పతికి భరద్వాజుడు పుట్టెను. (భార)

**ఉత్కచము** : ఇది ఒక పుణ్యతీర్థము. ఇచట ధౌమ్యుని పాండవులు పురోహితునిగా వరించిరి.

**ఉత్కళము** : పంచగౌళదేశములలో ఒకటి. దీనిని ఓఢ్రదేశము అనియు అందురు.

**ఉత్కలుడు** : ధృవుని పెద్దకొడుకు. బాల్యమునందే బ్రహ్మజ్ఞానము కలిగి రాజ్యము ఒల్లక వెళ్ళిపోయెను. ఇతని తమ్ముడు వత్సరుడు.

**ఉత్తముడు** : (1) ఉత్తానుపాదునికిని సురుచికిని పుట్టిన కొడుకు. ఇతడు వేటాడపోయి ఒకయక్షునిచే చంపబడెను. అపుడు ఇతనితల్లి ఆ దుఃఖము తాళలేక అతనిని వెదకుచుపోయి మృతిపొందెను. (2) మూడవ మనువు (భాగ) (మార్కం)

**ఉత్తమౌజుడు** : ద్రుపదుని కొడుకు. ధృష్టద్యుమ్నుని తమ్ముడు. భారతయుద్ధమునందు, పదునెనిమిదవనాటి రాత్రినిద్రించునపుడు అశ్వత్థామచే చంపబడెను (భార)

**ఉత్తర** : విరాటరాజు కూతురు. ఉత్తరుని చెల్లెలు. అభిమన్యుని భార్య. పరీక్షిత్తుని తల్లి. ఈమెకు అర్జునుడు అజ్ఞాతవాసమపుడు బృహన్నల అను నామముతో నాట్యము కరపెను. అశ్వత్థామ ప్రయోగించిన అపాండవాస్త్రము, ఈమె గర్భమున వుండిన పిండమును, హింసింపగా ఆ వేదనను ఈమె సహింపనోపక సంకటపడుటను చూచి కృష్ణుడు ఈమె గర్భమున ప్రవేశించి యాపిండమును రక్షించెను. కాన ఆ బిడ్డకుపరీక్షిత్తు అను పేరు కలిగెను. (భార)

**ఉత్తరగీత** : ఇది భారతమందు ఒకభాగము. వేదాంత విషయముగా వుండును

**ఉత్తరుడు** : మత్స్యదేశపు రాజైన విరాటమహారాజుకొడుకు. పాండవుల అజ్ఞాతవాసకాలమున కౌరవులు, పాండవులు విరాటరాజుపట్టణమునందు వుందురు అని తలచి వారిని బయలుపరచి మరల వనవాసమునకు పంపుటకై విరాటునకు విరోధియగు సుశర్మను దక్షిణదిక్కున గోవులను కట్టుమని తాము ఉత్తర దిక్కున గోవులను కట్టగా అపుడు విరాటరాజు సమస్త సేనలతోడను దక్షిణ గోగ్రహణమునకై పోయియుండెను. కాబట్టి ఉత్తరుడు మాత్రము, పట్టణములో వుండి తనకు

తగిన సారథి చిక్కిన తాను కౌరవులను పోయి జయింతును అనెను. అపుడు సైరంధ్రీ వేషమున వుండిన ద్రౌపది బృహన్నల సారథ్యము చక్కగా చేయును అని చెప్పగా బృహన్నలయను అర్జునుని సారథిగాచేసికొని పోవునపుడు కౌరవుల సేన జూచి ఉత్తరుడు భయపడి పరుగిడసాగెను. అపుడు అర్జునుడు అతనికి ధైర్యముచెప్పి నిజరూపంబు ఎరిగించి అతనిని సారథిగాచేసికొని కౌరవులతో యుద్ధముచేసి జయించెను. (భార)

**ఉత్తానపాదుడు** : స్వాయంభువు అను మనువునకు శతరూపివలన పుట్టిన రెండవ పుత్రుఁడు. ఇతనికి సునీతి సురుచి అని యిరువురు భార్యలు. అందు సురుచిపై భర్తకు ప్రేమ అతిశయించి వుండెను. సునీతికి ధ్రువుడు అను కొమరుడును సురుచికి ఉత్తముడు అను కుమారుడును కలిగిరి. (భాగ) (మత్స్య)

**ఉత్పలావతి** : సురాష్ట్రుని భార్య. తామసమనువుతల్లి. నిర్వృతచక్షుడు అను ఒక ఋషిశాపముచే మృగమై సురాష్ట్రుని స్పర్శవలన గర్భము ధరించెను. (మార్కం)

**ఉదంకుడు** : ఋ॥ పైలుని శిష్యుడు. ఈతడు గురుభార్య నిమిత్తము పౌష్య మహారాజు భార్య కుండలములు తెచ్చునవసరమున తక్షకుడు అను నాగుడు దానిని అపహరించెను. అంతట మిక్కిలి ప్రయాసపడి ఆకుండలములను రాబట్టుకొని పోయి గురుభార్యకు సమర్పించి తక్షకునివలని విరోధముచే జనమేజయునకు సర్పయాగమందు బుద్ధిపుట్టించెను. ఈతడు వేదునికిని శిష్యుడు. (భార)

**ఉదక్సేనుడు** : బా॥ విష్వక్సేనుని కొడుకు.

**ఉదయగిరి** : (1) చూ॥ ఋషగిరి. (2) ఆంధ్రదేశమందలి నెల్లూరి జిల్లాలో వుండెడు ఒకకొండ. దీని చేరువను వుండు గ్రామమునకును యీ పేరు చెల్లుచూ వున్నది.

**ఉదయాశ్వుడు** : అజాతశత్రుని పౌత్రుడు. శైశునాగులలో ఒక్కడగు మగధ దేశపురాజు. ఇతడు కుసుమపురము లేక పాటలీపుత్రము అనంబడు పట్టణమును నిర్మించెను.

**ఉద్దాలకుడు** : (1) ఋ॥ నా॥ ఉపమన్యుడు. ఇతనికి కల గురుభక్తికి అశ్వినీదేవతలుమెచ్చి యితనిగురువగు ధౌమ్యుని లోహదంతునిగావుండినవాని నిస్వర్ణదంతునిగా

చేసిరి. ఇతనికొడుకు శ్వేతకేతుడు. తొల్లి స్త్రీలు నియమములేక తమ పురుషుల తోను పరపురుషులతోను సంగమము చేయుచుపుండిరి. అట్లుండగా ఒక్కపుడు ఋతుస్నానము చేసియుండిన ఋతని ధర్మపత్నిని ఒక ముసలిబ్రాహ్మణుడు పుత్రార్థియై యాచింపశ్వేతకేతుడు కోపగించుకొని అది ధర్మవిరుద్ధము అని నిషేధించి అది మొదలు స్త్రీలు ఎన్నడును పరపురుషులతో సంగమము చేయకూడదు అని నియమము చేసెను.

**ఉద్ధవుడు** : (1) బృహస్పతి శిష్యుడు. వసుదేవునితమ్ముడైన దేవభాగుని కొడుకు (2) నహుషుని కొడుకు

**ఉన్మత్తుడు** : మాల్యవంతుని కొడుకు.

**ఉపదానవి** : వైశ్వానరునికూతురు. హిరణ్యాక్షుని భార్య (భాగ)

**ఉపదేవి** : దేవకుని కూతురు. వసుదేవుని భార్య. ఈమెకొడుకులు కల్పవృష్టి ప్రభృతులు పదుగురు.

**ఉపనందుడు** : య॥ వసుదేవునికి మదిరయందు పుట్టినకొడుకు. నందునిసహోదరుడు.

**ఉపనిషత్తు** : బ్రహ్మస్వరూపమును గుఱించి చెప్పువేదభాగములు. ఇవి 108. అందు ఇప్పుడు ప్రసిద్ధముగా పఠింపబడునవి. ఈశావాస్యము, కేనము, కఠవల్లి, ప్రశ్న, ముండకము, మాండూక్యము. తైత్తిరీయము, ఐతరేయము, ఛాందోగ్యము, బృహదారణ్యము, అనునవి పది.

**ఉపప్లావ్యము** : భారతయుద్ధమునకు ముందుపాండవులు విడిదలచేసుకొని యుండిన చోటు, ఇచ్చటుండునపుడె పాండవకౌరవులకు రాయబారములు జరిగెను.

**ఉపమన్యుడు** : చూ॥ నా॥ ఉద్దాలకుడు

**ఉపయాజుడు** : ఇతడు గంగా కూలంబున వాన ప్రస్థవృత్తినిఉన్న ఒకవిప్రుడు. యాజునితో కూడ ఇతడు ద్రుపదునిచే యాగముచేయించెను.

**ఉపశ్రుత్యధిదేవత** : ఉపశ్రుతికి అధిష్టానమగుదేవత. (ఉపశ్రుతి - తాముతలచిన కార్యముల సిద్ధ్యసిద్ధులకు సూచకముగా వినబడెడి ఆకస్మికపుమాట.) ఈ యుపశ్రుత్యధిదేవత, దేవేంద్రుడు దేవపదభ్రష్టత్వమును పొందియుండుకాలమున అతని భార్యయగు శచీదేవి యొక్కసత్యతకు మెచ్చి ఆమెను ఇంద్రునితో కూడచేర్చెను.

**ఉపస్మృతులు** : ఇవి పదునెనిమిది. అవియేవన. కణ్వస్మృతి. కపిలస్మృతి. లోహితస్మృతి. దేవలస్మృతి. కాత్యాయనస్మృతి. లోకాక్షిస్మృతి. బుధస్మృతి శాతాతప

స్మృతి, అతిస్మృతి, ప్రచేతసస్మృతి, దక్షస్మృతి, విష్ణుస్మృతి, వృద్ధవిష్ణుస్మృతి, వృద్ధమనుస్మృతి, ధౌమ్యస్మృతి, నారదస్మృతి, పౌలస్త్యస్మృతి, ఉత్తరాంగిర స్మృతి.

**ఉపేంద్రుడు** : కశ్యప ప్రజాపతియు అదితియు శ్రీమహావిష్ణువు తమగర్భమున పుట్టవలయునని అనేకవేల సంవత్సరములు తపమాచరింపగా, ఆతపమునకు మెచ్చి వారు కోరినట్లు వారిగర్భమున పుట్టినవిష్ణువునకుపేరు. చూ॥ నా॥ వామనుడు.

**ఉమాదేవి** : దక్షప్రజాపతి కూతురు. రుద్రునిభార్య. చూ॥ పార్వతి, భద్రకాళి,

**ఉమాపతి** : రుద్రుడు .

**ఉరువల్కుడు** : య॥ వసుదేవునకు ఇళయందు పుట్టినకొడుకు.

**ఉర్మిళ** : యమునిభార్య.

**ఉమశ్రవుడు** : నరి॥ సత్యశ్రవునికొడుకు.

**ఉలూకుడు** : (1) ఇంద్రుడు. హిరణ్యాక్షునికొడుకు (మత్స్య) (2) శకుని కొడుకు. సహదేవునిచే మృతినందెను. వీడుకురుక్షేత్రంబున కౌరవపాండవులు యుద్ధసన్నద్ధులు అయిచేరినప్పుడు. పాండవుల యొద్దకువచ్చి దుర్యోధనుడుచెప్పు మన్నమాటలు కొన్నిచెప్పిపోయెను. (భార)

**ఉలూపి, ఉలూచి** : నాగకన్యక. వాసుకికూతురు. ఈమెయందు అర్జునుడు ఇలావంతుని కనెను.

**ఉల్ముకుడు** : చక్షుర్మనువునకును డనలకును పుట్టిన కడపటికొడుకు. భార్య పుష్కరిణి. కొడుకులు అంగుడును, మనసుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు.

**ఉశనుడు** : చూ॥ నా॥ శుక్రుడు

**ఉశీనరుడు** : అ॥ మహామనుని పెద్దకొడుకు. శిబితండ్రి. ఈతనిదేశము ఉశీనర దేశము అనంబడును.

**ఉశేనస్సు** : వేదశిరునికొడుకు.

**ఉష** : బాణాసురుని కూతురు. అనిరుద్ధుని భార్య. ఈమె కృష్ణునిపౌత్రు డగు అనిరుద్ధుని కలయందుచూచి తన చెలికత్తెయగుచిత్రరేఖద్వార ఆతనిని ఎరిగి

ఆ చిత్రరేఖ తన మాయచేత ఇతరులకు తెలియక ద్వారకకు పోయి అంతఃపురము నందు శయనించియున్న అనిరుద్ధుని కొనిరాగా తండ్రికి తెలియక అతనికిచ్చెను. చూ॥ బాణాసురుడు. (భాగ)

ఉషాపతి : అనిరుద్ధుడు.

## ఊ

ఊర్జ : వసిష్ఠునిభార్య.

ఊర్జస్వతి : ప్రియవ్రతునికూతురు. భార్గవుడగు శుక్రాచార్యునిభార్య, దేవయాని తల్లి,

ఊర్జితుడు : యు॥కార్తవీర్యార్జునునికొడుకగు శూరుడు

ఊర్మిళ : జనకమహారాజుయొక్క ఔరసపుత్రి. లక్ష్మణునిభార్య. ఈమెభర్త యగు లక్ష్మణుడు, తమ అన్న వెంటవనమునకు పోయిమరల అయోధ్యకువచ్చి,చేరు నంతవరకు ఇతరవ్యాపారములెల్ల మరచి నిద్రించుచుండెననియు, అంతకాలములక్ష్మణుడు నిద్రలేకయుండెను అనియు నితిహాసము.

ఊర్వశి : ఒకయప్సరస నరనారాయణులు బదరికాశ్రమమునతపమాచరించు నపుడు దేవతాస్త్రీలు వారి తపోభంగము చేయ అవటికిరాగా ఆ మహామునులు చలింపరైరి, అందు నారాయణుడు తమ నిశ్చలత్వమును ఆ నారీమణులకు తెలుపు వాడై తన యూరవు గీరగా అందుండి రూపవతులగు ఊర్వశిమొదలగు వారు అనేకులు పుట్టిరి. అప్పుడు దేవతాస్త్రీలు తమ యత్నము జరగనేరదని తలచి ఊర్వశిని తమకు ముఖ్యురాలినిగా జేసికొని తమ లోకమునకు పోయిరి, అని భాగవతమునందు చెప్పబడియున్నది. మఱియు అర్జునుడు శివుడు మొదలగు దేవతలవలన పాశుపతము మొదలైన దివ్యాస్త్రములను పడసి దేవతలకు బాధకులుగాఉండిన కాలకేయనివాతకవచులను వధించుటకై దేవలోకమునకు పోయిఉండు తటిని ఊర్వశి ఇతని సంగమమును కోరి అందులకు ఇతడు ఇయ్య కొననందున ఇతనికి నపుంసకత్వముకలుగునట్లు శపియించెను. అంత అది ఇంద్రుడు ఎఱిఁగి ఆ శాపమును అర్జునుడు అజ్ఞాతవాసకాలమున అనుభవించునట్లును తదంతంబున శాపమోక్షము అగు నట్లునుఅనుగ్రహించెను.

(భార)

ఊర్వుడు : రు॥ ఇతఁడు అత్యుగ్రతపము ఆచరించు సమయమున నారదాది దేవర్షులును, బ్రహ్మర్షులును వచ్చి ఇతనిని ఒకపుత్రునిపడయుము అనిన ఒకతెల్లు పోచను చేతవూనితనవూరువును అగ్నియందునిచి మథించెను. అందుండి జ్వాలామాలియగు సుతుడు ఒకఁడు ఉద్భవిల్లెను. అంత బ్రహ్మప్రార్థనచే ఊర్వుడు పుత్రుని సముద్రమునందు బడబాముఖుఁడై వసించునట్లును ఆ ఉదకము అతఁడు ఆహారముగ కొనునట్లును నియమించెను. చూ॥ ఔర్వుడు (హరి)

## ఋ

ఋ : అదితినామము.

ఋచికుడు : ఔర్వునికొడుకు. విశ్వామిత్రుని సహోదరి అగు సత్యవతిమగఁడు ఇతనికి ముప్పురుకొమరులు. అందు జమదగ్ని జ్యేష్ఠుడు. ఒకప్పుడు హరిశ్చంద్రుఁడు తనయాగపశువును పోగొట్టుకొని దానికి బదులు నరపశువును తేగోరి ఈఋచికిని యొద్దకు వచ్చి అతనిపుత్రులలో మధ్యముడుఅగు శునశ్శేపుని వెలకు తీసికొనిపోగా వాడు మార్గమున తన మేనమామఅగు విశ్వామిత్రునిచూచి అతనిని తన్ను కాపాడుము అని ప్రార్థింపగా అతఁడు తన మంత్రశక్తిచే హరిశ్చంద్రునియజ్ఞము నెరవేర్చి, శునశ్శేపుని రక్షించెను.

ఋచేయువు ; పు॥ రౌద్రాశ్వునిజ్యేష్ఠపుత్రుఁడు. అతిసారునితండ్రి.

ఋతధాముడు : య॥ వసుదేవుని తమ్ముడగు ఆనకుని కొడుకు.

ఋతధ్వజుడు : కా॥ నా॥ ప్రతర్దనుఁడు. ఇతడే కువలయాశ్వుడు.

ఋతవాక్కు : ఋ॥ ఇతనికి రేవతి నక్షత్రము నాల్గవ పాదమున పుత్రుఁడు జన్మించి ఆ పుత్రుడు దుష్టుడు అయ్యెను. అందుకై ఇతఁడు కోపగించి రేవతీ నక్షత్రము పుడమియందు పడునట్లు శపియించెను.

ఋతుడు : మి॥ విజయుని కొడుకు.

ఋతపర్ణుడు : ఇ॥ అయుతాయువు కొడుకు. సర్వకాముని తండ్రి. ఈతనికి నలుఁడు అశ్వహృదయమను విద్యను ఉపదేశించి, అక్షహృదయమను విద్యను పడసెను.

**ఋభుఁడు** : బ్రహ్మ మానస పుత్రులలో ఒకఁడు. ఇతఁడు సనకసనందన సనత్సుజాత సనత్కుమారులతో కూడ పుట్టినవాఁడు. వీరలు అయిదుగురు సృష్టి విముఖులు అయినందున బ్రహ్మ మరల మఱీచాదులను తొమ్మండ్రను పుట్టించెను. ఇతనిని ఋషభుఁడు అనియు చెప్పుదురు.

**ఋభుక్షుడు** : చూ॥ ఇంద్రుడు.

**ఋశంకుఁడు** : నా॥ భేరుశంకుడు.

**ఋష్యమూకము** : ఒకానొక కొండ. ఇందు సుగ్రీవుఁడు తన అన్న అగు వాలిచే కిష్కింధ నుండి దరుమకొట్టఁబడి అతఁడు తన్ను వెదకిచంపును అనుభీతిచే దాగియుండెను. ఇది కిష్కింధకు సమీపమున ఉండెను. వాలి ఒక శాపనిమిత్తమున ఈ కొండమీదికి రానివాడు అయ్యె. చూ॥ వాలి.

**ఋష్యశృంగుడు** : విభాండక ఋషికొడుకు. ఇతఁడు తండ్రికి అతిభక్తితో శుశ్రూష చేయుచు లోక వ్యవహారము ఒక్కటిని ఎఱుంగక బ్రహ్మచర్యాశ్రమమున అడవి యందు ఉండునపుడు, అంగదేశపురాజు అగు రోమపాదుఁడు తనదేశము అనావృష్టిచే అవస్థ చెంది ఉండుట మాన్పకోరి ఋష్యశృంగుఁడు ఉండు దేశమున అనావృష్టి ఉండదు అని పెద్దలవలన ఎఱింగి అతని కొందఱు వేశ్యలను పంపి వానిని జనులతోడితెప్పించి, అనావృష్టి మానగానే, అతనికి తనకూతురును యిచ్చి వివాహము చేసెను. ఇతఁడు దశరధునిచే పుత్రకామేష్టి అను యాగము చేయించెను. (భార) (హరి) (రామా)

ఋషగిరి : మగధదేశమున వరహా పర్వతమునకు ఎదుట ఉండును.

ఋషభుఁడు : (1) నాభి కొడుకు ఇతనికి భరతుఁడు మొదలుగా గల నూరుగురు కొడుకులు ఉండిరి. ఋషభుఁడు విష్ణువుయొక్క అవతారము అందురు. ఇతఁడు సదాచారులు అగు తన కుమారులకు లోక శాసనార్థము సమస్త ఆచారముల ఉపదేశించి భరతునికి పట్టము గట్టి తాను అవధూతయై అవసాన కాలంబున దేశంబుల తిరుగుచు ఉండెను. ఇతఁడు పరమ యోగ ధ్యానపరుఁడు అనియు, పరమపురుషుండు అనియు పురాణములు పలుకును. (2) ఉపరిచర వసువు వంశస్థుడు. (3) సుగ్రీవుని దండునందలి ఒక వానరుఁడు (4) ఇంద్రునకు శచీదేవి యందు పుట్టిన రెండవ కొడుకు జయంతుని తమ్ముడు. (5) ఋభునికి నామాంతరము.

ఋషికుల్య : ఋషపర్వతమున ఉత్పత్తి అగు ఒకనది.

ఋషిక } ఋషీక } : మహేంద్ర పర్వతమునుండి వెలువడి గంజము వద్ద సముద్ర సంగమము అయ్యేడి నది.

ఋక్షుఁడు. : పు॥ అజమీఢుని మూడవ కొడుకు. ఇతని పౌత్రుడు కురువు. పు॥ నా॥ (2 .1) అర్కుఁడు పురుజానిని కొడుకు. భర్మ్యాశ్వుని తండ్రి (8) కు॥ దేవాతిథి కొడుకు.

# ఎ

ఎఱ్ఱాప్రెగ్గడ. : ఒక గొప్ప ఆంధ్రకవి. ఈయన నన్నయభట్టారకునిచే తెనుగు చేయింపఁబడి ఉండిన భారత అరణ్య పర్వమునందలి కొఱతను పూర్తి చేసినది కాక హరివంశమును లక్ష్మీనృసింహావతారము అను ఒక గ్రంథమును రచియించి ఉన్నాడు.

# ఏ

ఏకచక్ర పురము. : ఒక అగ్రహారము. ఇది పాండవులు లాక్షా గృహదహనమప్పుడు దొవతప్పించుకొని పోయి కుంతితో కూడ బ్రాహ్మణవేషము తాల్చి భిక్షుక వృత్తితో కొంతకాలము ఉండిన చోటు. ఇక్కడ ఉండునపుడు భీముఁడు బకాసురుని చంపెను. అవల పాండవులు ద్రుపద పురంబునకు పోయి ద్రౌపదిని పెండ్లాడిరి. ఈ తావున ఇపుడు ఏరా అను పట్టణము ఉండును. (భార)

ఏకచక్రుఁడు : దనుపుత్రులలో ఒక్కఁడు

ఏకతుఁడు : బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు.

ఏకదంతుఁడు : చూ॥ నా॥ వినాయకుఁడు.

ఏకపాదుఁడు : రు॥ అష్టావక్రుని తండ్రి. (భార)

ఏకపింగుడు } ఏకపింగళుడు : } చూ॥ కుబేరుఁడు.

ఏకలుఁడు : వసుదేవుని తమ్ముడైన దేవశ్రవసుని కొడుకు. నిషాదులచే చంపఁబడెను.

ఏకలవ్యుడు : ఒకబోయవాఁడు. వీడు ధనుర్విద్యఅభ్యసింప కోరి ద్రోణాచార్యులు సకల రాజకుమారులకును విలువిద్య నేర్పుట విని అచ్చటికి పోయి తన్నును శిష్యునిగా చేసికొమ్మని ప్రార్థింపగ ఆయన నీవు నీచ జాతియందు పుట్టిన వాడవు విలువిద్యకు అర్హుడవు కావు అని పరిగ్రహింపక పోయెను. అంతట వీడు ద్రోణాచార్యులవలె నుండు ఒక బొమ్మను చేసి పెట్టుకొని ఆ బొమ్మనుగురువుగా భావించి తనంతట తనే అస్త్రవిద్య సర్వము నేర్చుకొనెను. అది తెలిసి ద్రోణాచార్యులు వానికి అస్త్రవిద్య ప్రయోజకము కాకుందునట్లు వానికుడిచేతి బొటన వ్రేలిని గురు దక్షణగా కొనియెను. వీడు భారత యుద్ధమునకు ముందే కృష్ణునిచే చంపఁబడెను. (భార)

ఏకశిలా నగరము : ఒంటిమిట్ట అనెడి ఒకవూరు . ఇది బమ్మెర పోతరాజునకు జన్మ భూమి అని చెప్పుదురు.

ఏర్రాప్రెగ్గడ : చూ॥ నా॥ ఎర్రాప్రెగడ

ఏ లేశ్వరోపాధ్యాయులు : ఒక సంస్కృతకవి. శ్రీ శైలమునకుపశ్చిమ భాగమందలి ఏలేశ్వరము అను గ్రామము ఈయన నివాస స్థానము. కనుకనే ఈతనికి ఈ పేరు కలిగెను. చిన్నప్పుడే సకల శాస్త్రములు నేర్చి విద్యార్థులకు పాఠములు చెప్ప ఆరంభించినందున ఈయన మొదటిపేరు ఎవరికిని తెలియక పోయెను. మఱియు ఇతఁడు పదునాలుగు సంవత్సరముల ప్రాయమప్పుడే రాజసభలకు పోయి శాస్త్ర ప్రసంగముచేసి ప్రతిపక్ష సిద్ధాంతములను అణచి స్వసిద్ధాంతమును స్థాపించెను. గౌతమస్మృతికి దర్పణము అనెడు వాఖ్యానమును తెనుగు దేశమును గురించిన భూగోళశాస్త్రమును ఈ కవిచే రచియింపఁబడెను. రానురాను యుగధర్మము వ్యాపించి వర్ణసాంకర్యంబు కలుగుచు ఉండఁగా ఆంధ్ర బ్రాహ్మణులను నాడులచే విభజించి భోజన ప్రతిభోజనములు తప్ప తక్కిన సంబంధ బాంధవ్యములు ఆయాయి నాడు వారు వారిలోనే జరుపు కొనుచు ఉండునట్లు నియమించెను. నాటనుండి వెలినాఁడు, వేగినాఁడు, ములికినాఁడు, కాసరనాఁడు, తెలగాణ్యులు అని అయిదుతరగతులు అయెను, (ఈ వెలనాఁడు, వేగినాఁడు మొదలగు పేళ్లచే నూరునాడులు విభాగింపఁ

బడెను అని ఒక చరిత్రకారుడు వ్రాసి ఉన్నాడు.) అందు వెలినాటివారు వెల నాటివారు అనియు, ములికినాటివారు ములికినాటివారు అనియు ఇప్పుడు పేర్కొనం బడుచు న్నారు.

కాలక్రమమున కొందరు బ్రాహ్మణులు వైదిక వ్యాపారములను వదలి లౌకిక వ్యాపారముల యందు ప్రవేశించిరి. వారిని నియోగులు అందురు. మొట్టమొదట ఆ నియోగుల సంఖ్య ఆరువేలు అయినందున వారిని ఆరువేల నియోగులు అందురు. నియోగులకును వైదికులకును బాంధవ్యము కలుగ నేరదు.

## ఐ

**ఐరావతము** : తూర్పు దిక్కునందలి ఏనుగు, ఇది అమృత మధన మపుడు పాల సముద్రమునందు పుట్టినది. ఇంద్రుని వాహనము. ఏనుగులకు రాజు. (భాగ)

**ఐరావతి** : ఒకానొకయేఱు, ఇది హిమవత్పర్వతంబునకు దక్షిణమున ఉత్పత్తి అయి చంద్రభాగతో సంగమము అగుచున్నది.

**ఐల బిలుఁడు** : ఇలబిల కొడుకు. చూ॥ కుబేరుఁడు.

## ఒ

**ఒడ్డాది** : చూ॥ ఓఢ్రము,

## ఓ

**ఓఢ్రము** : ఉత్కల దేశము. ఒరిస్సా. ఉత్కలదేశపు భాష.

**ఓషధీశుఁడు** ; చంద్రుఁడు,

## ఔ

**ఔదేయులు** ; ఉశీనరుని కొడుకు ఐనభృగుని వంశస్థులు.

**ఔర్వుఁడు** : (1) ఊర్వుని కొడుకు. చూ॥ ఊర్వుఁడు. (2) చరీవమునికి మను కన్యక యందు పుట్టిన ఋషి. ఇతనికి నూఱుగురు పుత్రులు. అందు ఋచికుఁడు జ్యేష్ఠుఁడు. (భార) (బ్ర. వై.)

**ఔశనసము** : ఇది ఉప పురాణములలో ఒక్కటి.

# క

కంక : ఉగ్రసేనుని కూఁతురు. కంకుని భార్య.

కంకణుఁడు : య॥ నిమ్రోచి తమ్ముఁడు.

కంకుఁడు : (1) య॥ వసుదేవుని తమ్ముఁడు. (2) అజ్ఞాతవాస కాలమున సన్యాసివేషమును ధరించిన ధర్మరాజు ఉంచుకొనిన నామము, (3) సంపాతి వంశస్థుఁడు అగు ఒక పక్షిరాజు. (భార) (మార్కం)

కంఠుడు : ఒకఋషి. ఈతనిభార్య ప్రమ్లోచన. కూతురు మరీష. (విష్ణు)

కంచి : కాంచీ పట్టణము. చూ॥ కాంచి.

కంతుడు : చూ॥ మన్మథుడు.

కంజజుఁడు

కంజుడు : చూ॥ బ్రహ్మ.

కందరుఁడు : సంపాతి వంశస్థుడు అగు కంకుని తమ్ముఁడు.

కందర్పుడు : చూ॥ మన్మథుఁడు.

కందుఁడు : కుమార స్వామి.

కంబళ బర్హిషుఁడు : య॥ అంధకుని కొడుకు.

కంస : ఉగ్రసేనుని పెద్దకూతురు. దేవభాగుని భార్య.

కంసవతి : ఉగ్రసేనుని రెండవ కూతురు దేవశ్రవసుని భార్య.

కంసారాతి : కృష్ణుడు. కంసుని చంపుటచే ఇతనికి ఈ పేరు కలిగెను.

కంసుడు : య॥ ఉగ్రసేనుని కొడుకు. మధురా పురమునకు రాజు. శ్రీకృష్ణుని మేనమామ. ఈతఁడు పూర్వజన్మమునందు కాలనేమి అనురాక్షసుఁడు. కనుక ఈ జన్మమందును ఆ వాసన తప్పక దేవతలకు విరోధియై అనేకులను రాక్షసులను తోడుచేసుకొని సాధువులను బాధించుచు ఉండెను. ఇట్లు ఉండి ఒక నాడు తన చెల్లెలు అగు దేవకీదేవిని వసుదేవునకు ఇచ్చి వివాహముచేసి ఆ వధూవరులను రథము మీద కూర్చుండఁబెట్టుకొని తాను సారథియై మిక్కిలి ఉత్సాహముతో రథమును

తోలుకొని పోవుచు, నీచెల్లెలియొక్క యెనిమిదవ కొడుకు నిన్ను చంపును. అను మాట ఒకటి చెవిని పడగానే మనసు చలింపగా తటాలున రథమునుండి దిగి చెల్లెలు అయిన దేవకీదేవిని కొప్పుపట్టి ఈడ్చి నేలపడవేసి తలనరికి చంపఁ బోయెను. అప్పుడు వసుదేవుడు బహువిధముల వేడుకోగా, చంపక విడిచిపెట్టి అదె నిమిత్తముగ దేవకీ వసుదేవులకు సంకెళ్లవేసి కారాగృహమునందుంచి దేవకి కన్న కొడుకులను చంపుచు వచ్చి, కడపట యోగమాయవల్ల కృష్ణుడు వ్రేపల్లెలోనందుని యింట చేరి యున్న సమాచారము తెలిసి అతని చంపుటకు బహుప్రయత్నములు చేసి కడపట అతని చేతనే చచ్చెను, [ (హరి) (భాగ) ]

**కకుత్థ్సుఁడు** : ఇక్ష్వాకుని పౌత్రుడు అగు వికుక్షి కొడుకు. ఇతఁడు విష్ణువుయొక్క అనుమతిచే వృషభరూపుడైన దేవేంద్రుని ప్రార్థన మేరకు అతని మూపుర మెక్కి రాక్షసులతో యుద్ధముచేసినందున ఇతనికి కకుత్థ్సుడు అనియు ఇంద్ర వాహనుడనియు పేర్లుకలిగెను. ఇతనికి పురంజయుడు అని నామాంతరము కలదు. వికుక్షి ఇక్ష్వాకుని కొడుకు అని కొన్ని యెడలచెప్పి ఉండినను వాల్మీకి రామా యణమందు ఇక్ష్వాకు పుత్రుడైన కుక్షి కొడుకు అనిచెప్పివున్నది. మఱియు వికుక్షి కొడుకు బాణుడు అనియు ఉన్నది. అది కకుత్థ్సునికి నామాంతరముగ ఉండవచ్చును.

**కకుద్మి** : ఆ॥ రైవతుని కొడుకు. ఈతఁడు తన కూతురు అగు రేవతికి భర్తను నిశ్చయింపకోరి బ్రహ్మసభకు ఆమెను తనతోడ పిలుచుకొనిపోయి అచట ముహూర్తమాత్రము ఆటపాటలు వినుచుండి అనంతరము బ్రహ్మను అడుగగా, ఓతప కకుద్మి తనలోకమునకువచ్చిఉన్న ముహూర్త కాలముతో భూలోకమునందు నాలుగు యుగములు ఒండొంద ఇరువదియేడుమార్లు తిరిగెను అనిచెప్పి అప్పుడు ఆదిశేషుని అంశమున మనుష్యావతారము ఎత్తి శ్రీకృష్ణుని అన్న అగు బలరామునికిమ్ము అనిచెప్పి పంపెను. అతడట్లే చేసెను. (విష్ణు)

**కకుద్దేవి** : ధర్మని భార్య. దక్ష ప్రజాపతి కూతురు.

**కకుభ** : ఓఢ్రదేశమునందు ఒకపర్వతము.

**కచుడు** : బృహస్పతి కొమరుడు. ఇతడు దేవతల ప్రార్థనచే శుక్రాచార్యుల యొద్ద మృతసంజీవని (చచ్చినవారిని బ్రతికించునది) అను విద్యను గ్రహింప

కోరి ఆతని యొద్దకుపోయి శిష్యత్వము వహించియుండు నవసరమున శుక్రాచార్యులును అతనికుమార్తె దేవయానియు ఇతనిమీద మిక్కిలి ప్రేమకలిగి ఆదరించుచు ఉండిరి. అదిచూచి దానవులు సహింపనోపక ఒకదినము యితడు శుక్రాచార్యుల హోమధేనువును మేపుటకు అడవికిపోయి యుండగా అచటపట్టి వధించిరి. అంత దేవయాని కచుడు పోయిన పోకడ తెలియకపోయెను అని విచారపడుచుండగా శుక్రాచార్యులు యోగ దృష్టిచే వాడు రాక్షసులచేత చంపబడుట తెలిసికొని మృత సంజీవనివలన వానిని సంజీవితునిగాచేసి తోడుకొని వచ్చెను. అందులకు దానవులు సహింపక మరియొక తూరి అడవిని ఒంటిగా యుండువేళ అతనిని చంపి కాల్చి భస్మముచేసి ఆ భస్మమును సురయందు కలిపి శుక్రునికి త్రావనిచ్చిరి. అంతట దేవయాని మహాదుఃఖితురాలై మరల శుక్రుని వేడిన అతడు తనదివ్యదృష్టి వలన కచునికి ప్రాప్తించిన అవస్థ ఎరింగి సురవలనకదా యింత పుట్టెను అనియెంచి సుర పానము బ్రాహ్మణాది జనులకు అందరకు నిషిద్ధముగా విధించి తనగర్భము నందున్న కచుని మృతసంజీవనిచే మరల సంజీవితునిచేసి తన యుదరము భేదించి కొని అతడు వెలువడి రాను, తన్ను పునర్జీవితునిచేయను, అనువుగా అతనికి మృతసంజీవని ఉపదేశము చేసెను. అట్లు కచుండు శుక్రునివలన మృత సంజీవని వడసి అతని గర్భము పుచ్చుకొని బయటికివచ్చి మృతుండయిన శుక్రుని సంజీవితునిచేసి అతనిని సంతోషపరచెను. అంతదేవయానియు మిగుల సంతసించెను. అవల కొంతకాలమునకు వెనుక కచుండు దేవలోకమునకు పోవువాడై శుక్రుని వేడుకొని దేవయానికి తనప్రయాణ యత్నమును తెలుపగా ఆమె అతనిని విడనాడ నోర్వక తన్ను పెండ్లియాడుమని నిర్బంధించెను. అతడు అది ధర్మవిరుద్ధము అని అందులకు సమ్మతించనందున దేవయాని కోపించి నాప్రయత్నమున నీకు లభించిన మృతసంజీవని విద్య ఫలింపకపోవుగాక అని శపించెను. అంతట కచుండు నేను ధర్మమార్గము తప్పనివాడను. కావున నీశాపమున మృతసంజీవని నాకు పని చేయకున్నను, నాచేత ఉపదేశము పొందువారికి పనిచేయును. నీవు ధర్మవిరోధము తలచితివి. కాబట్టి నిన్ను బ్రాహ్మణుడు పెండ్లియాడకపోవునుగాక అని ప్రతి శాపము నిచ్చెను. అది కారణముగా దేవయానికి క్షత్రియుడైన యయాతిని పెండ్లాడ వలసివచ్చెను. కచునకు మృతసంజీవని ఫలింపక తానుపదేశముచేసిన వారికి మాత్రము ఫలించునట్లు అయ్యెను.

**కణాదుడు** : నా॥ గౌతముడు తర్కశాస్త్రమును ఏర్పరచిన ఋషి.

**కణికుడు** : శకునికి ఆప్తుడైన మంత్రి. (భార)

**కణ్వుడు** : రు॥ ఇతఁడు పూరువంశస్థుడు అయిన అప్రతిరథుని కొడుకు. శకుంతల పెంపుడుతండ్రి. ఈతని వంశస్థులు కాణ్వాయులు అనబడునట్టి బ్రాహ్మణులు అయిరి.

(2) మగధ దేశపురాజగు దేవభూతి యొక్క మంత్రి. ఇతనికి నామాంతరము వసుదేవుఁడు. దేవభూతి సంగవ్యసనుడుఁ అయినందున అతనిచంపి ఇతఁడు రాజు అయెను. ఈతని పేర నలువురు నలువదియయిదు సంవత్సరములు రాజ్యముచేసిరి. [ (భాగ) (భార) ]

**కటకపురి** : గజపతిరాజులకు ముఖ్యపట్టణము.

**కదిరీపతి** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు శుకసప్తతి అనుగ్రంథమును రచియించెను.

**కద్రువ** : కశ్యపుని భార్యలలో ఒకతె. దక్షుని కూతురు. ఈమె యందు నాగకులము పుట్టెను. అందు ఆదిశేషువు జేష్టుడు. వాసుకి, కర్కోటకుఁడు, తక్షకుఁడు, ఐరావతుఁడు. ఏలాపుత్రుడు మొదలైన వారు ఇతరులు.

ఒకదినము సాయంకాలమున కద్రువయు ఆమె సవతి వినతయు పాలసముద్రము గట్టున విహరించుచు ఉండి అచ్చట మేయుచు ఉండిన ఉచ్చైశ్రవమును చూచి కద్రువ అక్కా ఈ గుఱ్ఱముదేహము అంతయు తెల్లగా ఉండియు తోక మాత్రము నల్లగా ఉన్నది. చూచితివా అనిచెప్పెను. వాస్తవముగా తోకయు తెల్లగానే ఉన్నందున వినత అట్లులేదు నీవు చక్కగా చూడుము అని చెప్పెను. అదివిని కద్రువ అది దూరమున ఉన్నది కనుక నీకు చక్కగాతెలియలేదు. దగ్గరకు పోయి చూచి నల్లగా ఉండిన యెడ నీవునాకు దాసివి అగుము, లేని యెడ నీకు నేను దాసిని అయ్యెదను అని, పందెము వేసికొని అది అస్తమయ సమయముగా ఉన్నందున మఱునాడు తెల్లవారివచ్చి చూచునట్లు నిష్కర్ష చేసుకొనిరి. అనంతరము కద్రువ తన కొడుకులవద్దకుపోయి వారికి, తనకును వినతకును జరిగిన వాగ్వాదమును పందెమువేసి కొనుటను తెలియ పఱిచి మరుసటి నాటి ఉదయమున తాను సముద్ర తీరమునకు వచ్చు వేళకు ఆ గుఱ్ఱముతోక నల్లగా ఉండునట్లు చేయవలయును,

అని వేసుకొనెను. అందుకు శేషుఁడు మొదలయిన కొందరు అది అధర్మము అని ఆ పనికి సమ్మతింపక పోగా సర్పములు అన్నియు జనమేజయుని సర్పయాగము నందు పడి నశించునట్లు కద్రువ శపించెను. శపింపగానే ఆ శాపమునకు వెఱచి కర్కోటకుఁడు అనువాఁడు తల్లి ఇష్టప్రకారము చేసెను. కనుక వినత కద్రువకు దాసి అయ్యెను. ఈ దాసీత్వమును గరుఁడుకు మాన్పెను. (చూ॥ గరుడుడు). ఆదిశేషుఁడు మహాతపము ఆచరించి విష్ణుప్రసాదము పడసి అతని పాన్పైవేయిపడగలతో భూమిని మోయుచు ఉండెను. వాసుకి రుద్రునికి భూషణము అయ్యెను.
(భార)

కన్నఁడు : చూ॥ కృష్ణుడు.

కన్నడము : చూ॥ కర్నాటకము.

కన్య : వివస్వుని భార్య. ఈమెను జ్యామఘుడు తాను పెండ్లాడవలెనని కొని తెచ్చి తన పుత్రునకు భార్యగా చేసెను.

కన్యాకుబ్జము : ఒక దేశము. కుశనాభుని నూరుగురు కుమార్తెలు వాయుశాపముచే కుబ్జలుకాగా వారిని బ్రహ్మదత్తుడు వివాహము అయి వారి కుబ్జత్వమును మాన్పి వారితో గూడ ఉండిన ప్రదేశము – చూ కుశనాభుడు. ఇది పంచగౌళ దేశములలో ఒకటి.

కపాలమోచనము : ఒక పుణ్యక్షేత్రము. పూర్వము శ్రీరాములచేత చంపబడిన మహోదరుడు అను అసురుని తలపునుక ఒక తపస్వి కాలికి తగులుకొని విడువరాకున్న అతడు వేదన పొందుచు అయ్యల ఉపదేశమున శుక్రుడు తపముచేసిన ఇచ్చోటికి రాగా ఆ కపాలము విముక్తము అయ్యెను. దానంజేసి దీనికి కపాలమోచనము అనుపేరు కలిగెను.

కపిల : (1) సింధునదిలో కలియు ఒక ఉపనది (2) దక్షప్రజాపతి కూతురు. కశ్యపుని భార్య. గోవుల తల్లి. నా॥ సురభి, (3) పుండరీకము అను దిగ్గజముయొక్క భార్య.

కపిలాశ్రమము : ఇది గంగ సముద్రునితో సంగమము అగు ప్రదేశమున నుండు సగరద్వీపమున ఉండెను.

**కపిలాశ్వుడు** : ఇ॥ తండ్రి కువలయాశ్వుడు. లేక దుందుమారుడు కొడుకు దృఢాశ్వుడు.

**కపిలుడు** : రు॥ కర్దమ ప్రజాపతికిని దేవహూతికిని పుట్టినరుషి. సాంఖ్య యోగ ప్రవర్తకుడు. ఈతని విష్ణుని అవతారము అందురు. ఈతని క్రోధదృష్టిచే సగరచక్రవర్తి కొడుకులు అరువదివేగురు భస్మము అయిరి 2) దనువు పుత్రులలో ఒకడు. [(భాగ) (భార)]

**కపోతలోముడు** : య॥ విలోమతనయునికొడుకు.

**కబంధుడు** : (1) ఒకరాక్షసుడు. వీడుజంఘారహితుడై యోజన దీర్ఘములు అగు బాహువులును ఉదరమునందు అణగిన ముఖమును, కలిగి దండకారణ్యమున వుండెను. రామలక్ష్మణులు సీతను వెదకుచు, పోవు అవసరమున వారిని పట్టి మ్రింగపోగా వారు వీనిబాహువులు తెగనరికిరి. అంతటవీడు. గంధర్వుడు ఆయెను. తొల్లిదనువు అను గంధర్వుడు తపోబలముచే చిరజీవిత్వమును, కామరూపిత్వమును పడసి క్రౌర్యపరుడు అయివుండగా వానికి స్థూలకేశుడు అను రుషి శాపముచే ఇట్టి రాక్షసరూపము ప్రాప్తము అయ్యెను. అనంతరము మరి ఒకప్పుడు వాడు యింద్రునితో సంగరము కోరి పోరునపుడు అతని వజ్రాయుధము పెట్టుచేత, కంఠమును, శిరమును, కాళ్లను పొట్టలోపలికి అడగి పోయెను. వాడే కబంధుడు అనపరగెను. కాబట్టి రామలక్ష్మణులు తనబాహువులను తెగగొట్టగానే వీనికి శాపవిమోచనము అయ్యెను. (2) బాణాసురుని మంత్రి. నా॥ కుంభాండుడు. (రామా) (భార)

**కమలిపాలిక** ; నా॥ హిడింబ.

**కమలభవుడు** : బ్రహ్మ. చూ. తోయజగర్భుడు.

**కరంధముడు** : (1) యయాతి పుత్రుడు అగు తుర్వసుని పౌత్రుని కొడుకు. ఈతనికి నామాంతరము బలాశ్వుడు. బలపరాక్రమవంతుడు అయి ఇతడురాజ్యము ఏలుచుండగా, మత్సరంబున పరరాజులు ఇతని పట్టణమును ముట్టడించిరి. అపుడు యితడు అతిఖిన్నుడు అయి, ఏకాంతంబున చింతించుచు పాణిద్వయముచే వక్త్ర నాసికంబుల మూసికొని యుండగా ఇతని అంగుళి మధ్యంబునుండి. వెడలిన ఉఛ్వాసపవనంబున సంఖ్యాతీత బలంబులు పుట్టి శత్రువర్గంబుల జయించెను. ఈ కారణంబున ఇతనికి కరంధముడు అనుపేరు కలిగెను. ఇతని కొడుకు అవీక్షిత్తు. (మార్కం)

**కరంభి** : య॥ శకుని కొడుకు. నా॥ కుంతి.

**కరతోయ** : వంగదేశముగుండా ప్రవహించునట్టి, ఒకనది. ఇది గౌరీవివాహకాలమున ఈశ్వరుని హస్తమువలన పుట్టినది కనుక దీనికి ఈ నామము కలిగెను.

**కరూశము** : ఒకానొక దేశము - చూ మలదకరూశములు దీనికి మొట్టమొదటిరాజు. ఇక్ష్వాకుని తమ్ముడైన కరూశుడు. (రామా)

**కరూశుడు** : వైవస్వతమనువు కొడుకులలో ఒకడు. ఇక్ష్వాకుని తమ్ముడు ఇతని వంశస్థులు కారూశులు అనబడుదురు.

**కర్ణాటకము** : ద్రవిడాంధ్ర దేశముల నడుమను, పశ్చిమ పార్శ్వము నను, ఉండు దేశము. ఈ దేశపు బ్రాహ్మణులు కర్ణాటకులు, అనబడుదురు, వీరు పంచ ద్రావిళ్లలో ఒకరు. వీరి భాష కర్ణాటము, కన్నడము అనబడును.

**కర్ణిక** : (1) అనకుని భార్య. (2) ఒక అప్సరస.

**కర్ణికారవనము** : మేరుతటంబున ఉండు ఒక వనము.

**కర్ణుడు** : కుంతి కన్యగానుండు నపుడు సూర్యప్రసాదమున పుట్టినకొడుకు. చూ॥ కుంతి. ఇతడు పుట్టిన తోడనే కుంతి ఇతనిని దైవికముగా అప్పుడు దొరకిన ఒక మంజసయందు పెట్టి గంగలో పడవైచి తన యింటికి పోయెను. అంతట సూత వంశోద్భవుడు అగు అతి రథుడు అనువాడు తనభార్యఅగు రాధయు తానును. గంగయందు జలక్రీడలు ఆడుచు ఉండి ఆ మంజసను కనిపెట్టితెచ్చి, తెరచిచూచి అందు సూర్యునివలె వెలుగుతున్న బాలకుని చూచి, బిడ్డలులేని మనకు దైవము ఈ బిడ్డను, ఒసంగెను అని అనుకొనుచు వానిని ఎత్తుకొని పోయిపెంచుకొనిరి. అది కారణముగ కర్ణుడు సూతపుత్రుడు అనియు రాధేయుడు అనియు చెప్పబడును. వీడు సహజ కర్ణకుండలములు గలవాడు అగుటవలన కర్ణుడు అనియు, వసువర్మధరుడు కావున వసుసేనుడు అనియు నామములు పడసెను. (వసువు = బంగారు. వర్మము = కవచము) మరియు కర్ణుని పెంపుడు తండ్రియగు సూతుడుఅస్త్రవిద్యాభ్యాసమునకై రాజకుమారులకు అస్త్రవిద్యకరపుచు ఉన్న ద్రోణాచార్యుల యొద్దకు పిలుచుకొని పోగా ఆయన బ్రాహ్మణులును, క్షత్రియులును తక్క తక్కిన వారు అస్త్రవిద్యకు అర్హులు కారు పొమ్మ అని చెప్పెను. అంతట కర్ణుడు ఎట్లయిన అస్త్ర విద్య గ్రహింపవలెను అను తలపున బ్రాహ్మణ వేషమువేసికొని పోయి, పరశు

రాముని ఆశ్రయించి, ఆయనవద్ద సాంగముగా అస్త్రవిద్య అభ్యసించి ద్రోణునికి ప్రియశిష్యుడు అగు అర్జునునియెడ మత్సరము గలిగి యుండెను. కనుక దుర్యోధనుడు ఈతనిని తనకు పరమాప్తునిగా జేసికొని అంగదేశరాజ్యాభిషిక్తునిగ చేసెను. ఈతడు బ్రాహ్మణవేషముతో పరశురాముని యొద్ద విలువిద్య నేర్చుకొను నపుడు ఆయన దొంగతనమును తెలిసికొని తానుపదేశించిన మహాస్త్రములు ఇతనికి ఆపత్కాలమున ఫలింపక పోవునట్లు శాపము ఇచ్చెను.

ఇదిగాక కర్ణుడు విలువిద్య అభ్యసించు వేళ ఒకనాడు ఒక బయలవిలు సాధన చేయుచు ఉండగా ఒక బాణము అచ్చట మేయుచు ఉన్న ఒక బ్రాహ్మణుని ఆవు పెయ్య మీదబడి అది చచ్చెను.. దానికి ఆ బ్రాహ్మణుడు కోపించి కర్ణునికి సమరోద్రేకమున రథచక్రము పుడమిని క్రుంగునట్లును, ఏ వీరుని మార్కొని గెలువకోరి పోరునో ఆ వీరునిచే అతఁడు చచ్చునట్లును శపించెను. ఈతఁడు మహాదాత. సూర్యప్రసాదమువలన, పుట్టినప్పుడే తాను పడసి ఉండిన సహజ కవచకుండలములను ఇంద్రుఁడు అర్జునుని మేలుకై బ్రాహ్మణవేషము తాల్చి వచ్చి తన్ను యాచింపగా అది తెలిసియు, వెనుదీయక ఇచ్చివేసెను. కనుకనే "అతిదానాద్ధతః కర్ణః" అందురు. (భార)

**కర్దమ ప్రజాపతి** : బ్రహ్మచ్ఛాయ యందు పుట్టినయతఁడు. భార్య దేవహూతి. కొడుకు కపిలుఁడు. ఇతఁడు పులహుని కొడుకు అని కొందఱు అందురు. (భాగ)

**కర్మము** : (చూ॥ జన్మము). కర్మములకు హేతువులు అహంకారమమకారములు . అహంకారము అనగా దేహమందు ఆత్మ అనుబుద్ధి. మమకారము అనగా తనవిగాని వానియందు తనవి అనుబుద్ధి. ఈ అహంకార మమకారములు "అవిద్య" అని చెప్పబడుచున్నది. గృహారామాదులకును, ఆత్మకును సంబంధము ఏమియు లేదు. అవియెల్ల దేహాను బంధములు అయినవి. అట్టివానియందు అభిమానముంచ కూడదు. మఱియు సుఖదుఃఖములు పొందక సర్వోదాసీనులు అయి సర్వసముఁడు అయిన ఆ పరమేశ్వరుని సేవించువారు మోహమును వదలి అతిశీఘ్రమున ఉత్తమ పదము చెందుదురు. అన్యకామ్య ధర్మములయందు విషయబుద్ధిచేత నేను నీవు, నాకు నీకు అని వచియించుచు వుండువారు విషయధర్మనిరతులు అయిక్షయింతురు. స్థావర జంగమ ప్రాణిసమూహములందు సమము అయిన భాగవత ధర్మమున వర్తించువారు దేహాదేహ స్వరూపములను ఎఱిగి ఈశ్వరానుగ్రహముపడయుదురు.

మోక్షము పొందుటకు భగవద్భక్తి ముఖ్యసాధనము. అది భగవత్కథల యందలి శ్రద్ధ భగవద్గుణ చేష్టితములను చెప్పుట, సర్వమును భగవదర్పణ చేయుట యిత్యాది వలన హాని కలుగదు. మఱియు ఈశ్వరుడు ఎల్ల భూతములయందు వర్తించుచు వున్నాడు అని ఎల్లభూతములను సమ్మానింపవలయును. అట్టి భగవద్భక్తి కలుగుటకు కొన్ని ప్రతిబంధకములు ఉన్నవి. అవి కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు. వీని సముదాయమే అరిషడ్వర్గము అనఁబడును. అది ఇంద్రియములను వశపరచుకొని విషయముల వైపు ఈడ్చుచున్నది. ఉదకములకు పల్లపు భూములందు ప్రవహించుట స్వభావము అయినట్లు, ఇంద్రియములకు దుర్విషయములయందు తిరుగుట సహజము. విషయాసక్తులకు భగవద్భక్తి కలుగఁజాలదు, సహజముగ మనుష్యులు ఇంద్రియములకు లోబడుచున్నారు, ఇంద్రియములు మనసును ఈడ్చుచున్నవి. అట్టి మనసును వశపరచుకొనువాడే బుద్ధిమంతుఁడు. జీవుఁడు అను రధికుఁడు మనసు అను కళ్లెముతో ఇంద్రియములు అను గుఱ్ఱములను స్వాధీనముచేసికొని విషయములు అనేఁడు విషమభూములయందు పోనీక నిలిపెనేని తనకు కలుగఁగల హానిని తొలఁగించి తాను పొందవలసిన మోక్షము అను దేశమును చేరి సుఖపడవచ్చును. అట్టి మనోనిశ్చయము మత ప్రాణములయందలి విశ్వాసమువలన కాని మనుష్యునకు కలుగదు. ''మ॥ ఉపవాస వ్రతశౌచశీల సఖసంధ్యోపాసనాగ్ని క్రియా, జపదానాధ్యయనాదికర్మముల మోక్షప్రాప్తి చేకూరద, చ్చపు భక్తిన్ హరిఁబుండరీకనయనున్ సర్వాతిశాయిన్ రమాధిపుఁబాపఘ్నుఁబరేశు నచ్యుతుని నర్థిన్ గొల్వలేకుండినన్''

**కలశభవుఁలు** : అగస్త్యుఁడు, వసిష్ఠుఁడు, ద్రోణాచార్యుఁడు. ఈ ముగ్గురకును వీరిజనకుల రేతస్సులు కలశములయందు రక్షింపఁబడి అందు వీరు జన్మించినందున ఈ నామము కలిగెను.

**కలహాకంఠిక** : కాలకౌశికుని భార్య.

**కలి** : కలియుగాధిదేవత.

**కలియుగము** : ఒకయుగము. దీనిపరిమితి 4,32,000 సంవత్సరముల కాలము. చూ॥ యుగములు. ఇది కృష్ణ నిర్యాణము మొదలు గణింతురు. ఈ యుగమున జనులు తమోగుణయుక్తులు అయి రాగద్వేష సహితులును, తపోవిరహితులును, క్షుద్రోగపీడితులును, దురాచార పరులును, అనృతవాదులును, కృతఘ్నులును,

అల్పాయుష్కులును, దుఃఖపీడితులును అయి జన్మింతురు అని చెప్పఁబడిఉన్నది.
(కల్కి)

**కల్క్యవతారము** : విష్ణువు యొక్క దశావతారములలో కడపటి అవతారము. కలి యుగాంతమున శంబళ గ్రామమున విష్ణుని అంశముగల బ్రాహ్మణోత్తమునకు విష్ణుడు కల్క్యాత్మకుఁడు అయి జనియించి సంస్మరణ మాత్రముననే వేదశాస్త్రములను అధిగమించి వసుమతియందలి అధర్మవర్తులను ఎల్ల నాశనముచేసి ధర్మము నిలుపును అని పురాణములయందు చెప్పఁబడియున్నది. (కల్కి)

**కల్బరిగ** : ఇది కృష్ణదేవరాయల శత్రువులు అగు ముసల్మానుల రాజధాని. ఇది వాడుకయందు కలబరిగి గుల్బర్గా అనఁబడును.

**కల్మాషపాదుడు** : ఇ॥ నా॥ మిత్రసహుఁడు. ఒకప్పుఁడు కల్మాషపాదుఁడు వేటకై వనమునకేగి అచట ఒక రక్కసుని చంపగా వానితమ్ముఁడు ఇతనిపై మచ్చరమున ఇతనియింట వంటవాని వేషముతో వసించి వశిష్ఠమునికి ఒక్కనాఁడు భోజనము పెట్టు సమయంబున నరమాంసము వండితెచ్చి పెట్టెను. అదిచూచి ఆ ముని అలిగి రాజును రాక్షసుడవుకమ్ము అని శపించెను. అందుకు అతఁడు తనయందు దోషము లేనిది తెలిసికొనక తనకు శాపము యిచ్చెను, అని ప్రతిశాపమియ్య జలము నెత్తెను. అది అతని భార్యచూచి బ్రాహ్మణుండు కోపించినను మనము కోపించుటధర్మము కాదు అని రాజును మాన్పించెను. అప్పుడు అతఁడు ఆ జలమును ఎక్కడను చల్లను ఒల్లక తన పాదములపై విడిచికొనెను. దానిచేత పాదములయందుకల్మషము కలిగి కల్మాషపాదుఁడు అనుపేరు కలిగెను. అంత వశిష్ఠుఁడు కోపము చల్లారి అతనిని అనుగ్రహించి పండ్రెండు సంవత్సరములకు శాపమోక్షము అగునట్లు ప్రసాదించెను. కల్మాష పాదుఁడు తనకు రాక్షసత్వము రాగానే వసిష్ఠుని జ్యేష్ఠపుత్రుడును పరాశరుని తండ్రియును అగు శక్తిని మ్రింగెను.

కొందఱు ఇతనికి ఈ శాపము శక్తి ఇచ్చెను అని చెప్పెదరు.

**కవి** : (1) పు॥ ఋక్షయుని కొడుకు. ఇతని వంశస్థులు బ్రాహ్మణులు అయిరి. (2) ఇక్ష్వాకుని తమ్ముఁడు. వైవస్వతుని కడపటి కొడుకు. ఈతడు బాల్యముననే మృతి చెందెను. (3) శుక్రునితండ్రి చూ॥ శుక్రుడు.

**కవ్వడి** : అర్జునుని నామము.

కశ్యపుఁడు : (1) ఒకప్రజాపతి. ఇతఁడు మరీచికి కళ వలన పుట్టిన వాఁడు ఈయన దక్షప్రజాపతి కుమార్తెలలో పదుమువ్వురను. వైశ్వానరుని కుమార్తెలలో ఇరువురను వివాహమయ్యెను. అందు.

దక్షప్రజాపతి కుమార్తెలు : } సంతతి.

దితి దైత్యులు.

అదితి ఆదిత్యులు.

దనువు దానవులు.

అనాయువు - లేక - అనుగ - సిద్ధులు,

ప్రాధ గంధర్వులు.

ముని : { అప్సరసలు మానేయులు, మానేయులు అనఁబడు గంధర్వులు అనియు అందురు.

సురస : (యక్షులు, రాక్షసులు,)

ఇల : వృక్షలతా తృణజాతులు.

క్రోధవశ : పిశితాశనములైన సింహవ్యాఘ్రాది సర్వమృగములు.

తామ్ర : { శ్యేనగృధ్రాది పక్షిగణములు, అశ్వములు, ఉష్ట్రములు గార్దభములు

కపిల - లేక - సురభి. గోగణము.

వినత : అనూరుఁడు - గరుడుఁడు.

కద్రువ : నాగులు.

వైశ్వానరుని కొమార్తెలు ఇరువురిలోను కాలయందు కాలకేయులును, పులోమయందు పౌలోములును, పుట్టిరి. వీరుకాక కశ్యపుని కొడుకులు ఇంకను కొందఱు కలరు. వారు, పర్వతుఁడు అను దేవఋషి, విభండకుఁడు అను బ్రహ్మఋషి.

(2) రు, ఇతఁడు పరశురామునిచే అశ్వమేధయాగమున భూమిని అంతయు దక్షిణగాకాని బ్రాహ్మణులకుఇచ్చెను. ఈతని పేర భూమికాశ్యపి అననెగడెను.

(3) ఒక పౌరాణికుఁడు. (4) వసుదేవుని పురోహితుఁడు; ఈతని ద్వారా పాండవ జన్మ మపుఁడు కుంతి యొద్దకు భాగినేయుల నిమిత్తము వసుదేవుఁడు రత్నభూషణములు ఇచ్చిపంపెను. (భార)

**కళ** : కర్దమ ప్రజాపతి కూతురు. మరీచి భార్య. కశ్యపుని తల్లి.

**కళావతి** : పారుఁడు అను ఋషికి పుంజకస్థల అను అప్సరసయందు పుట్టిన కూతురు. ఈ బిడయొక్క సౌందర్యమునకు మెచ్చి పార్వతీదేవి ఈమెకు పద్మినీ విద్యను ఇచ్చెను. ఆ విద్యవలన కోరిన సౌఖ్యములు ఒనగూడును. దానిని కళావతి స్వరోచికి ఇచ్చిఅతనిని వివాహము అయ్యెను. (మను)

**కళింగదేశము** : ఇది ఓఢ్రదేశమునకు దక్షిణమున కర్నాట దేశమునకు ఉత్తరమున వుండును.

**కళింగుడు** : అంబలి మూడవ కొడుకు. కళింగదేశము యితని నామముచే పరగును.

**కహ్వాడు** : య. కంసుని తమ్ముడు.

**కక్షదేశము** : ఇది యిప్పుడు. కచ్ అనబడును.

**కళకంఠుడు** : గరళకంఠుడు. రుద్రుడు.

## కా

**కాంచనుడు** : పురూరవుని పుత్రుడగు అమవసువు పౌత్రుడు.

**కాంచి** : ఒకప్రసిద్ధపట్టణము. ఇదియొక దివ్య స్థలము. ఇచట బ్రహ్మదేవుడు యాగముచేసి విష్ణువును ప్రత్యక్షము చేసికొనెను, అనిచెప్పుదురు. శివుడును ఇచ్చట సాన్నిధ్యము నొంది ఉన్నాడని ప్రసిద్ధి. ఈ పట్టణమునందు అనేక గోపురములు ప్రాకారములు మండపములు మఠములు మొదలగునవి ఉన్నవి. ఇది చోళదేశాధిపతులకు ముఖ్య పట్టణము. బహురమణీయముగ ఉండునది యని చిరకాలము నుండి పేర్కొనఁబడినది.

మఱియు ఇచట పంచలింగములలో ఒకటి అగు పృథులింగము ఉండును. ఇచ్చటి శివమూర్తికి ఏకామ్రనాధుఁడు అని పేరు.

**కాందిని** : అక్రూరుని తల్లి. భర్త శ్వఫల్కుఁడు.

**కాంపిల్యము** : పాంచాలదేశమందు ఒక భాగము. దానికి ముఖ్యపట్టణము కాంపిల్య పురి. అది ద్రుపదునికి రాజధాని.

**కాంపిల్యుఁడు** : పా. భర్మ్యాశ్వుని కొడుకు

**కాంభోజము** : భరత ఖండము యొక్క వాయవ్యదిగ్భాగము ఇందలి జనులు కాంభోజులు అనంబడుదురు.

**కాకమానిమూర్తి** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు పాంచాలీపరిణయమును కల్పించెను.

**కాణ్వాయులు** : చూ॥ కణ్వుఁడు.

**కాత్యాయని** : పార్వతి నామము.

**కాత్యాయనుఁడు** : (1) పాణిని యొక్క వ్యాకరణమునకు వార్తికముచేసిన వరరుచికి నామాంతరము. (2) యాజ్ఞవల్క్యమహర్షికి నామాంతరము.

**కాదంబరి** : బాణునిచే విరచితము అయిన ఒక సంస్కృత వచన కావ్యము. అందలి నాయిక పేరు.

**కావత్యుఁడు** : పారియాత్రా చలమున ఉండిన ఒకబోయ. వీఁడు మహాధర్మగుణ సంపన్నుడు అని ప్రసిద్ధి.

**కాపాలికము** : ఒకానొక మతము. ఈ మతము ఈశ్వరునికిని జగత్తుకును భేదాభేదములను ప్రతిపాదించును. ఈ మతస్థులకు నరాస్థిమాలాధారణ, శ్మశానవాసము నరకపాల భోజనము, మొదలగు కృత్యములు కలవు.

**కాపిలము** : (1) ఒకమతము. ఇది కపిల మహర్షిచే ఏర్పరుపఁబడినది. దీనికి ఆధారము కాపిల సూత్రము. ఇందు ప్రకృతి జగత్సృష్టికి కారణము అనియు పురుషుఁడు నిర్లిప్తుడనియు నిరూపింపఁబడి ఉండును.(2)ఉపపురాణములలో ఒకటి.

**కామాందకము** : రాజనీతినిఁగూర్చి చెప్పెడి ఒక గ్రంథము.

**కామధేనువు** : నా॥ సురభి. పాలసముద్రమునందు పుట్టెను, కోరిన వస్తువులను ఇచ్చును, అని ప్రసిద్ధి. ఈమె సంతతి గోగణము.

**కామరూపము** : ఆర్యావర్తమునకు ఆగ్నేయదిక్కున ఉండు ఒక దేశము.

**కామాక్షి** : కాంచీపురమునందలి దేవి.

**కాముఁడు** : ధర్మునికి శ్రద్ధ (లేక సంకల్పము) యందు పుట్టిన కొడుకు. భార్య రతి. మన్మథునకు నామముగా చెప్పుదురు.

**కామ్యకము** : ఒకానొక వనము. ఇందు పాండవులు అరణ్య వాసమున మొట్ట మొదట నివసించియుండిరి. ఇది కురు జాంగలములయందుండును. (భార)

**కారూశవంశము** : వైవస్వతమనువు కొడుకులలో ఒకఁడు అయిన కరూశుని వలన పుట్టిన వంశము. ఈ వంశస్థులు ధర్మముతోడి ప్రియమున బ్రాహ్మణులు అయి ఉత్తరాపథమునకు రక్షకులు అయిరి.

**కార్కోటకము** : గోదావరీ తీరమందు ఉండెడు ఒక పట్టణము. అచ్చోట ఉండు శివునికి కర్కోటకేశ్వరుఁడు అని పేరు.

**కార్తవీర్యార్జునుఁడు:** య॥ హైహయవంశజాతుఁడగు ఒకరాజు. ఇతని పేరు అర్జునుఁడు అయినను కృతవీర్యుని కొడుకు కనుక ఇతనిని కార్తవీర్యార్జునుఁడు అందురు. వీని రాజధాని వింధ్యపర్వతమునకు దక్షిణమున పారునట్టి నర్మదానదీ తీరమున ఉండు మహిష్మతీపురము. ఇతఁడు యదువుయొక్క పెద్దకొడుకగు సహస్రజిత్తు వంశస్థుఁడు. ఒకప్పుఁడు ఇతని పరాక్రమమును రావణాసురుఁడు విని ఇతనితో పోరుకోరి మాహిష్మతీపురమునకు వచ్చెను, ఆ దినమున ఇతఁడు వనవిహారార్థముపోయి యుండగా పురజనుల వలన ఆ వృత్తాంతము విని తనరాక తెలిసి అర్జునుఁడు దాగెను అని నవ్వుచు పోయి వింధ్యారణ్యమునందు విహరించుచు కొంతసేపటికి నర్మద ఒడ్డునకు వచ్చి అచ్చట శివపూజ కావించుచు ఉండెను. అప్పుడు స్త్రీలతోడ జలక్రీడలు ఆడుచున్న కార్తవీర్యార్జునుని వేయిచేతుల చేతను అడ్డగింపఁబడి ఎగదట్టిన నర్మదానదీప్రవాహమున తన పూజాద్రవ్యములెల్లకొట్టుకొని పోయెను. అందుక కారణము మంత్రులచేత తెలిసికొని రావణుఁడు అతడుండిన కడకుపోయి అతనితో పోరాడి పట్టుపడి చెరనుంచబడెను. ఆ వృత్తాంతము వానితాతయగు పులస్త్యుఁడువిని కార్తవీర్యార్జునుని ప్రార్థించి అతనిని విడుదలచేసెను. మఱియు కార్తవీర్యార్జునుడు పరశురాముని తండ్రియగు జమదగ్నియొక్క హోమధేనువును కొనిపోగా అదివిని పరశురాముడు వీనితో పోరాడి వీనిని చంపెను. అవల కొంతకాలమునకు కార్త

ర్యుని కొడుకులు జమదగ్నిని చంపిరి. అది కారణముగ పరశురాముడు దేశమును అంతయు క్షత్రియ శూన్యము కావింతునని ప్రతిజ్ఞచేసి యిరువది యొక్క మార్లు క్షత్రియులమీద దండెత్తి పోరాడి రాజులనెల్ల వెదకి వెదకిచంపి ఆ నెత్తురు అయిదు మడుగులుగా కావించి అందు పితృ తర్పణములు చేసెను. కార్తవీర్యునకు అనేకులు పుత్రులు కలరు. అందు పరశురామునిచే చావక తప్పినవారు జయధ్వజుడు శూర సేనుడు, వృషణుడు, మధువు, శూరుడు (లేక) ఊర్జితుడు అనువారు ఏవురు. (భార), (మార్కం.)

కార్తికేయుడు : నా॥ కుమారస్వామి. చూ॥ కృత్తిక

కాల : వైశ్వానరుడు అను దానవుని కూతురు. కశ్యపుని భార్య. ఈమె కొడుకులు కాలకేయులు. (భార)

కాలకంఠుడు : చూ॥ శివుడు

కాలకవి : ది॥ విరోచనుని కొడుకు. బలికి సహోదరుడు. వీడు ద్వాపరాంత మున దానవుల సహాయార్థము విషకపిత్థవృక్షరూపమున వ్రేపల్లెయందు పుట్టి అందలి గోపాలకులకు రోగము కలుగజేయగా ఆ విషయము శంఖకర్ణుడను భూతము ఒక బ్రాహ్మణునియందు ఆవేశించి శ్రీకృష్ణ బలరాములకు తెలిపెను. అంతటవారలు ఆకపిత్థవృక్షమును నిర్మూలించి గోపాలకులకును గోవులకును సుఖము కలుగజేసిరి.

కాలకార్ముకుడు : ర॥ సుమాలి కొడుకు.

కాలకూటము ఇది భారతయుద్ధమపుడు ఒక ఏడిదల.

కాలకేయులు : ర॥ కశ్యప ప్రజాపతికి కాల యందు పుట్టినవారు. వీరు మహా దురాత్ములు. సముద్రమున దాగియుండి బహువిధముల దేవతలను బాధించుచుండగా అగస్త్యుడు దేవతలచేత ప్రార్థింపబడి వీరి వాసస్థానమైన సముద్రముయొక్క జలము నంతయు పానము చేసెను. వీరిసంతతివారిని అర్జునుడు రూపులేక నాశనము చేసెను. (భార)

కాలకౌశికుడు : కాశియందుండిన ఒక బ్రాహ్మణుడు, కలియొక్క అంశమున జనించినవాడు. ఇతడు విశ్వామిత్ర ప్రేరితుడై యీ రూపమున జన్మించి హరిశ్చంద్రుని భార్య అయిన చంద్రమతిని దాసిగా కొనెను. (మార్కం)

కాలకౌక్షేయుడు : క్షేమదర్శియను కోసల దేశపురాజుయొక్క మంత్రి. ఇతడు రాజ ధర్మములను చక్కగా యెరిగి యుండెనని ప్రసిద్ధి.

కాలనాభుడు : ది॥ హిరణ్యాక్షుని కొడుకు. నా॥ తారకుడు.

కాలనేమి : (౧) తారకయుద్ధమున విష్ణువుచే చంపబడిన ఒక దానవుఁడు (౨) ర॥ రావణాసురుని మేనమామ. (శివ) (రామా)

కాలభైరవుడు : కాశియందుండు ఒకదేవత. (శివ)

కాలయవనుడు : ద॥ వీడు నారదుని ఉపదేశమున మధురపై దండెత్తిరాగా, కృష్ణుడు విశ్వకర్మవలన సముద్ర మధ్యమున ద్వారకాపురిని కట్టించి అందు మధురాపుర జనులను అందరను చేర్చి తాను నిరాయుధుడై పురమువెలువడి ముచికుందుడు నిద్రించుచుండిన పర్వత గహ్వరమునకు పరువిడెను. కాలయవనుడు అతనిని తరుముకొని పోయి ఆ గహ్వరము దూరి అందు నిద్రించు ముచికుందుని కృష్ణుడని తలచి తన్నగా అతడు మేల్కని వానిచూడ భస్మమయ్యెను. ఒకపుడు సాళ్వుడు గార్గ్యుని షండుడు అని పలుకగా యాదవులు అందరు వాని చూచినవ్విరి. అందుమీద ఆ గార్గ్యుడు లోహచూర్ణము భుజించుచు పండ్రెండేండ్లు అత్యుగ్రము అగు తపమాచరించి కాలయవనుని పుట్టించినట్లు చెప్పబడియున్నది (విష్ణు)

కావేరి : దక్షిణదిక్కున ఉండెడు ఒక పుణ్యనది. అగస్త్యుఁడు స్వర్గమునకు పోయి తన కమండలమున దేవగంగ ఎత్తికొనివచ్చి సహ్యపర్వతమునందు ఉంచి స్నానముచేయ పోయిన సమయమునందు విఘ్నేశ్వరుఁడు కాకి అయివచ్చి ఆ కమండలజలమును దొర్లించెను. అది నదీరూపమున ప్రవహించి కావేరి అనపరగెను. అట్లు చేసి నందులకు విఘ్నేశ్వరుని మీద అగస్త్యులు కోపించితలమీద మొట్టెను. అందువల్ల నాటినుండి విఘ్నేశ్వరుని నిమిత్తము తల రెండు ప్రక్కలను చేతులతో నెవరు మొట్టుకొందురో అట్టివారికి విఘ్నేశ్వరుని అనుగ్రహము కలుగును, అని అతడు ప్రసాదించెను.

కావ్యప్రకాశిక : కావ్యలక్షణములను తెలుపునట్టి ఒక లక్షణగ్రంథము. దీనికి విద్యాచక్రవర్తి ప్రణీతమయిన సంప్రదాయ ప్రకాశినియను ఒక వ్యాఖ్యానమున్నది.

కావ్యుడు : శుక్రుడు. కవిపుత్రుడని అర్థము.

కాశి : ఇది గంగయొడ్డున కాశీదేశమందు వుండు ఒక ప్రసిద్ధపట్టణము. దీనికి వారణాసి అనియుపేరు. కాశి అనగా ప్రకాశించునది అని అర్థము. ఇక్కడ శివుడు విశేషసాన్నిధ్యమునొంది స్వభావముచే పరిశుద్ధమైన గంగకు విశేషమహిమను కల్పించి యిచట మరణముపొందు వారికి ముక్తినిచ్చుచున్నాడు అని ప్రసిద్ధి.

కాశ్యపి : భూమి. చూ॥ కశ్యపుడు. (భార)

కాశ్యపుడు : పాముమంత్రము చక్కగా నేర్చిన ఒక బ్రాహ్మణుడు పరీక్షిత్తును తక్షక విషము పోగొట్టి కాపాడవలెనని ప్రయత్నపడి వచ్చు, సమయమున తక్షకుడు యితనిని మార్గమున నిలిపి విశేష ద్రవ్యము ఇయ్యగా నితడు పరీక్షిత్తు చెంతకు పోక మరలి తన నివాసమునకు పోయెను. (భార)

కాశ్యుడు : (౧) బా॥ సేనజిత్తు కొడుకు. (౨) ఆయువు పౌత్రుడు అగు సుహోత్రుని కొడుకు. ఇతని వంశస్థులు కాశ్యులు.

కాళాంజనము : ఇది యొక తీర్థము. చూ॥ శ్వేతుడు.

కాళి : ఉమాదేవికి నామాంతరము. చూ॥ భద్రకాళి.

కాళింది : (౧) యమునానది. కళింగపర్వతమునందు పుట్టినది అని అర్థము. ఒకప్పుడు బలరాముడు ద్రేపల్లెయందుండు వేళ దప్పిగొని కాళిందిని తన సమీపమునకు రమ్మనగా రానందున ఆయనకోపించి హలాయుధముచేత భేదించి నూరుపాయలుగా ప్రవహించునట్లు చేసెను అని పురాణప్రసిద్ధి. (౨) సుమతియొక్క భార్య. (౩) కృష్ణుని అష్టభార్యలలో నొకతె. సూర్యుని కూతురు (భాగ)

కాళికాదేవి : చూ॥ జ్యేష్ఠాదేవి.

కాళిదాసుడు : ఒక సంస్కృతకవి. కాళికాదేవిని కొలిచి ఆ దేవియొక్క వరప్రసాదము పొందినందున ఇతనికి యీ పేరు కలిగెను. ఇతడు మిక్కిలి ప్రసిద్ధుడు. కవి సమయము చక్కగా తెలిసినవాడు, ఉపమానోపమేయములను పోల్చి చెప్పుట యందు మిక్కిలి సమర్థుడు కాబట్టి యితడు చెప్పెడు ఉపమాలంకారము శ్లాఘింపతగినదిగా నుండును. కనుకనే ఉపమాకాళిదాసస్య అనువచనము లోకమునందు ప్రసిద్ధముగావాడబడుచున్నది మఱియు యీ మహాకవి విక్రమార్కుని ఆస్థాన మందలి కవులలో నొకడై యుండెను.

ధన్వంతరి క్షపణకామర సింహశంకు
బేతాళ భట్టిఘటకర్పర కాళిదాసాః॥
ఖ్యాతో వరాహమిహిరో నృపతే
స్సభాయాం రత్నానివై వరరుచేర్న వ విక్రమస్య

అను సీశోకమునందు చెప్పబడిన చొప్పున ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంకువు, భేతాళుడు. భట్టి, ఘట కర్పరుడు, కాళిదాసుడు వరాహమిహిరుడు అను కవులు తొమ్మండ్రుును విక్రమార్కుని సభయందలి నవరత్నములని తెలియ బడుచున్నది. శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము, విక్రమోర్వశీయము అనునాటకములును, రఘు వంశము, మేఘస-దేశము, కుమార సంభవము అను కావ్యములును, యితనిచే రచియింపబడెను. ఇదిగాక భోజప్రబంధమువలన భోజ రాజుయొక్క సభలోను ఒక కాళిదాసు డున్నట్లు తెలియ వచ్చుచున్నది. ఇతడు సకలవిషయములందును మొదటి యాతనిని పోలినవాడు. ఒకానొక కాలమున భోజుని సభయందలి కవులలో నొకడగు దండి అను వానికిని ఇతనికిని వివాదము కలిగి అప్పుడు సరస్వతిని ఆరాధించి మా యిరువురిలో కవిఎవరో తెలుపవలయును అని ప్రార్థింపగా వారికి సరస్వతి ప్రత్యక్షమై ''కవిర్దండీ. కవిర్దండీ. కవిర్దండీ'' నసంశయః అనగా కాళిదాసునికి కోపమువచ్చి కోహంరండే అనగా త్వమేవాహం, త్వమేవాహం, త్వమేవాహం,, నసంశయః అని సరస్వతి చెప్పినందున యీ కాళిదాసుడు సరస్వతి అవతారమని చెప్పుదురు. ఈయన నళోదయము, శృంగార తిలకము, ప్రశ్నోత్తరమాల, కవికంఠపాశము, కర్పూర మంజరి, భోజచంపువు అనెడి గ్రంథములను శ్యామలా దండకమును, రచియించెను. ఇందు కడపటి వుదహరించిన దండకము తనకు కాళికాదేవి ప్రత్యక్షమైనపుడు చెప్పినది. ఇంతటి కవులు లోకములో మఱియెవరును కారు. కనుకనే,

నా ''పురాకవీంగణనా ప్రసంగే
కనిష్ఠికా ధిష్ఠిత కాళిదాసా.
అద్యాపితత్తుల్య కవేర భావా

దనామికా సార్థవతీ బభూవ'' అని చెప్పబడియున్నది. ఈతని విషయమై కట్టు కథలు అనేకములున్నవి.

**కాళియుడు** : యమునయందు వుండిన ఒక విషనాగుడు. ఇతడు కృష్ణునిచే యమునయందుండి వెడలింపబడి భార్యా పుత్రులతోడ సముద్రమునకు పోయెను. యమునకు గరుడుడు రాకుండునట్లు సౌభరియను ఋషి శాపము యిచ్చెను. కనుక యీ కాళియుడు గరుడుని వలని భీతిచే యిందుదాగి యుండినట్లును, ఆ భీతికృష్ణుని వలన మాన్పబడినట్లును భాగవతమునందు చెప్పబడినది (భాగ)

**కాళేశ్వరము** : పయోష్ణి గోదావరి సంగమ స్థానమునందుండు ఒక దివ్యక్షేత్రము.

## కి

**కింపురుషుడు** : పులహుని కొడుకు.

**కింపురుషులు** : దేవతా భేదము. వీరు నరముఖమును, అశ్వశరీరమును కలవారు.

**కిన్నరుడు** : పులహుని కొడుకు.

**కిన్నరులు** : దేవతా భేదము. వీరు అశ్వముఖమును నరశరీరమును కలవారు.

**కిమ్మీరుడు** : ర॥ బకాసురుని తమ్ముడు. కామ్యక వనమున వీనిని భీముడు చంపెను. (భార)

**కిరాతార్జునీయము** : ఒక సంస్కృత కావ్యము. అర్జునుడు కిరాతవేషమున వున్న శివునితో పోరాడి పాశుపతాస్త్రమును బడసిన కథను చెప్పుటచేత దీనికీ పేరు కలిగెను. ఇది భారవిచే చేయబడినందున దీనికి భారవి అనియు నామము కలదు. వ్యాఖ్యానము కోలాచల మల్లినాథసూరి విరచితము.

**కిరీటి** : చూ॥ అర్జునుఁడు.

**కిష్కింధ** : వాలి సుగ్రీవుల రాజధాని. తమ్మునిపై తప్పు కల్పించి తఱుము గొట్టిన వాలిని శ్రీరాముఁడు చంపి సుగ్రీవునకు ఈకిష్కింధా పట్టణమును ఇప్పించెను. ఇది మైసూరికి కొంత ఉత్తరంబున ఉండును. (రామా)

## కీ

**కీచకులు** : వీరు నూరుగురు అన్నదమ్ములు. విరాటుని భార్యఅగు సుదేష్ణ యొక్క తోడబుట్టువులు. పాండవుల అజ్ఞాతవాసకాలమున సైరంధ్రివేషమును

తాల్చి ఉండిన ద్రౌపదిని పెద్దకీచకుఁడు అగు సింహబలుఁడు పట్టి ఈడ్చినందున భీముఁడు గంధర్వుఁడు అనుమిషచే వీరిని నూఱుగురను చంపెను. (భార)

**కీనాశుఁడు** : చూ॥ యముఁడు

**కీర్తిమతి** : అణుహానిభార్య. శుకుని కూఁతురు.

**కీర్తిరథుఁడు** : మి॥ ప్రతిరథకుని కొడుకు

**కీర్తిరాతుడు** : మి॥ మహాధ్రకుని కొడుకు.

## కు

**కుంజరుఁడు** : ఒకానొక వానరుఁడు. అంజనతండ్రి. హనుమంతుని మాతామహుఁడు. (రామా)

**కుండల** : వింధ్యవంతునిసుత. ఈమెభర్త శుంభుఁడు అను రాక్షసునిచే మృతినొందెను. ఈమెకు ఎల్లెడల సంచరించుశక్తి కలదు. (మార్కం)

**కుండినపురము** : విదర్భ దేశమునకు రాజధానిగా ఉండిన పట్టణము. అమరావతికి ఈశాన్య దిక్కున నాలుగు ఆమడల దూరమున ఉండెను. (భాగ)

**కుంతలము** : బళ్లారికి సమీపమున ఉండు దేశమునకు ప్రాచీన నామము.

**కుంతి** : ఈ పేరిచే అనేక యాదవులుండిరి.

(1) హేహయుని పౌత్రుఁడు. దర్మనేత్రుని పుత్రుఁడు.

(2) విదర్భుని పౌత్రుఁడు. కృధుని కొడుకు. ఈతఁడు శశిబిందువువంశస్థుఁడు.

(3) పైనచెప్పిన రెండవ కుంతి వంశస్థుఁడు. నా॥ కరంభి

(4) సాత్వతుని కొడుకైన మహాభోజుని వంశస్థుఁడు. పాండవులతల్లిఅగు కుంతీదేవికి పెంపుడుతండ్రి. నా॥ కుంతి భోజుఁడు. (భార)

**కుంతిపురి** : ఇప్పటి గ్వాలియరు.

**కుంతీదేవి** : కుంతిభోజుని అభిమానపుత్రిక దేవమీఢునకు మారిషయందు పుట్టినది. వసుదేవుని చెల్లెలు. ఈమెకు పృథ అని నామాంతరము కలదు. ఈమె బాల్య

మునందు తండ్రి పంపున దుర్వాసమునికి శుశ్రూష చేయుచుండు తఱిని ఈమె భక్తికి ఆయన విస్మయమంది ఒక దివ్యమంత్రమును ఉపదేశముచేసి ఈ మంత్ర బలమున నీవు ఏ వేల్పును కోరినను ఆ వేల్పు ప్రసాదమున కోరినట్టి పుత్రుని పడయుదువు. అనిచెప్పినందున కుంతి అ మంత్రశక్తిని ఎఱుగుటకై ఒకనాఁడు గంగకు చని ఆదిత్యుని తలచి అతని వంటిపుత్రుని కోరెను. అంత అతఁడు సాక్షాత్కరించి ఆమె కన్యాత్వము చెడకుండ ఒక సుపుత్రుడు కలుగ అనుగ్రహించి చనియెను. అట్లు సూర్యప్రసాదమువలన ఒక సుతుని పడసి అతనికి, సహజకర్ణకుండలుడై జనించినందున, కర్ణుఁడు అనియు, వసువర్మధరుడుగా పుట్టినందున వసుసేనుఁడు అనియు నామకరణము చేసెను. ఈ విషయము భారతమున ఆది పర్వమునందు ఒక విధముగాను అరణ్యపర్వమునందు ఒక విధముగా చెప్పఁబడి ఉన్నది. మఱియు ఈమె పాండురాజును వివాహము అయిన పిదప ఆ మంత్ర బలమువలననే యముఁడు వాయువు ఇంద్రుడు అను వీరి ప్రసాదముల వలన వరుసగా ధర్మజుఁడు భీముఁడు అర్జునుఁడు అను కొడుకులను కనెను. భారతయుద్ధానంతరంబున ధర్మరాజు బంధువులకెల్ల తిలోదక వానోదకములను ఈయబోవు అవసరమున అతనికి కుంతి, కర్ణుఁడు తనకు జ్యేష్ఠపుత్రుఁడు అనియు అతనికి తిలోదకాదులు మొట్టమొదట ఈయవలయును, అనియు నుడువగా, అపుఁడు ధర్మరాజు కర్ణుని వృత్తాంతమును అంతయు యెఱిగిఅతనితో ఎదిరించి పోరినందులకును అతని మరణమునకును కడు దుఃఖించి తన తల్లి అగుకుంతి ఆ వృత్తాంతమును తనతో ఇన్ని దినములు చెప్పక దాచినందులకై మిగుల అలిగి అది మొదలు స్త్రీలయందు రహస్యము ఏదియు నిలువక ఉండునట్లు శపించెను. (భార)

కుంభకర్ణుడు : ర॥ రావణాసురుని తమ్ముఁడు. ఈ రక్కసుఁడు మహాఘోరమగు తపమొనరించి వరము అడుగ బోవు వేళ దేవతల ప్రార్థనచే సరస్వతీదేవి వాని నాలుక యందు ప్రవేశించి నిద్రకావలెను అని పలికించెను. అది కారణముగా వాఁడు ఎల్లప్పుఁడు నిద్రపోవుచుండును. మఱియు వానికి నిద్రాభంగము అగువేళ చావు సంభవించును అని నియ్యతి కలిగి వున్నందున రాముడు లంకలో యుద్ధము చేయునవసరమున రావణుఁడు నిద్రించుచున్న కుంభకర్ణుని లేపియుద్ధమునకు పంపగా వాడు రామునిచేత చచ్చినట్లు చెప్పుదురు. రావణ కుంభకర్ణులు సనకసనందుల శాపముచే రాక్షసావతారము ఎత్తిన విష్ణు ద్వారపాలకులు.

**కుంభకుడు** : విదేహదేశమందు వుండిన ఒక గొల్లవాఁడు. వీని ఇంట తారక యుద్ధమున మడిసిన కాలనేమిపుత్రులు ఏడుగురు ఆబోతులుగా పుట్టినట్లును వారిని శ్రీకృష్ణుడు చంపి కుంభకుని కూతురైన నీలను పెండ్లియాడినట్లును చెప్పఁబడి ఉన్నది. (భార) (రామా)

**కుంభాండుడు** : బాణాసురునిమంత్రి. నా॥ కబంధుడు. (విష్ణు)

**కుంభీనస** : సుమాలి కుమార్తె. కైకసితోబుట్టువు. మాల్యవంతుని మనుమరాలు (ఉరా)

**కుంభుఁడు** : కుంభకర్ణుని కొడుకు. సుగ్రీవునిచేత చంపబడెను. (రామా)

**కుకుద్దుఁడు** : య॥ అంధకుని కొడుకు.

**కుచేలుఁడు** : కృష్ణుని సఖుఁడైన ఒక బ్రాహ్మణుఁడు. ఇతడు బ్రహ్మవేత్తయు విజితేంద్రియుఁడును అయినను దారిద్ర్యముచే కడుపీడితుడై భార్య ప్రేరేపింపగా ధనమును కోరి కృష్ణుని దర్శనమునకు పోవగా అతఁడు ఇతని మిగుల గౌరవించి తనయందు కలభక్తి విశ్వాస మనోరథంబులను ఎఱింగి అతని మహదైశ్వర్య యుక్తునిగా చేసెను. (భాగ)

**కుజంభుఁడు** : (1) దా॥ తారకయుద్ధమున వరుణునిచే చంపబడిన రాక్షసుఁడు. (2)వత్సంద్రునిచే చంపఁబడిన ఒక అసురుఁడు. వీఁడు తొల్లిత్వష్టచేసృజింపఁబడిన సర్వశత్రు నిర్మూలసాధనమైన ఒక ముసలమును స్వాధీన పరుచుకొని లోకమునకు కడుయెగ్గు ఒనరించుచు ఉండెను. ఈ ముసలము వీడూ రధిని కూతురు అగుముదావతి లేక సౌనంద మూలముగనిష్ప్రయోజనము ఆయెను. అది కారణముగ వత్సంద్రుఁడు వీనిని జయించిముదావతిని వివాహము అయ్యెను.

**కుజుఁడు** : నా॥ అంగారకుఁడు.

**కుటప్పుఁడు** : ఒకానొక ఋషి.

**కుబేరుడు** : అష్టదిక్పాలకులలో ఒక్కఁడు. ఇతనిది ఉత్తరపు దిక్కు - పట్టణము అలకాపురి - భార్య చిత్రరేఖ - వాహనము గుఱ్ఱము - ఆయుధము ఖడ్గము - ఇతఁడు ఐశ్వర్యమునకు దేవత. ఇతని రాజాధి రాజత్వము వేదప్రసిద్ధము కనుక ఇతనికి రాజరాజు అనియు ఒక పేరుకలదు. ఇతఁడు యక్షులకును గుహ్యులకును

రాజు - నరవాహనుఁడు అనియు ప్రసిద్ధి. కుబేరుఁడు విశ్రవసునకు ఇలబిలయందు పుట్టినవాఁడు. కాన అతనికి ఐలబిలుఁడు అను ప్రసిద్ధము అయిన పేరుకలదు. పార్వతీ దేవి శాపమువలన ఇతఁడు ఏకపింగాక్షుఁడు అయ్యెను. (శివ) (ఉరా)

కుబ్జ : కంసునికి కలపము తెచ్చి ఇచ్చెడుదాసి. ఇది మూడు వక్రములుఁ గల దేహము కలది అగుటచే దీనికి త్రివక్రయనియు పేరు. బలరామకృష్ణులు వ్రేపల్లె నుండి మధురాపురికి వచ్చునపుఁడు నానావిధలేపనముల భాజనమును కంసుని యొద్దకు కొనిపోవుచు వుండిన దీనిని చూచి లేపనములు అన్నియు తనకు ఇమ్మని అడిగిపుచ్చుకొని దేహములను అలదుకొనిరి. అపుడు శ్రీకృష్ణుఁడు ప్రసన్నుడై దాని కుబ్జత్వమును మాన్పెను. (భాగ)

కుమార రుద్ర దేవుడు : ఇతఁడు ఒకానొక ఆంధ్రకవి. భాస్కరరామాయణమున అయోధ్యా కాండమును తెనిగించెను.

కుమారస్వామి ; శివుని కుమారులలో ఒకఁడు. దేవతలకు సేనా నాయకుఁడు. మఱియు ఇతనికి కార్తికేయుఁడు, మహాసేనుఁడు, శరజన్ముడు, షడాననుడు, పార్వతీ నందనుఁడు, తారకజిత్తు, సుబ్రహ్మణ్యుఁడు అని అనేక నామములు కలవు. ఇతనికి వాహనము నెమలి. శక్తి ఆయుధము. పార్వతీ పరమేశ్వరులు ఏకాంతమున ఉండువేళ శివుని చేష్టలను అరయుటకై అగ్ని శుకరూపంబు తాల్చి జాలరంధ్రముల దారిని అంతఃపురమునొచ్చిన అది పార్వతి ఎఱిగి సిగ్గుచే తొలగి చనియెను. శివుఁడును శుకరూపియైన అగ్నిని కాంచి కోపగించి అప్పుఁడు పతనమైన తన రేతస్సును అగ్నిని పానము చేయుము అనెను. అగ్ని దానిని భరింప జాలక శర వనమునందు విడువ అందుండి కుమారస్వామి పుట్టెను. (చూ. పార్వతి) (బ్రహ్మం) కొందఱు ఇతనిని అగ్నికి జనించినవాడు అని చెప్పుదురు. (చూ. కృత్తికాదేవి). కుమారస్వామి పుత్రులు శాఖుఁడు విశాఖుఁడు మైఘమేషుఁడు వృష్ఠజుఁడు.

కుమారి : ఋక్షపర్వతమున ఉత్పత్తి అగు ఒకనది.

కుముదబాంధవుఁడు : చంద్రుఁడు.

కుముదము : నిర్భృతి దిక్కునందలి మగ ఏనుఁగు.

కుముదవతి : వింధ్య పర్వతమున ఉత్పత్తిఅగు ఒకనది.

**కుముదాక్షుడు** : విష్ణు పరిచరులలో ఒక్కఁడు.

**కుముద్వంతుఁడు** : (1) విష్ణు పరిచరులలో ఒక్కఁడు (2) ఒకానొకకోతి. (3) ఒకానొక రాక్షసుఁడు.

**కురుజాంగలము** : హస్తినాపురికి వాయవ్యమున పాంచాలమునకు దక్షిణమున ఉండు దేశము.

**కురుజిత్తు** : మి॥ అంజకుని కొడుకు.

**కురుదేశము** : దీని రాజధాని హస్తినాపురి. దీనికి ఈ నామము కురువుఅను రాజు వలన కలిగెను.

**కురుదాముడు** : దిష్యంతుని కొడుకు.

**కురువశుఁడు** : యు॥ ఆరవ మధువు కొడుకు.

**కురువు** : పు॥ అజమీఢుని మూడవకొడుకు అగు ఋక్షుని పౌత్రుఁడు. సంవరుని పుత్రుఁడు. ఇతనిపేర శమంత పంచకము, కురుక్షేత్రము అనఁబరగెను. కొడుకులు పరిక్షిత్తు, సుధను, సుజహ్నువు, నిషధుడు.

**కురుక్షేత్రము** : తానేశ్వరము. ఇది ప్రజాపతి ఉత్తరవేది అనియు సమస్త దేవతలు ఇందు వరిష్ఠంబులు అగు సత్రంబులు ఆచరించిరనియు ప్రసిద్ధి. కురురాజు దీని దున్నుట జేసి దీనికి ఈ నామము కలిగెను. ఇది కురుదేశమునందు ఉంటాను. ఇచ్చోటనే భారతయుద్ధము జరిగెను. (భార)

**కులపర్వతములు** : (1) మహేంద్రము. (2) గంధమాదనము (3) మలయము (4) సహ్యము (5) శుక్తిమంతము. (6) వింధ్యము (7) పారియాత్రము. ఇవి ఏడు.

**కల్లూకభట్టీయము** : మనుస్మృతి యొక్క వ్యాఖ్యానము ఇది కల్లూకభట్టుచే రచియింపబడినందున దీనికి ఈపేరు వచ్చెను.

**కువలయానందము**: అప్పయ్య దీక్షితులచే రచియింపబడిన అలంకారశాస్త్రము ఇది చంద్రాలోకమునకు వ్యాఖ్యానము అని చెప్పుదురు.

**కువలయాపీడము** : కంసుని గజము. ఇది ఎట్టిబలశాలిని అయినను ఎదురించి పట్టి పడ త్రోసి కాళ్లతోత్రొక్కి చంపుచుండును. కనుక కంసుడు శ్రీకృష్ణ బలరాముల మీదికి దీనిని పురికొల్ప మావటి వానికి ఉత్తరువు చేసెను. మావటివాడు అట్లే పురికొల్పగ కృష్ణుడు దీనిని చంపెను. (భాగ)

**కువలయాశ్వుడు** : (1) కా॥ నా॥ ఋతధ్వజుడు. ప్రతర్దనుడు, వత్సుడు, శత్రుజిత్తు దివోదాసుని కొడుకు. అలర్కునితండ్రి. శ్రీమద్భాగవతమున ఇతడు దివోదాసుని పౌత్రుడుగా చెప్పిఉన్నది ఇతనికి గాలవుడు అను ఒక ముని ముల్లోకంబుల నదుల యందును పర్వతాదులయందును సమత్వంబున చరించుట గుణముఁగలుగుటచే కువ లయాశ్వము అనుపేరుగల ఒక గుఱ్ఱము ఇచ్చెను. దానికొని ఆ ఋషికి తపోభంగము కావించునట్టి పాతాళకేతువు అను ఒక రాక్షసు పొలియించి పాతాళలోకంబున ఉండు మదాలస అను ఒక కన్యను పెండ్లియాడెను. కనుక ఇతనికి ఈపేరువచ్చెను.

(2) ఇ॥ బృహదశ్వుని కొడుకు. ఇతఁడు దుంధుడు అను రక్కసుని చంపి నందున దుంధుమారుడు అనుపేరు పొందెను. (మార్కం)

**కుశధ్వజుడు** : జనక మహారాజు తమ్ముఁడు. దశరధుని వియ్యంకుడు. భరతశత్రు ఘ్నులకు మామగారు. (రామా)

**కుశనాభుఁడు** : కుశికుని కొడుకు. ఇతనికి కొమార్తెలు నూర్వురు. వాయుశాప ముచే కుబ్జలుకాగా వారిని చూలి అను నొక ఋషికిని సోమద అనునొక అప్సరస కును పుట్టిన బ్రహ్మదత్తుడు అనుఋషికి ఇచ్చి ఈతఁడు వివాహచేసెను. ఆ మహర్షి తపోబలమువలన వారికుబ్జత్వమును పోగొట్టెను. (రామా)

**కుశలవులు** : శ్రీరాముని కుమారులు. వీరు అమడలు. వీరిని గర్భమునందు ధరించి ఉండగా శ్రీరాముఁడు కొంచమైనను ఎరబరికము దాక్షిణ్యము లేక చిరకాలము రావణాసురుని ఇంటఉండిన సీతను ఆమెయందలి మోహముచేత విడనాఁడజాలక తోడితెచ్చి ఇంటవుంచుకొని ఏలుచున్నాఁడు అని లోకులు చెప్పుమాటలు విని లోకా పవాదమునకు వెరచి పూర్ణగర్భిణి అయిన సీతను అడవికి పంపివేసెను. అంతట ఆమె వాల్మీకి ఆశ్రమముచేరి అచట అమడబిడ్డలను కనెను అంతట ఆ మహర్షి ఆ బిడ్డలకు జాతకర్మాది వైదిక క్రియలు నడపి ధనుర్విద్య మొదలుగా గల సమస్త విద్యలను గరపెను. పిమ్మట కొంతకాలమునకు సీతయు కుశలవులును మరల

రామునియొద్దకువచ్చి చేరిరి. ఆ కుమారులలో కుశుఁడు కుశస్థలి అనుపురమును నిర్మాణము చేసెను. (రామా)

**కుశస్థలి** : (1) రైవతదుర్గమున నుండిన ఒక పట్టణము. మధురాపురము జరాసంధునిచే కాల్పఁబడిన వెనుక కృష్ణునకు ఇది ముఖ్యపట్టణము ఆయి ఉండెను. తొలుత ఇది ఆనర్తునిచే నిర్మింపఁబడి ఆనర్త దేశములకు రాజధాని అయి ఉండినట్లు తెలియవచ్చెడి. (2) దీని శ్రీరాముని కొమరుఁడయిన కుశుఁడు నిర్మాణముచేసెను. ఇది వింధ్య పర్వతముఖమున ఉండును. చూ॥ కోసలము. (ఉరా)

**కుశాంబుఁడు** : కుశికుని పెద్దకొడుకు ఇతని పుత్రుఁడు గాధి (రామా)

**కుశాగ్రుఁడు** : కు॥ బృహద్రథుని కొడుకు. జరాసంధుని భ్రాత.

**కుశావతి** : కుశుని రాజధాని ఇది ఉత్తర కోసలదేశమునందు ఉండును.

**కుశికుఁడు** : విశ్వామిత్రుని ముత్తాత. పురూరవుని కొడుకు అగు అదువశువు వంశస్థుఁడు. బలాకాశ్వుని కొడుకు.

**కుశీలవుఁడు** : మైత్రేయుని తండ్రి.

**కుశుఁడు** : (1) చూ॥ కుశలవులు. (2) క్షత్రవృద్ధుని రెండవ కొడుకు (3) క్షత్రవృద్ధుని మొదటికొడుకు అగు సుహోత్రుని రెండవ కొడుకు (4) య॥ విదర్భుని కొడుకు.

**కుశుంబుడు** : కు॥ ఉపరి చరవసువు కొడుకు.

**కుసుమపురము** : చూ॥ నా॥ పాటలీ పుత్రము.

**కుసుమేశువు** : చూ॥ మన్మధుఁడు.

**కుహూదేవి** : ధాతభార్యలతో ఒకతె.

**కుక్షి** : ఇక్ష్వాకు కొడుకు వికుక్షి యొక్కతండ్రి.

## కూ

**కూర్మపురాణము** : ఇది కూర్మరూపమున ఇందిరాధీశుఁడు ఇంద్రద్యుమ్నునకు చెప్పిన సర్గవిషయ వర్ణాశ్రమ ధర్మ విచార శివమహాత్మ్యాదులు కలది. దీని గ్రంథసంఖ్య 6000.

కూర్మావతారము : విష్ణువుయొక్క దశావతారములలో రెండవ యవతారము చూ॥ అమృతమధనము. (భాగ)

## కృ

కృతకుఁడు ; య॥ వసుదేవుని కొడుకు.

కృతకృత్యుఁడు : త్రికకుత్తు కొడుకు. ఇతఁడు విరక్తుఁడయిచనెను.

కృతద్యుతి : చిత్రకేతుని జ్యేష్ఠభార్య. అంగరాజు కూతురు. (భాగ)

కృతప్రవణుఁడు : రు॥ పరశురాముని అనుచరుఁడు.

కృతమూల : మలయపర్వతమున ఉత్పత్తి అగు ఒకనది

కృతయుగము : ఒకయుగము. దీని పరిమిత 17,28,000 సంవత్సరములు చూ॥ యుగములు.

కృతవర్మ : య॥ హృదికుని కొడుకు.దేవమీఢుని తమ్ముఁడు. ఇతఁడు కృపాశ్వత్థామలతో కూడి భారతయుద్ధానంతరమున రాత్రియందు పాండవశిబిరము చొచ్చి నిద్రపోవువారిని హత్యచేసిన అశ్వత్థామకు సహాయముగవుండెను. (2) కృతవీర్యుని తమ్ముడు. (భార)

కృతవీర్యుఁడు : య॥ ధనికుని పుత్రుఁడు. కార్తవీర్యార్జునుని తండ్రి. (భార)

కృతాంతుఁడు : చూ॥ యముఁడు.

కృతాగ్ని : య॥ కృతవీర్యుని తమ్ముఁడు.

కృతాశ్వుఁడు : ఈ॥ బర్హిణాశ్వుని మొదటికొడుకు. నా॥ కృతాశ్వుఁడు రూపాశ్వుఁడు. కొడుకు రెండవ యువనాశ్వుఁడు.

కృతి : (1) మి॥ బహుళాశ్వుని కొడుకు (2) పు॥ సన్నతమంతుని కొడుకు ఇతఁడు హిరణ్యనాభునివలన యోగమార్గము ఎఱిగి శోకమువిడిచి తూర్పుదేశమున నామసంహిత పఠియించెను. (3) య॥ విరుభువు కొడుకు (4) కు॥ చ్యవనుని కొడుకు

కృతిమంతుఁడు : పు॥ నా॥ దృతిమంతుఁడు యవీనరుని కొడుకు.

కృతుఁడు : (1) గంభీరుని కొడుకు ఇతని వంశజులు బ్రాహ్మణులయిరి.

(2) య॥ బలరాముని తమ్ముడు.

**కృతౌజసు** : య॥ కృతవీరుని తమ్ముఁడు.

**కృత్తిక** : అశ్విన్యాది నక్షత్రములలో మూఁడవది. ఇది ఆరునక్షత్రముల గుంపు. ఒకప్పుడు అగ్నిదేవుఁడు సప్తర్షుల భార్యలనుచూచి మోహింపగా అతని భార్యఅగు స్వాహాదేవి, తనభర్త ఆ ఋషి భార్యలచేత శపింపఁబడునని భయపడి వసిష్ఠుని భార్య అయిన అరుంధతితప్ప తక్కిన ఆరుగురిరూపములను తాను - ఉంచి ఆయనతోకూడెను. అంతట ఆ ఋషులు తన భార్యలే అగ్నితోకూడిరి, అనియెంచి వారిని విడనాడిరి. అప్పుడు వారు తాము అట్టి అకృత్యముచేయలేదనియు అగ్ని భార్యయే తమరూపములను వహించెను అధి దోషములేని తమ్ము పరిగ్రహింప వలెను, అనియు ప్రార్థింపగా వారు అదినిజము అని తెలిసియు వారితోడిది అగు అరుంధతియొక్క రూపమును స్వాహాదేవివహింపలేక పోయెను. అట్టిపాతివ్రత్య మహిమను వీరియందు ఉండిన యెడ వీరిరూపములను మాత్రము యెట్లు తాల్చును. అనివారి ప్రార్థనమును అంగీకరింపక పోయిరి. ఆ ముని భార్యలనే = షట్కృత్తి కలు అందురు. కొందఱు అపుడు కుమారస్వామి వీరివల్ల అగ్నికి పుట్టినట్లు వక్కా ణింతురు. కొందరు తెల్లునందు పుట్టిన కుమారస్వామికి ఈ కృత్తికా దేవులుస్తన్యము యిచ్చి అతనిని తమకుమారునిగా చేసికొనిరి అని చెప్పుదురు. కనుకనే కుమార స్వామికి కార్తికేయుడు అను పేరుకలిగెను. (స్కాంద)

**కృత్తివాసుఁడు** : శివుఁడు. (లింగ)

**కృత్స్నమదుడు** : క్షత్రవృద్ధుని పౌత్రుఁడు. సుహోత్రుని పుత్రుఁడు. శునకుని తండ్రి,

**కృధుఁడు** : య॥ విదర్భుని రెండవ కొడుకు.

**కృపి** : సత్యధృతి కూతురు. ద్రోణాచార్యుల భార్య. అశ్వత్థామతల్లి. కృపా చార్యుల చెలియలు. (భార)

**కృపీటజన్ముఁడు** : ఉదకమువలన జన్మముకలవాఁడు అని శబ్దార్థము అగ్ని = చంద్రుఁడు

**కృపీటయోని** : చూ॥ కృపీటజన్ముఁడు.

**కృపుఁడు** : సత్యధృతి కొడుకు. ద్రోణాచార్యుల బావమరిది ద్రోణుఁడు రాక మునుపు కౌరవులకు అస్త్రగురువు. ఇతఁడుచిరంజీవి. ఏకాదశరుద్రుల యంశమున

జనించిన వాఁడు. గోతముని వంశమున పుట్టినవాడు అగుటచే ఇతనికి గౌతముడు అనియు ఒకపేరు కలదు. (భార)

**కృశానురేతుఁడు** : శివుఁడు.

**కృశానువు** : అగ్ని.

**కృశాశ్వుఁడు** : చూ॥ నా॥ కృతాశ్వుడు. (భాగ)

**కృశుఁడు** : ఒకానొక ఋషి. ఇతఁడు శమీకుని మెడను పరీక్షిత్తు సర్పశవమును వేసినది, శృంగికి చెప్పినవాఁడు. (భార)

**కృష్ణ** : (1) ద్రౌపది పేరు. (2) ఒకానొకనది. (భార)

**కృష్ణకర్ణామృతము:** ఇది శ్రీ లీలాశుకులచే రచియింపఁబడిన ఒక గ్రంథము. ఇందు కృష్ణలీలలు చెప్పబడివుండును.

**కృష్ణజయంతి** : శ్రావణ బహుళ అష్టమి. ఈ దినమున విష్ణువు కృష్ణావతారము ఎత్తినందున జనులు ఇది ఒక వ్రతముగా ఆచరింతురు.

**కృష్ణదేవరాయలు;** ఇతఁడు కర్ణాటక దేశాధీశుఁడు ఇతఁడు రమారమి వెనూఋ సంవత్సరములకు మునుపు ఆన గొందియందు లేక చంద్రగిరియందు ఉండి కర్ణాటక రాజ్యమును పాలించెను. ఇతఁడు ఆ కాలమందుండిన శూరులగు ఇతర దేశాధీశులను జయించి ఆంధ్రదేశము అంతయును, కొంతవఱకు ద్రవిడదేశమును కర్ణాటకమహారాష్ట్రములను స్వాధీనము చేసికొని మూఋరాయర గండడు అని బిరుదాంకమును వహియించి ఉండెను. ఇతని కాలమున అల్లసాని పెద్దన, భట్టుమూర్తి, ముక్కుతిమ్మనను పిల్లలమఱ్ఱి పినవీరభద్రయ్య, సూరపరాజు, తెనాలిరామకృష్ణయ్య మొదలగు కవీశ్వరులు అనేకులు ఉండిరి.

**కృష్ణద్వైపాయనుడు:** చూ॥ వ్యాసుడు.

**కృష్ణాంగన** : నైరుతిని రాజధాని.

**కృష్ణుఁడు** : య॥ వసుదేవునికి దేవకీదేవియందు పుట్టిన కొడుకు ఇతఁడు ఈ పేరుతో అవతారమెత్తిన శ్రీ మహావిష్ణువు, కంసుఁడు తన్నుకృష్ణుఁడు చంపును అని ఒకప్పుఁడు ఆకాశవాణి పలికినందున కృష్ణుని పుట్టినప్పుడే చంపవలయును

అవి దానికి తగినయత్నములన్నిచేసి యుండెను. అట్లైనను యోగమాయా సహాయమున కృష్ణుఁడు తప్పించుకొని వ్రేపల్లెలో నందుని భార్యయగు యశోదాదేవి యొద్దచేరి అందు పెరిగెను. (చూ॥ కంసుఁడు) ఈతని లీలలు అనేకములు. ఇతఁడు చేసిన అమానుష కృత్యములు అనేకములు పలువిధముల తెలియవచ్చును. భారత యుద్ధప్రారంభమునకు ముందు అర్జునుఁడు తన బంధువులతోడను గురువులతోడను యుద్ధముచేయను అని విరమింపగాఅతనికి కృష్ణుఁడు యోగశాస్త్రమును ఉపదేశించి యుద్ధముచేయ బుద్ధిపుట్టించెను. ఆ యోగశాస్త్రము ''భగవద్గీత'' అని పేరిచే మన వేదాంతగ్రంథములలో మిగులదొడ్డది అయిఉన్నది. మఱియు ధర్మరాజుచేత చేయబడిన రాజసూయ యాగకాలమున ఇతఁడు శిశుపాలుని సంహరించెను. కౌరవ సదస్సున దుర్యోధనాదులచే ద్రౌపది అవమానింపఁబడినప్పుఁడు యితఁడుఆమె మొర ఆలకించి సంరక్షించెను. పాండవులకును కౌరవులకును సంధిచేయకోరి రాయబారము పోయిన కాలమున ఇతఁడు తనవిశ్వరూపము చూపెను. ఇవి మొదలయిన అమానుషములును అద్భుతములును అయిన కృత్యములను యితఁడు చేసినందున కేవలము మనుష్యమాత్రుఁడుకాడు. (భార) (భాగ) (హరివం)

## కే

**కేకటుఁడు** : సంకటుని కొడుకు. ఇతనికి దుర్గాభిమానదేవతలు పుట్టిరి.

**కేకయము** : ఒకానొక దేశము. శిబి కొడుకు అగు కేకయుని వలన దీనికి ఈ నామము కలిగెను. ఇది యుపాశానదికి వాయవ్యభాగమున ఉన్నది. దీనికి రాజధాని గిరివ్రజము. పితామహుఁడు ఈ దేశాధిపతి.

**కేకయుఁడు** : అ॥ శిబిచక్రవర్తి యొక్క నలుపురి కొడుకులలో ఒకఁడు. చూ॥ కేకయము.

**కేతన** : ఒక ఆంధ్రకవి. ఇతనికి అభినవదండి అని బిరుదాంకము కలదు. ఈతఁడు విజ్ఞానేశ్వరీయము అను ధర్మశాస్త్రమును తెనిగించెను.

**కేతుమంతుఁడు** : (1) నలువురు లోకపాలురలో ఒకఁడు. (2) కళింగ దేశాధీశుఁడు శ్రుతాయువు కొడుకు (3) కా॥ ధన్వంతరి కొడుకు. కేతురథుని తండ్రి.

**కేతుమతి** : ఒక గంధర్వ స్త్రీ. సుమాలి అను రాక్షసుని భార్య.

**కేతురథుఁడు** : కా॥ కేతుమంతుని కొడుకు. భగీరథుని తండ్రి.

**కేతువు** : విప్రచిత్తికి సింహికయందు పుట్టిన కొడుకు. ఇతఁడు అగ్నికి వికేశి యందు పుట్టిన పుత్రుఁడు అనియు చెప్పఁబడియున్నది. చూ॥ రాహువు.

**కేదారము** : హిమవత్పర్వతమునందలి ఒక శివక్షేత్రము.

**కేదారేశ్వరవ్రతము** : ఇది ఆశ్వయుజ బహుళ చతుర్దశి నాఁడు సువాసినులు భర్త యను గ్రహమును కోరి ఆచరించు వ్రతము. చూ॥ అర్ధనారీశ్వరి.

**కేదారేశ్వరుఁడు** : ఒకానొక శివమూర్తి. చూ ర్ధనా రీశ్వరి.

**కేరళము** : కేరళుఁడు ఏలిన దేశము. ఇదియే దక్షిణ మళయాళము అనఁబడు.

**కేరళుఁడు** : దుష్యంతుని తమ్ముఁడు అగు దిష్యంతుని మునిమనుమఁడు. వీని తండ్రి ఆక్రీతుఁడు. ఇతఁడు కేరళ దేశమును ఏలినవాఁడు.

**కేశవుఁడు** : చూ॥ విష్ణువు.

**కేశి** : (1) ఒకదానవుఁడు. వీఁడు దేవసేనను పట్టి ఎత్తుకొని పోవుచుండ ఆమెను దేవేంద్రుఁడు విడిపించెను. (2) హయరూపధరుఁడు అయివచ్చి కృష్ణునితో పోరాడి మృతిచెందిన ఒక అసురుఁడు. (3) య॥ వసుదేవునికి భద్రయందు పుట్టిన కొడుకు. (విష్ణు)

**కేశిధ్వజుఁడు** : నిమివంశోద్భవుఁడు చూ॥ ఖాండిక్యుఁడు. (విష్ణు)

**కేశిని** : దమయంతి పరిచారికలలో ఒకతె. (భార)

**కేసరి** : ఒకానొక వానరుఁడు. ప్రభాసతీరమున ఋషులకు ఉపద్రవము చేయుచు ఉండిన ఒక ఏనుగును ఇతఁడు చంపెను. కనుక కుంజర సూదనుఁడు లేక కేసరి అనుపేరు కలిగెను. ఇతని భార్య అంజన. కొడుకు హనుమంతుఁడు. (రామా)

## కై

**కైకసి** : సుమాలి కూతురు. విశ్రవసుని రెండవ భార్య. ఈమెయందు రావణ కుంభకర్ణ విభీషణులును శూర్పణఖయును పుట్టిరి. (ఉ. రా)

**కైకేయి** : (1) కేకయదేశపురాజు కూతురు. దశరథుని మూడవ భార్య. భరతుని తల్లి (2) విరాటరాజుభార్య, నా॥ సుదేష్ణ (రామా) (భార)

**కైటభుఁడు** : ఒక అసురుఁడు. కల్పాంతమున విష్ణువు యోగనిద్రయందుండి నపుఁడు వీఁడును మధువు అను వాఁడును అతని చెవినుండి వెడలివచ్చి ప్రళయ సముద్రమున మోకాలి బంటిగా చరించుచుండిరి. అపుఁడు విష్ణునాభికమల మందు బ్రహ్మజన్మించి మధుకైటభులు తన్ను హింసింపరాగా విష్ణువును శరణువేడెను. విష్ణువు కరుణించి మధుకైటభులను నిలువరించి మీరు ఏల ఈ బాలుని హింసిచెదరు' వీనిని విడువుడు మీకు కోరిన వరములు ఇచ్చెదను అనెను. అందుకువారు చిరునవ్వు నవ్వుచు నీవా మాకు వరములు ఇచ్చెడివాడవు కావలయునేని నీకు మేము వర ములు ఇచ్చెదము. కోరుము అనగా, మీరు నా చేతచచ్చునట్లు వరమునిండు అని అడిగి పుచ్చుకొని ఆ ఇద్దరను చంపెను. కనుకనే విష్ణువునకు కైటభారిమధువైరి అను నామములు కలిగెను. (దేవీ భాగ)

**కైలగిల** : ఒక పట్టణము. ఇది సుమారు యెనిమిదినూర్లు సంవత్సరములకు ముందు కోంకణమునకు రాజధానిగా నుండెను.

**కైలాసపర్వతము** : హిమవత్పర్వతపృష్ఠ భాగమున వుండునట్టి ఒక కొండ. అందు గుహ్యకులు అనేకులు కొలువ కుబేరుడు వసించి యుండును.

## కౌ

**కౌమరుసామి** : కుమారస్వామి.

## కో

**కోంకణము** : పశ్చిమ సముద్ర తీరమున కేరళ దేశమునకు ఉత్తరమున నుండు దేశము.

**కోటికాస్యుడు** : ఒక రాజకుమారుడు, పాండవులు వనవాసము చేయునపుడు ఆశ్రమమునందు వొంటరిగా యున్న ద్రౌపదిని సైంధవుడు చూచి మోహించి ఆమె యెవరో విచారించి రమ్మని యీతనిని పంపెను. (భార)

**కోలాహలుడు** : హిమవంతుని పుత్రుడు. మైనాకుని తమ్ముడు. యీ పర్వ తము ప్రక్కన శుక్తి మతీనది ప్రవహించును. (భార)

కోసలము : సరయూనది ప్రాంతమున ఉండిన వొకానొక దేశము. దీనికి రాజధాని అయోధ్య. ఇక్ష్వాకు వంశపు రాజులు దీనిని పాలించిరి. ఇది శ్రీరాముల కాలమునకు పిమ్మట ఉత్తరకోసలము అని వాడబడును. ఇదిగాక వింధ్యపర్వత సమీపమున మఱియొక కోసలము కలదు. దానికి శ్రీరాముల పెద్దకొడుకగు కుశుడు కుశస్థలి అను పట్టణము నిర్మించి రాజధానిగా చేసెను. ఇది దక్షిణ కోసలము అని వాడఁబడును. (రామా)

# కౌ

కౌశాంబి : కుశాంబుడు కట్టిన పట్టణము. ఇది నిచకునికాలము మొదలు అభిమన్యుని వంశస్థులకు రాజధాని.

కౌశికము. : ఇది ఉప పురాణములలో ఒకటి.

కౌశిక : గాధి కూతురు. ఋచికునిభార్య. జమదగ్నితల్లి. విశ్వామిత్రుని సహోదరి. నా॥ సత్యవతి.

కౌశికీదేవి : గౌరీదేవియొక్క కాయకోశము నుండి శుంభనిశుంభులను చంపుటకై పుట్టినదేవి. ఈమె చండుడు, ముండుడు అను రాక్షసులను చంపుటచే చాముండి అనియు చెప్పబడును.

కౌశికుడు : (1) ధర్మవ్యాధుని వలన ధర్మవిశేషములను యెఱింగిన ఒక బ్రాహ్మణుడు (భార, (2) ప్రతిష్ఠాన పురమునందువుండిన ఒక విప్రుడు. ఇతడు కుష్ఠువ్యాధిచే నీరుగారుచు అసహ్యమైనశరీరముతో నుండగా అతనిసతి రోతపడకపతికి సతతము భక్తియుక్తమైన సేవకావించుచు ధన్యురాలుఅని అనిపించుకొనుచుండెను. అట్టి నికృష్టదశను వుండియు అతడు ఒకనాడు ఒక వేశ్యనుచూచి మోహించి దానిని పొందకోరి ఆకోరికను తనపత్నితో చెప్పగా ఆపతివ్రత మతిని ప్రతిభావ ముంచక ఆ రాత్రియే, వలసిన ధనమును కొని తనపెనిమిటిని మూపుపై నిడుకొని ఆ వెలయాలి యింటికిపోవుచుండ, దైవయోగమున అపుడు గగనము మేఘములచే కప్పబడి యుండుట చేసి మార్గము చొప్పరడక వుండెను. ఆగాధాంధకారమున దారిని

కొరత వేయబడి యుండిన మాండవ్యుని, ఆకౌశికుని కాలు మెట్లో సోకెను. అందులకు అతడు యెవని కాలు తనపై సోకెనో వాడు సూర్యోదుదయింపుడును చచ్చుగాక యని శపియించెను. అంత ఆపతివ్రత కౌశికుడు చచ్చిన పక్షమున తనకు వైధవ్యము సంప్రాప్తించును అని యెంచి, సూర్యుడుదయింపక వుండెడుగాకయని పలికెను. దానంజేసి సూర్యుని పొడ గానరాక లోకమునకు మిక్కిలి అలజడి పుట్టిన దేవతలు ఎల్లరును నలువపాలికి యేగి మొఱపెట్టుకొనిరి. అపుడతడు వారలతో మీరు భూలోకమునకు పోయి అత్రిపత్నియగు అనసూయను ఆశ్రయించితిరేని ఆ బిడ్డ ఈ ఆపదను బాపును పొండు అనెను. వారును అట్లే ఆమె చెంతకు పోయి ప్రార్థించిరి. అంతట ఆమె కౌశికుని సదనమునకు ఏతెంచి అతని భార్యను బహు విధముల స్తుతించి నీ భర్తమృతి చెందినను నవయౌవనాంగుడై మరల బ్రదుకునని వరమొసంగి సూరు ్యడుదయింపను అనుగ్రహింపవలయు అని వచింపగా ఆమె అట్లు కానిమ్మనియెను, అప్పుడు సూర్యుడుదయింప లోకముల అలజడి బాసెను. కౌశిక మునియు మృతుడై అనసూయాదేవి మహిమవలన పునర్జీవితుడు అయ్యెను. ఇది పాతివ్రత్యము వలని మహిమ (మార్కం) (3) ఒకానొకముని ఇతడు నారాయణ కవచమంత్రమును జపించి నిర్మలచిత్తుడై యోగధారణను వొక మరుభూమియందు తనువు విడువగా ఆ దేహము జీర్ణించిఅస్థులు మాత్రము అచటపడివుండెను. ఆ అస్థులకు సరిగా వుపరిభాగమునందుచిత్రరథుడు అను ఒక గంధర్వుడు తన విమానము మీద పోవుచుండ. తననీడ ఆయస్తులమీద సోకినందున అతడు విమానముతోగూడ తలక్రిందుగా క్రిందపడెను. అది వాలఖిల్యాముని చూచిఆగంధర్వుంతో నీవు యీ పుణ్యశల్యములను సరస్వతీ జలముల ప్రక్షేపణము చేసి కృతస్నాతుడవు కమ్ము అట్లయిన నీకు ఊర్ధ్వగమనశక్తి కలుగును. అని చెప్పగా అతడు అట్లే చేసి విమానారూఢుడై దేవలోకమునకు చనియెను. 4యు॥వత్స బాలకుని (లేక) వత్సవంతుని పెంపుడు కొడుకు (5) విశ్వామిత్రునికి నామాంతరము (6) జరాసంధుని మిత్రుడు. నా॥ హంసుడు చూ॥ డిచికుడు.

**కౌసల్య** : (1) దశరథుని జ్యేష్ఠభార్య. శ్రీరాముని తల్లి (2) యయాతి పుత్రుడగు పూరుని భార్య (3) నా॥ భద్రవసుదేవుని భార్య

(రామా) (భార)

## క్ర

క్రతువు : (1) బ్రహ్మ మానస పుత్రులలో ఒకడు. ఇతనికి దక్షప్రజాపతి కూతురైన సన్నతియందు అంగుష్ఠమాత్ర ప్రమాణులు అయి అరువది వేగురు మహాతపస్సంపన్నులు అయిన వాలఖిల్యమహర్షులు పుట్టిరి. (2) ఉల్ముకుని కొడుకు, అంగుని తమ్ముడు. (భార) (భాగ)

క్రిమి : అ॥ ఉశీనరుని నాల్గవ కొడుకు.

క్రిమిలాపురం : ఒకానొక పట్టణము. క్రిమి అనువానిచే నిర్మింపబడినందున దీనికీ పేరు కలిగెను,

క్రీడి : చూ॥ అర్జునుడు కిరీటి శబ్ద వైకృతము

క్రోధవశర : దక్షప్రజాపతి పుత్రికలలో ఒకతె, కశ్యపుని భార్య.

క్రోష్టువు : యదుపుత్రులలో రెండవవాడు. వృజినవంతుని తండ్రి.

క్రౌంచుడు : మైనాకుని కొడుకు. ఈ పర్వతమును కుమారస్వామి భేదించి క్రౌంచదారణుడు అనిపేరు వడపెను.

## క్ష

క్షత్రవర్ముడు : ఒకానొకరాజు, పురూరవుని కొడుకైన ఆయువుయొక్క రెండవ కొడుకు అగుక్షత్రవృద్ధుని వంశమునందు పుట్టినవాడు.

క్షత్రవృద్ధుడు : పురూరవుని రెండవ కొడుకు. నహుషుని తమ్ముడు. క్షత్రోపేక్షుడు. య॥ అక్రూరుని తమ్ముడు,

క్షమ : దక్షప్రజాపతి కూతురు. పులహుని భార్య.

క్షితిధరము : నా॥ శ్రీశైలము. ఇది కృష్ణానది పుట్టుచోటికి సమీపమునందు వుండును. దీని వునికి తావు మహారణ్యము.

క్షుపుడు : మొదటి ఖనిత్రుని కొడుకు.

క్షేత్రపాలుడు : నా॥ భైరవుడు. ఇతడు దిగంబరుడు.

క్షేమకుడు : అభిమన్యుని వంశపు రాజులలో కడపటి రాజు. ఇతనితో భరత వంశము ముగిసెను.

క్షేముడు : క॥ సునీతుని కొడుకు. సుకేతుని తండ్రి.

క్షేమ్యుడు : పు॥ ఉగ్రాయుధుని కొడుకు. (భార)

## ఖ

ఖగముఖుడు : సహస్రపాదుని సహాధ్యాయుడు. ఇతడు సహస్రపాదుని డుండుభము కమ్మని శపించెను. (భార)

ఖగేంద్రుడు : పక్షులకెల్లను రాజు. చూ॥ గరుడుడు.

ఖట్వాంగుడు : ఇ॥ విశ్వసహుని కొడుకు. దీర్ఘబాహువు తండ్రి. ఇతడు ఒకప్పుడు దేవాసురుల యుద్ధమునందు దేవతలకు సహాయము చేయగా వారు సంతసిల్లి వరమువేడుమనిరి. అపుడు ఇతడు తనజీవితకాలము పరిమితిని దెలియ కోరెను. అంతట వారు ఒకముహూర్తకాలమున్నదని తెలిపిరి. అదితెలిసి అంతలో తనకు మోక్షము కలుగుటకు కావలసినదానిని సాధించెను.

ఖనిత్రుడు : (1) ప్రజాని కొడుకు. క్షుపుని తండ్రి. వివింశుని తాత. ఈతని తమ్ములు ఇతనిని నిర్మూలము కావింప దుర్మంత్రమున ఒకహోమము ఒనర్పగా ఆ హోమకుండమునందు ఒకకృత్తి పుట్టెను. దానిని ఖనిత్రుని చంపుము అని పంపగా అది అగణ్య పుణ్యగణములచేతచుట్టబడివుండిన ఖనిత్రుని డాయవెరచి మరలివచ్చి తన్నుపుట్టించినవారినే చంపెను. (2) మొదటి ఖనిత్రు వంశస్థుడైన వివింశుని కొడుకు. ఈతడు పుత్రసంతానము అపేక్షించి గోమతి అను పుణ్యనదీ తటముచేరి అందు దేవేంద్రునిగూర్చి తపముచేసిన అతడు ప్రత్యక్షమై పుత్రుడు కలుగునట్లు వరములు ఒసగెను. అపుత్రులు బలాశ్వుడు అని కరంధముడు అని చెప్పబడును. (మార్కం) (భార) (విష్ణు)

ఖరుడు : ర॥ విశ్రవసునకు రాకయందు పుట్టిన కొడుకులలో జ్యేష్ఠుడు. జనస్థానమందలి సేనకు అధిపతి. రామునిచేత చంపబడెను. ఇతని తమ్ములు దూషణుడు త్రిశిరుడు. (రామా)

ఖస్పృముడు : ద॥ విప్రచిత్తు కొడుకు.

## ఖా

**ఖాండవము** : ఇంద్రునివనము. అగ్నిదేవుడు ప్రార్థింపగా కృష్ణార్జునులు దీనిని అతనికి అహారముగా యిచ్చిరి: (చూ॥ శ్వేతకి) ఇదివుండినచోట ఇంద్రప్రస్థపురము కట్టబడెను. కనుక దానికి ఖాండవప్రస్థము అనియు ఒక పేరు కలదు. (భార)

**ఖాండిక్యుడు** : నిమివంశోత్పన్నుడైన (ధర్మధ్వజు) జనకమహారాజు యొక్క పౌత్రుడు. అమితధ్వజుని పుత్రుడైన కేశిధ్వజునితో విరోధించి రాజ్యభ్రష్టుడై అడవికి చనెను. అంత కొంతకాలమునకు వెనుక కేశిధ్వజుడు తనయాగపశువు పులిచేత చంపబడగా యాగపరిసమాప్తిచేయు విధము తెలియక ఖాండిక్యుని చెంతకువచ్చి ప్రాయశ్చిత్త విధిని ఎరిగి దానికి బదులు అతనికి బ్రహ్మజ్ఞానము బోధించెను. అంతటి ఖాండిక్యుడు గోవిందునియందు వదలని భక్తికలవాడై ముక్తిని పొందెను. (విష్ణు)

**ఖ్యాతి** : (1) దక్షప్రజాపతి కూతురు భృగువుయొక్క భార్య ఈమెకు సుధాత విధాత యని యిరువురు కొడుకులును, లక్ష్మి అను కూతురును కలిగిరి.
(2) ఉల్ముకుని కొడుకు. అంగుని తమ్ముడు. (మత్స్య)
(3) ఉరుని పుత్రుడు. (భార) (భాగ)

## గ

**గంగ** : ఒకానొకనది. హిమవంతమునందు పుట్టినందున దీనిని హిమవంతుని కూతురు అందురు. ఇది దేవలోకమునంుండి భగీరథుని ప్రయత్నమున భూలోకమునకు వచ్చెను. భగీరథునకు తనముత్తాతలు అగు సగరపుత్రులు కపిలమహాముని యొక్క కోపాగ్నిచేత(భస్మము)నీఱు కాగా వారికిసద్గతి కలిగింపతలచిగంగను కూర్చి తపస్సుచేసి భూలోకమునకు దిగివచ్చునట్లు ప్రార్థించెను. అప్పుడు ఆనది తాను భూలోకమునకు వచ్చునెడ తన ప్రవాహవేగమును ధరింపగల వారిని ఒకరిని ఏర్పరుచుకొనిన పక్షమున తాను వచ్చునట్లు ఒప్పుకొనెను. అంతట భగీరథుడు రుద్రుని గూర్చి తపమాచరించి అతని అనుగ్రహము పడసి గంగాప్రవాహమును వహింప ప్రార్థించెను. అపుడు గంగ మిక్కిలి అట్టహాసముతో భూమికి దిగి రాసాగెను. అది రుద్రుడు చూచి గంగను తన ప్రక్కకు ఆకర్షించి జటా

జూటమునందు నిలిపిపిదప కొంతకాలమునకు భగీరథుని ప్రార్థనచేతనతని శిరస్సు నుండి యేడు బిందువులను భూమి మీదవదలెను. అది కారణముగా రుద్రుడు మందాకినీ మౌళి అనబడును. ఆ బిందువులు పడినచోటు బిందు సరస్సు అనియు ఆ బిందు సరస్సు నుండి వెడలి గంగ ప్రవహించును అనియు చెప్పుదురు. అట్లు వెడలి ఆ గంగ జహ్నుమహాముని యజ్ఞశాలయందు ప్రవేశింపగా అతడు కోపగించి దానిని పానముచేసి పిమ్మట భగీరథుడు ప్రార్థింపగా ప్రసన్నుడయి తన చెవినుండి వెడల విడిచెను. ఇందువలన గంగకు జాహ్నవి అనుపేరు కలిగెను. మఱియు నీనది భగీరథుని వెంట పాతాళమునకు పోయెను. కనుక దీనిని త్రిజగత్కళ్యాణి, త్రిపథగ. అని అందురు. త్రివిక్రమావతారమున విష్ణువు భూమియందు ఒక పాదముంచి రెండవ పాదముచే మీది లోకమును కప్పునప్పుడు బ్రహ్మాండము పగిలి ఆకాశగంగ ఆయన పాదము గుండ క్రిందికి ప్రవహించినందున దీనికి విష్ణుపది అనుపేరు కలిగెను. ఊర్ధ్వలోకములయందు వ్యాపింపజేసిన త్రివిక్రమ దేవుని పాదమును బ్రహ్మ తన కమండల జలముచే కడుగగా ఆ జలము ప్రవహించి ఈ నది యేర్పడియెను, అనియు అది కారణముగా దీనికి విష్ణుపది అనుపేరు కలిగెను. అనియు కొందరు చెప్పుదురు. (భాగ)

**గంగా ద్వారం** : చూ॥ నా॥. హరిద్వారము.

**గండకి** : ఒకానొక నది. ఇది మగధ దేశముగుండా ప్రవహించి గంగతో సంగమము అవును. (శివ)

**గంధమాదనము** : ఒక కొండ. ఇది యిపుడు. గోండ్వాన అనబడు దేశము నందుండి ను. (భార)

**గంధమాదనుడు** : (౧) ఒక వానరుడు. వీడు సుగ్రీవుని సేనయందు ఒకడు. కుబేరుని వలన పుట్టినవాడు (౨) య॥ అక్రూరుని తమ్ములలో ఒకడు)

**గంధర్వులు** ; దేవతలలో ఒక తెగవారు హా హా హూ హూ ప్రభృతులు. కశ్యపునికి ప్రాధయందు పుట్టినవారు

**గంధవతి** : (౧) వాయువుయొక్క రాజధాని. (2) వ్యాసుని తల్లియగు సత్యవతికి నామాంతరము. (భార)

**గజకర్ణుడు** : ఒకయక్షుడు.

గజాస్యుడు : వినాయకుని కి నామము, దక్షాధ్వర ధ్వంసమప్పుడు వీరభద్రునుచే ఈతని తలనరుక బడెను. అపుడు సర్వకార్యముల విఘ్నములను చెఱుచునట్టి యితనిని బ్రతికింపుము అని దేవతలు శివుని ప్రార్థింపగా శివుడు యే జంతువు ఉత్తరతలాపిగా పండుకొని యుండునో దానితల నఱికితెచ్చి యీ మొండెముతో అతికించిన యెడ యితడు జీవించునని చెప్పెను. అది తెలిసి యెల్లజంతువులును వెఱచి ఉత్తరపు తట్టుతల పెట్టుకొని శయనింపకుండెను ఏనుగు మాత్రము మదాతి శయముచేత వాొళ్లెరుగక ఉత్తరతలాపిగా పండుకొని యుండెను. అదిచూచి దేవతలు దాని తల నరికితెచ్చి మొండెముతో అతికింప వినాయకుడు బ్రతికెను. కనుక యితనికి ఈ రూపమును నామము కలిగెను.

గజుడు : ఒకదానవుడు. వీడు తారకయుద్ధమున రుద్రునిచే చంపబడెను.వీని చర్మమును రుద్రుడు ధరించి యుండెను గాన రుద్రునికి గజచర్మధారి అని పేరు కలిగెను. (శివ)

గణపట్టి : కాత్యాయనునుచే రచియింపబడిన ఒకని ఘంటువు. ఇందు పదములు వేరువేరు గణములుగ యేర్పరచి లింగనిర్ణయము చేయబడియుండెను.

గణపతిదేవుడు: ఒక అంధ్రకవి. ఇతడు మిక్కిలి ప్రామాణికుడు, శివయోగ సారము అను నొక వేదాంతగ్రంథమును రచియించెను. అందు అపూర్వములైన దేశ్యపద ములు అనేకములున్నవి.

గణేశుడు : వినాయకుడు.

గదుడు : య॥ బలరాముని భ్రాత. రోహిణియందు వసుదేవునికి పుట్టిన కొడుకు.

గయ : కాశి యొద్దనుండెడి ఒక పుణ్యక్షేత్రము. ఇందు అక్షయవటము అనియొక మర్రిమానుకలదు. దానిక్రింద తీర్థ శ్రాద్ధము చేసిన మహావిశేషము అందురు.

గయుడు : (౧) ఉల్ముకునికొడుకు. అంగుని తమ్ముడు. (౨) ఒక చక్రవర్తి ప్రియవ్రతుని వంశస్థుడయిన నక్తునికొడుకు. ఇతడు యేనూఱు అశ్వమేధయాగ ములుచేసి అసంఖ్యేయములయిన ఋత్విజులను సభ్యులను పూజించి సువర్ణమయ గోదానంబులు అనేకములు ఇచ్చిఅక్షయములగు ఇంద్రలోక సుఖములను బడసెను.

(3) అధూర్తరజునికొడుకు. ఇతడనేక యజ్ఞములు కావించి రాజర్షి యయ్యెను ఈతని యజ్ఞవాటియే గయ యను పుణ్యక్షేత్రము (భాగ)

**గరుటామంతుడు**
**గరుటాలమంతుడు:** } గరుత్మంతుడు

**గరుడ పంచమి** : శ్రావణ శుక్లపంచమి ఇది సుమంగళులకు నోక వ్రతదినము.

**గరుడుడు** : నా॥ తార్క్ష్యుడు కశ్యప్రజాపతికి వినతవలన పుట్టిన కుమారుడు. ఇతని అన్న అనూరుడు. ఇతడు తనతల్లి అయిన వినతయొక్క దాసీత్వమును మాన్పు టకై కద్రువయొక్క పుత్రులు కోరిన ప్రకారము దేవేంద్రుని గెలిచి అమృతము తెచ్చియిచ్చెను. అట్లు తేబోవు సమయమున గరుడుడు తనకు లావుగలుగ తగిన ఆహారము నుపదేశింపుము అని తల్లినివేడి ఆమె సముద్ర మధ్యమునవుండి అప్పుడప్పుడు ప్రజలకు అపకారము చేయుచువుండెడి పుళిందులను భక్షింపుము అని చెప్పగా అతడు అట్లేచేసి అది చాలక మార్గమునందు తండ్రిని చూచి మఱి యొక ఆహారము చూపుము అని అడుగగా అతడు విభావసుడు. సుప్రతీకుడు. అను నిద్దఱు అన్నదమ్ములు పితృద్రవ్యమును పంచుకొనుటకై పోరాడి ఒకరి నొకరు శపించుకొని ఆరుయోజనముల పొడవును పండ్రెండు యోజనముల నిడు పునుకల గజమును మూడుయోజనముల లావును పదియోజనముల మండల మును కలిగిన కచ్ఛపమును అయి యున్నారు వారినికొని భక్షించు పొమ్మనెను. అంతట ఇతడు ఆ గజకచ్ఛపములున్న చోటికిపోయి వాని రెంటిని తన్నుకొని పోవుచు మార్గ మందొక గొప్పవృక్షశాఖయందు నిలువపోవ అది ఆ భారమునకు తాళక విఱిగెను. అప్పుడు 'వాలఖిల్యమహామునులు ఆశాఖ యందు వ్రేలుచు తపస్సు చేయుచుండిరి. కనుక వారికి విపత్తు కలుగుననుభీతిచే ఆ శాఖను క్రిందపడనీయక ముక్కున కఱచిపట్టుకొని తండ్రియొద్దకు పోయెను. అప్పుడు ఆయన ఇతని అభిప్రాయము నెఱిగి వాలఖిల్యమునులను శాఖయందుండి దిగుడు అని ప్రార్థించి వారువిడిచిపోగా ఆ శాఖను హిమవంతమునొద్ద విష్పురుష నగమునందు పారవైపుము అని గరుడునికి చెప్పెను. గరుత్మంతుడట్లేచేసి గజ కచ్ఛపములను భక్షించి చనియెను. ఇతడు పక్షీంద్రుడు.

**గరుత్మంతుడు** : చూ॥ గరుడుడు.

గర్గుడు: (1) యాదవుల పురోహితుడు, వసుదేవుని పంపుననందునింట బలరామ కృష్ణులకు నామకరణాది సంస్కారములను కావించినవాడు (2) పు॥ హంత మన్యుని (లేక భుమన్యుని) కొడుకు. శిని తండ్రి.

గవాక్షుడు : సుగ్రీవుని సేనయందలి ఒక వానరుడు.

## గా

గాండీవము : అర్జునుని ధనుస్సు. దీనిని అగ్నిదేవుడు ఖాండవవన దహన మప్పుడు అర్జునకు యిచ్చెను. (భార)

గాంధారము : గాంధారునిచే యేలబడిన దేశము. ఇది ఆర్యావర్తమునకు పశ్చిమమున సింధునదీ సమీపమున ఉండెను.

గాంధారి : ధృతరాష్ట్రుని భార్య. గాంధార దేశపురాజయిన సుబలుని కూతురు. పరమ పతివ్రత. పెనిమిటి అంధుడయినందున తానును పరపురుషదర్శనము చేయ కూడదు అను నియమముచే యెప్పుడును కన్నులగంతకట్టుకొని వుండెను. ఈమె కొడుకులు దుర్యోధనాదులు. అందు పెద్దవాడు. అగు దుర్యోధనుడు యుద్ధమునకు పోవునపుడు జయముకలుగ వరము వేడగా ర్యతోధర్మ స్తతోజయః. అని చెప్పెను. ఈమెమతి అను దేవతాంశమున జనించినది. (భార)

గాంధారుడు : యయాతి కొడుకగు దృహ్యునియొక్క పౌత్రునికి పౌత్రుడు. ఇతని పేరున గాంధారము, అనియొక దేశము ప్రసిద్ధికాంచెను. ఆ కులమునందు పుట్టినవారు తురగారోహణ కుశలురును విక్రమాది గుణములచే ప్రసిద్ధులయినవారు

గాధి : కుశాంబుని కొడుకు. విశ్వామిత్రుని తండ్రి. శ్రీ మద్వాల్మీకి రామాయణమున యితడు కుశనాభుని కొడుకని చెప్పియున్నది. (భార)

గారుడము : ఒకపురాణము. ఇది గరుడోద్భవ బ్రహ్మాండ విషయాదులను గూర్చిచెప్పును. దీనిగ్రంథసంఖ్య పంతొమ్మిది వేలు.

గార్గ్యుడు : పు॥ శిని కొడుకు. బాష్కలుని శిష్యుడు. ఋగ్వేదాధ్యాపకుడు. ఇతని వంశస్థులు బ్రాహ్మలు అయిరి.

గాలవుడు : (౧) కువలాశ్వునికి అశ్వమునిచ్చిన ఒకఋషి (౨) శుక్లయజుర్వేదాధ్యాపకుడయిన ఒకఋషి. ఇతనిని గురువైన విశ్వామిత్రుడు ధవళవర్ణములై

ఒక కర్ణము నీలమైన ఉత్తమాశ్వములను యెనమన్నూటిని తనకు గురుదక్షిణగా తెచ్చియిమ్మ అనిన ఆ గుఱ్ఱములను యెందును పడయనేరక తనబాల సఖుడైన గరుడుని వెంటబెట్టుకొని యయాతి దగ్గఱకు పోయి అతని పుత్రికయగు మాధవి అనుకన్యను పడసి ఆమె సహాయమున అయోధ్యాధిపతియగు ఇక్ష్వాకు మహారాజు యొద్దను భోజపురి నాధుడగు శిబియొద్దను కాశిరాజుఅగు దివోదాసుని యొద్దను ఇన్నూరేసి హయములను పడసి ఆ కన్యను ఆరునూరుగుఱ్ఱములను విశ్వామిత్రునకు యిచ్చి అతనిని తృప్తిపొందించెను, (హరివం) (భార)

## గి

**గిరివ్రజము** : ఒక పట్టణము. మగధదేశముయొక్క రాజధాని, దీని చుట్టును కోటకట్టినట్లు కొండలుండుటచే దీనికి పేరు కలిగెను. ఈ నామమున మఱియొక పట్టణము కలదు. అది కేకయదేశమునకు రాజధాని. ఇందు మొదటిది కుశికుని కొడుకైన వసువుకట్టినది. అది ధర్మారణ్యమునకు సమీపమున మగధదేశమున నుండును.

## గు

**గుండవిభునార సింహుడు:** ఆంధ్రదేశమున ఒక సామంతరాజు ఇతని తండ్రి గుండవిభుడు. తల్లి మల్లాంబ. ఈతనికి జైమిని భారతము అంకితమొనర్పబడెను.

**గుజరాతి**
**గుజ్జరాతి**
**గుజ్జరి** : ఘూర్జరదేశము. ఇది పూర్వము ఆనర్తదేశము అనబడును.

**గుణాఢ్యుడు** : రుద్రుని శాపముచే భూలోకమున పుట్టిన మాల్యవంతుడు.

**గుప్తులు** : కొందఱుసామంతరాజులు. ఆంధ్ర భృత్యుల కాలమున మగధరాజ్యము అనేకభాగములయ్యెను. అందు ప్రయాగ వఱకుగల గంగగట్టుభూమినివీరు యేలిరి.

**గురుడు** : (౧) పు॥ నా॥ బుచిరథుడు, సంకృతి కొడుకు. (౨) బృహస్పతి :

**గురువరాజు** : ఒక ఆంధ్రకవి ఇతడు చంద్రరేఖా పరిణయమును రచించెను.

**గుహుడు** : (౧) నా॥ కుమారస్వామి (౨) శృంగి బేరపురమునకు ప్రభువు అగుఒక కిరాతరాజు, రామునికి భక్తుడు. (రామా)

**గుహ్యకులు** : కుబేరుని నవనిధులను పాలించువారు (తఱుచుగా కుచ్ఛితము పలుకువారు అని శబ్దార్థము) వీరు మాణిభద్రాదులు.

## గృ

**గృహపతి** : ఒక అగ్ని. ఇతడు యింద్రాది దేవతలకు హవ్యమును మోసికొనిపోయి యిచ్చును. కనుక ఇతనికి హవ్యవాహనుడు అను నామమును కలదు. ఒకప్పుడు ఇతను హవ్యములను, మోయజాలక సముద్రమునందు దాగి యుండగా అందలి మత్స్యములు ఇతడుండుతావు దేవతలకు చెప్పెను. అందువల్ల మత్స్యములు జనులకు ఆహారము అగునట్లు శపించెను.

## గొ

**గొంతి** : కుంతి.

## గో

**గోకర్ణము** : కర్ణాటక దేశమునందుడు ఒక గొప్ప శివక్షేత్రము రావణుడు తపస్సుచేసి బ్రహ్మచేవరము పడసిన చోటు.

**గోకులము** : యమునా నదీతీరమున బృందావనము దగ్గరవుండు గొల్లపల్లె. కృష్ణుడిచ్చటే పెరిగెను .దీనినే వ్రేపల్లె అందురు.

**గోతముడు** : ఒకానొక ముని. ఈతని కొడుకగు శాక్యబుద్ధుని గౌతముడు అని చెప్పుదురు.

**గోత్రములు** : ఇవి అనేకములు. అందుకొన్ని శిష్యపరంపరను. కొన్ని పుత్ర పరంపరను తెలియచేయును. వీనిని ఇన్ని అని లెక్కపెట్టి చెప్పుటసాధ్యము. అయినను ఇందు ముఖ్యమైనవి యేబది. అవికాశ్యప భారద్వాజహరిత కౌండిన్య కౌశిక వశిష్ఠగౌతమగార్గేయ శ్రీవత్స ఆత్రేయ ముద్గల శఠమర్షణాములు వానిలో ప్రతిదానియందును అంతర్భాగములు అనేకములు కలవు మఱియును అవి యేకార్షేయములు ద్వ్యార్షేయములు త్ర్యార్షేయములు పంచార్షేయములును అయి వుండును అనగా ప్రవర చెప్పునపుడు కొందఱు ఒకఋషిని, కొందఱు ఇద్దఱు ఋషులను, కొందఱు ముగ్గురు ఋషులను,కొందఱు అయిదుగురు ఋషులను చెప్పి చెప్పుదురు అని అర్థము.

**గోపతి** : అంగిరసుని వంశస్థుడు ఒక అగ్ని.

**గోపరాష్ట్రము** : కోంకణదేశపు దక్షిణ భాగము.

**గోభానుడు** : యయాతి పుత్రుడు అగు తుర్వసుని పౌత్రుడు.

**గోమతి** : ఒకనది. ఇది హిమవత్పర్వతమునందు ఉత్పత్తియై కోసలదేశము గుండ ప్రవహించి గంగలో సంగమము అగును.

**గోముఖుడు** : శాకల్యుని శిష్యుడు

**గోవర్ధనము** : మధురాపురము సమీపమున ఉండు ఒకకొండ. కృష్ణుడు ఇంద్ర యాగముచేయుచున్న గోపాలురకు దానివలన ఫలములేదు అని బోధించె. ఇంద్రుడు అందులకు మిగుల అలిగి వారికి ఉపద్రవము కలుగునటుల శిలావర్షము కురిపింపగా తాను ఆ పర్వతమునుఎత్తి గొడుగుగాపట్టి దానిక్రింద అచటి గోవు లను గోపాలురను విలిపి రక్షించెను. పిదప ఇంద్రుడు కృష్ణుని శక్తి ఎఱిగి అత్త విత్తో బద్ధసఖ్యుడయి ఆతనిని గోవులకు అధిపతినిగా చేసిపోయెను. అందువలన కృష్ణునకు గోవిందుడు అని పేరు కలిగెను. (భాగ)

**గోవింద భగవత్పాదాచార్యులు** : శ్రీమచ్ఛంకరాచార్యుల వారి గురువు గౌడపాదాచార్యుల శిష్యుడు.

**గోవిందుడు** : నా॥ కృష్ణుడు. చూ॥ గోవర్ధనము,

**గోళకుడు** : శాకల్యుని శిష్యుడు.

## గౌ

**గౌడపాదాచార్యులు**: శ్రీశుకుల శిష్యుడు యతిగోవింద భగవత్పాదులకు గురువు. ఈయన ఉత్తర గీతకు భాష్యము వ్రాసెను,

**గౌడపురి** : నా॥ లక్ష్మణపతి. వంగదేశమందలి ఒకముఖ్యపట్టణము. ఇచట ముందు జహ్నుమహర్షియొక్క ఆశ్రమము ఉండినట్లు చెప్పుదురు. ఇందుండు బ్రాహ్మణులు గౌడులు అనబడుదురు, వీరు అభిమన్యుని పుత్రుడు అగు పరిక్షిత్తు యొక్క కాలమున కురుకోసలదేశములనుండి వచ్చిరి.

**గౌడము** : వంగదేశము. ఈదేశస్థులు పంచగౌడులలో ఒక్కరు.

గౌతమాశ్రమము : ఇది విశాలపురినుండి మిథిలాపురమునకు పోవుమార్గమున ఉండెను. దీనికి సమీపమున నిమిచే నిర్మింపబడిన జయంత పురము అను ఒక పట్టణము కలదు.

గౌతమి : గోదావరి.

గౌతముడు : 1) దీర్ఘతముని కొడుకు, శతానందుని తండ్రి కృపాచార్యుల పితామహుడు (2 కణాదునికి నామాంతరము. 3 శాక్యబుద్ధుడు.

గౌతముని గోవు : రాజమహేంద్రపురమ్ము దగ్గిర గోదావరి నదికి దక్షిణపు ఒడ్డున నుండు కోవూరిక్షేత్రవాసి అగు గౌతముడు తపమాచరించుచుండగా ద్వాదశ వర్షామమొకటి సంభవించెను. అప్పుడు అక్కడవుండిన ఋషులందరును అతని చెంతకు వచ్చిరి. అతడు వారిని ఆదరించి ప్రతిదినము తాను అనుష్ఠానమునకు కూర్చుండబోవునపుడు పిడికెడు వొడ్లు కొనిపోయి గోదావరి యిసుకలో మడిచేసి చల్లివచ్చిన ఆ వొడ్లు అతని తపోమహిమచే అప్పుడే మొలచి పైరై ఆయన అనుష్ఠానము నెఱవేర్చుకొనునంతలో పండి సిద్ధము అగును. అంతట ఆ ధాన్యమునుతెచ్చి తనయొద్దకువచ్చియుండు రుషులకు అందరకు భోజనము జరిగించును. ఇట్లు పండ్రెండేండ్లు గడపి క్షామము తీరగానే ఆ రుషులందరు తమతమ నివాసములకు పోవుచు గౌతముని తమవెంట రమ్మని వేడిరి. అందులకతడు వొప్పకపోగా వారు ఒకమాయాగోవును సృష్టిచేసి అతడు నిత్యము వేసుకొను వరిపైరునుమేసి పోవునట్లు చేసిరి. అపుడు గౌతముడు ఒకదర్భ కర్రతో దానినికొట్టి అదలింపగా అంతమాత్రముననే ఆమాయాగోవు తనదూడతోకూడ పడిచచ్చెను అంతట ఆ ఋషులు గౌతముడు గోహత్య చేసెను అని నిందించి అతనిని చాంద్రాయణ వ్రతము ఆచరింపుము అని విధించి చనిరె, కనుక యెవరేని అదలించిన మాత్రమున మిక్కిలి బాధింపబడినవారివలె అభినయుంచిరేని అబ్బా గౌతముని గోవురా ఇది అని అందురు

గౌరముఖుడు : రు॥ శమీకుని శిష్యుడు

గౌరి : (1) పార్వతి (2) వరుణుని భార్య

గౌరీ గంగ : కైలాస పర్వతము నందలి ఒకనది.

గౌశులు : చూ॥ పంచగౌశులు.

## గ్ర

గ్రసనుడు : తారక యుద్ధమున విష్ణువుచే చంపబడిన రాక్షసుడు.

గ్రామదేవత : గంగమ్మలోనగు స్త్రీ దేవతలు ఒక్కొక్క విశేషమునుపట్టి పరాశక్తిరూపమైన దేవుని ఒక్కొక్క నామముతో అక్కడక్కడ పూజింతురు. అందులకు కారణములు ఆయాయిస్థల పురాణములవల్లను ఐతిహ్యములవల్లను యెఱుగదగియుండును.

## ఘ

ఘంటాకర్ణుడు : వీడు పిశాచ నాయకుడగు కుబేరకింకరుడు. శ్రీకృష్ణుడొకప్పుడు బదరీవనమునందు సమాధియోగమునందుండగా వీడుచూచి సంభాషించి నియమమనుష్ఠించి తనపిశాచ దేహమును వదలి పుణ్యలోకములకు పోయెను. (ఉ. హ. రి.)

ఘటోత్కచుడు : భీమసేనునికి హిడింబివలన పుట్టిన కొడుకు. భారత యుద్ధమందొకరేయి అక్షౌహిణి దండును చంపి, కడపట అర్జునుని చంపవలెనని కర్ణుడింద్రునివలన కైకొనిన శక్తిచే చంపబడెను. (భార)

ఘట్టుప్రభువు : ఒకానొక ఆంధ్రకవి. ఇతడు కుచేలోపాఖ్యానమును రాసుభాశ్వరము అను గ్రంథములను రచించెను.

ఘర్మ్మర : గాంధారుని పుత్రుడు.

## ఘూ

ఘూర్జరము : ఒకానొక దేశము. ఇది పశ్చిమ సముద్రతీరమందుండును. దీనినే గుజరాతు అందురు.

ఘూర్జరులు : ఘూర్జర దేశస్థులు. పంచద్రావిళ్ళలో ఒక్కరు.

## ఘృ

ఘృతాచి : ఒక అప్సరస (భాగ)

## ఘో

ఘోషమణి : నకులుని శంఖము

## చ

చండకౌశికుడు ; ఒకానొక ముని. గౌతమ వంశస్థుడు మగధదేశపు రాజు అగు బృహద్రథుడు యితని అనుగ్రహము వలన ఒకమామిడి పండును పడసి దానిచే జరాసంధుడు అను కొమరుని పడసెను. (భార)

చండముండులు : ర॥ శుంభనిశుంభుల భృత్యులు చూ॥ కౌశికీదేవి మార్కం

చండామార్కులు : శుక్రుని పుత్రుడు, దైత్యులకు పురోహితుడు చండుడు మార్కుడు అని రెండు నామములుగా కొందరు చెప్పుదురు. (భార) (భాగ)

చండికేశ్వరుడు
చండుడు : ఒక బ్రాహ్మణ చిన్నవాడు. ఇతడు ఈశ్వరునియందు అతిభక్తి కలిగి తదేక ధ్యానమున పూజచేయువేళ తండ్రి దానికి భంగము చేయరాగా ధ్యానపరవ్వతమున అతనిని యెఱుగక కాళ్ళువిఱుగకొట్టెను, అపుడు ఈశ్వరుడు ప్రత్యక్షమై పితాపుత్రులకు ఇరువురకు మోక్షమిచ్చెనని ప్రసిద్ధి

చందన : అంగదేశముగుండా ప్రవహించు ఒకనది.

చంద్రకేతుడు : శ్రీరాముని తమ్ముడగు లక్ష్మణుని రెండవ కొడుకు. (రామా)

చంద్రగిరి : నరసభూపాలుని రాజధాని.

చంద్రగుప్తుడు : నందులకు అనంతరము మగధదేశమున రాజులైన మౌర్యులకు మూలపురుషుడు. ఇతని తల్లి మురి. ఆమెపేర యీ వంశస్థులు మౌర్యులు అన బడిరి ఇతడు క్రీస్తుశకము సుమారు మున్నూఱు సంవత్సరములకు ముందు రాజ్యము చేసినట్లు తెలియబడుచున్నది.

చంద్రభాగ : సింధు నదికి ఉపనది,

చంద్రమతి : హరిశ్చంద్రుని భార్య, ఈమె మహాపతివ్రత. తన భర్తయొక్క సత్యసంధత నిలుపుటకై తాను దాసిగా అమ్ముడు పోవుటకాక ప్రాణత్యాగమునకును, ఒడంబడెను. (మార్కం)

చంద్రరేఖ : ఒకయప్సరస.

చంద్రలోకము: స్వర్గమునందు పితరులుండులోకము. దీనిని పితృలోకమనియు చెప్పుదురు.

చంద్రపీడుడు : నా॥ చంద్రకేతుడు.

చంద్రశర్మ : విష్ణుశర్మ కొడుకు. విక్రమార్కుని తండ్రి. ఇతడు బ్రహ్మ క్షత్రియ వైశ్యశూద్ర జాతుల నాలుగింటను నలుగురు కన్యకలను పెండ్లాడి బ్రాహ్మణ స్త్రీ యందు వరరుచిని వైశ్య స్త్రీ యందు భట్టిని క్షత్రియ స్త్రీ యందు విక్రమార్కుని శూద్ర స్త్రీయందు భర్తృహరిని కొమరులుగా కనియెను. అందు భట్టి విక్రమార్కునకు మంత్రి అయ్యెను.

చంద్రాలోకము : ఒక అలంకార శాస్త్రము..

చంద్రాశ్వుడు : నా॥ దండాశ్వుడు

చంద్రుడు : 1) ఒక గ్రహము. అత్రి కొడుకు. తల్లి అనసూయ ఇతడు నక్షత్రములకు, బ్రాహ్మణులకు ఓషధులకు, యజ్ఞములకు, తపస్సుకు అధిపతి. ఈతనికి దక్షప్రజాపతి కుమార్తెలగు అశ్విన్యాదులు,ఇరువదియేడుగురు భార్యలైరి అందు రోహిణి ప్రియభార్య వీరినే నక్షత్రములందురు. చంద్రునికి బృహస్పతి భార్య అగు తారయందు బుధుడు పుట్టెను. ఇందుడు. సోముడు, ఇత్యాదులు చంద్రునకు నామాంతరములు. చంద్రుడు సముద్రమథన మప్పుడు పాలసముద్రమునందు పుట్టెననియు పురాణములు చెప్పుచున్నవి (ఇది కల్పభేదము వలన కలిగినదని కొందరు చెప్పెదరు. మఱియు యితనియందు కుందేలు వున్నది అనియును, జింక వున్నదనియును కావ్యముల యందు వర్ణింపబడుటచేత ఇతనికి శశాంకుడు, మృగాంకుడు, అను నామములును కలవు. అమృత కిరణుడు అగుటచే ఈతని కిరణములను దేవతలు పానము చేయుదురు కనుక విధుడు అనియు అనబడును. అందరు భార్యలందును సమముగా ప్రవర్తింపక రోహిణియందు మాత్రము

ప్రీతిగలవాడయినందున తక్షుడు ఇతనికి క్షయరోగము కలుగుగాక యని శపించెను. (మార్కం) (వరాహ)

చంపానగరము : అంగదేశపు రాజయిన చంపునిచే నిర్మింపబడిన పట్టణము. ఇది అంగదేశమునకు రాజధానిగా నుండెను

చంపుడు : ఇ॥ 1) హరితుని కొడుకు; సుదేవుని తండ్రి. 2) అం॥ పృథులాక్షుని కొడుకు. చంపా నగరమును నిర్మించిన రాజు.

చక్రవాళము : లోకాలోక పర్వతము. ఇది చక్రాకారముగా భూమిని చుట్టివుండును కనుక దీనికీ నామము కలిగెను.

చక్రసమీరదైత్యుడు: చూ॥ తృణావర్తుడు.

చతురంగుడు : అం॥ రోమపాదుని కొడుకు.

చమసోద్భేదము : ఒక తీర్థము.

చర్మణ్వతి : ఒకనది. ఇది వింధ్యపర్వతమున ఉత్పత్తి అయి, ఉత్తరవాహిని అగుచు, యమునయందు, సంగమము అవును. (భార)

చక్షుర్నది : గంగతో కలియు ఒకనది.

చక్షుర్మనువు : సర్వతేజస్సుయొక్క కొడుకు. ఇతడు స్వాయంభువమనువు వంశస్థుడు తల్లి ఆకూతి. భార్య నడ్వల. కొడుకులు పురువు, కుత్సుడు, త్రితుసుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, రుతుడు. వ్రతుడు, అగ్నిష్టోముడు అతిరాత్రుడు, సుద్యుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అనువారు పన్నిద్దరు. ఇందు కడపటి కొడుకయిన ఉల్ముకుడు అంగుని తండ్రి.

చక్షువు : యయాతి పౌత్రుడు. తండ్రి అనువు.

## చా

చాణూరుడు : కంసుని భటుడగు మల్లుడు. వీడు మిక్కిలి శూరుడు. కృష్ణుడు వ్రేపల్లెనుండి మధురానగరమునకు వచ్చినప్పుడు కంసుని పంపున అతని యెదిరించి మల్లయుద్ధముచేసి అతనిచేత చంపబడెను. (భాగ)

చాముండేశ్వరి : వింధ్యవాసిని అయిన పరాశక్తి. ఈమె మైసూరుకు సమీపమున కొండ యందు ప్రతిష్ఠింపబడివుండును. చూ॥ కౌశికిదేవి.

చారణులు : దేవతాభేదము.

చారుపదుడు, చారువు: పు॥ మనస్వ్యిని కొడుకు.

చార్వాకము : ఒక మతము. ఈ మతస్థులు ఇంద్రియ గోచరములైన ప్రత్యక్ష విషయములు తప్ప తక్కిన వానిని నమ్మరు. సర్వము స్వభావసిద్ధములనియు దైవములేదనియు వారు వాదింతురు ఇట్టివే నాస్తిక మతములు.

చార్వాకుడు : 1) దుర్యోధనునికి మిత్రుడగు ఒకరాక్షసుడు వీడు ధర్మరాజు కౌరవులను నాశముచేసి కృతకృత్యుడై పట్టాభిషేకము చేసికొను కాలమున, రుషివేషముతో వచ్చి దానికి విఘ్నముచేయ పూని ఋషుల కోపదృష్టులచే నశించెను 2) చార్వాక మతమును స్థాపించిన వాడు. (భాగ)

చాక్షుసుడు : ఒకమనువు. విశ్వకర్మ కొడుకని శ్రీ మద్భాగవతమునందు చెప్పి వున్నది.

## చి

చిత్రకుడు : ఒక యాదవుడు. వృష్ణివంశమున జనించినవాడు (పృశ్నియొక్క రెండవ కొడుకు I

చిత్రకూటము : ఒకానొక కొండ. ఇది యిప్పుడు బండల్లండు అని చెప్పబడు దేశమునందు వున్నది. వాల్మీకియొక్క ఆశ్రమమిందుండెను. రాముడరణ్యవాసము నకుపోవునపుడిందుకొన్ని మాసములు నివసించెను. ఇది శృంగిబేరపురమునకు నిర్రృతి దిశయందుండెను. (రామా)

చిత్రకేతుడు : (1) య॥ వసుదేవుని తమ్ముడైన దేవభాగుని పెద్దకొడుకు. (2) శూరసేన దేశపురాజు. ఇతడు సంతానములేకయుండి చిరకాలమునకు ఒక పుత్రుని పడసెను. ఆ పుత్రుడు (తనమారుదల్లులు విషముపెట్టి చంపగా) బాల్యము ననే చచ్చినందున చిత్రకేతుడు, పుత్రశోకమును సహింపలేక కడుదుఃఖితుడై విలపించుచుండెను. అపుడు నారదుడును, అంగిరసుడునువచ్చి అతనికి జ్ఞానోప

దేశముచేసి పోయిరి. అంతట అతడు తెలివినొంది జ్ఞానవంతుడై దేహము వదలి దేవత్వమును వహించి విద్యాధరాధిపతి అయి ఒకప్పుడు కైలాసమునకుపోయి అచ్చట పార్వతితో కూడుకొనివుండు శివునిచూచి జగత్కర్తలు అయినవారుకూడ యిట్లు మిథునరూపముగా వుందురా అని పార్వతీదేవి వినునట్లు పలికెను. అందుల కామె కోపించి అతనిని రాక్షసుడగునట్లు శపియించెను. అంత అతడు వృత్రాసుర డుగా పుట్టి ఇంద్రునిచే చంపబడి మోక్షమును పొందెను. (భాగ)

**చిత్రగుప్తుడు** : యమునియొద్దనుండు గణికుడు. ఇతడు మనుజులయొక్క నిత్య కృత్యములను ఎప్పటికప్పుడు వ్రాయుచుండును. కనుక వారువారుచేసిన కృత్యము లను వీనిలెక్కప్రకారము విచారించి యముడు యెల్లవారిని దండించుచు ఖండించు చుండును.

**చిత్రరథుడు** : (1) ఒక గంధర్వుడు. చూ॥ మూడవ కౌశికుడు. (2) య॥ భేరుశంఖుని పుత్రుడు. శశిబిందుని తండ్రి. (3) ఆ॥ దివిరథుని కొడుకు. (4) దుర్యోధనుని తమ్ముడు.

**చిత్రరేఖ** : (1) బాణాసురుని మంత్రియైన కబంధుని కూతురు. ఉషకు చెలికత్తె. ఈమె చిత్రములు వ్రాయుటయందు మిగులనేర్పరి. కనుక ఈ పేరు పొందెను. (2) నా॥ చిత్రాదేవి. (భార)

**చిత్రవాహనుడు:** మణలూరుపురపుదేశపు రాజు. అర్జునుని భార్యయైన చిత్రాంగద యొక్క తండ్రి. బభ్రువాహనుని మాతామహుడు.

**చిత్రసేనుడు** : య॥ ఒకగంధరుడు: అర్జునునికి స్నేహితుడు. పాండవులు ద్వైత వనమునవుండు సమయమున దుర్యోధనాదులు. వారికి తమఐశ్వర్యముచూపి పరిహ సింపదలచి ఘోషయాత్ర నెపమున ఆవనమునకువచ్చి పాండవులు అచ్చట సరస్సు గట్టున సంధ్యాస్కంధము అను యజ్ఞము చేయుచుండగా దానియావలి గట్టున గుడారములు పన్నించుచుండిరి. అప్పుడు చిత్రసేనుని దూతలువచ్చి ఈ సరోవరము మారాజునకు క్రీడార్థం కల్పింపబడినది. మీరు ఇచట నిలువక తొలగిపొండు అనగా వారు మాటవినక ఈ గంధర్వునిచేత తమ ఆడువారితోగూడ పట్టుబడిరి. అప్పుడు ధర్మరాజు భీమార్జున నకుల సహదేవులపంపి వారినివిడిపిం చెను. (2) దుర్యోధనుని తమ్ములలో ఒకడు. (3) కర్ణుని కొడుకు. వీడు నకు

లునిచేత చంపబడెను. (4) నరిష్యంతుని కొడుకులలో ఒకడు. (5) జరాసంధుని మిత్రుడు. చూ॥ నా॥ డిచికుడు. (భార)

చిత్రాంగద : అర్జునుని భార్య. చిత్రవాహనుని కూతురు. కొడుకు బభ్రువాహనుడు. (భార)

చిత్రాంగదుడు: (1) ఒకానొక గంధర్వుడు. (2) విచిత్రవీర్యుని అన్న. ధృతరాష్ట్రుని పెదతండ్రి. ఇతడు బాల్యముననే తనపేరుగల గంధర్వునిచేత చంపబడెను. (3) దుర్యోధనుని తమ్ములలో ఒకడు. (భార)

చిత్రాంగి : రాజరాజనరేంద్రుని భోగస్త్రీ. అతి దుర్మార్గురాలు. కనుక లోకులు సాధారణముగా దుష్టలైన స్త్రీలను చిత్రాంగి అని చెప్పి నిందింతురు.

చిత్రాదేవి : కుబేరుని భార్య. ఈమెను చిత్రరేఖ అని యందురు.

చిత్రాయుధుడు : ఒక గంధర్వుడు.

చిత్రోపల : ఋక్షపర్వతమునందుండి వెలువడెడి ఒకనది.

చిదంబరము : ఒకదివ్యక్షేత్రము. పంచలింగములలో ఒకటి అగు ఆకాశలింగము ఇచట మూర్తీభవించి ఉంటెను.

చిన్నయసూరి (పరవస్తు) : ఒకానొక అధునిక పండితుడు. ఈయనచే రచింపబడిన నీతిచంద్రికయను వచన కావ్యమొకటి కలదు. అది ప్రాచీన కవితలమాడ్కి మిక్కిలి ప్రౌఢముగాను లక్ష్యములకు ముఖ్యలక్షణముగాను చక్కని ప్రయోగములు కలదిగాను ఉన్నది. ఈయన తెనుగునకు ఒకవ్యాకరణము రచియించెను. అది బాలవ్యాకరణము అను పేరిచే ఇప్పటి విద్యార్థులకు మిక్కిలి ఉపకారకముగా వున్నది.

చిరకారి : ఋ॥ మేధానిథి కొడుకు. ఒకప్పుడు ఇతనితండ్రి తనపత్నిపై కోపించి ఆమెను చంపుము అని చెప్పగా ఇతడేపనియును చిరవిచారముతో చేయును కాన, ఆపనిని అప్పుడే నెరవేర్పక కొంతసేపు యోచించు చుండెను. ఇంతలో మేధానిథి కోపముచల్లారి ఆ కర్మమును నిలిపి కొడుకుయొక్క చిరకారి తను సంస్తుతించెను. కనుక ఇతనికి ఈ పేరు కలిగెను. (భార)

చిరాయువు : నా॥ శతాయువు. పురూరవుని కొడుకు.

## చూ

చూళి : రు॥ బ్రహ్మ దత్తుని తండ్రి. (రామా)

## చే

చేది : య॥ విదర్భుని మూడవ కొడుకగు రోమపాదుని వంశస్థుడగు పుశికుని కొడుకు. ఈతని వంశము చేదివంశమనియు ఇతడేలిన దేశము చేదిదేశమనియు చెప్పబడును.

చేదిషుడు : కు॥ ఉపరిచర వసువుయొక్క కడపటి కొడుకు.

## చై

చైతన్యులు : వీరు లింగధారులవలె వర్ణాశ్రమ ధర్మముల నిరాకరింతురు. వీరికి భక్తి ప్రధానము. వీరు విష్ణువును పూజింతురు. చూ॥ చార్వాకము

చైత్రరథము : కుబేరుని ఉద్యాన వనము. (భార)

చైద్యులు : యాదవులలో ఒకతెగవారు. విదర్భుని పుత్రుడగు రోమపాదుని వంశస్థుడైన చేది అనువానియందు కలిగినవారు కనుక వీరికి ఆ పేరు వచ్చెను.

## చో

చోరుడు : ఒకానొక సంస్కృతకవి. నా॥ బిల్హణుడు.

చోళదేశము : చోళుడు ఏలిన దేశము. దీనికి రాజధాని కాంచీపురము.

చోళుడు : దిష్యంతుని పౌత్రుడు అయిన ఆశ్రితుని కొడుకు. ఇతడేలిన దేశము చోళదేశమనబడును.

## చ్య

చ్యవనుడు : (1) భృగువునకు పులోమయందు పుట్టిన పుత్రుడు. ఇతనికి సుకన్యయందు ప్రమతియు మనుకన్యకయందు ఔర్వుడును పుట్టిరి. ఈచ్యవనుని తండ్రి అగు భృగువు బ్రహ్మమానస పుత్రుడగు భృగువు కొడుకు. మఱియు యీతని పుత్రుడగు ప్రమతికి రురుడును రురునికి శునకుడును పుట్టిరి. మఱి యొక పుత్రుడగు ఔర్వునికి రుచికుడును, రుచికునకు జమదగ్నియును, జమదగ్నికి



పరశురాముడును పుట్టిరి. (2) కు॥ సుహోత్రుని కొడుకు. (3) మిత్రాయువు కొడుకు. (భార)

## జ

జంతుడు : (1) సుజన్మ కృత్తు కొడుకు (2) వృషదుని అన్న. (భార)

జంబుకుమారుడు : ర॥ శూర్పణఖ కొడుకు రావణుని మేనల్లుడు. వీని తండ్రి విద్యుజ్జిహ్వుడు. (రామా)

జంబుకేశ్వరము : తిరుచినాపల్లి, శ్రీరంగము ఈ రెంటికి మధ్యప్రదేశము నందుండు పుణ్యక్షేత్రము. ఇచ్చట అబ్లింగముండు (అప్పు + లింగము = అబ్లింగము)

జంబుమాలి : (1) ర॥ ప్రహస్తుని కొడుకు. రావణుని సేనాధిపతులలో ఒకడు. హనుమంతునిచేత అశోకవనభంగ సమయమున చంపబడెను. (రామా)

జంభారి : ఇంద్రుడు, జంభుడు, అను అసురుని చంపుటచే ఇతనికీ నామము కలిగెను. (రామా)

జంభుడు : తారకయుద్ధమునందు దేవేంద్రుని చే చంపబడిన ఒక అసురుడు.

జక్కన : ఒక ఆంధ్రకవి. ఇతడు విక్రమార్క చరిత్రము తెనుగించెను. అందు అద్భుత కథలు అనేకములు కలవు.

జగన్నాథము : ఇది పురుషోత్తము (విష్ణు) క్షేత్రము. కృష్ణుని నిర్యాణమునకు పిమ్మట ఆయన దేహమును దహనము చేయుచుండగా సముద్రము పొంగి ద్వారకా పట్టణమును ముంచెను. అపుడు ఆదేహము సంపూర్ణదగ్ధముకాక సముద్రమునందు కొట్టుకొనిపోవుచుండగా దానిని కొందరు భక్తులు దారువునందు సంపుటముచేసి ఇచట స్థాపించిరి.

జటాయువు : అనూరుని రెండవ కొడుకు. ఇతనితల్లి శ్యేని, తాతకశ్యపుడు. అవ్వవినత అన్న సంపాతి. ఇతడు పంచవటియందు శ్రీరాముని ఆశ్రమమున ఉండి సీతను రావణాసురుడు ఎత్తుకొనుపోవు కాలమున వానిని అడ్డగించి వానిచేత చంపబడెను. (రామా) (మత్స్య)

జటాసురుడు : ర॥ వీడు గంధమాదనమునందు భీమసేనునిచే చంపబడెను. (భార)

**జటిల** : జటిలుని కూతురు. ఈమె ఒకకాలమున ఏడుగురు పురుషులకు భార్యగా ఉండెను. జటిలుకుడు గౌతముని వంశస్థుడు. (భార)

**జఠరపర్వతము లు** : నీలపర్వతమునకును నిషధపర్వతమునకు నడుమ ఉండు పర్వతములు. ఇందలి జనులు జఠరులు అనబడుదురు.

**జనకుడు** : (1) చూ॥ నా॥ మిథిలుడు. (2) హ్రస్వరోముని కొడుకు. మిథిలా పట్టణమునకు రాజు. సీతాదేవి తండ్రి. ఇతడు మహాజ్ఞాని. తత్వవేత్త సంసార మును వదలకయే ముక్తి చెందెను. నా॥ ధర్మధ్వజుడు.

**జనమేజయుడు** ; (1) అ॥ పురంజయుని కొడుకు. (2) పూరువు కొడుకు. (3) కు పరీక్షితుని కొడుకు. ఉదంకుని ఉపదేశమున ఇతడు సర్పయాగము ఒనరించెను. చూ॥ పరీక్షిత్తు (భార)

**జనస్థానము** : దండకారణ్యమునందు రాముడు వాసముచేయుచుండిన పంచవటికి సమీప ప్రదేశము. ఇందు రావణాసురుని మూలబలములలో ఒకభాగము అగు రాక్షససేన ఉండెను. దానికి నాయకుడు ఖరుడు. ఇక్ష్వాకు మహారాజు. తన కుమారు లలో కడపటి వాడయిన దండుడు నీతిమాలి ప్రవర్తించుచు ఉండగా వానిని పట్టణమునుండి వెడలగొట్టెను. అంతట వాడు సాధుహింసకులగు రాక్షసులను గూడి శుక్రాచార్యులకు శిష్యుడై వింధ్యపర్వతము దగ్గర మధుమంతము అను పట్టణమునొకటి నిర్మించుకొని అందువాసముచేయుచుండి ఒకనాడు శుక్రుని ఆశ్రమ మునకు పోయి అచ్చట విహరించుచు శుక్రుని కూతురగు అరజ అనుదానిని చూచి మోహించి బలత్కారించి చెరిచెను, అది శుక్రుడువిని కోపించి అప్పుడు దండుడు ఉన్నచోట చుట్టు పండ్రెండు ఆమడలమేర మట్టివానకురియునట్లును దండుడును వానివారలును అందు అణగి నశించునట్లును శపించెను. అంతట అచ్చటి జనులం దరు వెరచి పారిపోయిరి. దండుడు తనపరివారముతోడ ఆమట్టివానయందు అణగి నశించెను. కావున ఆ చోటు దండునిపేర దండకారణ్యము అనబడెను. అట్టి జనశూన్యమగు అడవియందు ఇది జనులుండు చోటుగా ఏర్పడెను. కనుక దీనికి ఈ పేరు కలిగెను. (చూ॥ దండకారణ్యము) (రామా)

**జనార్దనుడు** ; విష్ణువునకు నామాంతరము.

**జన్మము** : జన్మము అనగా ఆత్మకు శరీరముతోడి సంబంధము ఈశ్వరుడు. జీవునికి కర్మానురూపముగా శరీరములను ఫలములను ఇచ్చుచున్నాడు. అనగా

జీవుడు పూర్వజన్మములయందుచేసిన పుణ్యకర్మములను అనుసరించి వివేకముగల మనుష్యాది జన్మములను పాపకర్మములనుఅనుసరించి వివేకము చాలని పశ్వాది శరీరములను పొందుటయేకాక ఆయాజన్మములయందును సుఖదుఃఖరూపఫలములను ఆవలస్వర్గనరకాది లోకములను పొందుచు ఉన్నాడు. బీజాంకుర న్యాయముగా ప్రవాహరూపము అగు కర్మపరంపరను నివర్తింప చేయవలయు. ఆత్మ అనాది; ఆ యాత్మకు శరీరధారణ హేతువులు అయిన కర్మములును అనాదులు: కర్మములవలన దేహము కలుగుచున్నది. దేహముచేత కర్మములు చేయబడుచున్నవి; ఈ రెంటిలో ఏదిముందో ఎఱుగబడదు; చెట్టువలన విత్తుకలుగుచున్నది; విత్తువలన చెట్టు కలుగుచున్నది; ఈ రెంటిలో ఏదిముందు తెలియబడదు. ఆలాగుననే ఆత్మ కర్మములును నిత్యములయి ఉన్నవి. కర్మములు సుఖదుఃఖ హేతువులు అగు కార్యములు. సుఖహేతువు అగు కార్యము పుణ్యకర్మము అనియు, దుఃఖ హేతువు అగు కార్యము పాపకర్మము అనియు చెప్పబడును, దుఃఖము మనకు ఎట్లు విడువతగినదో అట్లే నశ్వరమైన సుఖమును విడువతగినది. మనము కోరకయే ఎట్లు దుఃఖములు కలుగుచున్నవో అట్లు సుఖములును మనము కోరకయే పూర్వకర్మములచేత కలుగు చున్నవి పుణ్యము చేసినవాడు ఆ పుణ్యమునకు అనురూపమైన ఫలమును అనుభవించుటకుగాను జన్మము ఒక్కటి ఎత్తవలయు. కనుక శబ్దమయ వేదమార్గము అయిన కర్మఫల బోధన ప్రకారము వ్యర్థములు అగు స్వర్గాది నానాలోక సుఖములను ఇచ్చించువాడు కలలు కనుతెరగున పరిభ్రమించుచుండును. నిరవద్య సుఖనేరములను చెంచనేరడు. కాబట్టి విద్వాంసుడగువాడు నామమాత్రసారములగు భోగములలో ఎంతటి దేహనిర్వాహము సిద్ధించునో అంతియ కైకొనుచు అప్రమత్తుడయి సంసారము సుఖము అని ఎంచక ఒండు మార్గమున సిద్ధికలదేని పరిశ్రమచేయ ప్రయత్నించుచుండును.

సీ॥ పాంచభౌతికమైన భవనంబు దేహంబు పురుషుండు దీనిలో పూర్వకర్మవశమున నొకవేళ వర్తించు. దీపించు తటిమైన నొకవేళ దలగిపోవు, చెడునేని దేహంబుచెడుగాని పురుషుండు. చెడడాతనికినింత చేటులేదు. పురుషునికిని దేహపుంజంబునకు వేఱుగాని యేకత్వంబుగానరాదు. ॥గీ॥ దారువుల వెలుంగు దహనునిక్రై వడి కాయముల జరించుగాలిభంగి నాశలీలమైన నభముచాడ్పున వేఱు తెలియవలయు దేహి దేహముఁకు.

జపేశ్వరము : నైమిశారణ్యము నందలి ఒకదివ్యక్షేత్రము చూ॥ నంది.

జమదగ్ని : ఒకమహర్షి. ఇతని తండ్రి ఋచికుడు. (చూ॥ చ్యవనుడు) తల్లి గాధిరాజు కూతురగు సత్యవతి (కౌశికి) కొడుకులు రుమణ్వంతుడు, సుషేణుడు, విశ్వావసుడు, పరశురాముడు అని నలుగురు. అందు పరశురాముడు ముఖ్యుడు. జమదగ్ని అగు రుచికుడు సత్యవతిని పెండ్లాడి కన్యాకుబ్జమునందు సంతానమును కోరి తనకని ఒకచెరువును (చెరువు): హోమమునకు తగిన పక్వాన్నము) తన మామకని ఒకచెరువును కల్పించి ఆరెంటిని తన భార్యముందరపెట్టి, రాజులకు గెలువరానివాడును రాజులనెల్ల నాశముసేయువాడును అగు కొడుకు దీనివలన జనించును. ఈ చరువును మీతల్లికి ఇమ్ము. తపస్సంపత్తియు శమంబును కల సుపుత్రుడు దీనివలన పుట్టును. ఈ చరువు నీవుకైకొనుము. అని తెలియచెప్పి అతడు స్నానార్థము నదికి చనియెను. అంతట తీర్థయాత్ర చేయపోయి ఉండిన గాధి. తనభార్యతోగూడ అచ్చటికి వచ్చెను. సత్యవతి అట్లువచ్చిన తల్లిదండ్రులను చూచి సంతసించి తనపెనిమిటిచేసిన రెండు చరువులను తల్లికిచూపి వానిప్రభావము చూపెను. అందులకు ఆమెసంతోషించితనకూతుతోద తానును స్నానముచేసిశుచియై ఇదితనది, ఇదికుమార్తెది, అనుభేదము తెలియక తన చరువు కూతునకు ఇచ్చి కూతుచరువుతాను ఉపయోగించెను. సత్యవతియును ఆభేదము మరచి తల్లిఇచ్చిన దానినే పుచ్చుకొనెను. అంత ఋచికుడువచ్చి భార్యనుచూచి తన దివ్యజ్ఞానముచేత చరువులు మారుట తెలిసికొని నీవు క్షత్రియనాశకరము అగు గర్భమును దాల్చితివి అనగా ఆమె వెరచి అతని పాదములమీదబడి మీరు ఇట్లు చెప్పవచ్చునా, అని అడిగెను. అంత అతడు ఇదినీవల్లవచ్చిన తప్పుగాదు నీతల్లివలన అయిన తప్పు చరువ్యత్యాసముచేత నీకు క్రూరకర్ముడు అగు కొడుకును మీతల్లికి బ్రహ్మజ్ఞాన సంపన్నుడును తపోధనుడును అగు కొడుకును పుట్టుదురు. అని చెప్పి అందులకు ఆమె దుఃఖింపగా ఈ చరుమహిమము నీకొడుకునందు పొందక మనుమనియందుప్రవర్తిల్లెడుగాక అని అనుగ్రహించెను. అది కారణముగా పరశురాముడు భృగువంశజాతుడగు జమదగ్ని మహామునికి జనించియు క్రూరకర్ముడై చలముపట్టి రాజులనెల్ల నాశము చేసెను.

జమదగ్ని తన భార్యఅగు రేణుక అంగదేశపురాజు అగు చిత్రసేనుడు అనువాని (మనసా) మోహించి వ్యభిచరించినందున, కోపించి తనచిన్న కొడుకు అగు పరశు

రాముని చేత ఆమెను చంపించి, మరల పరశురాముడు తనతల్లిని బ్రదికింపవలెనని ప్రార్థింపగా అమెను బ్రతికించెను. (బ్రహ్మ) (భార)

**జయంతపురము** : గౌతమాశ్రమ సమీపమున నుండు ఒక పట్టణము. ఇది నిమిచే నిర్మింపబడెను.

**జయంతుడు** : (1) ఇంద్రుని పెద్దకొడుకు. ఇతడును కుబేరుని కొడుకైన నలకూబరుడును మన్మథుడును మహాసౌందర్యవంతులు అని ఎన్నబడుదురు.
(2) ధర్మునికి మరుద్వతి యందు పుట్టిన రెండవ కొడుకు.
(3) విష్ణుపరిచారకులలో ఒకడు. (4) విశ్వామిత్రుని కొడుకు.
(5) అజ్ఞాతవాసకాలమున భీమునకు సంకేతముగా పెట్టబడిన పేరు.

**జయత్సేనుడు** : (1) కు॥ సార్వభౌముని కొడుకు, (భాగ)
(2) అజ్ఞాతవాసకాలమున నకులునకు సంకేతముగా పెట్టబడినపేరు.

**జయద్బలుడు** : అజ్ఞాతవాసకాలమున సహదేవునకు సంకేతముగా పెట్టబడిన పేరు. (భార)

**జయద్రథుడు** : (1) అం॥ బృహన్మనస్సు కొడుకు. ఈతని భార్య సూతవంశస్థురాలు. కనుక ఇతని కొడుకు విజయుడును వాని వంశస్థులును సూతులు అయిరి.
(2) ధృతరాష్ట్రుని యల్లుడు. చూ॥ సైంధవుడు.
(3) అ॥ తితిక్షువు కొడుకు. (4) బా॥ బృహత్కాయుని కొడుకు విశ్వజిత్తుయొక్క తండ్రి (భార)

**జయధ్వజుడు** : య॥ కార్తవీర్యార్జునుని పెద్దకొడుకు. తాళజంఘుని తండ్రి.

**జయవిజయులు** : వైకుంఠ ద్వారపాలకులు. వీరు ఒకప్పుడు శిశువేషములుదాల్చి వచ్చిన సనకసనందనులను వైకుంఠము లోపలికి పోనీక అడ్డగింపగా, వారు కోపించి వీరిని క్రూరరాక్షసులగుడు అని శపించిరి. అది కారణముగ వీరు హిరణ్యాక్షహిరణ్యకశిపులు అన ప్రథమమున దితికి జనించిరి. పిదప రావణ కుంభకర్ణులు అన రెండవ జన్మమున కైకసికి పుత్రులైరి. శిశుపాల దంతవక్త్రులు అన మూడవ జన్మమున దమఘోషునకు స్వాతియందు పుట్టిరి. వీరిని ప్రథమ జన్మమున వరాహనారసింహావతారములను, ద్వితీయ జన్మమున రామావతారమునను, తృతీయజన్మమున కృష్ణావతారమునను విష్ణువు చంపెను. అంతట వీరు విష్ణుసాయుజ్యమును పొందిరి. (భాగ)

జయుడు : (1) య॥ సాత్యకి కొడుకు. (2) వసుదేవుని తమ్ముడు అగు అనకుని కొడుకు. (3) మి॥ సుశ్రుతుని కొడుకు. (4) అజ్ఞాతవాసమున ధర్మరాజు సంకేతముగా పెట్టుకొన్న పేరు. (భార)

జయులు : కల్పాది యందు సృజింపబడిన ద్వాదశ దేవఋషులు. ప్రతిమన్వంతరమునను దేవతలుగా పుట్టుదురు. చూ॥ ఆదిత్యులు.

జరత్కారుడు : యాయావరవంశమునందు జనించిన ఒక బ్రహ్మర్షి. ఇతని భార్య వాసుకి చెల్లెలైన జరత్కారువు. కొడుకు అస్తీకుడు. ఈయన బహుదినములు బ్రహ్మ చర్యాశ్రమమున, ఉండి పుత్రసంతానము పడయక పోగా ఇతని పితృదేవతలు ఒక అవురు గంటె తపుకు అవలంబముగా తలక్రిందుగా వ్రేలుచు ఇతనికి కనబడిరి. వారిని చూచినంతట సంతాన వాంఛపుట్టి తన పేరుగల కన్యక కావలెనని విచారించి జరత్కారువును వివాహము చేసికొనెను. [(స్కాం) (భార)]

జరత్కారువు : కద్రువకూతురు. వాసుకి చెలియలు. జరత్కారుని భార్య. ఆస్తీకుని తల్లి. [(స్కాం) (భార)]

జరాసంధుడు : కు॥ మగధదేశపురాజు. ఉపరిచర వసువు కొడుకు ఐన బృహద్రథుని పుత్రుడు. వీనికొడుకు సహదేవుడు. పట్టణము గిరివ్రజము. బృహద్రథుడు చిరకాలము తనకు పుత్రులు కలుగక యుండగా, తపస్సుచేసి పుత్రులను పడయగోరి రాజ్యమును మంత్రి అధీనముచేసి ఒక అడవికి పోయి అచట తపస్సుచేయుచు ఉండిన చండ కౌశికుడు అను మునిని ఆశ్రయించి సేవచేయుచుండెను. కొంతకాలమునకు ఆ ముని ఇతని యందు అనుగ్రహముకలవాడై నీవు ఏమి కోరివచ్చి నాకు పరిచర్య చేయుచు ఉన్నావు అని అడిగి ఇతని అభిప్రాయము తెలిసికొని ఒక మామిడిపండును అభిమంత్రించి యిచ్చి దీనిని నీభార్యకు ఋతుకాలమున భుజింప ఇచ్చితివేని నీకు మహాబలపరాక్రమ సంపన్నుడగు కొడుకు గల్గును పొమ్ము అని చెప్పిపంపెను. అందులకు బృహద్రథుడు సంతోషించి ఆ పండుతెచ్చి తన పెద్ద భార్యకు ఇచ్చెను. ఆమె పెనిమిటివలన దాని మహిమ తెలిసికొని తనకు మాత్రము కాక తన సవతికి సంతానము కలుగవలయును అను తలపున సగముపండు తాను భుజించి సగముపండు తన సవతికి ఇచ్చెను, అంతట ఇరువురును గర్భము ధరించి సగము దేహము ఒకరును. తక్కిన సగము దేహము మఱియొకరును ప్రసవించిరి. అప్పుడు దాదులు ఆ రెండు ఖండములును ఊరిముందరి చదుకమున వైచివచ్చిరి.

అంతట ఆ ప్రదేశమును ఆశ్రయించి ఉండిన జర అను రాక్షసి ఆహారార్థిని అయి ఆ రెండు ఖండములును ఒకటిగా చేర్చి ఎత్తుకొని పో పోగా అవి ఒకటిగా అతుకు కొని బాలుడై ఎత్తరాని భారమున ఏడువ సాగెను. అందులకు అది ఆశ్చర్యపడి బృహద్రథునకు ఆ సమాచారమును తెలుపగా అతడు వానిని ఎత్తుకొని పోయి జరచే సంధింపబడినవాడు కావున జరా సంధుడు అనుపేరు పెట్టి పెంచుకొనెను. అట్టి జరా సంధుడు తన అల్లుడయిన కంసుని కృష్ణుడు చంపెను అని అతని యెడ విరోధించి పదునెనిమిదిమాఱులు మధురాపురము మీద దండెత్తి జయము కొనియెను. పిమ్మట ధర్మరాజు రాజసూయ యాగముచేయ యత్నించినప్పుడు కృష్ణుడు భీమ సేనునిచే వీనిని చంపించెను. వీడు విప్రచిత్తి వంశమున జనించినవాడు.

[(భార) (భాగ)]

జరిత : మందపాలుని భార్య. శార్ఙజాతి స్త్రీ.

జలపద : ఒక అప్సరస. (భార)

జహ్నువు : (1) అమవసు వంశస్థుడైన సుహోత్రుని కొడుకు. ఇతడు తన యజ్ఞవాటమున గంగప్రవేశించినప్పుడు దానిని పానముచేసి భగీరథుని ప్రార్థనచే మరల తన చెవిగుండ వెడల విడిచెను. కనుక గంగకు జాహ్నవి అను నామము కలిగెను. ఈతని కొడుకు సుమంత్రుడు. (2) కురువుయొక్క మూడవ కొడుకు.

(బ్రహ్మ) (భాగ)

## జా

జాంబవంతుడు : బ్రహ్మపుత్రుడైన భల్లూకరాజు. సుగ్రీవుని మంత్రి. ఇతఁడు శ్రీరాముఁడు రావణునితో యుద్ధముచేయు కాలమున ఆతనికి సహాయపడియెను.

[(రామా) (భాగ)]

జాంబవతి : జాంబవంతుని కూతురు. కృష్ణుని అష్టభార్యలలో ఒకతె. ఈమె కొమరుఁడు సాంబుఁడు.

జాజలి : ఋ॥ ఇతఁడు తపోనిష్ఠ నుండగా ఇతని జడలయందు పిచ్చికలు గూడుకావించుకొని పిల్లలతోకూడ వసించియుండెను. చూ॥ తులాధారుఁడు.

(భార)

జాతకర్ణి : ఇతఁడు శాకల్యుని శిష్యుఁడు.

జాతవేదుఁడు : ఆహవనీయాది రూపుఁడు అయిన అగ్ని. చూ॥ పురూరవుఁడు.

జాబాలి : (1) రు॥ ఒకనైయాయికుఁడు శ్రీరాముని కాలమున ఉండెను. ఇతఁడు నాస్తికుఁడు. (2) రు॥ జాతకర్ణి శిష్యుఁడు (రామా)

జామదగ్న్యుఁడు : చూ॥ పరశురాముఁడు,

## జీ

జీమూతవాహనుడు: ఒకానొక ఖేచరుఁడు (ఇతఁడు తనదేహమును గరుత్మంతునికి ఆహారముగా ఇచ్చి ఒకనాగకుమారుని బ్రతికించెను. (క.స.సా)

జీమూతుడు : య॥ వ్యోముని కొడుకు.

జీవలుడు : ఋతుపర్ణుని గుఱ్ఱపువాడు. (భార)

## జై

జైనులు : ఒకానొక మతస్థులు వీరువేదములు ఈశ్వర ప్రోక్తములు అని కాని, వేదములయందు చెప్పఁబడినవి అన్నియు సత్యములు అని కాని, నమ్మరు, జీవహింస ఏమాత్రమున్ను చేయకూడదు. అనుట వీరి ముఖ్యసిద్ధాంతము. అందు చేతనే రాత్రులయందు వీరుభోజనము చేయరు. మఱియు శ్వేతాంబరులు అనియు దిగంబరులుఅనియు జైనులు ఇరుతెరగులుగా ఉందురు.

జైమిని : రు॥ వ్యాసశిష్యులలో ఒకఁడు. ఇతఁడు సామవేదాధ్యాపకుఁడు. ఒకానొకప్పుడు ఇతఁడు తనకుగల సందేహములను కొన్నింటినితీర్ప మార్కండేయ మహామునిని ప్రార్థింపగా, అతఁడు ధర్మపక్షుల వృత్తాంతముచెప్పి ఆ పక్షుల మూలముగా అతఁడు అడిగిన ప్రశ్నలకు ఉత్తరము చెప్పించెను. ఆ ధర్మపక్షుల చేత చెప్పఁబడినదే మార్కండేయ పురాణము. ఇతనిచే ఒకభారతము చెప్పఁబడెను. అది అశ్వమేధపర్వము మాత్రమే లోకమున కానఁబడుచు ఉన్నది. (భార)

## జ్ఞా

జ్ఞానప్రసూనాంబ : పరాశక్తి యవతారము అగు కాళహస్తీశ్వరుని భార్య.

## జ్యా

జ్యామఘుఁడు / జ్యామఘుఁడు : య॥ రుచికుని కొడుకు. విదర్భుని తండ్రి. ఇతఁడు తన భార్యకు మిగుల వెఱచి వుండెను. (బ్రహ్మ)

జ్యేష్ఠాదేవి : వరుణు భార్యలలో ఒకతె. ఈమె ధాతృవిధాతృలతో గూడ పుట్టింపఁ

బడిన బ్రహ్మమానస పుత్రిక. ఈమె చెలియలు లక్ష్మి. ఈమె వరుణుని వలన అధర్ముఁడు అను సుతుని పడసెను. ఈ జ్యేష్ఠాదేవినే కాళికాదేవి అనియు అందురు.

**జ్యోతిష్మంతుడు** : ప్రియవ్రతుని కొడుకులలో ఒకఁడు. ఇతఁడు కుశద్వీపమునకు రాజు. ఇతని కొడుకులు ఏడుగురు. (బ్రహ్మ)

## ఝ

**ఝర్ఝరుడు** : హిరణ్యాక్షుని కొడుకు.

## డి

**డిచికుఁడు** : నా॥ చిత్రసేనుఁడు. జరాసంధుని చెలికాఁడు. హంసుని సహోదరుఁడు (పాఠాంతరము డిభకుఁడు) వీఁడును హంసుఁడును తపమున శివునిమెప్పించి ఆయుధములచేత చావులేకుండ వరము పడసి జరాసంధునికి సహాయులై లోకములోని రాజులనెల్ల హింసించుచుండగా, కృష్ణుఁడు వారితో తనకు యుద్ధము పొసగినప్పుడు వారు ఒకనిని ఒకడు ఎడబాసి యాదవసేనలతో పోరాడుచుండు సమయమునందు డిచికుఁడు చచ్చెను అని హంసునకును హంసుఁడు చచ్చెను అని డిచికునకును చెప్పించెను. అంతట వారు పరస్పర స్నేహాతిశయముచేత మనోవ్యథనొంది ప్రాణములు విడిచిరి. (ఉ.హ (భార)

## త

**తంత్రీపాలుడు** : అజ్ఞాతవాసకాలమున గోపవేషమును ధరించిన సహదేవుఁడు పెట్టుకొనిన పేరు. (భార)

**తపతి** : సంవరుణుని భార్య. కురువుయొక్క తల్లి. సూర్యుని కూతురు. (భార)

**తప్తకుంభము** : ఒకనరకము. ఇందు సలసల మసలు తైలముచే నిండిన కుండలు మెండుగా ఉండును. పాతకులు ఆ కుంభములందు అధోముఖులుగా త్రోయఁబడుదురు. అపుడుఁ వారి శరీరములు కరఁగి ముద్దలు అగును. వానిని అచటి గ్రద్దలు ఎత్తి శిమిశిమా అను యంత్రములపై వైచును. అంతట వారలు మరల యాతనా, ధారులు అయ్యెదరు.

**తపుఁడు** : అంగిరసుని సంతతి వారగు కాశ్యపుఁడు వాసిష్ఠుఁడు ప్రాణుఁడు, అంగిరసుఁడు చ్యవనుఁడు అను ఏవురకును పుట్టిన పాంచజన్యుఁడు అను అగ్ని.

తమస : ఋక్షపర్వతమునందు ఉత్పత్తి అగు ఒకనది,

తమస్సు : ఒక నరకము. ఇది మహా రౌరవసమాన విస్తీర్ణమును శీతస్వభావ మును అంధకారబంధురమును అయి ఉండును. దీనిని అనుభవించు హీనుల యొక్క ఇడుములు కడు బెడిదములయి వుండును.

తర్పణము : ఇది ఒక శ్రాద్ధాంగము. జలమువిడిచి పితృదేవతలను తృప్తి పొందించుట.

తలాతలము : ఒక అధోలోకము. ఇందుగులక తాళ్లనిండుకొని యుండును. దీనిని కాలనేమి మొదలైన దానవులు ఏలుదురు.

తలుఁడు : శలుని తమ్ముఁడు. చూ॥ శలుఁడు.

తక్షకుఁడు : (1) వాసుకి తమ్ముఁడు. కద్రువ కొడుకు. వీడు పరీక్షిత్తును కఱచి చంపెను అను నెపముచేత జనమేజయుఁడు సర్పయాగముచేయ ప్రయత్నిం చెను. భోగవతి యందు వాసుకుని జయించి తక్షకుని భార్యను రావణుఁడు యెత్తి కొని పోయినట్లు చెప్పుదురు. (2) శ్రీరాముల తమ్ముడైన భరతుని జ్యేష్ఠపుత్రుఁడు (3) వృకుని పుత్రుడు. [(భార) (రామా)]

తక్షశిల : భరతుని పెద్దకొమారుఁడగు తక్షకునిచే గాంధార దేశమున నిర్మింపబడిన పట్టణము.

తక్షుఁడు : య॥ వసుదేవుని తమ్ముఁడు అగు వృకుని జ్యేష్ఠపుత్రుఁడు. (భార)

## తా

తాటక : ఒకరాక్షసస్త్రీ. మారీచ సుబాహువుల తల్లి. కడు క్రూరురాలు. రాముఁడు విశ్వామిత్రుని యాగమును కాచుటకు పోవునపుఁడు మధ్యేమార్గమున రాక్షసిని చంపెను. సుకేతుఁడు అను యక్షునికూతుఁరు. దీనికి వేయి యేనుఁగుల బలముకలదు, దీని మగడు సుందుడు అను యక్షుఁడు. ఇది భర్తృ మరణానంత రము ఒకనాఁడు అగస్త్యాశ్రమమునకు పోయి అతనిని బెదరింప పోవ అతఁడు దీనిని దీని సుతులు అగు మారీచ సుబాహులను రాక్షసులు అగునటుల శపించెను. (రామా)

తాపత్యులు : తపతి వంశమున పుట్టినవారు. కౌరవ పాండవులు.

తామసుఁడు : నాలవమనువు. ఇతని తండ్రి సురాష్ట్రుఁడు. తల్లిఉత్పలావతి. భాగవతమున ఇతఁడు ప్రియవ్రతుని సుతుఁడు అని చెప్పఁబడిఉన్నది. (మార్కం)

తామ్ర : దక్షప్రజాపతి కూతుఁరు కశ్యపుని భార్య.

తామ్రపర్ణి : (1) అంజనము అను దిగ్గజముయొక్క భార్య. (2) దక్షిణదేశము నందలి ఒకనది. దీనియందు ముత్యపుచిప్పలు ఉండును.

తామ్రలిప్తి : గంగానది సముద్రముతో సంగమము అగుతావున ఉండు ఒక పట్టణము.

తామ్రుఁడు : ద॥ మురాసురుని కొడుకు, కృష్ణునిచే చంపఁబడెను.

తార : (1) ఒక అప్సరస (2) బృహస్పతి భార్య. ఈమెకు చంద్రుని వలన బుధుఁడు అను కొడుకు పుట్టెను. (3) తారుని కూతుఁరు వాలిభార్య అంగదుని తల్లి. వాలి మరణానంతరము వాలితమ్ముఁడు అగు సుగ్రీవుఁడు ఈమెను పరిగ్రహించెను. (భాగ) (రామా)

తారకజిత్తు : చూ॥ కుమారస్వామి

తారకుఁడు : (1) ది ఒకానొక రాక్షసుఁడు. తండ్రి వజ్రాంగుఁడు. తల్లి వజ్రాంగి. వీఁడు బ్రహ్మఁగూర్చి మహాతపము ఆచరించి తాను ఇతరులచేత అవధ్యుఁడు అగునట్లు వరమువేడెను. అపుఁడు బ్రహ్మ ఎవ్వారిచేతను చావులేక వరము ఇచ్చుటకు సమ్మతిలేక ఏడుదినముల బాలకునిచేత మాత్రము చచ్చునట్లును తక్కిన వారిచే చావక ఉండునట్లును అనతిచ్చి అంతర్హితుఁడయ్యెను. కనుక వాఁడు కడపట ఏడుదినముల బిడ్డఁడు అయిన కుమారస్వామిచే చంపఁబడెను. (శివ)(స్కాం) (2) దనువు పుత్రుఁడు , (3) హిరణ్యాక్షుని కొడుకు నా। కాలనాభుఁడు.

తారుఁడు : వాలి సుగ్రీవుల మామ. తారతండ్రి. బృహస్పతి కొమారుఁడు. ఇతఁడు సర్వ వానరులలో మిగులబుద్ధిమంతుండు.

తార్క్షి : కందరునికి దమనిక యందు పుట్టిన పక్షిస్త్రీ. వపుస్సు అను అప్సరస దుర్వాస మహర్షియొక్క తపస్సునకుభంగము చేయపోయి ఆయన శాపము వలన ఈ జన్మము ఎత్తెను. ఇది ధర్మపక్షులతల్లి. (మార్కం)

తార్క్ష్యుఁడు : (1) కశ్యపునకు నామాంతరము (2) రు॥ ఇతని ఆశ్రమమున ఒకనాఁడు. హైహయ వంశోద్భవుఁడయిన దుందుమారుఁడు అను రాజు వేటాడు చుండి కృష్ణాజినముకప్పుకొని ఉండిన ఇతని కొమారుని ముని అని ఎఱుఁగక మృగభ్రాంతిచే బాణప్రయోగముచేసి చంపెను. అప్పుఁడు ఇతఁడు చింతను ఒందక తన ప్రభావముచే కొడుకును పునర్జీవితునిగా చేసికొనెను. (3) గరుడునకు నామాంతరము. (4) విష్ణుపరిచారకులలో ఒకఁడు (భార)

తాళకేతుఁడు : పాతాళకేతుని తమ్ముఁడు. వీఁడు "తన అన్నను కువలయాశ్వుఁడు చంపెను" అని ఒకమాయావనమును కావించుకొని అందు ఒక సరోవరమును కల్పించి దానిఒడ్డున యజ్ఞముచేయ పోయెదను. అనునెపమున కువలయాశ్వుని కావలిఉంచి అతని కంఠహారమును కొని తాను అతని ఇంటికి పోయి "కువలయాశ్వుఁడు రాక్షసుల చేతమృతినొందెను" అని చెప్పి ఆ కంఠహారమును అతనితండ్రిచేతికి ఇయ్యఁగా కువలయాశ్వునిభార్య అగు మదాలస విని దుఃఖముచే ప్రాణము విడిచి మరల బ్రతికింపఁబడి, తన భర్తను కూడెను. (మార్కం)

తాళజంఘుఁడు : య॥ కార్తవీర్యార్జునుని పౌత్రుఁడు. ఇతని వంశజులు తాళజంఘులు అనఁబడుదురు. వీరి రాజధాని మాహిష్మతీపురము.

తాళజంఘులు : తాళజంఘుని వంశస్థులు. యాదవులలో ఒకశాఖ.

## తి

తిక్కన సోమయాజి : ఒకగొప్ప ఆంధ్రకవి. ఇతఁడు నన్నయభట్టారకుని పిమ్మట కొంతకాలమునకు భారతశేషమును తెనిఁగించెను. ఈయన భారతమును తెనిగించుటకుముందు నిర్వచనోత్తర రామాయణముఅనుపేర రామాయణము ఉత్తరకాండమునుతెనిగించెను అది తక్కిన కావ్యములవలె వచనములును పద్యములును కలసిఉండక కేవల పద్య కావ్యముగా ఉండును. ఇతని నివాస గ్రామము కర్ణాటక దేశమునందలి ఉత్తర పినాకినీ నదిగట్టున ఉండెడు నెల్లూరికి పడమట రెండుక్రోసుల దూరమునందుండు పాటూరు. ఈయన ఆరువేల నియోగి. ఈతని తండ్రి కొమ్మనామాత్యుఁడు. సహోదరులు, కార్యతిక్కన ఖడ్గతిక్కన అనువారు. కొమారుఁడు మారన. ఈయనకు కవితిక్కన అనుబిరుదు కలదు. పైచెప్పిన నెల్లూరుకి ఆ కాలమునందు అధిపతిగానుండిన మనుమసిద్ధి అను రాజు

వద్ద ఆస్థాన పండితులలో ఈయన ముఖ్యుఁడు. ఈయన, నన్నయభట్టు, ఎఱ్ఱాప్రెగడ, ఈ ముగ్గురును కవిత్రయము అనఁబడుదురు. తెలుగునందు వీరి ప్రయోగములే ముఖ్యలక్ష్యములుగా గ్రహింపబడును.

చూ॥ నన్నయ్య భట్టారకుడు

**తితిక్షుఁడు** : మహామనుని రెండవ కొడుకు

**తిమ్మన** : (1) ఒక ఆంధ్రకవి. కృష్ణదేవరాయల ఆస్థానము నందలి కవులలో ఒకఁడు. ఈయన ముక్కుతిమ్మన అనఁబడును. "ముక్కుతిమ్మనార్యు ముద్దు పలుకు" అని ఇతని కవిత మిగుల ముద్దుగా ఉండునని పేర్కొనఁబడును. ఈయన రచియించిన కావ్యము పారిజాతాపహరణము (2) మఱియొక ఆంధ్రకవి. ఈయనచే రచియింపఁబడిన కావ్యము సమీరకుమార విజయము. ఉత్తర రామాయణము ఈయనచే రచియింపఁబడి కంకంటి పాపరాజు రచియించి నట్టు గద్యము వ్రాయఁబడియెనని అందురు. ఇతనిని నంది తిమ్మన అందురు. (3) మఱియొక ఆంధ్రకవి. ఇతఁడు నిరాటంకము అగు కవితాధార కలవాఁడు. అచ్చతెనుఁగు రామాయణము నీలాసుందరీ పరిణయమును రచించినవాఁడు. అచ్చ తెనుగు కావ్యఘటన దుస్సాధ్యమయినను ఇతనికి అది సుసాధ్యము అని రచనా శైలినిపట్టి ఊహింపఁబడుచున్నది. మఱియును ఇతఁడు రసికజనమనోభిరామము రుక్మిణీపరిణయము, సింహాచల మాహాత్మ్యము, రాజశేఖర విలాసము, సారంగధర చరిత్రము సకల లక్షణ సారసంగ్రహము అను మిశ్రకావ్యములను రచియించెను. ఇతఁడు కూచిమంచి తిమ్మన అనఁబడును.

**తిమ్మరాజు** : ఒక ఆంధ్రకవి. ఇతఁడు వైష్ణవ భక్తుఁడు. వైష్ణవాగ్రేసరులగు ఆళ్వారాదుల చరిత్రములను పొందుపఱచి పరమయోగి విలాసము అనుపేర ఒక మహాకావ్యమును రచియించెను. అందలి చరిత్రములు అద్భుతములుగ ఉండును. ఇతని కొడుకు, ఈశ్వర ప్రభువు.

**తిరుపతి** : ఒకదివ్యక్షేత్రము. త్రిమతస్థులును అట్లు అంగీకరించి ఉన్నారు. ఇందు ఒకప్పుడు వైకుంఠవాసుఁడు అయిన విష్ణువు వేంకటేశ్వరుఁడు (శ్రీనివాసుడు) అను పేర సాక్షాత్కరించి ఉండెను. ఆ దేవతామూర్తిని అగస్త్యుఁడు పులస్త్యుఁడు మొదలుగాగల ఋషులు పూజించిరి అని వామన మహర్షి జనకునకు చెప్పినట్లు ఆ స్థల పురాణమునందు చెప్పఁబడి ఉన్నది.

**తిరుమలరాయలు** : కృష్ణదేవరాయల పినతండ్రి. ఈయనను తిమ్మన అనియు అందురు.

**తిలోత్తమ** : ఒక అప్సరస. [(బ్ర. వై) (పద్మ) (భార)]

## తీ

**తీర్థకారులు** : జయుని గురువులు. వీరు ఇరువది నలువురు, అందు మొదటివాఁడు ఆదినాథుఁడు.

## తు

**తుంగప్రస్థము** : రామగిరికి తూర్పున ఉండు కొండ.

**తుంబురుఁడు** : గంధర్వ గురువు. నారదతుంబురులు గొప్పగాయకులు అనిప్రసిద్ధి. (హర.వి) (రామా)

**తుర్వసువు** : యయాతికి దేవయానియందు పుట్టిన కొడుకు. తండ్రి శాపముచే (చూ॥ యయాతి) తుర్వసు వంశము వారు ధర్మాధర్మ వివేకశూన్యులైన సంకీర్ణ కిరాత దేశములకురాజులయిరి, ఈతని దుర్వసుఁడు అనియును అందురు. (భార)

**తులాధరుఁడు** : వారణాసియందుండిన ఒక వణిగ్వరుఁడు. ఇతఁడు జాజిలి అను మునికి ఉత్తమాచార ప్రకారమును ఎఱిఁగించి బ్రహ్మగీతలు చెప్పెను. (భార)

**తుళువ వంశము** : యయాతి కొడుకు అగు తుర్వసు వంశమునందు చంద్రగుప్తుఁడు అనువాఁడు జన్మించి అతఁడు శాలివాహనశకమునకు నన్నూరు సంవత్సరములకు ముందు మగధదేశమునకు రాజై ఉండెను. ఈ చంద్రగుప్తుని వంశమునకు వెనుక శూద్రవంశములు మూడు వచ్చెను. అందు కడపటిది అగు ఆంధ్రుల వంశము శాలివాహన శకము మున్నూట యేబది సంవత్సరములకు సమాప్తి చెందెను. అది తులువ వంశము అనఁబడును. ఆ వంశమున పుట్టినవాఁడే తిమ్మరాజు.

**తుషితులు** : దేవతలలో ఒకతెగవారు. సంతోషించువారు అని శబ్దార్థము. వీరు ముప్పది యార్వురు. భాగవతమున యజ్ఞునికి దక్షిణయందు పుట్టిన పన్నిద్దరు కొడుకులను తుషితులు అనిచెప్పియున్నది. వీరు తోషుడు ప్రతోషుడు, సంతోషుఁడు

భద్రుఁడు, శాంతుఁడు, నిదన్వతి, ఇధ్మకుఁడు, కవి, విభుఁడు, వహ్ని, సుదేవుఁడు, రోచనుఁడు అనువారు. (భాగ)

తుష్టిమంతుడు : య॥ కంసుని తమ్ముఁడు.

## తూ

తూశలకుడు : ర॥ చాణూర ముష్టికులతోకూడ మల్లయుద్ధమునందు కృష్ణునిచే మడసిన ఒక అసురుఁడు

## తృ

తృణబిందువు : మరుచ్చక్రవర్తి వంశస్థుడగు బుధుని కొడుకు. ఇతని కొడుకు విశాలుఁడు. (ఉ.రా)

తృణావర్తుఁడు : ర॥ కృష్ణుఁడు వ్రేపల్లెలో శిశువుగావుండునపుఁడు సుడిగాలి రూపమున వచ్చి అతనిని ఆకాశమునకు ఎత్తుకొనిపోయి అతనిచేత చంపఁబడిన ఒకదైత్యుఁడు. ఇతనికి చక్రసమీర దైత్యుఁడు అనియు పేరు కలదు. (భాగ)

## తె

తెనుఁగు : తెలుఁగు భాష చూ॥ త్రిలింగము.

తెలగనార్యుఁడు : ఒకఆంధ్రకవి. ఇతఁడు యయాతి చరిత్రము అను అచ్చతెనుఁగు కావ్యమును రచియించెను.

తెలుఁగు : ఆంధ్రభాష. ఇది త్రిలింగశబ్ద వైకృతము. చూ॥ త్రిలింగము.

## తే

తేజస్వి : అగ్యస్తుని పౌత్రుఁడు. దృఢస్యుని పుత్రుఁడు నా॥ ఇధ్మవాహనుడు (భార)

తేజోవతి : అగ్నిదేవుని పట్టణము.

## తై

తైత్తిరీయము : ఇది ఒకఉపనిషత్తు చూ॥ యాజ్ఞవల్క్యుఁడు.

## తో

తోయజగర్భుడు : చతుర్ముఖ బ్రహ్మ. ఇతఁడు కమలమునందు పుట్టెను కనుక కమలజుఁడు అనియు, కమలమును ఆసనముగా కలవాఁడు కనుక కమలాసనుఁడు అనియు చెప్పఁబడును. పద్మజుఁడు, వనజుఁడు అరవిందజుఁడు, నాళీకజన్ముఁడు, పద్మాసనుఁడు, వనజాసనుఁడు, అరవిందాసనుఁడు, నాళీకాసనుఁడు మొదలగు పేర్లు అనేకములు ఇతనికి కలవు.

## త్ర

త్రయారుణుఁడు : చూ॥ నా॥ సూర్యారుణ్యుఁడు.

త్రయ్యారుణి : పు॥ ఋషయుని కొడుకు. ఇతని వంశస్థులు బ్రాహ్మణులు అయిరి.

త్రసదస్యుడు : ఇ॥ పురుకుత్సుని కొడుకు. అనరణ్యుని తండ్రి. నా॥ వసుదుఁడు. (భార)

త్రిగర్తము : ఒకానొక దేశము. ఇది ఆర్యావర్తమునకు వాయవ్య భాగమున ఉండునది. (భార)

త్రిజట : ర॥ విభీషణుని కూతురు. సీత రావణునిచేత పట్టువడి ఉండుకాలమున ఈమె సీతకు మిగుల ఊరటమాటలుచెప్పుచుండెను. ఒకప్పుడు రావణుని నాశమునకు సూచకమైన కల ఒకటి కని రాక్షస స్త్రీలు చేయు నిర్బంధములచే మిగుల ఖిన్నురాలై ఉండిన సీతకు ఆ స్వప్నవృత్తాంతము చెప్పి శీఘ్రకాలములో రాముఁడు రావణుని నశింపఁజేసి ఆమెను తోడుకొనిపోవును అని ఈమె సమాధానపరచెను. (రామా)

త్రితుఁడు : బ్రహ్మమానస పుత్రులలో ఒకఁడు. (భార)

త్రిదివ : వారిపత్ర పర్వతమునందు ఉత్పత్తి అగు ఒక నది.

త్రిధన్వుఁడు : ఇ॥ సుమనుని కొడుకు. సూర్యారణ్యుని తండ్రి.

త్రిపురాసురుఁడు : తారకాసురుని కొడుకులు అగు కమలాక్షుఁడు, విద్యున్మాలి, తారకాక్షుఁడు అనువారు. వీరు మహత్తరమైన తపస్సుచేసి శివుని అనుగ్రహము వలన ఇనుముతోను, బంగారంతోను, వెండితోను చేయఁబడిన మూడు జంగమ

పట్టణములను పొంది లోకములను పాడుచేయుచుండిరి. అపుడు విష్ణువు ఒకపాషండుని అవతారముఎత్తి నారదుని తనకు శిష్యునిగాచేసికొని ఈ త్రిపురాసురులకు వీరి కాపులకును శివుని యందలి భక్తి తొలగుటకు తగిన విషయములు బోధించెను. అంత వీరును వీరి కాపులును శివద్వేషులు అయిరి. అందులకు శివుడు ఆగ్రహించి వీరితో యుద్ధముచేసి వీరిని చంపెను. వీరు తమ మరణానంతరము ప్రమథ గణములలో చేరిరి. (శివ)

త్రిపృష్ఠుడు : య॥ వసుదేవునికి ధృతియందు పుట్టిన కొడుకు.

త్రిమూర్తులు ; బ్రహ్మ, విష్ణువు. రుద్రుడు. ఆదిని నిర్గుణ స్వరూపుడు అయిన ఈశ్వరుడు (శుద్ధ బ్రహ్మము లేక శుద్ధచైతన్యము) "బహుస్యామ్" అని సంకల్పించి సృష్టిచేయ నుద్యమించెను. ఈ సంకల్ప స్థితియందు ఆ బ్రహ్మము ప్రకృతి పురుష స్వరూపుడగుచు సత్వరజస్తమోగుణాత్మకుడై ఉండెను. ఆ స్వరూపమునందు అతడు శబళ బ్రహ్మము లేక మాయావచ్ఛిన్న చైతన్యము అనబడెను. అది అతనికి మాయోపాధిచే అనగా ప్రకృతి సంబంధముచేత కలిగెను మాయ అన విచిత్ర సృష్టికి హేతువు; ప్రకృతి అన మహదాది వికారములకు కారణము. ఇది జ్ఞానవిరోధిగా నుండుటవలన అవిద్య అనియు చెప్పబడును. అట్టి ప్రకృతి సంబంధముగల శబళ బ్రహ్మస్వరూపమునందు (అనగా కేవల సంకల్ప స్థితియందు) సత్వరజస్తమోగుణములు మూడును సమములు అయి ఉండును. సత్వము జ్ఞానసుఖములను వానియందు ఇచ్ఛను పుట్టించుచున్నది. ఇది విష్ణురూపము అయ్యెను. రజస్సు రాగ తృష్ణలయందు సంగమమును పుట్టించుచున్నది. ఇది చతుర్ముఖ బ్రహ్మస్వరూపము అయ్యెను. తమస్సు విపరీత జ్ఞానమును నిద్రాలస్యాదులను పుట్టించుచున్నది. ఇది లయకారణము అగుటవలన రుద్ర స్వరూపము అయ్యెను. ఆ సంకల్పస్థితి వదలి ఈశ్వరుడు సృష్టికి క్రియారూపుడు కాగానే ఈ సత్వరజస్తమోగుణములకు వైషమ్యము కలిగెను. అదియే మహత్తత్వ స్వరూపము. అది సాత్వికము, రాజసము, తామసము అని మూడు విధములు కలది. ఆ స్థితియందు బ్రహ్మము సూత్రబ్రహ్మము (లేక అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము) అనబడును. ఈ స్వరూపమున అతడు నామరూపాత్మకమైన సకల ప్రపంచకమును సృజించెను. ఆ స్రష్టృసృజ్యతాదాత్మ్య స్వరూపమైన బ్రహ్మము విరాడ్రూపము అనబడును. జ్ఞానమాత్రతాదాత్మ్య స్వరూపము విష్ణుస్వరూపము

విరాడ్రూపస్థితియందు చిత్స్వరూపమైన జ్ఞానమును వ్యత్యవచ్ఛిన్న చైతన్యము అందురు. జ్ఞానశూన్యమై వికారాస్పదమైఉండు దానిని విషయావచ్ఛిన్న చైతన్యము అందురు.

అట్లు విరాట్స్వరూపుడు అయిన బ్రహ్మము వలననుండి ప్రపంచ సృష్టి కలిగెను. ఎట్లు అనిన.

(1) తమస్సృష్టి తపస్సు, మోహము, మహామోహము, తమిస్రము, అంధ తమిస్రము, ఇందుండి చేతనములేని స్థావర సృష్టి కలిగెను.

(2) తిర్యక్సృష్టి :- పశుపక్ష్యాదులు

(3) దేవసృష్టి :- తుష్టాత్ములై నిత్యానందులై కేవలసాత్వికభూతులైనవారు, ఈ సృష్టియందు పుట్టిరి. నహిదేవా అశ్నంతినపిబంతి ఏతదేవామృతందృష్ట్వాతృప్యతి" అని సాత్వికమునకు ప్రమాణము

(4) అర్వాక్సృష్టి :- తమోద్రేకకులయి దుఃఖబాహుళ్యములు కలిగి కర్మశీలురయిన మనుష్యుల సృష్టి.

(5) అనుగ్రహసృష్టి :- ఇది సాత్వికతామససమిశ్ర గుణములుకల జంతు రాశి సృష్టి

(6) కౌమారసృష్టి :- ఇది ప్రాకృతము వైకృతము అని రెండు విధములు. ఈ సృష్టియందే సనత్కుమారాదులు పుట్టినది ఈ ఆఱును, మహత్సృష్టి, పంచతన్మాత్రసృష్టి, పంచభూతేంద్రియ సృష్టి అను మూటితోచేరి తొమ్మిది సృష్టులు అగుచు ఉన్నవి. ఇది నవవిధసృష్టి వివరణము.

ఈ సత్వరజస్తమోగుణాత్మకులైన త్రిమూర్తులు తమతమ ఆశయములను ఒకరికొకరు పంచుకొనియు ఉందురు. ఆ స్థితియందు వారికి నామాంతరములు కలవు. అవి విష్ణువ్యూహము, బ్రహ్మవ్యూహము, రుద్రవ్యూహము అనబడును.

విష్ణ్వంశము : ప్రద్యుమ్నుఁడు, సంకర్షణుఁడు, అనిరుద్ధుడు

బ్రహ్మాంశము : మనువు, దక్షుఁడు, యముఁడు.

రుద్రాంశము : మృడుఁడు, భవుఁడు హరుడు.

త్రిలింగము : శ్రీశైలము, కాళేశ్వరము, ద్రాక్షారామము. ఈ మూఁడు లింగములకు నడుమ ఉండు దేశము నా॥ ఆంధ్రదేశము, ఈ దేశపుభాష తెనుఁగు, తెలుఁగు అనఁబడును,

త్రిలోచనుడు : రుద్రుడు మూడుకన్నులుగలవాఁడు అని వ్యుత్పత్త్యర్థము.

త్రివిక్రముఁడు : వామనుఁడు చూ॥ బలి.

త్రిశంకు : ఇ॥ సూర్యారణ్యుని కొడుకు. హరిశ్చంద్రుని తండ్రి. ఇతని మొదటి పేరు సత్యవ్రతుఁడు. ఇతఁడు బొందితో స్వర్గమునకు పోవలెనని వసిష్ఠుని వేఁడి, అతఁడు అది సరిపడదు అనఁగా, అతని కొమారుల చెంతకుపోయి వారిని నిర్బంధించెను. వారు తమ తండ్రిఅన్నదానికి ఇతఁడు ఉల్లంఘించినందులకై చండాలత్వము పొందునట్లు శపియించిరి. అటువెనుక విశ్వామిత్రుని ఆశ్రయించి అతఁడు తన తపోబలముచేత శరీరముతోనే దేవలోకమునకు పంపగా దేవతలచే అచ్చటనుండి తల్క్రిందుగా భూమికి పడద్రోయబడెను. అప్పుడు విశ్వామిత్రుడు వీనిని క్రిందపడకుండ నిలిపి త్రిశంకు స్వర్గము అని మఱియొక స్వర్గమును ఇంద్రుని తనతపోమాహాత్మ్యముచే సృజియింప యత్నించి దేవతలప్రార్థనచే మాను కొనెను. త్రిశంకుఁడు అట్లే నిలిచెను. ఇతనికి గురునాజ్ఞ యుల్లంఘన, చండాలత్వము క్షనిషిద్ధవస్తుభోజనము అను మూఁడు శంకువులు (శంకువు = మేకు, దోషము) సంభవించినందున త్రిశంకుఁడు అనునామము కలిగెను.

[(బహ్మ) (బాహ్మం)]

త్రిశిరసుఁడు : ఈ పేరు కలిగిన రాక్షసులు అనేకులు. అందు (1) విశ్రవసు కొడుకు. వీఁడు జనస్థానమందు ఖరునికి సహాయుడై ఉండెను. (2) రావణుని కొడుకు. హనుమంతునిచేత చంపఁబడెను. (రామా)

త్రేతాగ్నులు : పావకుఁడు, పవమానుఁడు, శుచి అని ముగ్గురు. వీరు వసిష్ఠుని శాపముచే పృథుచక్రవర్తి కొడుకు అయిన అంతర్ధానునికి కొడుకులయి పుట్టి అప్పుడే చచ్చిరి. ఆహవనీయము గార్హపత్యము దక్షిణాగ్ని అనిగృహస్థుఁడు ఆరాధింపదగిన అగ్నులు మూఁడు. (భాగ)

త్రేతాయుగము : మూడవ యుగము. దీని పరిమితి 12,96,000 సంవత్సరములు చూ॥ యుగములు.

త్ర్యంబకుఁడు : రుద్రుడు. మూడు కన్నులు కలవాఁడు అని అర్థము.

త్ర్యంశుడు : ద॥ విప్రచిత్తి కొడుకు.

# త్వ

త్వష్ట : (1) ప్రి॥ యావనుని కొడుకు.
(2) ద్వాదశాదిత్యులలో ఒకఁడు.
(3) శుక్రపుత్రుడు దైత్యగురువు.
(4) బ్రహ్మమానస పుత్రులలో ఒకఁడు. ఇతని కొమారుఁడు అగు విశ్వరూపుని చంపి ఇంద్రుఁడు బ్రహ్మహత్య సంపాదించు కొనెను.
(భార)

త్వష్ఠి : సూర్యుని భార్య అయిన సంజ్ఞాదేవి సూర్యుని వేడిమిని తాళజాలక ఛాయాదేవిని తనకు బదులుండనియమించి తానుకొన్ని దినములు పుట్టింట నుండెను. అవల కొంతకాలమునకు తండ్రి అది సరికాదు అన్నందున అతని యిల్లు వదలి ఒక ఆడుగుఱ్ఱము (బడబా) రూపమును ధరించి తిరుగుచుండెను. అంత ఒకప్పుడు సూర్యుడు సంజ్ఞాదేవి కానక త్వష్టపాలికేగి తన సతివృత్తాంతము అడిగిన అతఁడు ఆమె వేడిమి సహింపనోపక మేరుపర్వత సమీపమున ఉన్నది అని తెలుపగా ఆమె మీదిమోహముచేత తానును అశ్వమై అమెతో కలసెను. అపుడు వారికి ఇరుపురికిని అశ్వినీ దేవతలు పుట్టిరి. అనంతరము సూర్యుని అనుమతి పడసి అతని తేజమును త్వష్టతరిమెనపెట్టి అందు రాలిన రజస్సుచేత విష్ణువుకు చక్రమును శివునకు శూలమును ఇంద్రునకు వజ్రాయుధమును, చేసి ఇచ్చెను.

# ద

దండకారణ్యము : ఇక్ష్వాకు పుత్రుఁడు అగుదండుఁడు అసురకృత్యములచే జననిందితుఁడు అగుటవలన తండ్రిచే వింధ్యశైలమునకు పంపబడి అందు మధుమంతము అనుపట్టణము ఒకటి నిర్మాణముచేసికొని అసురులతో కలసి అసురగురువైన శుక్రాచార్యులకు శిష్యుడై ఆ పురమును ఏలుచు ఉండెను. ఒకనాడు అతఁడు శుక్రాచార్యుని ఆశ్రమమునకుపోయి అచ్చట తపము ఆచరించుచున్న అతనిపెద కొమార్తె అగు అరజ అను దానిని కని మోహించి అది అయుక్తముఅని ఆమె ఎంత చెప్పినను వినక బలాత్కారముగకూడి వెడలిపోయెను. పిదప దానికి శుక్రుడు మిగుల ఆగ్రహించి అదండుడు సపరివారముగ నేలపాలు అగునట్లును, అమధు

మంతము చుట్టు పీడుదినములు మట్టివాన కురియునట్లును జనశూన్యము అగునట్లును శాపము యిచ్చెను. చూ। జన స్థానము (రామా)

**దండపాణి** : కాశియందుండు ఒకదేవత

**దండాశ్వుఁడు** : ఇ॥ నా॥ దృఢాశ్వుఁడు. తండ్రి దుందుమారుడు. కొడుకు హరియశ్వుడు.

**దండి** : ఒకానొక సంస్కృతకవి. ఇతఁడు చేసిన కావ్యములలో దశకుమారచరిత్రము అను వచనకావ్యము ఒకటి మాత్రము కానఁబడుచున్నది. "దండినః పదలాలిత్యం'' అని ఇతని కవిత్వము మిక్కిలి లలితమని పేర్కొనఁబడిఉండెను.

**దండుఁడు** : (1) ఇక్ష్వాకు పుత్రుఁడు చూ॥ దండకారణ్యము. (2) ర॥ సుమాలి కొడుకు. (ఉ.రా)

**దంతఘాతఁకుడు** : హరిశ్చంద్రుని భ్రమింపచేసి భేతాపటము క్రింద చేర్చుటకై విశ్వామిత్రునిచేత సృజియింపఁబడిన ఒకరాక్షసుఁడు.

**దంతవక్త్రుడు** : వృద్ధశర్మనికి, వసుదేవుని చెలియలు ఐన శ్రుతదేవియందు పుట్టినకొడుకు. వీడును శిశుపాలుడును సనకసనందనుల శాపముచే అసురకృత్యములు కలవారుగా పుట్టిన జయ విజయలు వీడు కృష్ణునిచేత చంపబడెను. (భాగ)

**దంష్ట్రి** : శుక్రుని పుత్రుఁడు. దైత్యగురువు.

**దత్త** : జంభుని కూతురు. హిరణ్యకశిపుని భార్య (భాగ)

**దత్తాత్రేయుడు** : అత్రికి అనసూయయందు విష్ణువుయొక్క అంశమున పుట్టిన కొడుకు. చూ॥ దుర్వాసుడు, (భాగ) (మార్కం)

**దధిముఖుడు** : సుగ్రీవుని మేనమామ మధువనమునకు కావలి ఉండిన వానరుఁడు. (రామా)

**దధివాహనుడు** : అ॥ అంగుని కొడుకు.

దధీచి : ఒకానొకముని. ఇతఁడు ఇంద్రునకు తనవెన్నెముకను ఇయ్యఁగా దానితో అతఁడు నూఱుఅంచులుఁగల వజ్రాయుధమును చేసికొనెను. పరుల నిమిత్తము తనదేహమును విడిచినందున ఇతఁడు మహాదాత అని పేర్కొనబడియెను. ఇతఁడు రుద్రరహితమైన యాగముచేయకూడదు అని దక్షుని ఆక్షేపించెను, (బ్రహ్మ)

దనువు: : కశ్యపుని భార్య, దక్షప్రజాపతి కూతురు. ఈమె సంతతి వారు దానవులు అనఁబడుదురు. (భాగ)

దమనిక : ఒకానొక అప్సరస. మేనకకూతురు. సువర్ణగోత్రుడైన కందరుఁడు అను పక్షి వరుని భార్య తాక్షి తల్లి.

దమయంతి : నలుని భార్య. విదర్భరాజు భీముని కూతురు. ఈమె స్వయంవరమునందు ఇంద్రాది దేవతలను వరింపక నలుని వరించెను. అందులకు మిగుల కోపించి ఆమె పురుషుఁడు అగు నలుని అతని దాయాది అగు పుష్కలునితో జూదమాడునట్లుచేసి అతనికి అనేకములు అయిన ఇడుములు కలుగునటులచేసెను. ఈమె పతియందు అనురాగవతి అయినను అతనినిపాసి కొన్నిదినములు సేవకావృత్తిని ఉండెను, కడపట భర్తను కలసి రాజ్యము మరలచేరి సమస్త సుఖములను అనుభవించెను. (భార)

దమలిప్తులు : గంగకు పశ్చిమమున ఉండు దేశస్థులు,

దరుఁడు : య॥ అణువు కొడుకు. నా॥ అంధకుఁడు

దర్పకుఁడు : మన్మథుని నామము.

దర్మషణుఁడు : శృంజయుని రెండవ కొడుకు,

దర్శుఁడు : ధాతకు సినీవాలియందు పుట్టిన కొడుకు.

దవిద్యోతుఁడు : య॥ దుందుభి కొడుకు, నా। అభిజిత్తు.

దశకంఠుఁడు<br>దశగ్రీవుఁడు : } చూ॥ రావణుఁడు.

దశరథుఁడు : (1) ఇ॥ కల్మాషపాదుని పౌత్రుడైన మూలకుని (నారీకవముని కొడుకు. రుద్రశర్మని తండ్రి.

(2) ఇ॥ అజమహారాజు కొడుకు. ఇతనికి ప్రధాన భార్యలు కౌసల్య, సుమిత్ర కైకేయి అని ముప్వురు. ఇతఁడు చిరకాలము పుత్రులులేకఉండి పుత్రకామేష్టి అను యాగముచేసి రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు అను నలుగురు కొడుకులను పడసెను. అందు కౌసల్య పుత్రుఁడు అగు రామునకు యౌవరాజ్యాభిషేకము చేయ యత్నించిఉండు సంగతి కైకేయి ఎఱిగి తన కొడుకు అగు భరతునకు ఆ యువరాజపట్టము కట్టునట్లును రామునకు పదునాలుగు సంవత్సరములు వనవాసము ఆజ్ఞాపించునట్లును తనభర్తను అడిగెను. ఆయనకు అది సమ్మతిలేకపోయినను (పూర్వము దేవాసుర యుద్ధమునందు దేవతలకు సహాయము చేయఁబోయి శంబరాసురుఁడు అను వానితో యుద్ధముచేయునపుఁడు ఆయసురుఁడు అనేక మాయలు కావింపగా కైకేయి తాను ధవళాంగుఁడు అను మునివలన పడసిన మంత్రవిద్యచేక ఆ మాయలనెల్ల అణచివేయ అందులకు దశరథుడు మెచ్చుకొని నీకు ఏమికావలెను? అడుగుము? అనగా రెండువరములు అడిగి అవి తనకు కావలసినపుడు ఇచ్చునట్లు మాటతీసికొని యుండెను. కనుక ఆ వరములు ఇపుడు ఇమ్మనిన) దశరథుఁడు ఏమియు చెప్పనేరక ఊరకయుండెను. కైకేయి రామునితో నిన్ను మీ తండ్రి వనవాసము చేయుటకు పొమ్మనెను. అనిచెప్ప అతఁడు అట్లేచేసెను, అది కారణముగ దశరథుఁడు మృతిచెందెను.

ఈ దశరథమహారాజు ఒకప్పుడువేటాడఁబోయి, ఒకఋషి పుత్రుఁడు అంధులగు తన తల్లిదండ్రుల కొఱకు కమండలముతో తటాకమున జలము ముంచుచుండగా ఆ నీళ్ళ ముంచెడు చప్పుడువిని ఏనుగుతొండముతో నీళ్ళుత్రాగుచున్నదని నిశ్చయించి బాణమును సంధించి వేసెను. అదేటుతగిలినతోడనే ఆ ఋషిపుత్రుఁడు మృతిపొందెను. పిదప రాజు తనతప్పిదము తెలిసికొని అచ్చటికిపోయి అతనిని ఊరడించి తాను తెలియక ఇట్టిపనిచేసితినని ఆ దంపతులకు చెప్పెను. వారు పుత్రశోకము ను భరింపలేక నీవును మావలె పుత్రశోకముచే మృతిపొందుదువుగాక అని శపించి ప్రాణములు విడిచిరి 3) య॥ నవరథుని కొడుకు. 4) అ॥ చూ॥నా॥ రోమపాదుడు.

(రామా)

దశార్ణము : కాశీదేశమునకు దక్షిణమునను పడమటను ఉండు దేశము

దశార్హుడు : య॥ నిర్వృతి కొడుకు.

దక్షప్రజాపతి : (1) నవబ్రహ్మలలో (లేక ప్రజాపతులలో) ఒక్కఁడు. కొందఱు ఇతఁడు బ్రహ్మయొక్క అంగుష్ఠమునుండి పుట్టినవాడు అందురు. కొందఱు బ్రహ్మమానస పుత్రుఁడు అందురు, ఇతని భార్య ప్రసూతి. విష్ణుపురాణ ప్రకారము దక్షప్రజాపతికి కొమార్తెలు ఇరువది నలుగురు. వారిలో శ్రద్ధ లక్ష్మి ధృతి తుష్టి, పుష్టి, మేధ క్రియ, బుద్ధి లజ్జ, వపుపు, శాంతి, సిద్ధి కీర్తి ఈ పది మువ్వురు ధర్ముని భార్యలు (ధర్మద్వారములని ఎఱుగవలయును) వీరియందు ధర్మునకు పుట్టిన పుత్రులు క్రమముగా కాముఁడు, దర్పుఁడు, నియముఁడు, సంతోషుఁడు, లోభుఁడు. శ్రుతుఁడు, దండుఁడు, బోధుఁడు వినయుఁడు. వ్యవసాయుఁడు క్షేముఁడు సుఖుఁడు యశుఁడు, 2) ఇతఁడు ప్రచేతస్సులకు చంద్రుని (సోముని) కూతురు అగు మారిషయందు పుట్టిన కొడుకు. ఈయన చక్షుర్మనువు కాలమున ఉండినట్లు కొందఱు చెప్పుదురు. ఇతఁడు బ్రహ్మయాజ్ఞవడసి మైధున క్రియవలన సృష్టిచేయ ఆరంభించెను. తత్పూర్వము సంతానము దృష్టిస్పర్శేచ్ఛాదుల వలన కలుగుచుండినట్లు తెలియవచ్చుచున్నది. ఈతఁడు వీరప్రజాపతి కూతురగు అసిక్నిని భార్యగా గ్రహించి ఆమెయందు తొలుత హర్యశ్వులు అను ననేక పుత్రులను పడసెను. వారు అందరును నారదుని ఉపదేశమున ప్రజాసృష్టి యందు యిచ్ఛ ఉడిగిరి మరల శబలాశ్వులు అను ననేకులుపుత్రులను పుట్టించెను. వారలును అట్ల అయిరి. అంత దక్షుడు నారదునిమీద కోపించి అతనికి అనపత్యతయును నిరంత సంచారమును కలుగునట్లు శపించి అరువండ్రు కొమార్తలను అశిక్నియందు పుట్టించెను అందు ధర్మునికి పదుగురును, కశ్యపునికి పదమువ్వురును, చంద్రునకు ఇరువది ఏడుగురును అరిష్టానేమికి నలుగురును ఆంగిరసునకు ఇర్వురను కృశాశ్వునకు ఇరువురను బహుపుత్రునకు ఇరువురను ఇచ్చి వివాహములు చేయించెను. శ్రీమద్భాగవతమున తార్క్ష్యుఁడు అను నామాంతరము తాల్చిన కశ్యపునకు మరల నలుగురు కొమార్తలను యిచ్చినట్లు చెప్పిఉన్నది.

| ధర్ముని భార్యలు | వారి సంతతి |
|---|---|
| అరుంధతి | పృథితో చేరిన సమస్తము |
| భూమి (లేక) జామి | దుర్గభూములకు అధిష్ఠాన దేవత |
| లంఘ (లేక) లంబ | ఘోషుఁడు లేక విద్యోతుఁడు. |

| | |
|---|---|
| భానువు | భానువులు |
| మరుద్వతి | మరుత్వంతుఁడు జయంతుఁడు. |
| సంకల్ప | సంకల్పుఁడు. |
| ముహూర్త | మౌహూర్తికులు |
| సాధ్య | సాధ్యులు |
| విశ్వ | విశ్వేదేవతలు |

చంద్రుని భార్యలు అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, అశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త. చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర రేవతి అనువారు యీ యిరువది యేడు గురును నక్షత్రములు అనఁబడుదురు. కశ్యపుని పదుమువ్వురు భార్యల నామములు గూర్చి చూ॥ కశ్యపుఁడు.

తొల్లి దక్షుఁడు యాగముచేసినపుడు రుద్రునికి హవిర్భాగము ఇయ్యనందున అతనికి మరల జన్మము కలిగెను, అని అందురు,

శ్రీ మద్భాగవతమున అరుంధతిని దక్షపుత్రిగా చెప్పివుండలేదు. ఆమెకు మాతకకువుద్భవేదినిచెప్పి ఉన్నది. కుకుద్భేదికి సంకటుడును సంకటునకు కీకటుఁడును కీకటునకు దుర్గాభిమానులైన దేవతఁలును పుట్టినట్లు చెప్పిఉన్నది. మఱియు ఆమె సంతతికి స్వర్గుఁడు నంది అను నిరువురు పుట్టినట్లును సంకల్పకు కాముఁడు పుట్టినట్లును శ్రీమద్భాగవతము వలన తెలియబడుచు ఉన్నది.

[(బ్రహ్మ (బ్రహ్మకై) (భాగ) (భార)]

దక్షిణ : రుచి ప్రజాపతికి స్వాయంభువమనువు కూతురు అగుఆకూతియందు పుట్టిన కన్య ఈమె తన అన్నఅయిన యజ్ఞుని వివాహమయ్యెను. (భాగ)

## దా

దానవులు . కశ్యపునికి దనువునందు పుట్టిన వారును వారిసంతతివారును అందు ముఖ్యులు అయోముఖుఁడు ఏకచక్రుఁడు పులోముఁడు కపిలుఁడు అంధకుడు. (ఆదిదానవుడు) అరిష్టుడు అరుణి, అనుతాపకుఁడు, ద్విమూర్ధ్నులు, శంబరుఁడు, హయగ్రీవుఁవుడు విభావసుఁడు శంకు, శిరస్సు, స్వర్భానుఁడు

వృషపర్వుఁడు, విప్రచిత్తి. (ఇతనికి సింహికయందు పుట్టిన కొడుకులు రాహువు కేతువు) వాతాపి, ఇల్వలుఁడు, నముచి, రెండవ స్వర్భానుఁడు, కాలనాభుఁడు. వక్త్రయోధి, త్రంబుఁడు, శల్యుఁడు, నభుఁడు, నరకుఁడు, పులోముఁడు, ఖస్రుముఁడు రెండవ అంధకుఁడు, ధూమ్రకేతువు, విరూపాక్షుఁడు, దుర్జయుఁడు, వైశ్వానరుఁడు, రెండవతారకుఁడు,

దామగ్రంధి : అజ్ఞాతగావాస కాలమున అశ్వపాలక వేషము ధరించిన నకులుఁడుంచు కొనిన నామము. (భార)

దామోదరుడు : కృష్ణుఁడు యశోద బాల్యమునందు ఇతని నడుమున త్రాఁడువేసి రోటికి కట్టెను. కనుక ఇతనికి ఈ నామము కలిగెను (భాగ)

దారుకుఁడు : కృష్ణుని సారథి. దారకుఁడు అనియు అందురు. (భాగ)

దాశార్ణ : వింధ్యపర్వతమున ఉత్పత్తి అయిన ఉత్తరవాహిని అగు ఒక నది. యమునయందు సంగమము అగును.

దాక్షాయణి : పార్వతికి నామము దక్షుని కూతురు. అని వ్యుత్పత్త్యర్థము.

## ది

దిక్పాలకలు : చూ॥ అష్టదిక్పాలకులు.

దిగ్గజములు : చూ॥ అష్టదిగ్గజములు.

దితి ; కశ్యపుని పెద్దభార్య. దక్షప్రజాపతి కూతురు. ఈమె సుతులు దైత్యులనఁబడుదురు. (బ్రహ్మాం)

దిలీపుడు : (1) వృద్ధశర్మునికి నామము. (2) ఇ॥ అంశుమంతుని కొడుకు భగీరథుని తండ్రి. ఈతని భార్య సుదక్షిణ.

దివిరథుఁడు : అందధి వాహనుని కొడుకు.

దివోదాసుఁడు : (1) కా॥ నా॥ ద్యుమంతుఁడు. భగీరథుని కొడుకు. (2) హ॥ ముద్గలుని కొడుకు. అహల్య యొక్క అన్న. (భార)

దివ్యుఁడు : య॥ సాత్వతుని కొడుకు.

దిష్టుఁడు : ఇక్ష్వాకుని తమ్ముఁడు. ఇతని కొడుకు నాభాగుఁడు.

దిష్యంతుఁడు : దుర్యచిత్త స్వీకారపుత్రుఁడు. దుష్యంతుని తమ్ముఁడు.

## దీ

దీర్ఘతముఁడు : (1) ఉతథ్యుని కొడుకు భార్య ప్రద్వేషిని. కొడుకులు దీర్ఘతముడు జాత్యంధుడు అయినందున ఇతని భార్య లుబ్ధపుత్రి అయినను తన్ను మెచ్చక యుండెను. అందుకు ఇతఁడు అలిగి "పతివిహీనులైన భామినులతి ధనవతులయ్యుగులజలయ్యును ననలంకృతలయ్యేఁడు మాంగల్య రహితులయ్యేఁడు గృపణ వృత్తినిదియు మొదలుగా" అని శాపము ఇచ్చె. (భార)

దీర్ఘబాహుఁవు : ఖట్వాంగుని కొడుకు రఘుమహారాజు తండ్రి.

దీర్ఘాదేవి : నిబుతి భార్య.

## దు

దుంకి, దుంకి విఘ్నేశ్వరుడు : కాశియందుండు విఘ్నేశ్వరుడు.

దుందుఁడు : ఒక రక్కసుఁడు. చూ॥ దుందుమారుఁడు.

దుందుభి : (1) య॥ దరుణి కొడుకు. (2) మయుని రెండవ కొడుకు. మండోదరి సహోదరుఁడు. వాలిచే చంపబడెను. వీనిచంపి కళేబరమును వాలిపార వైచినపుఁడు దానినుండి రక్తబిందులు మతంగ మహర్షి తపముచేయుచు ఉండిన ఋష్యమూక పర్వతమున పడెను. అందుకు అతఁడు కోపగించుకొని ఆ కొండ మీదికి వాలివచ్చిన అతనికి తల సహస్ర ప్రక్కలు అగునట్లుగా శాపమిచ్చెను. (రామా) (భార)

(3) మాయావి రెండవ కొడుకు.

దుందుమారుఁడు : ఇ॥ నా॥ కువలయాశ్వుఁడు దుందుఁడు అను రాక్షసుని చంపుటచేత ఇతనికి ఈ పేరు కలిగెను.

దుర్గ : (1) వింధ్యపర్వతమునుండి వెలువడు ఒకగది.
(2) శివుని భార్య. చూ॥ నా॥ భద్రకాళి ఉమాపార్వతి.

దుర్ఘయుఁడు : దనువు పుత్రుఁడు.

దక్షముఁడు : (1) గాంధారి పౌత్రుని పుత్రుఁడు. (2) య॥ భద్రసేనుని పుత్రుడు.

దుర్మదుఁడు : య॥ ఈ పేరున వసుదేవున కిద్దరు కొడుకులుండిరి.

దుర్మర్షణుఁడు : దుర్యోధనుని తమ్ముఁడు. (భార)

దుర్ముఖుఁడు : (1· దుర్యోధనుని తమ్ముఁడు, (2) మాల్యవంతుని కొడుకు. (రామా) (భార)

దుర్యోధనుఁడు : ధృతరాష్ట్రునకు గాంధారియందు పుట్టిన నూర్గురు కొడుకులలో పెద్దవాఁడు. ఇతఁడు దుశ్శాసన కర్ణ శకునుల దుష్టవచనములువిని పాండవులతో మచ్చరముపూని భీష్మద్రోణ విదురుల మాట వినక జాత్యంధుడయిన ధృతిరాష్ట్రుని తనచర్యలకు ఒడఁబడునటుల కావించుకొని కడపట నాశము పొందెను. ఇతనిని ఇతని అనుజులను భీముడు ఒక్కడే చంపెను. ఇతఁడు కలియంశమున పుట్టెను. [భార]

(2) మనువంశము నొదలి ఒకరాజు, సుదర్శన తండ్రి.

దుశ్శాసనుఁడు : ధృతరాష్ట్రుని రెండవ కొడుకు. దుర్యోధనుని పెద్ద తమ్ముఁడు. (భార)

దుష్యంతుఁడు : పు॥ ఈశులునకు రదంతరయందు పుట్టిన కొడుకు శకుంతలభర్త భరతుని తండ్రి. (భార)

దుస్సల : ధృతరాష్ట్రునికి గాంధారియందు పుట్టిన కుమార్తె. దుర్యోధనుని చెలియలు. భర్త సింధుదేశపు రాజు అగు జయద్రథుడు (భార)

దుర్వాసుడు : అత్రికిని అనసూయకును రుద్రాంశమున పుట్టిన కొడుకు1 ఇతని సహోదరుడు సోముడు, దత్తాత్రేయుడు. ఇతడు మహాకోపి ఇతని శాపకథలు అనేకములు కలవు. [(బ్రహ్మ) (భార) (విష్ణు) (భాగ) (మార్కం) (రామా)]

## దూ

దూర్వాక్షి : వసుదేవుని తమ్ముడగు వృకుని భార్య.

దూషణుడు : ర। విశ్రవస్సు కొడుకు. కరుణ సహోదరుడు. జనస్థానమం దుండెను. (రామా,

## దృ

దృఢనేమి : వృ॥ సత్యధృతుని కొడుకు.

దృఢవ్రతుడు : అం। విజయుని కొడుకు.

దృఢశూసవు : బా। సేనాజిత్తు కొడుకు.

దృఢాఖ్యుడు : ఇ। చూ। నా। దండాఖ్యుడు

దృఢ్యుడు : అగస్త్యమహర్షి కొడుకు.

దృషద్వతి : యమునకు పశ్చిమమున ప్రవహించి కౌశికతో సంగమము అగునట్టి నది. ఇది బ్రహ్మావర్తమునకు ఒక ఎల్ల.

## దే

దేవకి : వసుదేవుని భార్య శ్రీకృష్ణుని తల్లి. ఈమె పెదతండ్రి కొడుకు కంసుడు. ఈమెయొక్క ఎనిమిదవ కొడుకు తన్ను చంపును అని ఆకాశవాణి చెప్పగావిని ఈమెను భర్తతోగూడ చిరకాలము చెరలోఉంచి యుండెను. అప్పుడు ఈమెకు ఆరుగురు కొడుకులుగలిగిరి కంసుడు కొంచమైనను కనికరములేక పుట్టినప్పుడే ఆ శిశువులను చంపెను. ఏడవగర్భమున విష్ణువుయొక్క ఆజ్ఞచేత యోగనిద్ర లేక మాయాదేవి సంకర్షించి రోహిణి గర్భమునందు చేర్చెను. గర్భ స్రావమని కంసుడు ఊరకఉండెను. పిమ్మట ఎనిమిదవ గర్భమునుదాల్చి దేవకి శ్రీకృష్ణమూర్తిని కనెను. దేవకి అదితి అవతారము అనియు మహత్తరము అయిన తపము ఆచరించి విష్ణుని కృష్ణునిగా కనెను అనియు భాగవతమునందు చెప్పబడి ఉన్నది.

(2) ఒకానొక నది ఇది కోసల దేశముగుండ ప్రవహించి గంగలో సంగ మము అగుచున్నది. (భాగ)

దేవకుడు : య॥ ఉగ్రసేనుని తమ్ముడు. దేవకి తండ్రి. (భాగ)

దేవక్షత్రుడు : య॥ దేవరాతుని కొడుకు.

దేవగిరి : శతద్రూనదికిని యమునానదికిని నడుమ ఉండు పర్వతము.

దేవతలు : జన్మదేవతలు కర్మదేవతలు అని దేవతలు ఇరు తెరంగులు - అగ్ని, ఇంద్రుడు, యముడు, సూర్యుడు, వాయువు, వరుణుడు మొదలు అగు వారు జన్మదేవతలు. వీరులోకోపకారార్థము ఆయాయి అధికారముతో మొదట సృజింపబడి వేదవిహితములయిన యజ్ఞాదులకు ధేయభూతులై తమ అధికారములను చెల్లించుచు కడవరకుఉండి నశించువారు తమతమ సుకృత కర్మములకు అనుగుణముగా స్వర్గాదిలోక భోగములను అనుభవించి పుణ్యము క్షీణించినతోడనే మానవలోకమును చెందువారు కర్మదేవతలు వీరు నహుషాదులు.

పితృదేవతలు అని మరి ఒకతెగ దేవతలు కలరు. వారు మృతులు అయినవారి పుత్రాదులచే చేయబడు కర్మాదులవలన తృప్తినిపొంది మృతులకును, వారి బాంధవులకును ఒసగిన దుర్గతి నివారింపను సద్గతిని కలుగజేయను సమర్థులుగ ఉందురు.

ఇంద్రాదులను పితృదేవతలును రాక్షసభీతిచేత కొంతకాలము కాకులయి ఉండిరి కాన కాకులకు అన్నము ఇడుటచేత వారికి తృప్తి అగును. యమపుర ద్వారమున వైవస్వతకులోద్భవములయిన కుక్కలు రెండుండును. తత్ప్రీత్యర్థము కుక్కలకు అన్నము ఇడుదురు.

అగ్నీంద్రాది జన్మదేవతలు ముప్పది ముగ్గురు
అష్టవసువులు (ఎనమండ్రుడు) 8
''అగ్నిశ్చపృథివీచవాయుశ్చాంతరిక్షంచాదిత్యశ్చద్యౌ
శ్చంద్రమాశ్చ నక్షత్రాణి చైతేవసవః'' (ఏతేషుహీదంస
ర్వం సునిహితం ఇతితస్మాద్వసవః)
ఏకాదశ రుద్రులు (పదునొకండ్రుడు) 11
దశవై పురుషేప్రాణాః ఆత్మఏకాదశః

ద్వాదశాదిత్యులు (పన్నిద్దరు) 12
ద్వాదశ వై మాసాస్సంవత్సరస్య
ఇంద్రుడు (ఒక్కడు) 1

బ్రహ్మ (ఒక్కడు) 1
అంతు (మొత్తం) 33

దేవదత్తము : అర్జునుని శంఖము. దేవేంద్రునిచే ఈయబడినదగుటచే దీనికి ఈ పేరు కలిగెను. (భార)

దేవదారువనము : ఇందు ఒకప్పుడు భృగ్వాది ఋషులు తపము ఆచరించు చుండ వారల మాయామోహితులగ చేయ రుద్రుడు ఒక సుందరమయిన యవ్వన పురుష రూపమున, విష్ణువుజగన్మోహనము అగు ఒక సుందరీ రూపమునుదాల్చి అచటికివచ్చి తామును అచటి రుషులవలె తపము ఆచరింపవచ్చినట్లు వారితో చెప్పగా వారు వీరి కలరూపమును ఎరుగమిచే వీరి సుందరరూపములు తమకును తమనియమములకును తపోభంగము కావించును అని భీతిజెంది, రుద్రుని చూచి నీకు ఇందుఉండ ఇష్టముండెనేనిలింగమును విసర్జించి ఉండుము అనిన అతడు నిజలింగోత్పాటనముచేసి దానిని అందుపారవైచి అదృశ్యుడయ్యెను. అప్పుడనేక మహోత్పాతములు పుట్టెను అంత ఆరుషులు నిజస్థితిని ఎరిగి దీనికి ఉపశాంతి ఆనతి ఇమ్ము అని బ్రహ్మను ప్రార్థింపగా అతడు కరుణ కలిగి వారిని రుద్రుని లింగాకారాముగా పూజింపనియమించెను. అంతట రుద్రుడు ప్రసన్నుడు అయ్యెను. దీనిని దారువనము అనియు అందురు.

దేవప్రయాగ : ఇది అలకనంద గంగతో సంగమము అగు స్థానమున ఉండును ఇందు తొమ్మన్నూరు అడుగుల పొడవుగల రామచంద్రస్వామి గుడి ఒకటి ఉన్నది.

దేవభాగుడు : య॥ వసుదేవుని తమ్ముడు ఉద్ధవుని తండ్రి (భార)

దేవభూతి : మగధదేశపురాజులగు శృంగులలో కడపటి రాజు చూ॥ కణ్వుడు.

దేవమిత్రుడు : మండూకేయుని శిష్యుడు.

దేవమీఢుడు : హృదికుని కొడుకు. వసుదేవుని పితామహుఁడు వసుదేవుని తండ్రి అని శ్రీమద్భాగవతమున నవమస్కంధమునందు చెప్పఁబడియున్నది.

దేవయాన : (దేవయాని) శుక్రాచార్యుల కూతురు. యయాతి భార్య. చూ॥ కచుడు వృషపర్వుడు. (భార)

దేవరక్షిత : వసుదేవుని భార్య దేవకునికూతురు, దేవకితోడబుట్టువు.

దేవరాతుడు : మీ। సుకేతుని కొడుకు. (2) య। కరంభి లేక కుంతి కొడుకు (2) చూ॥ నా॥ శునస్సేపుడు.

దేవలుడు : (1) ఋ। అష్టవసువులలో ఒక్కడయిన ప్రత్యూషుని కొడుకు. ఈ దేవలునికి క్షమావర్తుడు మనస్వి అని ఇరువురు కొడుకులు ఉండిరి. (2) య॥ అక్రూరుని పెద్దకొడుకు. (3) య। దేవకునికొడుకు, దేవకి సహోదరుడు. [(భార) (భాగ)

దేవవతి : ర। సుకేశుని భార్య గ్రామణి అను గంధర్వుని కూతురు. నా॥ దేవమణి (ఉ.రా)

దేవవర్ధనుడు : య। దేవకుని కొడుకు.

దేవవ్రతుడు : భీష్ముడు (భార)

దేవసేన : అరిష్టనేమి కూతురు. కుమారస్వామి భార్య. ఈమెను కేశి అను దానవుడు పట్టి ఎత్తుకొనిపోవుచుండ ఇంద్రుడు విడిపించెను. (భాగ)

దేవస్థానుడు : ర॥ భారతయుద్ధానంతరము కర్ణుడు మొదలు అగువారి మరణము నకై దుఃఖించుచుండిన ధర్మరాజునకు ఇతడు హితోపదేశము చేసెను.

దేవశ్రవసు : య। వసుదేవుని తమ్ముడు. (భాగ)

దేవహూతి : స్వాయంభువ మనువు కూతురు. కర్దమ ప్రజాపతి భార్య కపి లుని తల్లి. ఈమె తన పుత్రునివలన భక్తియోగమును యెరిగి తత్వజ్ఞానము పడసెను. (భాగ)

దేవాంతకుడు : ర॥ రావణుని కొడుకు. హనుమంతునిచేత చంపబడెను.

ద్రేవాతిథి : కు॥ అక్రోధనుని కొడుకు. (భార)

దేవాపి : కు। ప్రదీపుని పెద్దకొడుకు. ఇతడు తనతమ్ముడు అగు శంతనునికి బ్రాహ్మణుల అనుమతిని రాజ్యము వదలిపెట్టి తపస్సునకు పోయెను. (భార)

దేవావృథుడు : య। సాత్వుని పుత్రులలో ఒకడు. ఇతనికి ప్రభువు అను ఒక పుత్రుడుండెను. (మత్స్య)

దేవారణ్యము : లోహిత్య నదీతీరమును ఉండు అడవి ఇందుమాణిధరుడు అను యక్షుడు గుహ్యకపరివేష్టితుడై వసించుచుండును.

## దై

దైత్యులు : దితి పుత్రులు. ఒకనాడు దితిమన్మథశరవిద్ధయైసంధ్యాకాలమున తన పతి అగు కశ్యపునిచేరి అతనితో బలత్కారముగా రమింప అపుడు ధరించిన గర్భమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టిరి. ఆ సంధ్యాకాల దోషముచే వారు అతి క్రూరులు అయిరి. అందు హిరణ్యాక్షుని బలమధ్యమున లీనమైన ధరణిని నిలుప అవతరించిన యజ్ఞవరాహమూర్తి అగు విష్ణువు సంహరించెను. హిరణ్యకశిపుని ఆ విష్ణువేనారసింహ రూపమున సంహరించెను. దితికి సింహిక అని ఒక కూతురు కలదు.

దైత్యసేన : దేవసేన యొక్క అక్క. అరిష్టనేమి కూతురు.

## దో

దోష : పుష్పార్ణుని రెండవ భార్య వ్యుష్టి తల్లి.

## దౌ

దౌర్వాసము : ఒకఉప పురాణము.

## ద్యు

ద్యుతిమంతుడు : ప్రియవ్రతుని కొడుకులలో ఒకడు. ఇతనికి క్రౌంచద్వీపమియ్యబడెను. కొడుకులు ఏడ్గురు. (బ్రహ్మ)

ద్యుమంతుడు : చూ। నా। దివోదాసుడు.

ద్యుమత్సేనుడు : సాళ్వదేశపురాజు సత్యవంతుని తండ్రి. సావిత్రి మామ. చూ। సావిత్రి. (౬౯)

# ద్ర

ద్రవిడము : ఆంధ్రకర్ణాటకములకు దక్షిణమున ఉండు దేశము.

ద్రావిడము : ద్రవడదేశపు భాష ఈ భాష పరమేశ్వరుని వలనను సుబ్రహ్మణ్యునివలనను అగస్త్యమహర్షికి ఉపదేశింపబడెను. ఇది పాండ్యరాజుల కాలమున మిక్కిలి వృద్ధిపొందెను. పాండ్యదేశము యొక్క రాజధానిఅయిన దక్షిణ మథురలో రాజులచేత ఆదరింపఁబడి మూడు సంఘములు ఉండెను. అందు మొదటి సంఘము నుండి ఈ భాష పరిశీలన చేసినవారు అగస్త్యఋషి మొదలుగాగల ఏనూట నలువది తొమ్మండ్రు రెండవ సంఘముతోచేరి ఉండినవారు ఏబఁది తొమ్మండ్రు. మూడవ సంఘమునఉండి దీనిని వృద్ధినిచేసినవారు నలువదితొమ్మండ్రు. అగస్త్యులచేత చేయఁబడిన అగస్త్యము అనిచెప్పఁబడు శాస్త్రమేద్రావిడ భాషలోని వ్యాకరణశాస్త్రమునకు మొదటిది. దీనిని అనుసరించి అగస్త్య శిష్యులు జమదగ్ని ఋషి కుమారులును అయిన తుల్కాప్యమునిమఱియొక వ్యాకరణ శాస్త్రమును చేసెను. ఈతుల్కాప్యమునికి త్రుణధూమాగ్ని అని సంస్కృతమున పేరు. ఈతఁడు చేసిన శాస్త్రమునకు తుల్కాప్యము అని పేరు. ఈ భాషలో ఆళ్వారాదులవలన వేదాంత గ్రంథములు అనేకములు చేయఁబడి ఉన్నవి. దీనిని ద్రవిడము అనియు చెప్పుదురు.

ద్రాక్షారామము : ఇది మహారాష్ట్ర కర్ణాటాంధ్ర దేశములకు నడుమ ఉండెడు పర్వతములమీద ఉండు ఒక శివక్షేత్రము.

ద్రుపదుడు : పాంచాలదేశపురాజు. ఇతని రాజధాని కాంపిల్యనగరము. తండ్రి పృషదుఁడు కొమరులు ధృష్టద్యుమ్నుఁడు. శిఖండి. కూతురు కృష్ణ లేక ద్రౌపది ఈద్రుపదుడును ద్రోణాచార్యులును సహాధ్యాయులు. ఒకానొకప్పుడు ద్రోణాచార్యులు పేదరికముచేత తనసహాధ్యాయి అయిన ద్రుపదునివద్దకువచ్చి తనలేమిని చెప్పగా ఇతఁడు అతని నెఱుగనివానివలె మాటలాడి అవమానించెను. అందుమీద ద్రోణుఁడు హస్తినాపురమునకు పోయి భీష్మాచార్యుల నియోగమున కౌరవులకును పాండవుల

కును అస్త్రవిద్య కఱపి అందు అర్జునుని మహాసమర్థునిగా చేసి అతనిని ద్రుపద రాజును గురుదక్షిణగా తెచ్చి ఇమ్మని కోరెను. అర్జునుఁడు అట్లే ద్రుపదుని పట్టి తేగా ద్రోణుఁడు అతనిని పరిహాసముచేసి పంపెను, అది కారణముగా ద్రుపదుఁడు అర్జునుని పెండ్లాడదగిన కూతురును ద్రోణాచార్యులను చంపదగిన కొడుకును తనకు లభింపగోరి యజ్ఞము చేసెను. అప్పుఁడు యజ్ఞాగ్నికుండము నందు ద్రౌపదియు ధృష్టద్యుమ్నుఁడును పుట్టిరి.

(భార)

ద్రుహ్యుడు : యయాతి పుత్రులలో ఒకఁడు.

ద్రోణాచార్యుఁడు : భరద్వాజుని కొడుకు అశ్వత్థామ తండ్రి పాండవులకు కౌరవులకు ధనుర్విద్యా గురువు. ఈతఁడు భారతయుద్ధమునందు ధృష్టద్యుమ్నునిచేత చంపఁబడెను. ఇతఁడు శుక్రాంశమున జనించినవాఁడు. ఇతనికి కుంభజుఁడు అనియు నామముకలదు. చూ ద్రుపదుఁడు.

(భార)

ద్రోణుఁడు : ఒక పక్షి. ధర్మపక్షుల తండ్రి మందపాలు కొమరుఁడు.

ద్రౌపది : ద్రుపదమహారాజు కూతురు. పాండవుల భార్య. ఈమె తొలిజన్మమున నలాయనుఁడు అను ఋషి కూతురు. ఇంద్రసేన అను నామమున మౌద్గల్యుడు అను మహామునికి భార్య అయి ఉండిన పతివ్రతా శిరోమణి. కర్మవశముచే అతఁడు అతి కుష్ఠివ్యాధి పీడితుఁడై ఉండెను. అయినను ఇంద్రసేన అతనిని అతి భక్తిచే ఆదరించుచుండెను. అది చూచి అతఁడు మిక్కిలి సంతసిల్లి ఆమెను వరము వేడుము అనగా అపుఁడు ఆమె తనకు కామ భోగేచ్ఛ మిగుల కలదు అనియు. అతనిని కామరూపము ధరించి ఐదు ప్రకారముల తనతో కూడి రమింపవలయు అనియు వేడెను. అతఁడు అట్లే ఆమెను కూడి చిరకాలముండి దేవలోక ప్రాప్తి చెందెను. ఇంద్రసేన కాలవశమున శరీరము విడిచియు కామ భోగమందు తృప్తి లేక మరుజన్మమున కాశిరాజు కూతురు అయి పుట్టి కన్యాత్వమున బహుకాలముండి పశుపతిని ఉద్దేశించి ఉగ్రతపము చేయ అతఁడు ప్రత్యక్షమై వరము వేడుము అనగా అపేక్షాతిశయముచేత పతి, పతి, పతి. పతి, పతి అని ఐదుమారులు పలికెను, అది కారణముగా ఆమె ద్రౌపదియై పుట్టి పాండవులైదుగురికిని భార్య ఐయ్యెను. ఆమె యజ్ఞకుండమున పుట్టుటచే యజ్ఞసేని అనియు ద్రుపదుని కూతు

రగుటచే ద్రౌపది అనియు పాంచాలుని కూతురుగాన పాంచాలి అనియు చెప్పఁబడును. ఈమెకు తల్లిదండ్రులు పెట్టినపేరు కృష్ణ ఈమెకు ధర్మరాజువలన ప్రతివింధ్యుడు, భీముని వలన శ్రుతసోముడును, అర్జునుని వలన శ్రుతకీర్తియు, నకులుని వలన శతానీకుడును, సహదేవుని వలన శ్రుతసేనుడును పుట్టిరి. ఈ ఏవురును ఉపపాండవులు అనఁబడుదురు. ఈమె శచీయంశము. చూ ద్రుపదుఁడు.

# ద్వ

ద్వాపరము : ఒక యుగము. దీని పరిమితి. 864000 సంవత్సరముల కాలము. చూ॥ యుగములు.

ద్వారక : శ్రీకృష్ణుని రాజధాని. ఘూర్జరదేశమున పశ్చిమ భాగమునందుండును. హస్తినాపురికిని దీనికిని డెబ్బది ఆమడల దూరము అక్కడక్కడ పలుద్వారములు ఉంచి ఆద్వారములయందెల్ల తగిన కావలి ఉంచి ఉండుటచేసి దీనికి ఈ పేరు కలిగెను. (హరి)

ద్వితుఁడు : బ్రహ్మ మానస పుత్రులలో ఒకఁడు. (భార)

ద్విమీఢుఁడు : పు। హస్తికుని రెండవ కొడుకు- ఈతని వంశజులు కౌరవులు అనఁబడుదురు.

ద్విమూర్థుడు : దనువు పుత్రులలో ఒకఁడు.

ద్వివిదుఁడు : ఒక వానరుఁడు. మైందుని సహోదరుఁడు. వీఁడు నరకాసురుని సఖుఁడు. తన చెలికాఁడు. అయిన నరకుని శ్రీకృష్ణుఁడు చంపెను, అనిద్వేషించి కృష్ణుఁడు ఏలునట్టి పట్టణముల యందు చొచ్చి, జనులను తొందరపెట్టుచుండి తుదను బలరామునిచేత చంపఁబడెను. (భాగ)

ద్వీపములు : చూ॥ సప్తద్వీపములు.

ద్వైతము : (1) ఒక మతము. జీవాత్మ పరమాత్మలు వేరు అనియు జీవాత్మను కృత జీవుఁడు దుష్కృతి జీవుఁడు అని రెండు రూపములై ఉండును అనియు ఆయాజీవులు తమ తమ కాచిన రూప సదృశరూపములతోనే ముక్తిని పొందుదురు అనియు, ఈ ముక్తి పంచభేదజ్ఞానము వలన కలుగును అనియు ఈ మత సిద్ధాంతము. పంచ భేదజ్ఞానము అనగా,

(1) జీవేశ్వర జ్ఞానము.

(2) జీవ పరస్పర భేదజ్ఞానము.

(3) జడధీ జీవ భేద జ్ఞానము.

(4) జడేశ భేద జ్ఞానము.

(5) జడ పరస్పర భేదజ్ఞానము. ఈ మతము మధ్వాచార్యులు అగు ఆనంద తీర్థులచే స్థాపింపఁబడినది. దీని మధ్వ మతము అనియు ఈ మత ప్రవర్తకులను మధ్వులనియు చెప్పుదురు,

(2) ఒకానొక వనము. వనవాసకాలమున పాండవులు కామ్యకవనమును వదలి ఇందు కొంతకాలము వనవాసము చేసిరి. (భార)

ద్వైపాయనము : ఇది కురుక్షేత్రమునకు సమీపమున వుండు ఒక మడుగు. దుర్యోధనుఁడు తన సేన అంతయు మడిసిన వెనుక ఇందు జలస్తంభముచేసి దాగి ఉండెను.

## ధ

ధనంజయ నిఘంటు: ఒక సంస్కృత నిఘంటువు. ఇది రెండు అధ్యాయములు కలది, అందు రెండవది నానార్థములును ఉభయార్థములును అగు శబ్దములు కలిగి ఉండును. ఇది ధనంజయుడు అను పండితునిచేత చేయ బడినది.

ధనంజయుఁడు : (1) చూ। అర్జునుఁడు. (2) అగ్ని. (3) ఒక సంస్కృత నిఘంటుకారుఁడు. 4. కద్రువ కుమారుఁడు. (భార)

ధనికుఁడు : య। దుర్దముని కొడుకు. కార్తవీర్యార్జునుని పితామహుఁడు.

ధన్వంతరి : దీర్ఘతపుని కొడుకు. అమృతమథన కాలమునందు పాలసముద్రమున పుట్టిన ధన్వంతరియే ఆయుర్వేదమును కల్పించుట కొఱకు కాశీరాజు వంశమున ఈతఁడుగా పుట్టెను అందురు. (బ్రహ్మ)

ధర్మనేత్రుఁడు : య హేహయుని కొడుకు. ఈతనికి ధర్ముఁడు అనియు పేరు కలదు.

ధర్మపక్షులు : పింగాక్ష, విభోద, సపుత్ర, సుముఖి నామకములు అగు నాలుగు పక్షులు. పూర్వము విపులుఁడు అను ఒక ముని ఉండెను. అతనికి శుక్రుకుశుఁడు, తుంబురుఁడు అను ఇరువురు కొడుకు లుండిరి. అందు శుక్రుకుశుని ఒకప్పుఁడు ఇంద్రుఁడు పక్షిరూపియై నరమాంసమును వేడగా తన నలువుర కొడుకులలో యెవ్వరైనా ఒకని ఇంద్రునకు ఆహారము కమ్ము అనిన వారు సమ్మతింపక పోయిరి. అందుకు వారి తండ్రి అలిగి వారిని ధర్మపక్షులు కండి అని శపించెను. అంతట కొడుకులు తండ్రి కాళ్ళమీదపడి ఈశాపము తొలగ అనుగ్రహింపుము అని ప్రార్థింపగా ఆ శుక్రకశుఁడు శాంతి వహించి వారికి జైమినిముని సంశయములను నివర్తించి ఆరూపములు వదలి ఉత్తమ పదము పడయునట్లు కరుణించెను. ఇవి మార్కండేయ పురాణమును జైమినికి చెప్పిన ధర్మపక్షులు.

భారతయుద్ధము జరుగుచుండగా అచ్చట మెలగుచుండిన ఒక పక్షియొక్క గర్భము అర్జునుఁడు శత్రువులమీద ప్రయోగించిన బాణము తగిలి భేదిల్లగా అందలి గ్రుడ్లు నాలుగు ఆ యుద్ధరంగమునందు ఒక యేనుగు మెడనుండు ఘంట క్రింద అడగికొన్నాళ్ళకు పిల్లలై కిచకిచ లాడుచుండ శమీకుఁడు అను ఋషి చూచి తన ఆశ్రమమునకు కొనిపోయి పెంచెను. అవియ యీ ధర్మపక్షులు ఆపులుగులు ఆవల వింధ్యపర్వతముఁ జేరెను. (మార్క)

ధర్మరథుఁడు : చిత్రరథుని కొడుకు.

ధర్మరాజు : పాండుమహారాజు పెద్దకొడుకు. తల్లి కుంతీదేవి. ఇతఁడు యమ ప్రసాదమువలన పుట్టినవాఁడు. ఇతనికి మొదటి పేరు యుధిష్ఠిరుఁడు. మహాధర్మాత్ముఁడు అగుటచేత ఇతనికి ధర్మరాజు అను పేరు కలిగెను. ఇతనికి ద్రౌపది వలన పుట్టిన కొడుకు ప్రతివింధ్యుఁడు. దేవకి అను నామెవలన పుట్టిన కొడుకు యౌధేయుఁడు. ఇతని తమ్ములు భీమసేనాదులు నలువురు. (భార)

ధర్మవ్యాధుఁడు : మిథిలానగరమున ఉండిన ఒక యెఱుకలవాఁడు ఎఱుక కులమున జన్మించియు, గురుశుశ్రూషవలన సమస్త ధర్మములను చక్కగా ఎఱిగిఉండెనున వీఁడు తొల్లిటి జన్మమున బ్రాహ్మణుఁడుగా ఉండి శాపవశమున ఎఱుకవాఁడుగా పుట్టెను. కౌశికుఁడు అను బ్రాహ్మణుఁడు ఒకఁడు వీనివలన సమస్త ధర్మములను తెలిసికొనెను. [(1 వరా) (భార)]

ధర్మవ్రతుఁడు : దండకారణ్యమందు ఉండిన ఒక ఋషి ఇతఁడు శ్రీరామునకు పంచాప్సరసరస్సుయొక్క కథను తెలిపెను. (రామా)

ధర్మారణ్యము : ఒకానొక పట్టణము. ఇది కుశుని మూడవ కొడుకు అయిన అధూర్తరజుఁడు కట్టినది.

ధర్ముఁడు : (1) బ్రహ్మకుడి చేత పుట్టిన దేవత. ఇతని కొడుకులు శముఁడు కాముఁడు, హర్షుఁడు అని మువ్వురు. (2) యమ పృథుశ్రవుని కొడుకు. ఇతనికి, ఉశస్సు అనియు పేరు కలదు. (భార)

## ధా

ధాత : ఒక దేవత. ఇతనును విధాతయు స్వాయంభువ మనువునకు సహాయార్థమై బ్రహ్మచే పుట్టింపఁబడినవారు. (బ్రహ్మకే ధాత విధాత అను పేర్లును కలవు) వీరితో కూడా వరుణుని భార్య అయిన జ్యేష్ఠాదేవియు, విష్ణు భార్య అగు లక్ష్మీదేవియు పుట్టిరి. ఈ లక్ష్మిని మోక్షలక్ష్మి అనియు అందురు. శ్రీమద్భాగవతమున ధాతయు విధాతయు లక్ష్మియు భృగువునకు ఖ్యాతియందు పుట్టినటుల చెప్పి ఉన్నది. [(బ్రహ్మ) (భాగ)]

ధాత్రిక, ధాత్రేయిక: ద్రౌపది యొక్క పరిచారిక ఈమె పాండవుల యరణ్యవాస కాలమునందు ద్రౌపదికి పరిచర్యచేయుచుండి సైంధవుఁడు ద్రౌపదిని చెరబట్టిన వృత్తాంతమును పాండవులకు తెలిపెను (భార)

ధాన్యమాలిని : ఒక అప్సరస. దీనివలన రావణుఁడు అతికాయుఁడు అను కొడుకును పడసెను. (రామా)

ధారాపురము : విదర్భదేశమునకు భోజుని కాలమున రాజధానిగా ఉండిన పట్టణము

ధార్ష్టవంశము : వైవస్వతమనువు కొడుకు అయిన ధృష్టునివలన కలిగిన వంశము. (భాగ)

## ధీ

ధీసంతుఁడు : (1) పురూరవుని కొడుకు (2) ప్రియవ్రతుని వంశస్థుఁడు అయిన విరోహణుని కొడుకు. (భార)

## ధు

ధుర్యచిత్తుఁడు : యయాతి పుత్రుఁడు అగు తుర్వసుని పౌత్రునికి పౌత్రుఁడు ఇతనికి పురుత్తుఁడు అనియు నామము కలదు. ఇతఁడు తనకు సంతతి లేకపోగా భరతుని తండ్రి అగు దుష్యంతుని తమ్ముడు అయిన దిష్యంతుని పెంచుకొనెను

## ధూ

ధూమాది మార్గము : కర్మతులు పితృలోకమునకు పోవుమార్గము పుణ్య. క్షయా మార్గము అనంతరము వీరికి పునర్జన్మము కలదు. వీరికి తాము చేయు అగ్నిహోత్ర ధూమము ద్వారా ఈలోకము సిద్ధించును కనుక ఇది ధూమాది మార్గము అనఁ బడెను.

ధూమ్ర : ప్రజాపతి భార్య. ధరుఁడు అను వసువునకు తల్లి. చూ। అహుఁడు ప్రజాపతి. (భార)

ధూమ్రకేతువు : దనువు పుత్రుఁడు.

ధూమ్రాక్షుఁడు : సుమాలి కొడుకు. లంకాపట్టణమును ముట్టడించినపుఁడు పశ్చిమ ద్వారమునందు హనుమంతునిచే వీఁడు చంపఁబడెను. (రామా)

## ధృ

ధృతదేవి : దేవకుని కూతురు. వసుదేవుని భార్య.

ధృతరాష్ట్రుఁడు విచిత్రవీర్యుని కొడుకు. ఇతఁడు అంబికయందు వ్యాసులవలన దేవర న్యాయమున జనించినవాఁడు. ఇతని భార్య గాంధారి. ఇతఁడు పుట్టం ధుఁడు. హరిష్టుని కొడుకు అయిన హంసుఁడు అగు గంధర్వపతి అంశము. (2) కద్రువ కుమారుడు-సర్పము. (3) తామ్రయందు కశ్యపునకు పుట్టిన పక్షి. (జై. భా) (భార)

ధృతుఁడు : గాంధారుని పౌత్రుఁడు.

ధ్రువుఁడు : (1) ఉత్తానపాదునికి సునీతియందుఁ బుట్టిన కొడుకు. ఒకనాఁడు ఉత్తానపాదుఁడు, సింహాసనముమీఁద కూర్చుండి తన రెండవ భార్య అగు సురుచి యొక్క బిడ్డను తొడమీఁద ఉనిచికొని ఉండగా అప్పటికి నాలుగవేఁడ్ల బాలుఁడుగా ఉండిన ధ్రువుఁడు చూచి బాల్యచాపల్యముచేత తాను తండ్రి తొడ ఎక్కకోరెను. సురుచి ఆ ధ్రువుని అభిప్రాయ మెఱిఁగి కడు అహంకారముతో తండ్రి తొడ యెక్కవలెను అను నపేక్ష కలిగిన నీవు ఏల సునీతిని కడుపున పుట్టితివి అని అడిగెను. ఆమాట ధ్రువుఁడు విని తన హృదయమునకు అది బాణమువలె నాటగా ఆవృత్తాంతము తల్లికి ఎఱిఁగించి ఆమె యనుజ్ఞ పడసి నారదమహర్షి యొక్క ఉపదేశమున మిక్కిలి ఉగ్రమైన తపస్సుచేసి, విష్ణువుని ప్రత్యక్షము చేసికొని తల్లితోకూడా అత్యున్నతమైన పదమునుపొందెను. (2) అష్టవసువులలో ఒక్కఁడు. (3) పు॥ ఘతిసారుని రెండవ కొడుకు. (4) య॥ బలరాముని తమ్ముఁడు.

(భాగ) (మత్స్య) (విష్ణు) (హరి)

ధృష్టకేతుఁడు : (1) మి॥ సత్యధృతి కొడుకు. (2) పా॥ ధృష్టద్యుమ్నుని కొడుకు (3) కా॥ సుకుమారుని కొడుకు, వీని కొడుకు వీతిహోత్రుఁడు.

(భార)

ధృష్టద్యుమ్నుఁడు : ద్రుపదుని కొడుకు. ద్రౌపది తోఁబుట్టువు. ఇతఁడు భారత యుద్ధమునందు పాండవులకు దళవాయి అయి వుండెను. ఇతఁడు అగ్ని యంశము. చూ ద్రుపదుఁడు. (భార)

ధృష్టవర్ముఁడు : య॥ అక్రూరుని తమ్ముఁడు. దృష్టి య॥ రెండవ కుంతికొడుకు.

ధృష్టుఁడు : వైవస్వతమనువు కొడుకులలో ఒకఁడు. ఇక్ష్వాకుని తమ్ముఁడు. ఇతని వలన దార్ష్టము అనెడి వంశము కలిగి బ్రహ్మభావమును పొంది నెగడెను. కొడుకు నాభాగుఁడు.

## ధే

ధేనుకాసురుఁడు : ది వీఁడు ఒకప్పుడు గార్ధభాకారుఁడు అయి తన అనుచరులతోడ బృందావనమునందలి జనులను హింసింపగా బలరాముఁడు వీనిని చంపెను

(భాగ)

## ధౌ

ధౌమ్యుడు · పాండవుల పురోహితుఁడు. (భార)

## న

నంద : సాలపోతకుడు అను నాగరాజు కూతురు. తండ్రి శాపముచే మూకత్వమును పొందగా సుశర్మ సారస్వతము అను ఇష్టికావించి ఆ మూకత్వమును పోగొట్టెను. (మార్క)

నందనము : ఇంద్రుని ఉద్యానవనము.

నంది, నందికేశ్వరుడు: శిలాదుని కొడుకు. శివుని వాహనము అయిన వృషభము. ఇతఁడు కోటి సంవత్సరములు అతి నిష్ఠురమైన తపము సలిపి శివుఁడు ప్రత్యక్షము కాగా, మరల రెండు కోట్ల సంవత్సరములు తపము ఆచరించునట్లు వరము పొంది శివుని అనుగ్రహము వడసి పార్వతికి పుత్రభావము పొందెను. ఇతనిని నందికేశ్వరుఁడు అనియు అందురు ధర్మునికి యామె యందు పుట్టిన దుర్గభూమ్యధిష్ఠానదేవత యొక్క రెండవ కొడుకు అని శ్రీమద్భాగవతమునందు చెప్పి ఉన్నది. (శివ) (ఉ రా.)

నందిగ్రామము : అయోధ్యకు సమీపమున ఉండు ఒక చిన్న గ్రామము. ఇందు రాముఁడు దండకారణ్యవాసముచేయు కాలమున అతని పాదుకలకు రాజ్యవ్యవహారములను నివేదించుచు భరతుఁడు వల్కల జటాధారుడై నివసించి ఉండెను. (రామా)

నంది దుర్గము . ఒకానొక కొండ. దీని చేరువను ఉండు వూరికిని ఈ పేరు చెల్లెను. ఇది మైసూరు సీమలో వుండును. దీనియందు క్షీరనదియు ఉత్తర పినాకినినదియు పుట్టుచున్నవి.

నంది సింగన : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు ప్రబోధ చంద్రోదయమును తెనిగించెను

నందుఁడు: : 1. శ్రీకృష్ణుని పెంపుఁడు తండ్రి యోగామాయా సహాయమున వసుదేవుఁడు కృష్ణుని పుట్టిన తోడనే వ్రేపల్లెయందు ఇతని ఇంట తెచ్చి వదలి పెట్టెను. ఇతని భార్య యశోద. 2. య వసుదేవునికి మదిరయందు పుట్టిన

కొడుకు. 3. నా। మహాపద్మ్మ(డు. ఇత(డు మహానందికి శూద్రస్త్రీయందు పుట్టి అతని వెనుక మగధదేశమునకు రాజు అయెను. పరశురామునివలె ఇత(డు దేశమును క్షత్రియ శూన్యము కావించినందున ఇతనికి వెనుక శూద్రులు రాజులు అయిరి. ఇత(డు ఏకచ్ఛత్రాధిపత్యమును వహించినట్లు తెలియవచ్చుచున్నది. ఇతని వంశస్థులు తొమ్మండ్రు నూఱు సంవత్సరములు రాజ్యము చేసిరి 4. విష్ణుపరిచరులలో ఒక(డు. (భాగ)

నకులుడు : పాండుభూపతికి మాద్రియందు అశ్వినీ దేవతల ప్రసాదమున జనించినవా(డు. ఇతనికి ద్రౌపదియందు శతానీకు(డు అను కొడుకును చేదిదేశపు రాజు కూతురు అగు రేణుమతియందు నిరమిత్రుడు అను కొడుకును పుట్టిరి. (భార)

నక్షత్రక(డు : విశ్వామిత్రుని శిష్యులలో ఒక(డు. వీడు హరిశ్చంద్రుని బొంకింప తలచి అత(డు ఇచ్చెదను. అన్న ధనమును రాబట్టుకొని వచ్చుటకై తన గురువు పంపగా హరిశ్చంద్రుని వెంట తరువుకాడై పుట్టెను (మార్క)

నగోద్భేదను : ఒక తీర్థ విశేషము.

నడ్వల : చతుర్మనువు భార్య. ఉల్ముకుని తల్లి.

నన్నయభట్టారక(డు. : ఆంధ్ర కవులలో మొదటివా(డు. వేగిదేశాధీశు(డైన రాజరాజ నరేంద్రు(డు రాజమహేంద్రమున రాజ్యము చేయుకాలమున అతని యొద్ద ఇత(డు ఆస్థానపండితు(డుగా ఉండెను. ఇత(డు తన ఏలినవాని ప్రేరేపణచేత భారతమున మొదటి రెండు పర్వములను అరణ్యపర్వమున కొంత భాగమును తెనిగించి కాల ధర్మమును పొందెను. (తక్కిన భారత శేషమును ఎఱ్ఱాప్రెగ్గడయు తిక్కన సోమయాజియు తెనిగించిరి. చూ। తిక్కన) మఱియు ఈయన ఆంధ్ర శబ్ద చింతామణి అను పేర తెనుగునకు ఒక వ్యాకరణమును రచియించి దానికి లక్ష్యముగా ఈ భారతమును రచియించెను అని చెప్పుదురు. ఈ హేతువును బట్టియే ఇత(డు వాగనుశాసను(డు అన(బడెను. ఈ కవి తాను రచియింప(బూనిన భారతమును ముగింపకయే కాలధర్మమును పొందుటకు కారణము భీమన అను మహాకవియొక్క శాపము అని కొందరు చెప్పుచున్నారు. అది యెట్లు అనగా భీమన ఇత(డు భారతమును

తెనిగించుటకుమునుపే ఒక భారతమును తెనుగుఁ రచియించి ఆగ్రంథమును నన్నయ భట్టారకుని యొద్దకు కొనివచ్చి దానియందలి లోపాలోపములను పరిశీలించి రాజునకు చూపి తనకు సన్మానము కలుగఁజేయవలయును అని అడుగగా దానిని అతఁడు చదివి చూచి అందలి ప్రయోగ పద్ధతులు మొదలగునవి మిక్కిలి శ్లాఘనీయములు అయి ఉండగా అది బయట వచ్చిన యెడ తన భారతము అడగిపోవును అని యెంచి ఆ యభిప్రాయమును బయలుపరుపక భీమకవితో నేను రాజు ప్రేరేపణ చేత ఒక భారతము రచియించుచు ఉన్నాను. ఆదిపర్వము మాత్రము ఇప్పటికి అయినది. ఇప్పుఁడు ఈ గ్రంథమును రాజునకు చూపిన యెడ తన ప్రయత్నము నెరవేరుటకు భంగముగా ఇది ఒకటి వచ్చెను అని తిరస్కరించును గాని అంగీక రింపఁడు కనుక సమయము చూచి నీ గ్రంథమును అతనికి చూపి సన్మానము చేయింతును అని చెప్పి అది తీసి తనవద్ద ఉంచుకొని ఆయనను పంపి దానిని కాల్చివేసెను. ఈ సంగతి భీమన ఎఱుగఁడు కనుక కొన్ని దినములు తాలి నన్నయభట్టారకుని ఇంటికివచ్చి అప్పుడు ఆయన ఇంటలేకపోగా ఆయన భార్యను పిలిచి నీ భర్తచేయుచున్న భారతము ముగిసెనా అని యడిగినంతట ఆమె అరణ్య పర్వము జరుగుచు ఉన్నది అని చెప్పెను. అది విని అతఁడు తనకు ఏ సమాచార మును తెలియఁ జేయకయే ఇతఁడు గ్రంథ రచనఁ జరుపుచు ఉన్నాడు కనుక తన గ్రంథమును ముంచుకు రానీయఁ జాలఁడు అని తలచి దానివలని సంతాపముచే ఇంకను అరణ్యములోనే పడిఉన్నాడాఅని చెప్పగా అదియే శాపముగా తగిలి ఆకాలమందు ఏదోపని కలిగి ఊరిముందటి అడవికిపోయి ఉండిన నన్నయ భట్టారకుఁడు అక్కడనే దేహత్యాగము చేసెను

**నభగుఁడు** : వైవస్వతమనువు పుత్రులలో ఒకఁడు. కొనుకు నాభాగుఁడు.

**నభస్వంతుఁడు** : ద. మురాసురుని కొడుకు. శ్రీకృష్ణునిచే చంపఁబడెను.

**నభస్వతి** : అంతర్ధానుని రెండవ భార్య. హవిర్ధానుని తల్లి.

(భాగ)

**నభుఁడు** : ద॥ విప్రచిత్తి కొడుకు.

**నముచి** : ద। విప్రచిత్తి కొడుకు, భార్య స్వర్భానుని కూతురు అగు ప్రభ. ఇతనిని ఇంద్రుడు చంపెను.

(భాగ)

**నరకము** : పాపలోకము. ఇది రౌరవమహారౌరవాది భేదములచే ఇరువది యొక్క విధము కలది. ఇందు ఉపపాతక మహాపాతకములు చేసిన నరులు బాధింపఁబడుదురు.

**నరకుఁడు** : 1. వరాహస్వరూపుడు అయిన విష్ణువునకు భూమియందు పుట్టిన అసురుఁడు. ఇతని రాజధాని ప్రాగ్జ్యోతిషము. వాహనము సుప్రతీకము అనెడి ఏనుగు పుత్రుఁడు భగదత్తుఁడు ఈ నరకాసురునిచే అదితి యొక్క కర్ణకుండలములును వరుణుని ఛత్రంబును మణిపర్వతము అనెడు అమరాద్రి) స్థానమును కోలుపోయి ఇంద్రుఁడు హరికి విన్నవింపగా అతఁడు సత్యభామ సహితుఁడును గరుడవాహనారూఢుఁడు అగుచు ప్రాగ్జ్యోతిషపురముచేరి నరకుని యన్నయగు మురాసురుని వాని పుత్రులను చంపి పిమ్మట నరకాసురుని వధించి వాని మందిరమున చెరనుంచఁబడిన పదారువేల కన్యలను తెచ్చి తాను వివాహమయ్యెను. ఈ నరకాసురుని గెల్చి వచ్చునపుడు కృష్ణుఁడు స్వర్గమునకుపోయి అచట సత్యభామ ప్రేరింపఁగా నందనవనమునందలి పారిజాతవృక్షమును భూమికి తెచ్చెను.

(భాగ)

2 ద। విప్రచిత్తి కొడుకు.

**నరనారాయణులు** : వీరిరువురు విష్ణుని యంశమున పుట్టిన మహామునులు. ధర్మునకు దాక్షాయణియైన మూర్తివలన పుట్టినట్లు భాగవతము చెప్పుచు ఉన్నది. బదరీవనమున అనేకవేల సంవత్సరములు తపమాచరించినట్లును, దేవతలకు సహాయముగా అసురులతో అనేకమారులు యుద్ధమాడి వారిని జయించినట్లును తెలియును.

**నరసరాజు** : ఇతఁడు ఈశ్వర ప్రభువుకొడుకు. తమ్ముఁడు తిమ్మన నరసరాజునకు నరసింహాలు అనియు పేరు కలదు. వసుచరిత్రము ఇతనిపేర అంకితముగా ఒనర్పఁబడెను.

**నరసింహావతారము**: విష్ణువుయొక్క దశావతారములలో నాల్గవ అవతారము. చూ॥ ప్రహ్లాదుఁడు.

**నరాంతకుడు** : ద॥ రావణుని కొడుకు అంగదునిచే చంపఁ బడెను.

(రామా)

నరిష్యంతుఁడు : 1. వైవస్వతమను పుత్రులలో ఒకఁడు. కొడుకు చిత్రసేనుఁడు. 2. మరుచక్రవర్తి కొడుకు. (మార్క)

నరుఁడు : 1. ఒక దేవరుషి. ఇతఁడును నారాయణుఁడు అను ఋషియు విష్ణువు యొక్క అవతారము అని చెప్పుదురు. వీరే కృష్ణార్జునులుగా అవతరించిరి. చూ॥ నరనారాయణులు. 2. ప్రియవ్రతుని వంశస్థుఁడు అగు గయుని కొడుకు. 3. పు॥ భ మన్యుని కొడుకు సంకృతి తండ్రి.

నర్మద : నర్మ అనకేళి. దానిని యిచ్చునదగుటచేత దీనికి నర్మద అను పేరు కలిగె. ఇది మేఖల పర్వతమున పుట్టుటచేత దీనికి మేఖలకన్యక అనియు పేరు కలదు.

నర్మదనాగుల సహోదరి అనియు పురుకుత్సుని భార్య అనియు పురాణప్రసిద్ధి చూ॥ పురుకుత్సుఁడు.

నల : 1 గంగలో సంగమము అగు ఒకనది. 2 విభీషణుని కుమారిత (రామా) (మార్క (హరి)

నలకూబరుఁడు : కుబేరుని కొడుకు. మిక్కిలి చక్కనివాడు. వీని సహోదరుఁడు మణిగ్రీవుఁడు. తొల్లి ఒకప్పుడు నలకూబర మణిగ్రీవులు కైలాస పర్వతమునందు మదిరాపాన వశులు అయి నిర్వాణముగా క్రీడించుచు ఉండిరి. అప్పుఁడు అచటికి నారదుఁడు వచ్చెను. మత్తుచే నొడలు తెలియని వారు అగుటచేత అతఁడు వచ్చినది ఎఱుగక వస్త్రములు ధరించక ఉండిరి. అందుకతఁడు వీజినిద్దరిని మద్దిమ్రాకులు కమ్మని శపించెను. అంత చిరకాలమునకు నందుని ఇంట పెరుగుచు ఉన్న కృష్ణుఁడు వెన్న దొంగిలించెనని యశోద తన్ను రోటికి కట్టివేయగ ఆ రోలు ఈడ్చుకొని ఆ రెండు వృక్షముల నడుమరాగా అవి రెండును, పెల్లగిల్లి పడి వారికి శాపవిమోచనము ఆయెను. (భాగ)

నలిని : అస్తికుని కొడుకు అగు అజమీఢుని రెండవభార్య.

నలుఁడు : (1) యదువు మూడవ కొడుకు. (2) యయాతి పౌత్రుఁడు. అనువు రెండవకొడుకు. (3) నిషధ దేశమునకురాజు. వీరసేనుని కొడుకు. భార్య దమయంతి. కొడుకు ఇంద్రసేనుఁడు. కూతురు ఇంద్రసేన. ఇతనిభార్య అగు

దమయంతికి స్వయంవరము చాటింపగా ఆ వర్తమానము విని కలిపురుషుఁడు వరింప దలచి వచ్చి తాను వచ్చునంతలో దమయంతి నలుని పెండ్లాడెను, అని మాత్సర్యము పట్టి ఇతనికి పెక్కు ఇడుమలు కలుగచేసెను.

(4) విశ్వకర్మవలన పుట్టిన ఒక వానరుఁడు. ఇతఁడు వానరసేన లంకకుపోవుటకై సముద్రమునకు సేతువు కట్టినవాఁడు. (మార్క) (భార)

**నవఖండములు** : చూ॥ నవ వర్షములు.

**నవగ్రహములు** : సూర్యాదిగ్రహములు. అవి సూర్యుఁడు, చంద్రుఁడు, అంగారకుఁడు, బుధుఁడు, గురుడు శుక్రుఁడు, శని, రాహువు, కేతువు.

**నవరథుఁడు** : య॥ భీమరధుని కొడుకు

**నవరాత్రి** : ఆశ్వయుజ శుక్లపాద్యమి మొదలు నవమి వఱకు కలతొమ్మిది రాత్రులు. కృతయుగమున ఒకప్పుడు సుకేతనుఁడు అనురాజు తన జ్ఞాతులచే రాజ్యభ్రష్టుడై భార్యతోకూడా అడవులు తిరుగుచుకష్టమును అనుభవించుచు ఉండగా అంగిరసుడు అనుఋషి అతనికి నవరాత్రిపూజా విధులను ఉపదేశించెను. అతఁడు ఆ రీతిని ఆ పూజసలిపి మరల యథా ప్రకారము తన యైశ్వర్యమును పొందెను. ఈ ఐతిహ్యమును పట్టి లోకులు దుర్గ, లక్ష్మి, సరస్వతి వీనిలో ఒక్కొక్కదేవిని మూడేసి దినములు పూజింతురు. ఈ తొమ్మిదిరాత్రులయందును ఆ దేవతలను పూజించుటకు వసతి కానియెడల కడపటి దినము అగు నవమినాఁడు విద్యాపీఠమున పుస్తకములను పెట్టి దేవీ త్రయమును కల్పవిధిప్రకారము పూజింతురు. అట్లు పూజించుటచే ఆ దినము మహానవమి అనియు సరస్వతీదేవిని పూజించుటచే సరస్వతిపూజా దినము అనియు ఆయుధములను పెట్టి పూజించుటచే ఆయుధపూజాదినము అనియు చెప్పఁబడును. మఱునాటి దశమితిథికి విజయదశమి అనిపేరు.

**నవ వర్షములు** : భరతహేమకూటనైషద ఇలావృత నీలస్వేతకురు భద్రాశ్వకేతుమాల వర్షములు చూ॥ అగ్నీధ్రుఁడు.

**నవవిధ సృష్టి** : చూ॥ త్రిమూర్తులు.

**నహుషుఁడు** : ఒకానొక రాజు. ఇతఁడు చంద్ర వంశస్థుఁడు అగు ఆయువునకు స్వర్భానవియందు పుట్టినవాఁడు. పురూరవుని పౌత్రుఁడు ఇతని భార్య ప్రియంవద. పుత్రులు యతి యయాతి. సంయాతి ఆయాతి ఉద్ధవుఁడు అని ఏవురు. శ్రీమద్భాగ

వతమునందును విష్ణుపురాణ ు.నందును నహుషు ె కొడుకులు యతియయాతి సంయాతి, ఆయాతి, వియతి, కృతిఅ . ఆరుగురు చెప్ప బడివున్నారు. ఈతఁడు తన గుణాతిశయములచేత దేవతలవలన ప్రార్థింపఁబడి దేవేంద్రునికి బ్రహ్మహత్యా దోషము సంభవించి ఉండు కాలమున దివిజరాజ్యము చేసెను, అట్లయిన ఇతఁడు దేవరాజ్యము లభింపగానే గర్వించి వేద లను గూర్చి నిర్లక్ష్యముగా భాషించి నందున అగస్త్యుడు ఇత ని అజగరము అగునట్లు శపించెను. ఆ శాపము పాండవుల అరణ్యవాసకాలమున తాను అడిగిన కొన్ని ప్రశ్నములకుధర్మరాజు సమాధానము చెప్పగా విని నంతట తీరెను. (భార)

# నా

నాగ వన్వము : ఇది ఒక పుణ్యక్షేత్రము. ఇందు వాసుకి ని నాగేంద్రత్వమునకు అభిషేకము చేసిరి.

నాగమాంబిక : కృష్ణదేవరాయల తల్లి.

నాగముఖ్యులు : కద్రువయందు కశ్యపునకు ఏవురు కొడుకులు పుట్టిరి. వారెల్ల నాగులు అయిరి. వారుశేష, వాసుకి, అయిరావత. తక్షక, కర్కోటక, ధనంజయ, కాలియ, మనినాగ, ఆపూరన, పింజర, యెలాపుత్ర, వామన, నీల, అనీల, కల్మాష, శబల, ఆర్యక, ఆర్ద్రక, కలశపోతక, సురాముఖ, దధిముఖ, విమల, పిండ, ఆదిత, శంఖ, వాలశిఖ, నిష్టానక, హేమనేత్ర, నహుష, పింగల, బాహ్య కర్ణ, అస్థికర్ణ, ముద్గరపెండక, కంబళ, అశ్వతర, కాళియవృత్త, సంహృత్తక, శంఖ ముఖ, కుష్మాండక, క్షేమక, పిండారక, కరవీర, పుష్పదంష్ట్ర, బిల్వక, బిల్వ పాండర, మూషికాద, శంఖశిరః, పూర్ణదంష్ట్ర, అరిద్రక, అపరాదిత, జోతిక, శ్రీవహః, కౌరవ్య, ధృతరాష్ట్ర, శంఖపిండ, పుష్కర, శల్యక, విరంజః, సుబాహు, శాలిపిండ, హస్తిపిండ, పిటరక, ముఖర, కోనసానిక, కుటర, కుంజర, ప్రభాకర, కుముద, కుముదాక్ష, తిత్తిరి. హలిక, కర్దమ, బహుమూలక, కర్కర, అకర్కర, కుండోదర, మహోదర, ప్రభృతులు.

నాగవీధి : ధర్ముని కూతురు. తల్లి జామి లేక యామి. నక్షత్రవీధి యొక్క ఉత్తరభాగమునకు అభిమానిని అగుదేవత.

నాచనసోమనాథుఁడు: ఇతఁడు ఒక గొప్ప ఆంధ్రకవి. ఉత్తర హరివంశము అనుమహా కావ్యమును, రచియించెను. ఇందలి ప్రయోగములును. దీని శైలియు అసదృశ ములు.

నానార్థరత్నమాల : ఒకానొక సంస్కృత నిఘంటువు. ఇది ఇరుగు పందద నాథుఁడు తను పండితునిచే చేయ్యబడినది.

నాభాగుఁడు : (1) ఇక్ష్వాకుని తమ్ముఁడు అయిన దిష్టునికొడుకు. ఇతఁడు తన కృత్యముల వలన వైశ్యత్వమును పొందెను. మార్కండేయ పురాణమున ఇతఁడు సుప్రభ అను ఒక వైశ్యస్త్రీని గాంధర్వ వివాహమున పెండ్లాడి నందున వైశ్యుఁడు ఆయెను. అని చెప్పఁబడి ఉన్నది. వీని కొడుకు బలంధనుఁడు పుట్టినందున అతనికి క్షత్రియత్వము పోలేదనుచున్నాఁడు. మఱికొందఱు అతఁడు తన తపోబలముచేత మరల రాజర్షి అయినట్లు చెప్పెదరు. (2) ఇక్ష్వాకుని మఱియొక తమ్ముఁడు అయిన నభగుని పుత్రుఁడు. ఇతఁడు అంబరీషుని తండ్రి ఇతని సత్యమునకు మెచ్చి రుద్రుఁడు అంతర్దర్శిత్వంబును సనాతనంబగు బ్రహ్మజ్ఞానమును ఇతనికి ఉపదేశించెను. (3) ఇ॥ సుహోత్రుని కొడుకు. (మార్క)

నాభి : ఆగ్నీధ్రుని తొమ్మండ్రు కొడుకులలో ఒక్కఁడు. ఈతని పాలికి జంబూద్వీపము వచ్చెను. భార్య మేరుదేవి. కొడుకు ఋషభుఁడు చూ॥ భరత ఖండము. (భార) (విష్ణు)

నారదీయము : (1) పదునెనిమిది పురాణములో ఒకటి. ఇది నారదప్రోక్తబృహత్కల్ప ధర్మాదులను కలది. దీని గ్రంథ సంఖ్య 25000. (2) ఉపపురాణము లలో ఒకటి.

నారదుఁడు : బ్రహ్మకొడుకు. ఇతఁడు కడచిన మహాకల్పమునందు ఉపబర్హణుఁడు అను గంధర్వుఁడుగా ఉండి ఒకనాఁడు విశ్వస్రష్టలు అయిన బ్రాహ్మణులు దేవసత్రము అనియెడు యాగమును చేయుచు నారాయణ కథలు గానముచేయ ఇతనిని పిలువబంపిరి. అప్పుడచ్చటికితడు పోయి కొన్ని విష్ణు గాథలుపాడి అందు వచ్చియుండిన సతులను చూచి మోహితుఁడై వారలను కూడి చనెను. అంత ఆ బ్రాహ్మణులు కోపించి యితనిని శూద్రజాతికి సుతుడవగుమని శపియింపగా అట్లుపుట్టి పూర్వజన్మవాసనవలన బ్రహ్మవాదులయిన పెద్దలకు శుశ్రూషలుచేసి,

అప్పుడ్యోషున నీ మహాయుగమునందు బ్రహ్మమానస పుత్రుడై జన్మించెను.
చూ॥ పర్వతుడు.

ఇతడు కలహప్రియుడు. దక్షప్రజాపతి కొడుకుల నందఱకు విరక్తిమార్గము ఉపదేశించి సృష్టికి పరాఙ్ముఖులనుగా చేసినందున ఇతనిని అతడు అనపత్యుడును అస్థిరుడును అగునట్లు శపించెను.

(న. రా.) (మార్క) (బ్ర వై.) (భాగ) (భార)

నారసింహకవి : ఒక ఆంధ్రకవి. ఇతఁడు విష్ణుమాయావిలాసమును ద్విపదగా రచియించెను.

నారసింహము : ఇది ఉపపురాణములలో ఒకటి.

నారయణకవచము: ఇది ఒక మహామంత్రము దీనిని జపియించిన విష్ణుభక్తులకు మోక్షము కలుగును.

నారాయణ గోపాలురు : కృష్ణునితో సమానమైన బలపరాక్రమములుకల పదివేవురు గొల్లవాండ్రు. భారతయుద్ధమున దుర్యోధనునికి సహాయము వచ్చి అర్జునునిచేత చంపఁబడిరి.

నారాయణాఖ్యానము: నారాయణ ఋషిచే నారదునకు చెప్పఁబడిన శ్రుతిగీత. ఒకనాఁడు నారదుఁడు నారాయణాశ్రమమునకు చని ఋషిగణ సమేతుఁడు అయిన నారాయణ ఋషిని, సత్త్వాదిగుణ శూన్యము అయిన బ్రహ్మమునందు సత్త్వాదిగుణ గోచరములయిన వేదములు ఏక్రమమున ప్రవర్తించును అని అడుగగా ఆమహర్షి అంతకుముందు సనకసనందనాదులకు బ్రహ్మ చెప్పిన ప్రకారము పరమ తత్త్వార్థ ప్రతిపాదకము అయిన శ్రుతిగీతలను నుడివెను.

నారాయణామాత్యుడు: ఒక ఆంధ్రకవి. ఇతఁడు హంసవింశతి అను గ్రంథమును రచియించెను. ఇతడే ప్రపంచ తంత్రమును పద్యకావ్యముగా చేసెను అని చెప్పుదురు.

నారాయణుడు : భగవంతుడు అయిన ఈశ్వరునకు నామము. నారము అనఁగా ఉదకము అధిష్ఠానముగా కలవాడు. కనుక భగవంతుఁడు నారాయణుఁడు అనఁబడును. మహాప్రళయమప్పుడు సమస్తము జలార్ణవము అయి అంతట అంధ

కారము నిండిపో^దగా, భగవంతు(డు ఆజలముపైని యోగనిద్రను తేలుచు ఉండి యజ్ఞవరాహరూపమును పొంది జలమున మునిగి ఉన్న భూమిని పైకిఎత్తి నీటి పైవి నావచందంబున తేలించెను. ప్రళయకాలమున తునియలు అయిన పర్వతాదు లను మరల ఎప్పటి యట్ల కావించి సమస్తమును చక్కచేసెను,

నాంకవచుడు : ఇ॥ నా॥ చూ॥ మూలకు(డు.

నారీతీర్థములు : సౌభద్రము. పౌలోమము, కారండవము, ప్రసన్నము, భారద్వా జము, అనునామములతో దక్షిణాపథమునందు ప్రసిద్ధములు అయిన పంచతీర్థ ములు. ఇందు ఒక మునిశాపమున నంద, పౌరభేయి, సమీచి. వర్చిలత, అను వారు అయిదుగురు అప్సరసలు మహాగ్రాహములు అయి ఉండగా అర్జును(డు తీర్థ యాత్రచేయు కాలమున వారిని శాపవిముక్తులనుగా చేసెను.

(భార)

నావా(డ : ఆంధ్రదేశమున ఒక సామాంతరాజు పట్టణము.

నాలాయని : నలాయను(డు. అను ఋషి కూతురు ఈమె పేరు ఇంద్రసేన ఈమె మౌద్గల్యు(డు అను కుష్టరోగి అయిన ఋషికి భార్య అయి ఉంది పిమ్మట ద్రౌపది అయి జన్మించి పాండవుల ఏవురకు భార్య ఆయెను. చూ॥ ద్రౌపది.

నాళీజంఘు(డు : ఒక బకశ్రేష్ఠు(డు. నా॥ రాజధర్ము(డు మధ్యదేశమునందు గౌతము(డు అను బ్రాహ్మణుని కుమారు(డు. ఒక(డు వేదాధ్యయనాది, విప్రకర్మ విరహితు(డు అయి బోయలతో కలసి ధనము ఘటింప తిరుగుచు ఒకనా(డు నాళీజంఘుని యొద్దకు పోగా అత(డు తన సఖు(డు అగు ఒక దైత్యభర్తవలన వానికి ధనము యిప్పించెను. ఆ ధనమును కైకొని పోవునపు(డు ఆ క్రూరు(డు కొంత అయిన నెనరు లేనివాడు అయి నిద్రపోవుచు ఉన్న నాళీజంఘుని తన ఆహారార్థము చంపెను. అంత నాళీజంఘుని చెలికా(డు అగు దైత్యు(డు ఇది ఎఱిగి ఆ బ్రాహ్మణుని వధించెను. వా(డు కృతఘ్నుడు అయినందున వాని మాంసమును కుక్కలు కూడ ముట్టవయ్యె ఆవల నాడీజంఘు(డు తన మహనీయత వలన పునర్జీవితు(డు అయి ఆ బ్రాహ్మణుని మరల బ్రతికించి ఇక ఇట్లు చేయకుము. అని బుద్ధి చెప్పి పంపెను,

(భార)

# ని

**నికుంభుండు** : (1) ఇ॥ ఇతని తండ్రి హర్యశ్వుఁడు కొడుకు బర్హిణాశ్వుఁడు అమితాశ్వుడు లేక సంభవాశ్వుఁడు లేక సంహతాశ్వుఁడు అనఁబడును. (2) ర కుంభకర్ణునికొడుకు. వీడు హనుమంతునిచే చంపఁబడెను. (భార)

**నికృంతనము** : ఇది ఒక నరకము. ఇందు అనేకములు అగు కుమ్మరిసారెలు ఉండును. వానిచే క్రూరకర్ములు త్రిప్పఁబడి చెడియు మరల యాతనాధారులు అయ్యెదరు.

**నిచకుఁడు** : క॥ అభిమన్యునికి ఏడవతరమువాఁడు. వీని కాలమున హస్తినా పురము గంగయందు మునిగిపోయి, ఆవల కౌశాంబి రాజధాని అయ్యెను.

**నిదాఘుఁడు** : పులస్త్యుని కొడుకు. ఋభుని శిష్యుఁడు.

(విష్ణు)

**నిబంధనకారులు** : శ్రుతిస్మృతులను సూత్రమున్ బట్టి ఆచారవిధులను ఏర్పఱచిన కొందఱు పురోహితులును, ఆచార్యులును, వానియందు ముఖ్యముగా శుభాశుభ కర్మముల యొక్క ప్రయోగములను గుఱించి చెప్పఁబడియుండును. అవి యల్లాజీయము నిర్ణయసింధువు ధర్మప్రవృత్తి ధర్మసింధువు అభినవషడశీతి వైద్యనాథ దీక్షితీయము హేమాద్రి పరాశరమాధవీయము మొదలగునవి.

**నిబంధనగ్రంథములు** : అనేక విహిత ధర్మములు శ్రుతి స్మృతుల యందు కాక మఱి కొన్ని నిబంధన గ్రంథముల యందు చెప్పబడి ఉన్నవి. వాని యందు ఒక్కొక్క విషయమును సిద్ధాంతీకరించి దానికి ప్రమాణముగా స్మృతివాక్యములను ఉదాహరించి వానిపై పెద్దల అభిప్రాయములను నిరూపించి స్థాపించి ఉందురు. బహుతరముగా నీ నిబంధన గ్రంథములను అనుసరించియే లోకమున ఆచారములు జరుగుచు వచ్చును. ఇవి అన్నియు ఆచారకాండము వ్యవహారకాండము ప్రయాచిత్త కాండము అని మూడు భాగములుగ ఉన్నవి.

**నిమి** : ఇక్ష్వాకు పుత్రులలో ఒకఁడు. ఇతఁడు ఒకానొకసమయమునందు ఒక యాగముచేయ కోరి తన పురోహితుఁడు అయిన వసిష్ఠుని యొద్దకుపోయి తాను చేయఁ బూనిన యజ్ఞమును నడిపింప ప్రార్థించెను. అందులకు అతఁడు నన్ను ఇంతకుముందే ఇంద్రుఁడు తన యజ్ఞ అధ్వర్యుడుగా వరించిపోయి ఉన్నాఁడు

కనుక ఆయజ్ఞమును నెరవేర్చి వచ్చి నీయజ్ఞమును నడిపెదను అని చెప్పెను. దానికి ఇతఁడు కోపించి ఆయనను విడిచి గౌతమమహర్షిని వరించి అతనిచేత యజ్ఞముసు సాధించెను. అనంతరము వసిష్ఠుడు ఇంద్రుని యజ్ఞమును నెరవేర్చి వచ్చి ఇతనియొక్క ఇంటివాకిటచేరి కాచి ఉండెను. అప్పుడుఁ బడలికచేత పగలు అని యెంచక ఇతఁడు నిద్రించుచు ఉండెను. కనుక ఆ వృత్తాంతము విచారింప అనుకూలింపకపోయెను. అంతట వసిష్ఠుడు కులగురుడను అగు నన్ను విడిచి యజ్ఞము చేయుట కాక నేప వచ్చి వాకిట నిలిచిఉన్నను విచారింపక మత్తుడై నన్ను అవమానించిన ఈ దుష్టుఁడు అంగహీనుఁడు అగుగాక అనిశపించెను. అది హేతువుగా ఇతఁడును వసిష్ఠుని అట్లే శపించెను. అపుఁడు బ్రహ్మ వీరి తెలుగు ఎఱిగి సకల ప్రాణుల కనుఱెప్పలయందు వశించునట్లు నిమిని, వసిష్ఠుని మిత్రావరుణులకు కొడుకై దేహధారి అగునట్లును అనుగ్రహించెను. కనుకనే ఱెప్పపాటునకు నిమిషము అనుపేరు కలిగెను. ఇతని కొడుకు మిథిలుఁడు.

(ఉ. రా విష్ణు)

**నిమ్నుఁడు** : య॥ అనమిత్రుని జ్యేష్ఠపుత్రుడు ఇతని కొడుకులు సత్రాజిత్తు ప్రసేనుఁడు. అను ఇరువురు. (భాగ)

**నియతి** : మేరువు కూతురు విధాతభార్య (బ్రహ్మ)

**నిరృతి** : అష్టదిక్పాలకులలో ఒకడు. ఇతఁడు ఏలునట్టి దిక్కు దక్షిణ పశ్చిమము భార్య దీర్ఘాదేవి. వాహనము నరుఁడు. పట్టణము కృష్ణాంగన ఆయుధము కుంతము.

**నివాతకవచులు** ; దైత్యులలో ఒక తెగవారు ప్రహ్లాదుని వంశస్థులు. భారతము వీరిని దానవులు అని చెప్పి ఉన్నది. వీరు అందఱును తుల్యరూప బలప్రభలు కలవారు. వీరి సంఖ్య ముప్పదికోట్లు. సముద్రమధ్యము వాసస్థానముగాచేసికొని దేవతలకు మిక్కిలి బాధకావించుచు ఉండగా వీరిని ఇంద్రప్రేరితుడై అర్జునుఁడు చంపెను.

(భార)

**నిశాకరుఁడు** : 1. ఒకానొక ఋషి. ఇతని ఆశ్రమమునందు ఉండి సంపాతియు జటాయువును మింటికి ఎగసి సూర్యుని కిరణముల వేడిమికి తాళలేక మూర్ఛిల్లి

జటాయువు జనస్థానమునందు పడగా సంపాతి మఱియూ మీదికి ఎగసి సూర్యుని కిరణముల సెగచే ఱెక్కలు కాలి అందుండి ఈ మునివరుని ఆశ్రమమునపడి దుఃఖించుచు ఉండెను. అది చూచి కరుణించి ఈ నిశాకరుఁడు రఘువంశ శేఖరుఁడు అగు శ్రీరాముఁడు తన భార్యను కపట రాక్షసునిచే కోలుపోగలడు. అపుడు ఆ దేవిని హనుమంతాది వానరులు వెదుక వత్తురు. నీవు ఆ వానరులకు రాముని భార్య అగు సీత ఉండు చోటు తెలియఁ బరచితివేని నీ ఱెక్కలు మరల మొలచును, అంత పర్యంతము ఇచ్చటనే వసింపుము. అని అనుగ్రహించెను. ఈతని ఆశ్రమము వింధ్య పర్వతమునందు ఉండెను. (2) చంద్రునికి నామాంతము.

(రామా)

నిశుంభుడు : దే॥ చూ॥ శుంభ నిశుంభులు.

నిషధము : వింధ్య పర్వత సమీపమున పయోష్ణీ నదీతీరమునందు ఉండు దేశము. దీనికి నలుఁడు రాజుగా ఉండెను.

నిషధుఁడు : 1. కురుని నాలవ కొడుకు 2. శ్రీరాముల కొడుకు అగు కుశుని పౌత్రుఁడు.

## నీ

నీపుఁడు : బా॥ పారుని కొడుకు. ఇతనికి నూర్వురు కొడుకులు కలరు. వారిలో జ్యేష్ఠుఁడు సమరుఁడు. అతఁడు కాంపిల్యాధిపతి ఆయ్యెను.

(మార్క)

నీలకంఠక్షేత్రము : హిమవత్పర్వత సమీపమున కౌశికీనది పుట్టుచోటు.

నీలుఁడు : (1) పు॥ అజమీఢుని కొడుకు. 2. రాజసూయయాగమున పాండవులు దిగ్విజయముచేయు నవసరమున సహదేవునితో యుద్ధము చేసిన మహిష్మతీపురి రాజు. 3. అగ్నివలన పుట్టిన ఒక వానరుఁడు. సుగ్రీవుని సేనానాయకులలో ఒకఁడు.

(రామా) (భార) (వరా)

## నృ

**నృగుఁడు** : 1. వైవస్వతమనుని రెండవ కొడుకు. ఇక్ష్వాకుని తమ్ముడు. ఇతఁడు మహాఖ్యాతికి ఎక్కిన రాజు. వాపీకూప తటాకవనములు అనేకములు ఇతఁడు ప్రతిష్ఠ చేసెను. అయినను ఇతఁడు ఒకప్పుడు అజ్ఞానముచే ముందు తాను ఒక బ్రాహ్మణునికి దానము ఇచ్చిన గోవును మరల ఇంకొకనికి దానము ఇచ్చుట జేసి ఊసరవెల్లి అయి శ్రీకృష్ణు సంస్పర్శనదర్శనముల వలన ఆ రూపము మాని దివ్యరూపధరుఁడును దివ్యవిమానారూఢుఁడును అయి దివమునకు చనియెను.
(2) అ॥ ఉశీనరుని రెండవ కొడుకు. (భార) (వరా)

**నృసింహకవి** : ఒక ఆంధ్రకవి. ఇతఁడు కవి కర్ణరసాయనము. లేక మాంధాత చరిత్రము అను కావ్యము రచియించెను.

## నై

**నైమిశము** : ఒక అడవి. తొల్లి మరీచి అత్రి భృగు వశిష్ఠుఁడు క్రతు అంగిరసుడు. వీరి వంశజులగు ఆరు తెగలవారు తాము తపము ఆచరింప తావు చూపుము అని బ్రహ్మను వేడగా అతఁడు మనోమయచక్రమును ఒకటి సృజియించి దానిని దొర్లించి వారల కాంచి మీరు ఈ చక్రమును వెన్నంటి చనుడు, అది యెచ్చట నిలుచునో అదియే మీకు తగిన చోటు అగును అని ఆనతిచ్చెను. అది పోవుచు పోవుచు ఒకచోటనేమి (అనగా చక్రపు ఇనుపకట్టు) వదలి తట్టుపడెను. ఆ స్థలము నైమిశము అనపరగెను. ఈ నైమిశము పురాణ ప్రసిద్ధమైన అరణ్యము. పెక్కండ్రు ఋషులు అనేక సంవత్సరములు ఇచట తపము ఆచరించుట వలన దీనికి మహాపుణ్య క్షేత్రమని కొనియాడుదురు.

(వరా) (స్కాంద) (బ్రహ్మ)

**నైషధము** : పంచకావ్యములలో ఒకటి. ఇది శ్రీహర్షు చేత చేయఁబడినది. దీనికి మల్లినాథసూరి వ్యాఖ్యానము రచించి ఉన్నాఁడు. నిషధదేశపురాధీశుఁడు నిషధుఁడు (నలమహారాజు) అతని కథ ఇందు చెప్పఁబడుటచేత దీనికి ఈపేరు కలిగెను.

న్యా

న్యగ్రోధుఁడు : య॥ కంసుని తమ్ముఁడు.

నాకీయశాస్త్రము : ప్రత్యక్షాను మానాది ప్రమాణములను. ఎఱుఁగ తగిన శాస్త్రము. ఇదియే తర్కశాస్త్రము అనఁబడును,

# ప

పంచ గౌడులు : సారస్వతము, కన్యాకుబ్జము, మిథిలము, గౌడము ఉత్కలము, అను ఈ అయిదు దేశములయందలి బ్రాహ్మణులు.

పంచచూడ : ఒక అప్సరస. నారదుఁడు ఒకప్పుడు వనితల స్వభావము ఎట్టిది అని అడుగగా ఈపె అతనికి ఆవిధము అంతయు చెప్పెను.

పంచజనుఁడు : 1. ది॥ సంహ్లాదుని కొడుకు. 2, సాందీపుని పుత్రుని ప్రభాస తీర్థములోనికి తీసికొనిపోయిన రాక్షసుఁడు. వీడు తన గురుపుత్రుని కొనిపోయెను అని కృష్ణుఁడు వీనిని చంపి వీని మెడ యెముకను పుచ్చుకొనెను. అదియే పాంచ జన్యము అనఁబడిన కృష్ణుని శంఖము. (విష్ణు)

పంచద్రావిడులు : ఆంధ్రము, ద్రవిడము, కర్నాటకము, మహారాష్ట్రము ఘూర్జరము ఈ ఐదు దేశములయందలి బ్రాహ్మణులు.

పంచపర్వములు : సంక్రమణము, అమావాస్య, పూర్ణమాసి, కృష్ణాష్టమి, కృష్ణ చతుర్దశి, అనునవి అయిదును.

పంచలింగములు : పృథివ్యాపస్తేజోవాయు రాకాశాత్మకములు ఆయిన అయిదు లింగములు. అందు పృథివీలింగము కంచియందును, అబ్లింగము జంబుకేశ్వర మందును, తేజోలింగము అరుణాచలమునందును, వాయులింగము కాళహస్తి యందును, ఆకాశలింగము చిదంబరమునందును ఉండును. ఈ అయిదును శివక్షేత్రములలో మిక్కిలి మహిమకలవి.

పంచవటి : రాముఁడు వనవాసముచేయునపుడు దండకారణ్యమునందు ఆశ్ర మము కావించుకొనియున్నచోటు. అయిదు మఱ్ఱిచెట్ల చేరిక అని శబ్దార్థము ఇది గోదావరి పుట్టు తావునకు సమీపమున నుండును. ఈ తావున నిపుడు నాసికా పురి యున్నది. (రామా)

**పంచశిఖుఁడు** : రు॥ ఇతడు తత్త్వజ్ఞానఘనుడు అని ప్రసిద్ధి. మిథిలాధినాథుడైన జనకునికి తత్త్వోపదేశము చేసిన మహాత్ముఁడు.

**పంచసాయకుడు** : మన్మథుడు. అయిదు బాణములు కలవాడు. అనుశబ్దార్థములు, అవి అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునవి.

**పంచాప్సరసము** : ఒకానొక కొలను. దీనిని మందకర్ణుడు నిర్మించెను. ఇది దండకారణ్యమునందుండును.

**పంప** : ఒకానొక సరస్సు; ఇది కిష్కింధాపురమునకు సమీపమున ఉండును.

**పతంజలి** : సంస్కృత వ్యాకరణమునకు భాష్యము కావించిన విద్వాంసుఁడు, ఇతడుయోగశాస్త్ర ప్రవర్తకుడు. ఈతనిని ఆదిశేషావతారమందురు.

(బ్రహ్మ)

**పదార్థచింతామణి** : ఒకానొక వైద్యశాస్త్రము. ఇందు సమస్త పదార్థముల గుణాగుణములు చెప్పఁబడి ఉండును.

**పద్మనాభుడు** : విష్ణువునకు నామము.

**పద్మావతి** : వింధ్యపర్వతసమీపదేశమునందలి ఒక పట్టణము.

**పయోష్ణి** : ఒకానొకనది. ఇది విదర్భదేశము గుండ ప్రవహించి వరదయందు సంగమము అగును.

**పరమేష్ఠి** : 1. బ్రహ్మకు నామాంతరము. 2 ఇంద్రద్యుమ్నుని కొడుకు.

**పరశురాముడు** : జమదగ్ని కొడుకు. తల్లి రేణుక. విష్ణువు యొక్క దశావతారములలో ఆరవ అవతారము. ఇతఁడు తన తండ్రిని కార్తవీర్యార్జునుని పుత్రులు హోమపశువు కొఱకు చంపగా వారిపై కోపించి భూమిని క్షత్రియ శూన్యముగా చేయ నిశ్చయించి ముయ్యేడు మారులు రాజులమీద దండెత్తి గర్భములనున్న పిండములతోడ చంపి వారి నెత్తుటచేత పితరులకు తర్పణ చేసెను. మఱియు ఆ నెత్తురు శమంతపంచకము అను పేర అయిదు మడుగులు అయ్యెను. ఇతఁడు రుద్రుని గూర్చి ఘోరతపము ఆచరించి అతనికి శుశ్రూష చేయునట్లు వరము నంది ఆవల అతని యనుగ్రహమున దివ్యాస్త్రచయములు పడసె. అస్త్రవిద్యయందు ఇతనితో సమానులు లేరు. ఇతఁడు చిరంజీవి. చూ॥ జమదగ్ని.

(భార) (బ్రహ్మ)

**పరావసువు** : ఋ॥ రైభ్యుని కొడుకు అర్వావసుని సోదరుఁడు.

**పరాశరస్మృతి** : కలియుగమునందు అనుష్ఠింపవలయు ధర్మములనుఁ గూర్చి చెప్పునట్టి ధర్మశాస్త్రము. విద్యా నారాయణుఁడు అనఁబరగిన మాధవాచార్యులు మిగుల విచారణచేసి దీనికి మాధవీయము అను గొప్ప వ్యాఖ్యాన గ్రంథమును చేసి ఉన్నాడు,

**పరాశరుఁడు** : వసిష్ఠు పౌత్రుఁడు; శక్తిపుత్రుడు; వ్యాసుని తండ్రి. శుకుని పితామహులు ఇతఁడు తన తండ్రి అగు శక్తిని రాక్షసుఁడు మ్రింగెను అని (చూ॥ కల్మాషపాదుఁడు.) క్రోధముచే లోకములోని ఎల్ల రాక్షసులు నాశము అగునట్లు సత్రయాగము ఒకటి చేయగా దాని చూచి పులస్త్య, పులహ, క్రతువులు వసిష్ఠుని యొద్దకు వచ్చి నీ పౌత్రుని సత్రయాగమును ఉడిగింపుము అని వేడిరి. అంతట వసిష్ఠుని ఉపదేశమున ఇతఁడు ఆ సత్రమును ఉడిపెను. ఒకనాఁడు పరాశరుఁడు యమునానదిని దాటిపోవలసి పడవ రేవునకుపోయి పడవ ఎక్కి పోవుచు ఆపడవను నడుపుచున్న దాశరాజు కూతురు అగు సత్యవతిని చూచి మోహించి ఆమెకు యోజనగంధిత్వమును అనుగ్రహించి చుట్టుపట్టుల వారికి తన పొలకువ కానరాకుండునటుల ఒక చీకటిని కల్పించి ఆమెను కలసెను. అప్పుడు ఆమెయందు అతనికి సద్యోగర్భమున వ్యాసుఁడు పుట్టెను.

**పరీక్షిత్తు** : 1. కురుని కొడుకు.

2. అభిమన్యుని కొడుకు. తల్లి ఉత్తర. కొడుకు జనమేజయుఁడు ఇతఁడు ఒక నాఁడు వేటాడపోయి ఒక వనమునందు తన ఏటు తప్పించుకొని పారిపోయిన మృగమును వెదకుచు మౌనవ్రతము ధరించి తపస్సుచేయుచు ఉండిన శమీకుఁడు అను ఋషిని కని మృగము ఎటుపోయెను. అని అడిగి అతఁడు ఉత్తరము చెప్పక పోగా తన్ను అతఁడు లక్ష్యము చేసి మాటలాడకపోయెను అని యెంచి ఒక మృత సర్పకళేబరమును అతని కంఠమునందు మాలగా వైచి తన పురమునకు వచ్చి చేరెను. అంతట కొడుకు అగు శృంగి తన తండ్రి మెడను రాజు చచ్చిన పామును వైచి పోయెను అనుమాట విని అది మొదలు ఏడుదినములలోపల ఇతడు తక్షక నాగముచే కరవఁబడి చచ్చును గాక అని శపించెను. ఆ వృత్తాంతము ఇతఁడు విని విరక్తుఁడై శుకమహర్షివలన భాగవతమును విని ఆ యేడవనాఁడు తక్షకుడు వచ్చి కరవగా మృతుడై ముక్తిని పొందెను. పిదప ఇతని కొడుకు అగు

జనమేజయుడు రాజ్యముచేయు కాలమున ఉదంకుఁడు అను ఋషి (తాను గురు కార్యార్థము పోయినపుడు తనకు అపరాధము చేసిన తక్షకుని యందలి విరోధము చేత) జనమేజయుని వద్దకుపోయి మీ తండ్రి అగు పరీక్షిత్తును తక్షకుడు కరచి చంపెను కనుక అట్టి దుష్టుని సపరివారముగ నాశము చేయుట ఉత్తమము అని చెప్పి అతనికి సర్పయాగముచేయు బుద్ధిని పుట్టించెను. అట్లు ఉదంకునిచే ప్రేరింపఁబడి జనమేజయునిచే చేయఁబడిన సర్పయాగము వాసుకి చెలియలు అగు జరత్కారు కొడుకు ఆస్తీకునిచే నివారింపఁబడెను. అనంతరము జనమేజయుడు వ్యాసుని ఆనుమతిని భారత కథను వైశంపాయనునిచే వినెను.

3, సూర్యవంశమున పుట్టిన రాజులలో ఒకఁడు ఇతఁడు అయోధ్యను ఏలుచుండెను. అని భారతమున చెప్పఁబడి ఉన్నది. ఇతఁడు ఒకప్పుడు వేటాడఁబోయి మార్గమున సుశోభ అను పేరుగల మండూకరాజు కూతురు అగు ఒక కన్యను వివాహమై ఆమె యందు ముగ్వురు పుత్రులను పడసెను. ఆమె మిక్కిలి దుష్ట ప్రవర్తనము కలది అయి అనేకులను ప్రసిద్ధులగు రాజులను చిక్కులు పెట్టినందున తన పుత్రులు కపటులు అగునట్లు తన తండ్రిచే శపింపబడెను.

(భార) (భాగ)

పర్జన్యుఁడు : మేఘములకు అధిదేవత. ఇది సూర్యవరుణ ఇంద్రులకు నామాంతరము అయి ఉండెను.

పర్వతుఁడు : నారదుని చెల్లెలు కొడుకు, ఇతఁడును నారదుఁడును మహీమండలమున సంచరించు కుతూహలముతో వెడలి తమ నిజచిత్తవృత్తులను ఒండొరులకు దాపక ఉండునట్లు సమయము చేసికొని పోవునపుఁడు ఒకకాలమున సృంజయుఁడు అనురాజుపాలికి పోయి అతని ప్రార్థనచే అతని కొమార్తె అగు సుకుమారి అను కన్యక వలన పరిచర్యలను కైకొనుచు కొన్ని దినములు ఉండిరి, అప్పుడు నారదుఁడు ఆ చిన్నదాని యందు మోహము కలవాడు అయి నానాట కృశించుటను చూచి తత్కారణమును తనకు తెలియచేయమికి ఆ చిన్నదాని పాణిగ్రహణానంతరము నారదుని వానరముఖుఁడు అగునట్లు పర్వతుడు శపించెను. అందుకు నారదుఁడు పర్వతునికి నాకలోకమునకు పోక ఉండునట్లు ప్రతిశాపము ఇచ్చెను. ఆవల కొంతకాలమునకు వెనుక వీరు ఇరువురును అన్యోన్యశాపవిమోచనము చేసికొనిరి,

(లింగ) (శివ) (భార)

పర్వతభూములు : ఆర్యావర్తమునకు వెలుపల ఉండుమ్లేచ్ఛము తురుష్కము మొదలగు ధర్మాధర్మ వివేకశూన్యులు అయిన సంకీర్ణవర్ణజాతులు అగు కిరాతుల దేశములు.

పలాశిని : ఒకానొకనది. ఇది శుక్తిమంతమునందు ఉత్పత్తి అయి మహానదితో సంగమము అగును.

పల్వలుఁడు : ర॥ ఇల్వలుని కొడుకు. బలరామునిచే చంపఁబడెను. (భాగ)

పశుపతి : (1) రుద్రునకు నామము (2) అష్టమూర్తులలో ఒకఁడు. (వరా)

## పా

పాంచజన్యము : విష్ణుశంఖము. చూ॥ పంచజనుడు.

పాంచాలము : ఒకానొక దేశము ఇది హస్తినాపురమునకు వాయవ్యమున వామవంతమునకును చర్మన్వతికిని నడుమ ఉండును. దీనికి ఈ నామము పూర్వము ప్రసిద్ధము ఆయి ఉండెను. అజమీఢుని రెండవ కొడుకు అగు నీలుని వంశస్థుఁడు అయిన భర్మ్యాశ్వుఁడు తన ఏవురు పుత్రులను చూచి వీరేవురు తన విషయములకు (అనగా దేశములకును శబ్దాది విషయములకును నర్థము.) చాలుదురు. అవి పలికెను. కనుక పంచ అలం అను రెండు శబ్దములనుండి పాంచాలము అను నామము కలిగెను. ఈ దేశము ఉత్తర పాంచాలము దక్షిణ పాంచాలము అని రెండు భాగములు ఆయి ఉండును. అందు ఉత్తరపాంచాలమునకు అహిక్షేత్రము ముఖ్యపట్టణము. దక్షిణపాంచాలమునకు మాకందియు కాంపిల్యమును ముఖ్యపట్టణములు. పాంచాలరాజులు సంవరునుని హస్తినాపురమునుండి వెడలకొట్టినట్లును కురురాజు మరల ఆ పట్టణమును జయించి వశపఱుచుకొనినట్లును తెలియవచ్చు చున్నది.

పాండవులు : పాండురాజు కుమారులు. వీరు ఐదుగురు. 1. ధర్మరాజు 2. భీమసేనుడు 3. అర్జునుఁడు 4. నకులుడు5. సహదేవుఁడు. ఇందు మొదటిమువ్వురును కుంతికొడుకులు కావున కౌంతేయులు అనియు, కడపటి ఇరువురు మాద్రి కొడుకులు కనుక మాద్రేయులు అనియు చెప్పబఁడుదురు. వీరు పాండురాజు మృతిచెందిన పిదప హస్తినాపురి యందు ధృతరాష్ట్రుని వద్ద పెరుగుచు ధనుర్వేదాది విద్యల యందు మహా నిపుణులు అయి ఉండగా వీరి మేలిమి చూచి ధృతరాష్ట్రుని పెద్ద

కొడుకు అయిన దుర్యోధనుఁడు ఓర్వఁజాలక శకుని కర్ణదుశ్శాసనులతో కూడుకొని అనవరతము వీరలకు హింసకావించుచు ఉండెను. అదియెట్లనిన ఒకనాడు దుర్యోధనుడు భీముడు నిద్రపోవుచు ఉండుతఱిని అతనినిలావుత్రాళ్ళతో కట్టి గంగ మడువునందు త్రోయించెను. మఱియొక నాడు అతని సర్వాంగములందును కృష్ణ సర్పములను పట్టికఱపించెను. ఇంకొకనాడు భోజన సమయమునందు వానికి విషము పెట్టించెను. అతఁడు అనంత సత్వుడును దివ్యపురుషుడును కాన అవియెల్ల అతనిని చంప నేరవయ్యెను. మఱియు దుర్యోధనుఁడు పాండవులకు అందఱకును అపాయము చేయసమకట్టి వారణావతమునందు లక్కయిల్లు ఒకటి కట్టించి అందు పాండవులను చేర్చి అనలము దరికొల్పయత్నింపగా వారు ఈవృత్తాంతము విదురుని మూలముగా ఎఱిగి అచట నుండి తప్పించుకొని పోయి జననీ సహితముగ విప్ర వేషధారులు అయి ఏకచక్రపురము నందు కొంత కాలముండి అనంతరము ద్రుపదరాజు పట్టణమునకు పోయి అచట అర్జునుడు ద్రౌపదీస్వయం వరమున మత్స్యయంత్రమును ఆశ్రమమున ఉరలనేసి సకలరాజలోకంబు ఓడించి ద్రౌపదిని చేకొని గురు వచనంబున ఆమెను ఏవురును వివాహము అయిరి. అంత ఆ వృత్తాంతము అంతయు ధృతరాష్ట్రుడు ఎఱిగి పాండవులను రావించి వారికి అర్థ రాజ్యము ఇచ్చి ఇంద్రప్రస్థపురమున ఉండపంచిన వారి రాజ్య విభూతియు గుణ సంపదయు చూచి దుర్యోధనుఁడు ఓర్వఁజాలక శకునిసైతమున మాయజూదము ఆడి ధర్మరాజును పరాజితునిచేసి పండ్రెండు ఏండ్లు వనవాసమును ఒకఏడు జనపదమున అజ్ఞాతవాసమును చేయునట్లుగా సమయముచేసి భూమి వెలువరించెను. అట్లుపాండవులు వనవాసముచేసి సమయము తప్పక అజ్ఞాతవాసము జరపి మరలి వచ్చి తమపాలు అడిగిన యియ్యక దుర్యోధనుఁడు వారలతో విరోధించి ఎదిరించి యుద్ధముచేసి మడిసెను. పాండవులును శత్రువులను చంపి మరల రాజ్యముసైకొని అశ్వమేధాది యాగములచే జనులకు హర్షము కావించుచు నుండి కృష్ణనిర్యాణానంతరము పరీక్షిత్తునకు రాజ్యాభిషేకముచేసి స్వర్గా రోహణము కావించిరి.

(భార)

**పాండురాజు** : విచిత్రవీర్యుని రెండవ కొడుకు. తల్లి అంబాలిక. అన్న ధృతరాష్ట్రుఁడు. ఇతనికి కుంతి, మాద్రి అని ఇరువురు భార్యలు కలరు. ఒకనాఁడు ఇతఁడు వనమునందు వేటాడుచు ఉండి, మృగరూపధారులై క్రీడించుచు ఉండిన ఒకఋషిని అతని పత్నిని పొడగని వాస్తవమున జింకలే అని ఎంచి యేసెను.

అపుడు అ మునిదంపతులు ఆ ఏటున నొచ్చి తమ నిజరూపములతో కనఁబడి ఆవేదన సహింపచాలక మా అసువులను ఇపుడు ఎడబాయ చేసితివికావున నీవు నీ భార్య లతో సంభోగించిన యెడమరణము ఒందుదువుకాక అని శపించి తమ ప్రాణములను విడిచిరి. కనుకనే ఈ పాండురాజునకు సంతానము పొందు యోగ్యత లేక పోయెను. చూ॥ కుంతి. ఇతఁడు మరుద్గణాంశమున జనియించెను. (భార)

**పాండ్యము** : చోలరాజ్యమునకు దక్షిణమున కన్యాకుమారి వఱకు కల దేశము. దీనిని పాండ్యుడు కావించెను, దీనికి రాజధాని మధుర.

**పాండ్యుడు** : దుష్యంతుని తమ్ముడు అగు దిష్యంతుని పౌత్రుడు అయిన ఆక్రీతుని కొడుకు. ఇతఁడు పాండ్యదేశమును కావించెను.

**పాకయజ్ఞము** : అష్టకపార్వణ (స్థాలీపాక) శ్రాద్ధ (మాసి) సర్పబలి. ఈశానబలి ఆగ్రహాయణి మొదలుగా కల యజ్ఞము. చూ॥ యజ్ఞములు.

**పాకశాసనుఁడు** : ఇంద్రుఁడుపాకుని శిక్షించినవాఁడు అని శబ్దార్థము.

**పాకుఁడు** : వృత్రాసురుని తమ్ముడు. వీని చంపినందున ఇంద్రునకు పాకశాసనుఁడు అను నామము కలిగెను.

**పాటలావతి** : ఒకానొక నది ఇది. ఋక్షపర్వతమున ఉత్పత్తి అగును.

**పాటలీపుత్రము** : నా॥ ప్రతిష్ఠానపురము. మగధదేశపురాజు అగు ఉదయాశ్వుఁడు నిర్మించిన పట్టణము. దీనికి కుసుమపురి అనియు నామము కలదు.

**పాణిని** : సంస్కృత వ్యాకరణకర్త. సరస్వతీదేశమున జన్మించినట్లు తెలియును. ఇతఁడు చేసిన వ్యాకరణము సంస్కృత భాషకు ఆధారము.

**పాతాళకేతుఁడు** : మదాలసను ఎత్తుకొనిపోయి గాలవునికి తపోభంగము కావించిన ఒక రక్కసుడు. (మార్క)

**పాద్మకల్పము** : చతుర్ముఖ బ్రహ్మయొక్క ఆయుః పరిమాణములో పూర్వార్థము. చూ॥ వారాహకల్పము.

**పాద్మము** : ఒక పురాణము. ఇది పద్మగర్భప్రోక్తము అగు పాద్మకల్ప వివరణాదులను కలది. దీని గ్రంథ సంఖ్య 55,000.

పాపరాజు : (కంకంటి) ఒక ఆంధ్రకవి. ఇతఁడు శ్రీమద్రామాయణమునందు ఉత్తరకాండమును తెనిగించెను. దానికి ఉత్తరరామాయణము అని పేరు. మఱియు ఇతఁడు విష్ణు మాయావిలాసమును యక్షగానముగా రచియించినట్లు చెప్పుచున్నారు. ఈయనకు ఉత్తరరామాయణ రచనయందు సహాయుఁడు నంది తిమ్మన్న.

పారాశరుఁడు : ఒక ఉపపురాణము.

పారిజాతము : ఒక కల్పవృక్షము. సత్యభామ ప్రేరేపణచే కృష్ణుఁడు ఈ వృక్షమును స్వర్గలోకమునుండి భూమికి తెచ్చినట్లు చెప్పి ఉన్నది. చూ॥ నరకుడు.

పారిపత్రము : కరూశదేశములకు ముఖ్యపట్టణము. ఇది వింధ్యపర్వతమునకు కొంత ఉత్తరమున ఉండునటుల తెలియఁబడును.

పారుఁడు : 1. బా॥ పృథుసేనుని కొడుకు. ఇతని కొడుకు నీపుఁడు. 2. బా॥ సమరుని కొడుకు. 3. రు॥ ఇతఁడు తన కూతురు అగు కలావతిని ఒక గంధర్వుఁడు వివాహార్థము వేడగా అతనికి ఈయ సమ్మతింపనందున ఆ గంధర్వుఁడు రాత్రిపూట వచ్చి ఇతనిని చంపెను.

పార్వతి : 1. హిమవంతునికి మేరువు కూతురైన మనోరమయందు పుట్టిన రెండవ కొమార్తె. ఈమె యొక్క అక్క గంగాదేవి. తొలిజన్మమున ఈమె దక్షుని కూతురు అయిన ఉమాదేవి; అపుడు తన తండ్రి అయిన దక్షప్రజాపతి చేసిన యజ్ఞమునకు తన భర్త అగు రుద్రుని పిలువక అవమానించెను, అని అలిగి మహాకాళి స్వరూపమును వహించి ఆత్మాగ్రహమున దేహత్యాగముచేసి ఆవల పార్వతిగ పుట్టి రుద్రునికి భార్య అయ్యెను. ఈమె ఒక కాలమున రుద్రునితో కూడి ఉండగా దేవతలు ఆ కూటమికి విఘ్నము చేసిరి. అందువలన వారికి స్వభార్యలయందు పుత్ర సంతానము లేకుండు నటుల ఈమె శపియించెను. మఱియు ఆకాలమునందు రుద్రునికి రేతస్సు జారి భూమియందు పడెను. భూమి దాని భరింపను ఓపక దేవతల సహాయమున అగ్నిని వాయువును వహించునట్లు చేయగా వారు ఆ రేతస్సును హిమవత్పర్వత సమీపమున గంగయందు చేర్చిరి. అది కారణముగా గంగ గర్భము తాల్చి ఆ గర్భమును భరింపలేక శరవణమునందు విడిచిపుచ్చెను. అందు కుమారస్వామి పుట్టెను. అతనికి షట్కృత్తికలు పాలిచ్చిరి. కనుక కార్తికేయుఁడు అనుపేరును, ఆ పాలు ఆరు ముఖములతో ఒక్కతేపనే అతఁడు పానము చేసెను. కనుక షణ్ముఖుఁడు అను పేరును అతనికి కలిగెను.

స్ఖలితము అయిన రేతస్సు వలన పుట్టినందున స్కందుడు అనియు అందురు. ఇది కాక పార్వతి తన దేహమును కూడ వలసిన తన భర్తయొక్క రేతస్సును భూమి ధరించినందున భూమికి బహు భర్తలు కలుగునట్లు శాప మిచ్చెను. మఱియు గంగానిగడాతమైన ఈ సౌమ్యతేజమువలన సువర్ణము మొదలగు లోహములు కలిగినట్లును, ఆ గంగా నిక్షేపము వలన పొదలునట్టి సువర్ణప్రభచేత తృణవృక్షలతాగుల్మ ప్రభృతి వుద్భిజ్జములు, సువర్ణాంబులయ్యెననియు పురాణములు చెప్పుచున్నవి. 2. ఒక నది. ఇది మాళవమున ప్రవహించును. దీనికి సర అనియు నామాంతరము.

(వరా) (శివ) (బ్రహ్మ)

పార్ష్ణిసేనుడు : ఋ॥ ఇతని యాశ్రమమునందు పాండవులుండునపుడు అర్జునుడు దివ్యాస్త్రములు పడసి దేవలోకమునుండి వచ్చి అన్నదమ్ములతో చేరుకొనెను. ఈ ఆశ్రమము, కుబేరుని ఉపవనమునకు సమీపమున ఉండును.

## పి

పింగళ : దక్షిణ దిశయందు ఉండు ఆడు ఏనుగు దీని భడువామన.

పిండము : భక్ష్యరూపము, పితృదేవతలకు ఇయ్యబడునది. ఇది వర్తులాకారమై కపిత్థప్రమాణము అయి ఉండును.

పిండారకము : ఒకానొక పుణ్యక్షేత్రము. ఇది ద్వారకాపుర సమీపమున ఉండెను. ఇందు కొందఱు మహర్షులు తపము ఆచరించుచు ఉండగా యాదవులు దర్శించి కృష్ణుని పుత్రుడు అగు సాంబుని గర్భిణీ స్త్రీరూపముగ అలంకరించి, ఈ చూలాలికి ఏశిశువు కలుగును చెప్పుడు అని పరిహాసముగ అడుగ, వారు అది ఎఱిగి మిగుల కినుకతో యదుకులమును నిర్మూలము చేసెడు ఒక ముసలము ఉదయించును అనిరి. అనంతరము సాంబుని గర్భమునందు ఒక ముసలము పుట్టెను. అది చూచి వారు మిగుల జడిసి ఆ ముసలమును చూర్ణము కావించి సాగరమున కలిపిరి. అంత అ చూర్ణము ముయ్యంచు తుంగగా మొలిచెను. పిదప కొంతకాలమునకు యాదవులు అందఱు సముద్రస్నానము చేయపోయి మదిరాపాన మత్తులు అయి ఒకరితో ఒకరు కలహించి అ ముయ్యంచు తుంగ పెఱికికొని ఒకరిని ఒకరు కొట్టుకొని చచ్చిరి.

**పితరులు** : పితృదేవతలు. వసురుద్రాదిత్య రూపులు అయి చంద్రలోకమున ఉండువారు. వీరు అగ్నిష్వాత్తులు బర్హిషదులు అని రెండు విధములు, అందు అగ్నిష్వాత్తులు యజ్ఞము చేయనివారు. బర్హిషదులు యజ్ఞము చేసినవారు. చూ॥ అగ్నిష్వాత్తులు,

**పితృగణము** : అంగిరసునకు స్వధయందు పుట్టినవారు.

**పిప్పలుఁడు** (౧) ర॥ ఇల్వలుని పుత్రుడు. (౨) అరిష్టుని తమ్ముడు. మిత్రునికి రేవతియందు పుట్టిన రెండవ కొడుకు. (బ్రహ్మ)

**పిశాచక** : ఋక్షపర్వతమునందు పుట్టిన ఒక నది

**పిశాచదేశములు** : పాండ్యము, కేకయము, నేపాళము, బాహ్లీకము, కుంతలము, చోళము మొదలగునవి కొన్ని.

**పిశాచులు** : (౧) దేవయోనులలో ఒక తెగవారు (౨) పాపకృత్యమువలన పార్థివదేహమును పొందక వాయు దేహముతో సంచరించు జీవులు. ఆ జీవులు తమ తమ పాప కర్మములు విమోచనముకాగానే ఆ వాయు దేహములను వదలుదురు.

## పు

**పుంజికస్థల** : ఒక అప్సరస. వరుణుని కూతురు. (రామా)

**పుండరీకము** : (1) ఆగ్నేయ దిక్కునందలి మగయేనుఁగు. (2) ఒకానొక తీర్థము.

**పుండరీకాక్షుడు** : విష్ణువునకు నామము. (తామరలవంటికన్నులు కలవాడు అని శబ్దార్థము)

**పుండ్రము** : బంగాళ దేశపు పశ్చిమ భాగమునకు ప్రాచీన నామము.

**పుండ్రుడు** : అ॥ బలియొక్క నాలవకొమరుఁడు. పౌండ్రదేశము ఇతని నామముచే పరగెను.

**పుత్తు** : ఒకనరకము. ఈ నరకమునందు పడనీయక తండ్రిని కాపాడు వాఁడు అగుటచేత సుతునకు పుత్రుఁడు అనుపేరు కలిగెను.

"పున్నామ్నోనరకాద్యస్మాత్,

త్రితరం త్రాయతేసుతః!
తస్మాత్పుత్ర ఇతిప్రోక్తః॥ అని ప్రమాణవచనము

పునర్వసువు : (1) య॥ దవిద్యోతుని తమ్ముడు, తండ్రి దుంధుభి, (2) ఒకా నొక నక్షత్రము.

పురంజయుడు : (1) ఇ॥ వికుక్షి కొడుకు. కకుత్థ్సునికి పూర్వనామము. ఇతనికి ఇంద్రవాహనుఁడు అనియుపేరు కలదు. (2) పుసువీరుని కొడుకు. నా॥ నృపంజయుడు (3) అ॥ సృంజయుని కొడుకు (విష్ణు) (భాగ)

పురందరుఁడు : (1) వైవస్వతమన్వంతరమునందలి దేవేంద్రుని పేరు. ఇది ఇంద్రునికి సామాన్య నామముగాను వాడఁబడును. (2) అంగిరసుని వంశస్థుఁడు అగు ఒక అగ్ని.

పురాణములు : జగతస్సృష్టి మన్వంతరక్రమములోనగా కల కథలను తెలిపెడు గ్రంధములు. ఇవి వేదములకు వ్యాఖ్యానములు వంటివి. ఇవి బ్రాహ్మ్యము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, అగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వరాహము, స్కాందము, వామనము, కూర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము, అని పదునెనిమిది.

పురుకుత్సుడు : ఇ॥ మాంధాత జ్యేష్ఠపుత్రుఁడు. ఇతని భార్య నాగుల సహోదరి అయిన నర్మద. ఇతఁడు కశ్యప పుత్రులు అయిన మౌనేయులవలని భయమును నాగులకు మాన్పినందున వారు తమసహోదరి అయిన నర్మదను ఇతనికి ఇచ్చి వివాహముచేయించిరి. ఇతని కొడుకు త్రసదస్యుఁడు లేక పసుదుఁడు. (భాగ) (విష్ణు)

పురుజిత్తు : (1) య॥ రుచికుని కొడుకు. (2) య॥ వసుదేవుని తమ్ముఁడు అయిన కంకుని మూఁడవ కొడుకు.

పురుజుఁడు : పు॥ సుశాంతి కొడుకు.

పురుమీఁఢుడు : పు॥ హస్తికుని మూఁడవ కొడుకు. అజమీఢుని తమ్ముఁడు.

పురుహోత్రుడు : య॥ అనువు కొడుకు.

పురాఢుడు : య॥ వసుదేవునకు సహదేవి యందు పుట్టినకొడుకు.

పురూరవుడు : వైవస్వతమనువు కొమార్తె అగు ఇలకును చంద్రుని కొడుకు అగు బుధునికిని పుట్టినరాజు. అతఁడు రాజ్యమదముచేత విప్రులకు అవమానము చేసి వారిచే ఉన్మత్తుఁడు అగునట్లు శపియింపబడెను ఈ పురూరవునకు ఊర్వసి వలన ఆయువు, ధీమంతుఁడు అగు వసువు లేక విజయుఁడు. చిరాయువు లేక శతాయువు, శ్రుతాయువు లేక సుమంతుఁడు, అను పుత్రులు ఉదయించిరి, ఈతని రాజధాని ప్రతిష్ఠానపురము.ఊర్వశి స్వర్గలోకమును వదలి పురూరవునితో భూలోకమున బహు కాలము ఉండినందున స్వర్గలోకము మిక్కిలి చిన్నఁబోయెను అని దేవేంద్రుఁడు ఆమెను పిలువఁబంచెను. ఆమె అట్లు తన్ను వదలి పోఁగా పురూరవుఁడు విరహ వేదనను సహింప నోపక గంధర్వులను ప్రార్థన చేసెను, అప్పుడు వారు అతనికి ఒకస్థాలియిచ్చిరి దానిని అతఁడు కొంతకాలము ఊర్వసిగా భావించి ఉండి అవల దానిని వనమునందు విడిచిపెట్టెను. దాని వలన అశ్వత్థవృక్షము పుట్టెను. ఆయశ్వత్థముచేత అరణులు రెండు కావించి ఒకఅరణి తాను అనియు ఒక, అరణి ఊర్వశి అనియు ఆ రెంటి నడుమను ఉన్న కాష్ఠముపుత్రుడు అనియు మంత్రము చెప్పుచు తఱువగ జాత వేదుఁడు అను అగ్ని సంభవించెను. ఆ అగ్ని ఆహవనీయాది రూపమున నెగడి పురూరవుని పుణ్యలోకమునకు పంపెను. (బ్రహ్మ)

పురోచనుఁడు : దుర్యోధనుని చెలికాఁడు అగు ఒక శిల్పి. వాడు లక్కయింట పాండవులను కాల్చుటకు దుర్యోధనునిచే పంపఁబడెను. పాండవులు దుర్యోధనుని ఉద్దేశ్యమును ఎఱిగి వీని కంటె ముందెహెచ్చరికపడి వీడు నిద్రించు నవసరమున లక్కయింటికి నిప్పుపెట్టి విదురుని సాహాయముచే కావింపఁబడి ఉండిన బిలము గుండ తప్పించుకొని వెళ్ళిరి. (భార)

పులస్త్యుఁడు : బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు. ఇతనికి హవిర్భుక్కునందు అగస్త్యుడును విశ్రవసును పుట్టిరి. (ఉరా) (భాగ)

పులహుఁడు : బ్రహ్మమానస పుత్రులలో ఒకఁడు. ఇతనికి కిన్నరుఁడు కింపురుషుఁడు మొదలైన కొడుకులు పుట్టిరి. (భార) (భాగ)

పులోముఁడు : (1) ద॥ విప్రచిత్తి కొడుకు (2) దనుపుత్రులలో ఒకఁడు ఈతనిని చంపుటచే దేవేంద్రునకు పులోమజిత్తు అను నామము కలిగెను. ఇతని కూతురు కనుక దేవేంద్రుని భార్య అగు శచిపౌలోమి అనుపేరు పడసెను.

**పుల్లయ** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు బ్రహ్మోత్తర ఖండమును తెనిగించెను. ఇందు తెనుగు మరుగు పదములు కొన్ని ఉన్నవి కాని లక్షణ విరుద్ధములు అగు ప్రయోగములు అనేకములు కనఁబడుచు ఉన్నవి.

**పుష్కరము** : ఒకానొక పుణ్యతీర్థము. మాళవదేశప్రాంతములయందు ఉండును.

**పుష్కరవతి** : ఒకానొక పట్టణము ఇది శ్రీరాముని తమ్ముడు అయిన భరతుని రెండవ కొడుకు అగు పుష్కరునిచే నిర్మింపఁబడినది.

**పుష్కరారణ్యము** : పుష్కరతీర్థము చెంత ఉండెడి అరణ్యము.

**పుష్కరారుణి** : పు॥ రుక్షయుని కొడుకు. ఇతని వంశస్థులు బ్రాహ్మణులు అయిరి.

**పుష్కరణి** : (1) ఉల్ముకుని భార్య. అంగుని తల్లి. (2) వ్యుషిభార్య. సర్వతేజస్సు తల్లి.

**పుష్కరుఁడు** : (1) య॥ వసుదేవుని తమ్ముఁడు అగు వృకుని రెండవ కొడుకు. (2) నలునిపిన తండ్రి కొడుకు. ఇతఁడు కలిచే ప్రేరేపింపఁబడి నలునితో జూదము ఆడి సర్వస్వమునుగెలుచుకొని అతనిని వనమునకు తరిమెను. చూ॥ నలుఁడు. (3) శ్రీరాముని తమ్ముడు అయిన భరతుని రెండవ కొడుకు. (భార)

**పుష్పకము** : కుబేరుని విమానము. మణిమయము అయిన ఈ విమానమును కుబేరుఁడు బ్రహ్మ వలన వడసిదీనిపైని యెక్కి యథేచ్ఛము సంచరించుచు ఉండెను. అనంతరము కుబేరుని జయించి దీనిని రావణుడు కైకొనెను. రావణుని చంపిన పిమ్మట ఇది శ్రీరామునిచేరెను. ఈ విమానమునందు ఎందరు కూర్చుండినను ఒక మనుష్యుఁడు కూర్చుండతగినంత చోటుమాత్రము విడుదలగా ఉండును. (రామా)

**పుష్పదన్తము** : వాయవ్య దిక్కునందలి మగఏనుగు.

**పుష్పదన్తుఁడు** : విష్ణుపరిచరులలో ఒక్కఁడు. పుష్పవంతుఁడు. ఉపరిచరు వసువువంశస్థుడు అగు ఒకరాజు. (శివ. క. సాదేవా)

**పుష్పార్ణుఁడు** : ధ్రువుని కొడుకు అగు వత్సరునికి సర్వర్థియందు పుట్టిన కొడుకులలో పెద్దవాఁడు. ఇతనికి ప్రభ, దోషఁ అని ఇరువురు భార్యలు కలరు. అందు ప్రభకు ప్రాతర్మధ్యందిని సాయములును, దోషకుప్రదోష నిశీథవ్యుష్టులను కలిగిరి.

**పుష్పోత్కట** : సుమాలి కూతురు. విశ్రవసుని భార్యలలో ఒకతె. ఈమెకు మహోదర మహాపార్శ్వాదులు అగు రాక్షసులు పుట్టిరి. (ఉరా)

**పుష్యమిత్రుఁడు** : మగధదేశపురాజులు అయిన మౌర్యులలో కడపటి రాజు అగు బృహద్రదుని సేనాపతి. ఇతఁడు తన ఏలిన వానిని చంపి తానురాజు ఆయెను. ఇతని కొడుకు అగ్నిమిత్రుఁడు ఈతని వంశజులు శృంగులు అనఁబడుదురు.

**పుళిందులు** : ఆనర్తదేశమునందును విదర్భదేశమునందును ఒక భాగమున ఉండు జనులు.

## పూ

**పూతన పూతకి** : ఒకరాక్షసి. ఇది కృష్ణుడు బిడ్డగా ఉండునపుఁడు వ్రేపల్లెకు పోయి చను మొనలయందు విషముఁ ఉంచుకొని బాలింతవేషమున కృష్ణునికి పాలిచ్చు విధమున అభినయించి ఆతనిని చంపయత్నించెను. అప్పుడు కృష్ణుఁడు దీని చనుఁబాలు త్రాగువానివలెపాలతోకూడా ప్రాణముల సైతము పీల్చినందున ఇది చచ్చెను. (భాగ) (బ్ర. వై)

**పూరువు** : యయాతికి శర్మిష్ఠయందు పుట్టిన కొడుకు తన తండ్రి అభీష్టమును నెరవేర్చినందున తన కంటె పెద్దవారు అగుసోదరులు ఉండియు ఇతఁడే రాజ్యార్హుఁడు ఆయెను కొడుకు జనమేజయుఁడు. (భార)

**పూర్ణిమ** : ధాతకు అనుమతియందు పుట్టిన కూతురు

**పూర్వచిత్త** : ఒక అప్సరస. ఆగ్నీధ్రుని భార్య.

**పూషుఁడు** : ద్వాదశాదిత్యులలో ఒక్కఁడు. దక్షయాగమునందు వీరభద్రుడు ఇతని పండ్లు పెకలించెను

## పృ

**పృథ** : 1 కుంతీదేవి. 2 సోముడను వసువు కూతురు. (భార)

**పృధివి** : లేకపృథ్వి భూదేవి. విష్ణుభార్య. ఈమెకు బహుభర్తలు కలుగునటుల పార్వతీదేవిచే శాపముకలిగెను చూ॥ పార్వతి.

పృథుకర్ముఁడు
పృథుకీర్తి
ప్రుథుజయుఁడు. } య॥ శశిబిందుపు కొడుకులు.
పృథుదాసుఁడు
పృథుయశుఁడు.

పృథులాక్షుడు : చతురంగుని కొడుకు.

పృథువు : (1) ఇ॥ అనేనస్సు కొడుకు. విశ్వగంధుని తండ్రి ఇతనికి శాశ్వతుఁడు, విశ్వకుఁడు అను నామములు కలవు (2) ప్రసాదుని కొడుకు (3) బా॥ పారుని కొడుకు (4) ఒక చక్రవర్తి స్వాయంభువుని వంశస్థుఁడు వేనుని కొడుకు. భార్య అర్చి. కొడుకులు విజయాశ్వుఁడు, హర్యశ్వుఁడు ద్రవిణుఁడు, వృకుఁడు. ఇతనికి సనత్కుమారుఁడు బ్రహ్మజ్ఞానము ఉపదేశించెను మఱియు ఇతఁడు భూమిని గోవుగాను మనువును దూడగాను చేసి ఓషధులు పిదికెను (5) య॥ రుచికుని కొడుకు జామఘుని సోదరుఁడు

పృథుశ్రవుడు : య॥ శశిబిందుపు కొడుకు. ధర్మని తండ్రి

పృథుసేనుఁడు : బా॥ ప్రాజ్ఞుని కొడుకు పారుని తండ్రి.

పృశ్ని : య॥ అనమిత్రుని కొడుకు. స్వఫల్కురి తండ్రి. సత్యకుని పిన తండ్రి.

పృషతుఁడు : పా॥ సృజన్మకృత్తు కొడుకు. ద్రుపదుని తండ్రి. (భార)

## పె

పెద్దనార్యుఁడు – ఒక తెనుగు కవి. ఇతఁడు భద్రాపరిణయము రచియించెను.

## పై

పైలుఁడు : 1, ఋ॥ వ్యాస శిష్యులలో ఒకఁడు. ఋగ్వేదాధ్యాపకుఁడు.

2. ఋ॥ జాతకర్ణి శిష్యుడు. (భార) (భాగ)

పైశాచి : ప్రాకృత భాషాభేదము. ఇది పైశాచి, చూళికా పైశాచి అని రెండు విధములు కలది. ఇది పిశాచదేశముల యందు వాడఁబడునది కనుక దీనికి ఈ పేరు కలిగెను.

## పొ

పొట్నూరు : ఆంధ్రదేశము నందలి ఒక సామంతరాజు యొక్క పట్టణము.

## పో

పోతన : (బమ్మెర) ఆంధ్ర భాగవతమును రచియించిన మహాకవి. ఈయన ఆరువేల నియోగి. తండ్రి కేసన. కుమారుడు మల్లన. స్వాస్థగ్రామము కడపకు సమీపమున ఉండెడు ఒంటిమిట్ట అనఁబరగిన ఏకశిలానగరము. ఇతఁడు కఁడు పేదవాడు. .కృషివలన జీవించువాడు. ఇతడు బాల్యమున పశువులను మేపుచు, తమ ఊరి చేరువను కల కొండమీద సంచరించుచు ఉండి తన పురాకృత సుకృతశేషము వలన చిదానందుఁడు అను ఒక యోగీశ్వరుని కనుఁగొని అ మహాత్మునికి నమస్కరించి స్వామీ మీరెవరో మహాత్ములు అని నాకు తోచుచు ఉన్నది. ఇట్టి మహిమ పడయుటకు తగిన ఉపాయమును నాకు ఉపదేశించి నన్ను కడతేర్చుము అని ప్రార్థించెను. అది విని ఆయన ఇతఁడు మిక్కలి బుద్ధిశాలి అని మెచ్చుకొని తారకమంత్రమును ఉపదేశించి పోయెను. అంతట పోతన గురువు ఉపదేశించిన చొప్పున నియమముతో తారకమంత్రము జపముచేసి ఆజప మహిమవలననపుడు జ్ఞానసంపన్నుఁడును మహాకవియును అయి ఆశ్రమములం దెల్ల గృహస్థాశ్రమము మేలు అయినది, అని తెలిసి కులశీల వయో రూపముల తనకు తగిన ఒక కన్యకను పరిగ్రహించి సంతానమును బడసి లోకోప చారముగా ఒక పురాణమును తెనిగింపఁ గోరి ఎల్ల పురాణముల యందును భాగ వతము ఉత్తమము అని విచారించి దానిని తెనిఁగించుచు ఉండఁగా వేమ భూపాలునివద్ద ఆస్థానపండితుఁడును. ఇతనికి అనుబంధుఁడును అయినశ్రీనాధుఁడు, ఇతఁడు భాగవతమును తన యేలినవాని కంకితముగా చేయింప వలెను, అని పల్లకి మీద ఎక్కి ఒంటిమిట్ట పోలిమేరచేరరాఁగా అచ్చట దున్నపోతులనుకట్టిన అరకను పూని చేనుదున్నుచు ఉన్న పోతరాజు కొడుకును ఆచేని గనిమమీడ కూర్చుండి భాగవతమువ్రాయుచు ఉన్న పోతరాజును అతనికి కనఁబడిరి. వారిని చూచి తాను సరస్వతీ ఉపాసకుఁడు కనుక తన మహిమ పోతనకు తెలుపవలెను అని ఎంచి పల్లకి మోయుచు ఉన్న బోయీలను పిలిచి మీరు ఒక పక్క పల్లకి కొమ్మును వదలిరండి అని చెప్పెను. వారు అట్లే చేయగా దున్నుచుఉన్న మల్లన ఒక తట్టు

మాత్రము బోయీలు మోవగా వచ్చుచు ఉన్న పల్లకిని చూచి నాయనా ఇదియేమి వింతగా ఉన్నది అని తండ్రిని అడిగెను. అప్పుడు పోతన అబ్బీ నీవును ఒక తట్టు కట్టిన దున్నపోతును విడిచి దున్నుము అని చెప్ప అతఁడు అట్లు చేసెను. అది చూచి శ్రీనాథుఁడు రెండవ కొమ్మును కూడ వదలి పల్లకిని అంతరమున విడు వుడు అని బోయీలకు ఉత్తరువు చేసెను. అది మల్లన చూచి నాయనా రెండవ తట్టును బోయీలు లేక ఈపల్లకి ఉత్తబయల నడచి వచ్చుచున్నది. చూచితివా అనెను. అట్లయిన నీవును రెండవ దున్నను వదలి దున్నుము అని చెప్పెను. అతఁడు ఆ ప్రకారముచేసెను. అంతట శ్రీనాథుఁడు పోతన ఉన్నచోటికి దాపుగా వచ్చి హాలికులో అని పరిహసించెను. అది విని పోతన

> ''ఉ॥ బాలరసాల సాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
> 'గూళల కిచ్చి యప్పడుపు కూడు భుజించుట కన్న మేలుగా,
> హాళికులైన నేమి మఱియంతకునున్ వగలేకయున్న
> గొద్దాళికులైన నేమి నిజదార సుతాదిక పోషణార్థమై."

అని ప్రత్యుత్తరము చెప్పెను. అంతట శ్రీనాథుఁడు పల్లకి దిగి వచ్చి పోతనకు నమస్కరించి బావా నీమహిమ నేనెఱుగనా? బావ సంబంధులము కనుక కొంచెము మేలము చూచితిమి అనెను. అందులకు పోతనయు సరే అట్లు కాక ఇప్పుడు ఏమి విరుద్ధ ధర్మములు నడచెను. అనుచు కొడుకును దుక్కి నిలిపి ఇంటికిపోయి అక్కతో శ్రీనాథకవి మన యింట విందారగింప వచ్చెను. వేగ వంటచేయుమని చెప్పుము అని చెప్పి పంపి తానును అతనిని వెంటఁ బెట్టుకొని తన కుటీరమునకు పోయెను. ఇట్లు శ్రీనాథుఁడు పోతనఇంటికి పోయి మిక్కిలి శిథిలమై సంకుచితమై ఉన్న ఆ పూరియింటిని చూచి బావా మహానుభావుఁడవు అగునీవు గుడిసెలో ఉండి ఈపేదఱికమును అనుభవింపనేల ఎవరినేని గొప్పరాజుల నాశ్రయించి సంపదలు పడయరాదా అని పలికెను. ఇంతలో వంట ఆయినది స్నానమునకు యత్నింపుఁడు అని మల్లన వచ్చి చెప్పెను. అంత ఆ యిరువురును స్నానముదేసి తమతమ అనుష్ఠానము జరపుకొని భోజనము చేయపోయిరి. అప్పుడు మనుష్య స్త్రీరూపము ధరించి పోతనకు కూతురు అనుపేర అతని యింట మెలగుచు ఉన్న సరస్వతిదేవి పళ్ళెరమున అన్నమును కొనివచ్చి విస్తళ్ళలో వడ్డించుచు కన్నుల నీళ్ళు రాల్చెను. అది చూచి పోతన.

ఉ॥ కాటుక కంటినీరు చనుకట్టు పయింబడనేల యేడ్చెదో,
కైటభరాజ మర్దనుని గాదిలి కోడల యో మదంబ యో
హాటక గర్భురాణి నిను నాకటికిం గొనిపోయి యల్ల క
ర్ణాటకిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్మ భారతీ ।

అని చెప్పెను. అది విని ఆమె శోకము మాని సర్వపదార్థములు వడ్డింపగా భోజనముచేసి తగిన మర్యాదతో పోతరాజు పంపఁగా శ్రీనాథుఁడు తానేమి చెప్పుటకును ఎడములేక తన వచ్చినదారిని పోయెను. ఇట్లు పరమ వైరాగ్య వశుఁడై రామాంకితముగ భాగవతమును సమగ్రముగా తెనిగించి ముక్తుఁడు అయ్యెను. ఇది కాక వీరభద్ర విజయము అను దక్షాధ్వర ధ్వంసకథ ఒకటి ఈయన రచించినట్లు తెలియవచ్చు చున్నది. అది మాత్రము నరాంకితము చేయఁ బడి ఉన్నది. అందులకు కారణము తెలిసినదికాదు. ఇతఁడు శాలివాహనశకము వేయినిమున్నూరు అగు కాలమున జనియించినవాఁడు.

పోతురాజు : ఒకానొక పురుషదేవత. శంకరావతారమైన వీరభద్రుని ఈపేరితో గ్రామముల చావళ్ళయందు ప్రతిష్ఠచేసి జనులు పూజింతురు.

పోలేరమ్మ : ఒక గ్రామదేవత. పరశురాములతల్లి అగు పరాశక్తి అవతారము అయిన రేణుకాదేవిని ఈ నామముచే అనేక దేశములయందు పూజింతురు.

## పౌ

పౌండ్రము : (1) భీముని శంఖము. (2) ఓఢ్రదేశమునకును ఆంధ్రదేశము నందలి ఉత్తరభాగమునకును ప్రాచీన నామము. దీనికి బలికొడుకు అయిన పుండ్రుని వలన ఈనామము కలిగెను. (భార)

పౌరవి : బాహ్లికుని కూతురు. వసుదేవుని భార్య.

పౌరవులు : పూరువు వంశస్థులు.

పౌలోమి : శచీదేవి. పులోముని కూతురు. ఇంద్రుని భార్య.

పౌలోములు : వైశ్వానరుఁడు అను దానవుని కొమార్త అగు పులోమకును మరీచికిని పుట్టిన రాక్షసులు. వీరిని అర్జునుడు రూపులేక నాశము చేసెను.

పౌష్యుడు : ఉదంకునికి కుండలములు ఇప్పించిన రాజు. (భార)

# ప్ర

ప్రఘసుఁడు : ర॥ సుమాలి కొడుకు. (రామా)

ప్రచేతసులు : ప్రాచీనబర్హికిని సముద్రుని కూతురు అగు శతధృతికిని పుట్టిన వారు. వీరు పదుగురు అన్నదమ్ములు. తుల్యగుణ నామములు కలవారు. మహా తపోధనులు. వీరిభార్య మారిష. (విష్ణు) (మత్స్య)

ప్రచేతస్సు : గాంధారుని పౌత్రుని పౌత్రుఁడు. ఇతనికి అనేకులు పుత్రులు కలరు. వారు అందరు మ్లేచ్ఛులు అయిరి.

ప్రచేతసుఁడు<br>ప్రచేతుఁడు : } వరుణునికి నామము.

ప్రజాపతి : బ్రహ్మకు నామాంతరము. బ్రహ్మపుత్రుడైన మనువు కొడుకు ప్రజాపతి అనియు అతనికి ధూమ్ర, బ్రహ్మవిద్య, రస, శ్వస మనస్విని, శాండిలీ, ప్రభాస అని ఏడుగురు పత్నులు కలరు అనియు వారికి అష్టవసువులు పుట్టిరి అనియు భారతమున చెప్పబడి వున్నది. (భార)

ప్రజాపతిక్షేత్రము : ఒకానొక పుణ్యక్షేత్రము. ప్రయాగ మొదలు ప్రతిష్ఠాన పురము వరకును వాసుకిహ్రదము మొదలు కంబళాశ్వతర బహుమూల పర్వతములపర కును కల దేశము. ఇచట స్నానము చేసినవారికి స్వర్గము లభించుటయేకాక పునర్జ న్మము కూడాలేదు అందురు. బ్రహ్మాది దేవతలు ఈ క్షేత్రమును ఎల్లప్పుడు రక్షణ చేయుచు ఉండెదరు. ఇచటి పుణ్యతీర్థములను లెక్కింప అలవికాదు. వాని లోపల జాహ్నవి యమున ఈ రెండు నదులను సూర్యుడు రక్షించు చుండును. ప్రయాగను దానిమండలమును అందువుండు వటవృక్షమును శివుడును అందలి స్నాన ఫలమును దేవతలును రక్షింతురు. ప్రయాగను స్మరించిన మాత్రముననే సకల దురితములు పోవును. మఱియు ఈ ప్రయాగయొక్క దర్శనము స్పర్శనము మృత్తికాలేపనము వీనిచే పాపపరిహారము అగును.

ప్రతర్దనుఁడు : కా॥ నా॥ శత్రుజిత్తు. ఋతధ్వజుఁడు దివోదాసుని కొడుకు. (భార)

ప్రతాపరుద్రీయము : } విద్యానాథ కవిచే రచియింపఁబడిన అలంకార శాస్త్రము. ప్రతాప రుద్రుఁడు అను రాజునకు అంకితముగ చేయఁబడుటచే దీనికి

ఈ పేరు కలిగెను. ఇది నాయకలక్షణ, కావ్యనాటకరస దోషణగు, శబ్దాలంకార మిశ్రాలంకార ప్రకరణములు అనెడు నవప్రకరణములు కలిగియుండును. దీనికి రత్నాపనము అను వ్యాఖ్యానము ఒకటి కలదు. దీనికి సరియైన ఆంధ్ర గ్రంథము నరసభూపాలీయము లేక కావ్యాలంకార సంగ్రహము.

**ప్రతిబాహువు** : (1) య॥ కృష్ణుని వంశస్థుఁడు వజ్రుని కొడుకు. (2) య॥ అక్రూరుని తమ్ముఁడు.

**ప్రతివింధ్యుఁడు** : ధర్మరాజుకు ద్రౌపదియందు పుట్టిన కొడుకు.

**ప్రతిష్ఠానపురము** : ఇది గంగా యమునా సంగమమునకు తూర్పున వుండును. ఈపురి పురూరవునకు సుద్యుమ్నునిచే ఈయబడెను. చంద్రవంశపు రాజులకు ఇదియే తొలుతటి రాటధాని.

**ప్రత్యగ్రుఁడు** : కు॥ ఉపరి చరవసువు కొడుకు.

**ప్రత్యూషుఁడు** : అష్టవసువులలో ఒక్కఁడు. (భాగ) (భార)

**ప్రదీపుఁడు**
**ప్రతీపుడు** ; కు॥ భీమసేనుని కొడుకు భార్య సునంభ. కొడుకులు దేవాపి, శంతనుఁడు, బాహ్లికుఁడు. దేవాపి బాల్యమునందే తపోవనమునకు పోయెను. కనుక శంతనుఁడు రాజు ఆయెను.

పూర్వకాలమున మహాభిషుఁడు అను నొకరాజు కలఁడు. అతఁడు దేవలోకమునకుపోయి బ్రహ్మను సేవించుచు ఉండగా గంగయు స్త్రీ రూపము ధరించి బ్రహ్మ సభకు వచ్చెను. ఆ సమయమునందు ఆమెయొక్క వస్త్రము గాలిచే తొలగి తొడల మూలభాగము అగపడెను. అంత దేవతలు అందరును పరస్త్రీ మర్మమును చూడరాదు అని తమ మోములు త్రిప్పుకొని చూడక ఉండిరి. ఇతడు మాత్రము ఆపతో చూచుచుండెను. అది ఎఱిగి బ్రహ్మ మహాభిషుని మనుష్యయోనియందు పుట్టునటుల శపియించెను. అది కారణముగా అతఁడు శంతనుఁడను నామముచే ప్రదీపునియందు పుట్టెను. గంగాదేవియు అతనిమీద అనురాగము కలది అయి స్త్రీ రూపము ధరించి అతనికి భార్యఅయి వసిష్ఠుని శాపముచే భూమియందు పుట్టిన అష్టవసువులకు మాత అయ్యెను. చూ॥ అష్టవసువులు.

(భార)

ప్రద్యుమ్నుడు : కృష్ణునికి రుక్మిణియందు పుట్టిన కొడుకు. భార్య రతి. తొల్లి రుద్రుని కంటిమంటచే దగ్ధుడు అయిన మన్మథుడు దేహలబ్ధి కొఱకు ఆ రుద్రుని గూర్చి తపమాచరించి అతనివలన వరముపొంది ఈ జన్మము యెత్తెను.

ఇతడు శిశువుగా ఉండునపుడు శంబరుడు అను అసురుడు తనమాయచే ఇతరులకు తెలియకుండా సూతికా గృహము ప్రవేశించి ఇతనినిఁగొనిపోయి సాగరమున పాఱవైచ అందలి చేపఒకటి ఆ శిశువును మ్రింగెను. అంత కొందరు జాలరులు అందు చేపలుఁబట్టుచు మినుకు మినుకు అని మెఱయుచున్న ఆ చేప చిక్కఁగా దానిని తమ ఏలినవాఁడు అగు శంబరాసురునికి కానుకగా ఇచ్చిరి. వాఁడు దానిని వంటశాలకు పంపెను. అప్పుడు మాయావతి అను నామముచే పాతివ్రత్యము నడుపుచు దగ్ధుఁడు అయిన తనపెనిమిటి శరీరధారణము చేసి వచ్చుటను ఎదురుచూచుచు వానిఇంట వంటపనులకు సహాయముగా మెలగుచు ఉండిన రతీదేవి సూపకారులవద్ద నుండి ఆ మత్స్యముతెచ్చి దానిని ఛేదించి దాని కడుపులోవున్న శిశువునుచూచి నేను బిడ్డలులేనిదానను. కనుక ఈ బిడ్డను పెంచు కొనెదను, అని శంబరుని అడిగి వాని అనుమతమున నారదోపదేశమున ఆ శిశువునుపెంచి అతఁడు యౌవనవంతుడు కాగానే అతనికి సర్వశత్రు మాయా వినాశిని అను మహావిద్య నుపదేశించి శంబరాసుని చంపించి తాను అతనికి పత్ని యగుటను తెలిపి అతనితోకూడి ద్వారకకు వచ్చెను. అప్పుడు కృష్ణుఁడును రుక్మిణియు వారిని తమ కొడుకును కోడలును అని తెలిసికొని తమవద్ద చేర్చు కొని సుఖముగా ఉండిరి. (భార) (భాగ)

ప్రద్యోతనుఁడు : సూర్యునికి నామము.

ప్రద్యోతుఁడు : మ॥ సుక్రీనకుని కొడుకు. చూ॥ రిపుంజయుఁడు. ప్రద్యోతుని వంశస్థులు ఏవురునూట ముప్పది యెనిమిది సంవత్సరములు రాజ్యము చేసిరి.

ప్రబలోద్బలుడు : విష్ణుపరిచరులలో ఒకఁడు.

ప్రబోధ చంద్రోదయము : అద్వైత మతసిద్ధాంత ప్రతిపాదకము అగు ఒకనాటకము. కృష్ణ మిశ్ర శాస్త్రిలచే చేయఁబడినది.

ప్రభ : పుష్పార్ణుని భార్య. కొడుకులు వాతర్మధ్యందిన సాయములు.

ప్రభావతి : (1) సూర్యుని భార్య అగు సంజ్ఞాదేవికి నామము.

(2) ఒకానొక స్త్రీ. ఈమె ఇంద్రుని పతిగాకోరి తపము ఆచరించుచు ఉండగా అతఁడు వసిష్ఠుని ఆకృతి ధాల్చికొని బదరీఫలములను ఇచ్చి పక్వము చేయుము అనెను. అందులకు ఒప్పుకొని పక్వముచేయ ఆరంభింపగా అవి ఎంతసేపటికిని పక్వముకాకపోగా సేకరించిన కాష్టములు అన్ని సమసిపోయెను, అప్పుడు ఈమె తాను కాష్ఠములను తేబోయిన అగ్ని ఆరి దుష్పాకము అగును అని ఎంచి తనకాలు ఇంధనముగాఇడి పాకము చేయపూనెను. అంత ఇంద్రుడు మెచ్చుకొని ఆమె కోరిన వరము ఇచ్చెను. ఈమె తపము ఆచరించిన తీర్థము బదరీపాచనము అనఁబడును. (భార)

(3) వజ్రనాభుఁడు అను రాక్షసుని కూతురు. ప్రద్యుమ్నుని భార్య. (ప్ర) (భార)

**ప్రభాస, ప్రభాత** : ప్రజాపతి భార్య. ప్రత్యూషుఁడు, ప్రభాసుఁడు అను వసువుల తల్లి.

**ప్రభాసము** : ఒకానొక పుణ్యతీర్థము. అశ్విన్యాదులగు ఇరువది యేడుగురు భార్యలలో రోహిణి రూపాతిశయముకలది అయినందున చంద్రుఁడు ఆమెయందు ఆసక్తుడై యుండెను. అందులకు తక్కినవారు వగనుపొంది తమతండ్రి అగు దక్ష ప్రజాపతికి యెఱిగింపగా అతఁడు కోపించి చంద్రునకు అరుదెవులు కలుగునట్లు శపించెను. అట్లు తెవులుచేత నానాట అతడు కృశించుచుండ దేవతలు అతనిని దోడ్కొని దక్షప్రజాపతి చెంతకుపోయి ఇతఁడు ఇకమీద తనభార్యల అందఱి యెడ సమవర్తియై యుండును. ఇతని అరుదెవులు మానునట్లు అనుగ్రహింపుము అని ప్రార్థించిరి. అప్పుడు దక్షుడు ప్రసన్నుడై పదునైదు దినములు వరుసగ వృద్ధిపొందుచు మరల పదునైదు దినములు క్షయించుచుండగలవాడు అని చెప్పి సరస్వతీ జలనిధి సంగమ కలితము అయిన ఈ తీర్థమున అమావాస్యలయందు స్నానము చేయునట్లు నియమించెను. అట్లు చంద్రుఁడు మజ్జనముచేసి లోక ప్రభాసుఁడు అయ్యెను. ఈ తీర్థమునకు ప్రభాసము అను నామము కలిగెను. (బ్రహ్మ)

2. ఒకానొక పట్టణము. ఇది ద్వారకాపురికి సమీపమున ఉండును.

**ప్రభాసుడు** : అష్టవసువులలో ఒక్కడు ఇతడే భీష్ముడుగా జనించినవాడు. చూ॥ అష్టవసువులు. భార్య యోగసిద్ధి. కొడుకు విశ్వకర్మ. (భార)

ప్రమతి : రు॥ తండ్రి చ్యవనుఁడు. తల్లి సుకన్య. కొడుకు రురుడు. భార్య ఘృతాచి అను అప్సరస.

ప్రమద్వర : విశ్వావసుడు అను గంధర్వరాజు కూతురు. తల్లి మేనక అను అప్సర్స. ఈమెకు స్థూలకేశుడు, అను రుషి పెంపుడు తండ్రి. ఈమెను రురుడు పెండ్లి యాడెను. (భార)

ప్రమథ గణము : శివుని అనుగ్రహము వలన కైలాసమున అతనితో కూడ ఉండు భక్తుల సమూహము.

ప్రముచుడు : రు॥ రేవతి తండ్రి. ఇతడు రైవతక పర్వతమున ఉండెను. (మార్క)

ప్రమ్లోచ : ఒక అప్సర్స ఈమె ఖండుడు అను మహర్షి వలన మారిష అను కుమార్తెను కనెను. (చూ॥ మారిష)

ప్రయాగ చూ॥ ప్రజాపతి క్షేత్రము.

ప్రలంబుడు : ఒకానొక అసురుడు. వీడు బలరాముని చంపవలయును అని గోపాల రూపమున అతనితో ఆటలు ఆడవచ్చి కడపట అతనిచే మడిసెను. (విష్ణు)

ప్రవరుడు : అరుణాస్పదమందు ఉండిన ఒక విప్రుడు. (మార్క)

ప్రవర్షణము : ఒకానొక కొండ. ఇది మధుర దాపున ఉండును. ఇందు కృష్ణుడును, బలరాముడును దాగిరి, అని జరాసంధుడు దీనిని దహించెను. (భాగ)

ప్రవిరోధన మన్యువు }
ప్రవీరుఁడు. } : పు॥ పాచిన్వానుని కొడుకు.

ప్రశ్రముఁడు }
ప్రశ్రితుఁడు } : య॥ వసుదేవునకు శాంతియందు పుట్టిన కొడుకులు.

ప్రసాదుఁడు : ఇంద్రద్యుమ్నుని వంశజుఁడు అగు ఒక రాజు.

ప్రసూతి : స్వాయంభువుని కూఁతురు. దక్షుని భార్య (భాగ)

ప్రసేనజిత్తుఁడు : రేణుక తండ్రి జమదగ్ని మామ. (భార)

ప్రసేనుఁడు : య॥ సత్రాజిత్తు తమ్ముఁడు. (భాగ)

ప్రహసుఁడు : ర॥ సుమాలి కొడుకు. (రామా)

ప్రహేతి : ర॥ చూ॥ హేతి సోదరుడు (చూ) హేతి) (వరా)

ప్రహ్లాదుఁడు : ది॥ హిరణ్యకశిపుని కొడుకు. దైత్యదానవుల అధిపతి. తల్లి లీలావతి. ఈతడు విష్ణుభక్తుఁడు. తండ్రి విష్ణుద్వేషి. అయినందున ఇతనికిని ఇతని తండ్రికిని అనవరతము తర్కము జరుగుచుండును ఆట్లుండగా కడపట ఒక దినము విష్ణువు ఎక్కడ ఉన్నాడు చూపుము అని తండ్రి అడుగగా ప్రహ్లాదుడు. మా॥ కలడంబోధి కలండు గాలి గల డాకాశంబునం గుంభినిన్ గల డగ్నిన్ దిశలన్ బగళ్ళనిశలన్ ఖద్యోత చంద్రాదులం గలడోంకారమునం త్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులం దంతటన్ గలడీశుంఁడు గలండు తండ్రి వెదకంగానేల నీయాయెడన్॥

క॥ ఇందు గలడందు లేడని సందేహమువలదు చక్రి సర్వోపగతుం డెందెందు వెదకి చూచిన నందందే కలడు దానవాగ్రణి వింటే॥

అని ఉత్తరము ఇచ్చెను. అట్లయిన ఈ స్తంభమునందు ఉన్నాడా అని ఒక సభా స్తంభమును హిరణ్యకశిపుడు తన్నగా, అది విచ్చి అందుండి నరసింహరూపమున విష్ణువు అవతరించి అతనిని చంపెను. చూ॥ హిరణ్యకశిపుడు. (భాగ)

ప్రళయము :- సర్వ ప్రపంచనాశము. ఇది నిత్యప్రళయము. నైమిత్తిక ప్రళయము, ప్రాకృత ప్రళయము, ఆత్యంతక ప్రళయము, అని నాలుగు విధములు కలదిఁ. అందు నిత్యప్రళయము. సుషుప్తి. నైమిత్తిక ప్రళయము చతుర్ముఖ బ్రహ్మ యొక్క దినప్రళయము. అపుడు భగవంతుడు రుద్రరూపుడై సూర్యునియందు ప్రవేశించి భూమిని ద్రవశూన్యముగా చేయగా అందు కాలాగ్ని పొడమి ముల్లోకములను దహించును. ఆవల లోకమంతయు జలమయముకాగా ముల్లోకములును అంధీభూతములు అయి అందు అడగిపోవును. అది చతుర్ముఖ బ్రహ్మకు రాత్రివేళ అయినందున అపుడు అతఁడు నిద్రించుచూ ఉండును. కనుక లోకవ్యవహారము ఉడిగి ఉండును. మరల అతడు మేల్కొని యథారీతిని

పునస్సృష్టి ఆరంభించును. ప్రాకృత ప్రళయము చతుర్ముఖ బ్రహ్మతోడ జగన్నాశము. ఇందు జగత్సృష్టికి కారణము అగు వ్యక్తావ్యక్త స్వరూపము ఐన ప్రకృతి కేవల వ్యక్తస్వరూపమైన బ్రహ్మమందు లయించి పోవును. కనుకనే పదునాలుగు లోకములును పంచమహాభూతములును మహత్సృష్టితోడ సర్వము నశించిపోవును. ఆత్యంతిక ప్రళయము లోక నివృత్తి ఈ నివృత్తిచే ఆనంద మయము అగు స్వరూప ప్రాప్తి కలుగును. ఇది బ్రహ్మజ్ఞానమువలన కలుగు పాపక్షయముచేత అగును.

ప్రాంశువు : ప్రజాని తండ్రి.

ప్రాకృతము : ఒకానొక భాష. ఇది సంస్కృతమువలన కలిగినది. ప్రాకృతము. శౌరసేని, మాగధి, పైశాచి, చూళికా పైశాచి, అపభ్రంశము అని ఆరుభేదములు కలవి. అందు ప్రాకృతము మహారాష్ట్రదేశమున వ్యవహరింప బడుచు ఉన్న భాష. ఈ ప్రాకృత భాషకు సంస్కృత నాటికాదులయందు ఆయాయి పాత్రములకు అనుకూలముగా ప్రయోగము చూపబడెడు స్త్రీపాత్రములకును, హాస్యకాండ్రు మొదలగు వారికిని ప్రాకృత భాషయు, అధమ పాత్రములకు శౌరసేనియు, అత్యధమ పాత్రములకు మాగధియు. రాక్షస పిశాచాది నీచపాత్రములకు పైశాచియు, చూళికా పైశాచియు, చండాల వ్యవనాదీ పాత్రములకు అపభ్రంశమును, వినియోగింపబడును. ఈపాత్రములకు ఎల్ల ఒక్కొక్క కారణమును పట్టి భాషా వ్యత్యాసము కలదు.

ఈ భాషకు, వాల్మీకి వరరుచి మొదలగువారు వ్యాకరణములు చేసి ఉన్నారు. ప్రాకృత భాషయందు కాళిదాసుడు సేతు బంధము అని ఒక కావ్యము నొనర్చి ఉన్నాడు. శాలివాహనుడు ఈ భాషయందు సప్తశతి అను ఒక గ్రంథమును, వరరుచి పైశాచి యందు బృహత్కథ అను ఒక గొప్ప గ్రంథమును చేసి ఉండు సట్లు తెలియవచ్చుచున్నది. జైనుల ఆగమములు, పురాణములు. మొదలగునవి ప్రాకృత భాషయందే ఉన్నవి.

ప్రాగ్జ్యోతిషము :- నరకాసురుని రాజధాని. ఇది కిరాతులు వశించు కామరూప దేశమునకు ముఖ్యపట్టణము.

ప్రాచిన్వానుఁడు : పు॥ మొదటి జనమేజయుని కొడుకు. నా॥ ప్రాచీశుఁడు.

ప్రాచీనబర్హి : అవిర్థానుని కొడుకు. నా॥ బర్హిషదుడు. తల్లి ధిషణ. ఇతడు తాను చేసిన అనేక యజ్ఞముల వలన భూమినంతయు యజ్ఞదాటముగా చేసి ప్రాచీనాగ్రకుశలచే కప్పినందున ఇతనికి ఈపేరు కలిగెను. ఈతనికి శతధృతియందు పదుగురు కొడుకులు కలిగిరి. వారు ప్రచేతసులు అనబడిరి.

ప్రాచీశుఁడు : పు॥ చూ॥ నా॥ ప్రాచిన్వానుఁడు.

ప్రాజాపత్యుడు : అంగిరసుని వంశస్థుడు అగు ఒక అగ్నినామము. పురందరుని కొడుకు. ఇతడు పరమబ్రాహ్మణులచే అర్చితుడు అగును.

ప్రాజ్ఞుఁడు : పు॥ రుచిరాశ్వుని కొడుకు,

ప్రాణుడు : విధాతకు నియతియందు పుట్టిన కొడుకు. వేదశిరుని తండ్రి. (బ్రహ్మ)

ప్రాధ :- దక్షప్రజాపతి కూతురు. కశ్యపుని భార్యలలో ఒకతె.

ప్రాయశ్చిత్తము :- పాప పరిహారార్థము చేయబడు క్రియ. ప్రాయోనామ తపహ. ప్రోక్తంచిత్తంనిశ్చయఉచ్యతే, తపోనిశ్చయసయుక్తము ప్రాయశ్చిత్తంతదుచ్యతే॥ ప్రాయశసమం చిత్తం చారయుత్వ ప్రదీయతే, పరిషదాకార్యతేయత్ర ప్రాయశ్చిత్త మితిస్మృతమ్ అని ప్రమాణము. కలియుగమునందలి ప్రాయశ్చిత్త విధులు పరాశర స్మృతియందు చెప్పియుండెడు చొప్పున నడపదగి ఉండును.

ప్రాయోపవేశము :- దేహత్యాగముచేయు నిమిత్తము దర్భాసనముమీద శయనించుట.

ప్రాప్తి :- జరాసంధుని కూతురు. అస్తి చెల్లెలు. కంసుని రెండవ భార్య. (విష్ణు)

ప్రియంవద :- 1. నహుషుని భార్య. 2. శకుంతల చెలికత్తెలయందు ఒకతె. (భార)

ప్రియవ్రతుడు :- స్వాయంభువ మనువునకు శతరూపయందు పుట్టిన పెద్దకొడుకు. ఉత్తానపాదుని అన్న. ఇతడు కర్దమప్రజాపతి కూతురు అయిన సుకన్య అను దానిని పెండ్లాడెను. ఆమెయందు ఇతనికి సమ్రాట్టు, కుక్షి, అను ఇరువురు కూతులును, అగ్నీధ్రుడు. అగ్నిబాహువు. వపుష్మంతుడు ద్యుతిమంతుడు, మేధ. మేధాతిథి, హవ్యుడు. సవనుడు, పుత్రుడు, జ్యోతిష్మంతుఁడు

అని పదగురు కొడుకులును పుట్టిరి. వారిలో మేధపుత్రుడు అగ్నిబాహువు ఈ ముప్వురును యోగపరాయణులు అయిరి. తక్కిన ఏడురురు కుమారులకును ప్రియవ్రతుడు భూమిని ఏడు ద్వీపములుగ భాగించి ఇచ్చెను. అందు అగ్నీధునికి జంబూద్వీపమును, మేధాతి థికి ప్లక్షద్వీపమును, వపుష్మంతునకు శాల్మల ద్వీపమును, జ్యోతిష్మంతునికి కుశద్వీపమును, ద్యుతిమంతునకు క్రౌంచద్వీపమును, భవ్యునికి శాకద్వీపమును, సవనునికి పుష్కరద్వీపమును ఇచ్చెను.

(విష్ణు) (భాగ)

ప్రీతి : పులస్త్యుని భార్య. చూ॥ నా॥ హవిర్భుక్కు.

## ఫ

ఫల్గుణుడు : అర్జునునకు నామము. ఉత్తర ఫల్గునియందు పుట్టినందున ఇతనికి ఈనామము కలిగెను.

## బ

బంధుడు : తృషబిందుని తండ్రి. నా॥ బుధుడు. ఇతడు మరుశ్చక్రవర్తి వంశస్థుడు.

బకుండు : 1) ర॥ వీడు ఏకచక్రపురము అను ఒక అగ్రహారమునకు సమీపమునందు ఉండు అడవిలోచేరి ఆ యగ్రహారమునందలి బ్రాహ్మణులను హింసించుచు ఉండగా వారు ఇలువరుసను దిన దినము ఒక్కొక్కడు ఒక బండెడు అన్నమును రెండు ఎనుబోతులను కొనిపోయి ఈరాక్షసునికి ఆహారము అగునట్లు ఒడంబడిక చేసికొని ఆ చొప్పున నెరపుచు ఉండిరి. అంత కొంతకాలమునకు పాండవులు దుర్యోధనుని కపటోపాయముచే కాల్పబడిన లక్కయింటి చావు తప్పించుకొనిపోయి బ్రాహ్మణవేషములతో ఆ యగ్రహారమున ఒక బ్రాహ్మణుని యింట నివసించిరి. ఆకాలమునందు వీరు ఉండెడు ఇంటి బ్రాహ్మణుని వంతు వచ్చెను. అని ఆ బ్రాహ్మణుడు తనకు కలిగిన ఇద్దరు పసిబిడ్డలను తన భార్యను పంపనేరకయు తానుపోవుటకును మనస్సు రాకయు చింతించుచూ ఉండగాపాండవుల తల్లి అగు కుంతి ఆ వృత్తాంతము విని భీముని పంపిన యెడ ఆ రాక్షసునిచంప వచ్చును. అంతటితో బ్రాహ్మలబాధ తీరును, అనియెంచి ఆ బ్రాహ్మణునితో నాకు

అయిదుగురు కొడుకులుఉన్నారుగదా వారిలో ఒకరిని పంపెదను. అనిచెప్పి భీముని పంపెను. వాడు పోయి బకాసురుని చంపివచ్చెను. అంతట ఆ యగ్రహారమునందలి బ్రాహ్మణులు అందరు సంతోషించి అతనిని బహువిధముల దీవించిరి. చూ॥ఏకచక్రపురము. (భార)

(2) ర॥ వీడు బృందావనమునందు కృష్ణుడు ఉండు తరిని కంసుని పంపున అచ్చటికి వచ్చి బకరూపధారియై అతనిని మ్రింగబోయి అతనిచే చంపబడెను. (భాగ)

(3) య॥ వసుదేవుని తమ్ముడు అయిన కంకుని జ్యేష్ఠపుత్రుడు.

**బదరి:** ఒకానొకవనము. ఇది హిమవంతమునకు సమీపమున సరస్వతీనది పశ్చిమతీరమున ఉండును. ఇది పుణ్యక్షేత్రము అని ఇందు అనేకులు ఋషులు ఆశ్రమములు కావించుకొని వాసముచేయుదురు. ఇందు బదరీనాథుడు అనుపేర ఒక విష్ణుమూర్తి ప్రతిష్ఠితుఁడు అయి పూజింపబడుచు ఉండును. దీనిని బదరికాశ్రమము అనియు, బదరీనారాయణము అనియు చెప్పుదురు. (బదరి = రేగు చెట్టు) రేగు చెట్లవనము అగుటచే దీనికి ఈ పేరు కలిగెను.

**బదరీపాచనము** : ఒక పుణ్యతీర్థము. చూ॥ ప్రభావతి.

**బభ్రువాహనుడు** ; అర్జునుని కొడుకు. వీని తల్లి మణలూరు రాజు అగు చిత్రవాహనునికూతురు అయిన చిత్రాంగద. ఇతడు తన మాతామహుని రాజ్యమునకు కర్త ఆయెను. ధర్మరాజు అశ్వమేధము చేయబూని యజ్ఞాశ్వమును విడిచి దాని రక్షణమునకు అర్జునుని నియోగింపగా బభ్రువాహనుడు ఆయశ్వమును పట్టి తన తండ్రి అయిన అర్జునుని చంపెను. అంతట నాగరాజు కూతురు అగు ఉలూపి అర్జునుని పునర్జీవితుని చేసెను. (భార)

**బభ్రువు** : (1) య॥ విదర్భుని పౌత్రుడు, (2) య॥ సాత్వతునిపౌత్రుడు. (4) ద్రుహ్యుని కొడుకు.

**బర్హిణాశ్వుడు** : ఇ॥ నా॥ అమితాశ్వుఁడు. కృశాశ్వుని తండ్రి.

**బర్హిషదుడు** : చూ॥ నా॥ ప్రాచీనబర్హి.

**బర్హిషదులు** : పితరులలో ఒక తెగవారు. చూ॥ పితరులు.

**బర్హిష్మతి** : విశ్వకర్మ కూతురు. ప్రియవ్రతుని భార్య. (భాగ)

**బలంధనుడు** : నాభాగుని కొడుకు. వత్సప్రీతి తండ్రి. నా॥ హలంధనుడు.

**బలభద్రుడు / బలరాముడు** : అదిశేషుని అంశమున వసుదేవునకు రోహిణియందు పుట్టిన కొడుకు. ఇతడు మొదట దేవకి గర్భమందు చేరి యోగ మాయ ఆమె గర్భమునుండి సంకర్షింపగా రోహిణి గర్భమునుచేరి పిదప అవత రించెను. కనుకనే ఇతనికి సంకర్షణుడు అనియు నామము కలదు. ఇతడు తాల కేతుడు నీలాంబరుడు హలాయుధుడు రేవతీరమణుడు కృష్ణాగ్రజుడు అనియు అన బడును. (భాగ)

**బలసూదనుడు** : ఇంద్రునికి నామము. బలుడు అను అసురుని చంపుటచే ఇతనికి ఈ నామము కలిగెను.

**బలాకాశ్వుడు** : పురూరవుని కొడుకు అగు వసువు వంశస్థుడు. అజకుని కొడుకు. కుశికుని తండ్రి.

**బలాకుడు** : (1) సుశర్మ భార్యను ఎత్తుకొని పోయిన ఒక అసురుడు వీడు ఉత్తానపాదుని కొడుకు అగు ఉత్తముని భార్యను నాగలోకమునుండి అతనికి మరల తెచ్చి ఇచ్చెను. (మార్క)
రు॥ శాతకరిణ శిష్యుడు.

**బలాశ్వుడు** : రెండవ ఖనిత్రుని పౌత్రుడు. చూ॥ కరంధముడు.

**బలి** : (1) అ॥ సుతపుని కొడుకు. ఇతనికి సుదేష్ణయందు ఉతథ్యుని కొడుకు అయిన దీర్ఘతముడు అను మహర్షివలన మహాసత్వులును, వంశకరులును అయిన అంగుడు. వంగుడు, కళింగుడు, పుండ్రుడు, సుహ్మడు అను ఏవురుపుత్రులు పుట్టిరి. (2) ప్రహ్లాదుని కొడుకైన విరోచనుని కొడుకు. ఇతడు మహాశూరుడు. ముల్లోకములను గెలిచి దేవేంద్రుడు మున్నగువారి ఐశ్వర్యములను అపహరించి చక్రవర్తి అయ్యెను. అప్పుడు విష్ణువు వామనావతారము ఎత్తి ఒక చిన్నబాపడు అయి ఇతనిని మూడు అడుగుల భూమి యాచింప ఇతడు యాచకుడు విష్ణువు అని యెరిగియు, శుక్రాచార్యులు మొదలైనవారిచే అడ్డగింపబడియు, తన దాతృ త్వము లోకప్రసిద్ధము అగునటుల దానము ఇచ్చెను. అవామన రూపుడు అయిన

విష్ణువు అపుడు త్రివిక్రముడై ఒక్క అడుగున స్వర్గమును ఇంకొక అడుగున భూమిని అక్రమించి, మూడవది అయిన మరియొక అడుగునకు చోటు చూపుము అనగా యితడు తన తలను చూపెను. అంతట త్రివిక్రముడు ఇతనిని బంధించి ఇతని భార్యయగు వింధ్యావళి పతిభిక్షవేడగా అనుగ్రహించి పాతాళలోకమునందు సకుటుంబముగా వాసముచేయునట్లు ఇతనికి నియమమునుచేసి తాను ఇతని వాకిటి గదాధరుడు అయి కావలికాచుచు ఉండువాడు అయ్యెను. ఈ దానము ఇచ్చునపుడు శుక్రుడు జలకలశమునందుచేరి దాని ద్వారమునకు అడ్డము తన కన్ను నిలిపి ఉండగా అది ఎరిగి వామనుడు దర్భకర్రతో ఆ కన్ను పొడిచి ద్వారము చేసి నీళ్ళు బయలికి వచ్చునట్లు చేసెను. అది మొదలుకొని శుక్రుడు ఒంటికంటి వాడు అయ్యెను. మరియు ఈ బలిచక్రవర్తి చిరంజీవి. ఇతనికి నూర్గురుపుత్రులు కలరు. అందు బాణాసురుడు జ్యేష్ఠుడు. ఇతని సత్యసంధతకు మెచ్చి విష్ణువు ఇతనికి ఈ మన్వంతరముదైత్యేంద్రత్వమును పైమన్వంతరమున దేవేంద్రత్వమును అనుగ్రహించెను.

(భార) (భాగ)

**బలుడు** : (1) దై॥ బాణాసురుని కొడుకు. (2) బలరామునికి నామాంతరము. (3) అనాయువు పుత్రుడు (భార) (4) పారియాత్రుని పుత్రుడు, ఇతని కొడుకు చలుడు.

**బసవపురాణము** : ఇది వీరశైవమత స్థాపకుడు అగు బసవుని గురించి చెప్పబడినది.

**బసవుడు** : లింగధారి మతస్థాపకుడు. ఇతని తండ్రి శిలాదుడు. రమారమి 800 సంవత్సరములకు ముందు జీవించి ఉండెను. ఇతడు బ్రాహ్మణ వంశమునందు పుట్టియు ఉపనయన సంస్కారమును నిరాకరించి తన వారిని వదలి కళ్యాన పురమునకు పోయి అందలి జైనమతస్థుడు అగు కర్ణాటకరాజు యొక్క ప్రాపు కలిగించుకొని లింగధారి మతమును స్థాపించెను. ఈ మతస్థులు శైవారాధకులు. వేదమును శంకరాచార్యులను నమ్మదురుగాని జాతిభేదమును బ్రాహ్మణోత్కృష్టతను ఒప్పుకొనరు. కొందరు బ్రాహ్మణులును ఈ మతమును ఒప్పుకొని ఉన్నారు. వారు ఆరాధ్యులు అనబడుదురు. ఈతని తల్లిదండ్రులు కేవల శివభక్తులు అయినందున శివుడు వారి భక్తికి సంతుష్టుడై నంది వారికి పుత్రుడుగా జనియించునట్లు చేసి శివమతోద్ధరణము చేయుము అని ఆనతిచ్చినట్లు బసవపురాణమునందు చెప్పబడి ఉన్నది.

(బసవ)

బసవన : (పిడువర్తి) ఒకానొక తెనుగుకవి. ఇతడు ప్రభులింగలీల అను గ్రంథమును రచియించెను.

బహుళ : ఉత్తాన పాదుని కొడుకు అగు ఉత్తముని భార్య. ఈమె పతిని మిక్కిలి అనాదరము చేసినందున పతిచే విడువబడి సాలపోతకుడు అను నాగరాజు నాకలోకమునకు కొనిపోగా పోయి కొంతకాలమునకు పిమ్మట మరల తన భర్తను చేరెను. (మార్క)

బహుగంతుడు
బహుగవుఁడు : } పు॥ సుద్యుని కొడుకు. (భాగ)

బహురథుడు : పు॥ పురంజయుని కొడుకు.

బహుళాశ్వుడు : ఇతడు శ్రీకృష్ణుని కాలమున మిధిలానగరము పాలించుచు ఉండెను. ఇతని కాలముననే ఆపట్టణమున శ్రుతదేవుడు అను విష్ణుభక్తుడు అగు ఒక బ్రాహ్మణుడు ఉండెను. శ్రీకృష్ణుడు వీరి ఇరువురి భక్తికిని మెచ్చి మిధిలకు పోయి అందు కొన్ని దినములు ఉండి ఋషి సమేతుడు అయి ఆ ఇరువురి ఇండ్ల లోను ఏకకాలమున కనఁబడి వారిని కృతార్థులను చేసెను. (భాగ)

## బా

బాణుడు : (1) ది॥ బలిచక్రవర్తి యొక్క పెద్దకొడుకు. ఇతడు వేయి చేతులు కలవాడు. శివుని గూర్చి ఘోరమైన తపస్సుచేసి. తన పురద్వారమునందు అతడు కావలి ఉండునటుల వరము పడసెను. ఇతఁడు తనకు తెలియక తన కుమార్తె ఉష అను నామె కృష్ణుని పౌత్రుఁడు అగు అనిరుద్ధుని కూడెను. అని అతనిని నాగపాశబద్ధుని చేయగా కృష్ణుఁడు ఇతనిపై దండెత్తిపోయి యుద్ధము నందు ఇతని సహస్రబాహులలో తొమ్మన్నూట తొంబది యారు చేతుల ఖండించి తన్ను శివుడు ప్రార్థింపగా నాలుగు చేతులతో ప్రాణము తీయక నిలిపి శివునితో నీ భక్తులు అగు ప్రమథులలో వీడు ముఖ్యుడు అగును అని అనుగ్రహించి విడిచెను.

(2) య॥ వసుదేవుని తమ్ముడు అగు అనకుని మూడవ కుమారుడు,

(3) ఒకానొక సంస్కృత కవి, ఇతడు కాదంబరి. హర్షచరిత్ర అను గొప్ప కావ్య ములను రచియించెను. (భాగ)

**బాదరాయణుడు** : వ్యాసునికి నామము.

**బార్హదిషులు** ; పురువంశస్థుడు అగు అజమీఢుని కొడుకు అయిన బృహదిషుని వంశమున పుట్టినవారు. ఇందు కడపటివాడు భల్లాదుడు.

**బార్హద్రథులు** : మగధదేశపురాజులు. వీరిబృహద్రథుడు మొదలుకొని రిపుంజయుని వరకు క్రమాగతమై వేయి సంవత్సరముల కాలము మగధదేశమును ఏలిరి.

**బాలవత్స** : ద్యుమత్సేనుని భార్య. సత్యవంతుని మాత.

**బాలవ్యాకరణము** : పరవస్తు చిన్నయసూరిచే విరచితము అయిన ఆంధ్రవ్యాకరణము. ఇందు నన్నయభట్టీయమునందు చెప్పబడిన అనేక లక్షణ విశేషములు చెప్పబడి ఉన్నవి.

**బాలసరస్వతి** : నన్నయభట్టారకుని శిష్యుడు. ఇతడు సంస్కృతాంధ్రముల రెంటియందును నన్నయభట్టీయ వ్యాకరణమునకు వ్యాఖ్యానము వ్రాసి ఉన్నాడు. ఆ వ్యాఖ్యానముబాలసరస్వతీయము అనబడును. ఇతనిజన్మస్థానము రాజమహేంద్రము. అని జనుల వాడుక వలన తెలియవచ్చుచున్నది.

**బాష్కలి** : ఋ॥ బాష్కలుని కొడుకు ఇతడు వాలఖిల్యాఖ్య సంహితను గార్గ్యాది శిష్యులకు చెప్పెను.

**బాష్కలుడు** ; ఋ॥ ఇంద్ర ప్రమితి శిష్యుడు, ఋగ్వేదాధ్యేత కొడుకు బాష్కలి (2) అనుహ్లాదుని కొడుకు.

**బాహుకుడు** : (1) ఇ॥ వృకుని కొడుకు. సగరుని తండ్రి. ఇతడు శత్రువుల వలన రాజ్యమును పోగొట్టుకొని భార్యలతో కూడఅడవికిపోయి అచట కాలధర్మము పొందగా ఇతని జ్యేష్ఠభార్య సహగమనముచేయ యత్నించెను. అపుడు అచటి ఋషులు ఆబిడ గర్భిణిగా ఉండుట యెఱిగి ఆమెను సహగమనము వలన నివారించిరి. అనంతరము ఆమె పుత్రవతి అగుటకు సవతులు ఓర్వజాలక ఆగర్భము చెడునట్లు విషముపెట్టిరి. దానిచేగర్భముచెడక మహాబలపరాక్రమసంపన్నుడు అగు పుత్రుడు ఉదయించి సగరుడు అనబరగెను. (గరము = విషము) దానితో గూడినవాడు సగరుడు. (1) నలుడు ఋతుపర్ణునివద్ద అశ్వ శిక్షకుడును వంటవాడును అయి ఉండినప్పుడు వహించిన నామము

(భాశ)

**బాహుద** : ఈ పేరుతో రెండు నదులు కలవు. ఒకటి సర్వతీనది సమీపమున ప్రవహించును. మరి ఒకటి మహానదికి ఉపనదిగా ఉండును.

శంకుడు. లిఖితుడు. అను ఋషులు ఇరువురు ఈ నదీతీరమునందు ఆశ్రమము కావించుకొని ఉండు తఱిని లిఖితుఁడు తన అన్న అగు శంఖుని అనుమతి లేక తమ ఆశ్రమమునందలి ఫలములను భుజించెను. అది యెఱిగి శంఖుఁడు ఇది దొంగతనము అని నిందింపగా, ఆపాపము పరిహారము కాగలందులకు ఆదేశ మును అప్పుడు పాలించుచున్న సుద్యుమ్నుడు అను రాజుచేత తన రెండుచేతులను కోయించుకొని ఈ నదియందు స్నానము చేసెను. అంతట ఆ లిఖుతునికి ఈ నదీజలము వలని మహిమచేత బాహువులు రెండు వచ్చెను. కనుక దీనికి ఈ పేరు కలిగెను.

**బాహ్లికము** : ఒకానొక దేశము. ఇది సింధునదికిని శతద్రువునదికిని నడుమ ఉండును.

**బాహ్లికుఁడు** : కు॥ ప్రదీపునికొడుకు. శంతను తమ్ముఁడు. సోమదత్తుని తండ్రి. భూరిశ్రవుని తాత. భారత యుద్ధమునందు ఇతఁడు మృతిచెందెను.

## బి

**బిందుమతి** : శశిబిందుని కూతురు. మాంధాత భార్య (విష్ణు)

**బిందుసారుఁడు** : చంద్రగుప్తుని కొడుకు. మగధ దేశాధీశుఁడు.

**బిల్హణుడు** : ఒకానొక సంస్కృతకవి. నా॥చోరుఁడు. ఇతఁడు పాంచాలదేశపు రాజు అగు మదనాభిరామనృపతి యొక్క కూతురు అగు యామినీ పూర్ణతిలకకు విద్యాగురువుగా నియమింపఁబడి ఆపెను పరిగ్రహించెను.

## బు

**బుక్కమాంబ** : ఈశ్వరరాజు భార్య.

**బుధుడు** : (1) చంద్రుని కొడుకు. తల్లి బృహస్పతి భార్య అగు తార. ఇతఁడు వైవస్వతమనువు కూతురు అయిన ఇలను పెండ్లాడి ఆమెయందు పురూర వుఁడు అనుకొడుకును పడసెను. (2) చూ॥ నా॥ బంధుఁడు.

(భాగ)

బుద్ధుఁడు :బౌద్ధ మతస్థాపకుఁడు అగు గౌతముఁడు. ఇతఁడు మగధదేశాధిపతి అగు అజాతశత్రుని కాలమున నుండెను. బుద్ధుఁడు అను పదమునకు 'సర్వం క్షణికం బుధ్యతే బుద్ధః'' అని వ్యుత్పత్తి. ఇతఁడుఁ షడభిజ్ఞుఁడు అనియు చెప్పఁబడును. షడభిజ్ఞుఁడు అనగా, దివ్యదృష్టి" దివ్యశ్రోత్రము. పూర్వనివాసానుస్మృతి. పరచిత్తజ్ఞానము. అప్రత్యక్ష విషయజ్ఞానము, వియద్గమనాగమ వ్యూహాది లక్షణ బుద్ధి, అను ఆఱింటిని ఎఱిగిననాఁడు అని అర్థము. (భాగ)

## బృ

బృందావనము : యమునానది పశ్చిమతీరమున మధుర యొద్ద ఉండు వనము. దీనికి యెదుట (అనగా యమున యొక్క తూర్పుగట్టున) గోకులమున్నది. అందు కృష్ణుడు గోపకన్యకలతో అనేక లీలలు సలిపెను. (భాగ)

బృహత్క్షత్రుఁడు : పు॥ భుమన్యుని కొడుకు. హస్తికుని పితామహుఁడు.

బృహజ్జాతకము : ఒక జ్యోతిషగ్రంథము. వరాహమిహిరాదులచే చేయబడినది.

బృహత్కర్ణుడు : అం॥ భద్రరథుని కొడుకు.

బృహత్కాయుడు . బా॥ నా॥ బృహత్కర్ముఁడు. బృహద్ధనువు కొడుకు.

బృహచ్ఛేనుఁడు : } మద్రదేశపురాజు. ఇతని కూతురే కృష్ణుని యెనిమిదవ భార్య.
బృహత్సేనుఁడు : } అగు లక్షణ. కృష్ణుఁడు మత్స్యయంత్రము పడనేసి ఈమెను వివాహమయ్యెను. (శావ. స్త్రీ)

బృహదశ్వుఁడు : (1) ఇ॥ శబస్తుని కొడుకు, కువలయాశ్వుని తండ్రి.

(2) రు॥ పాండవులు అరణ్యావాసము చేయునపుడు ఇతఁడు ధర్మరాజునకు నలోపాఖ్యానము చెప్పెను. (భార)

బృహదిషుఁడు : (1) అజమీఢుని కొడుకు. ఇతని వంశస్థులు బార్హదిషులు అనఁబడుదురు. కొడుకు బృహద్ధనువు.

(2) పు॥ భర్మ్యాశ్వుని మూడవ కొడుకు.

బృహద్బలుడు : 1. య॥ వసుదేవుని అనుజుఁడు అయిన దేవభాగుని రెండవ పుత్రుఁడు. 2. శకుని తమ్ముఁడు. 3. శ్రీరాముని జ్యేష్ఠపుత్రుఁడు అగు కుశుని వంశస్థులలో కడపటివాడు. ఇతఁడు భారతయుద్ధమునందు అభిమన్యునిచేత చంపఁబడెను. (భార)

బృహద్రథుఁడు : 1. ఉపరిచరవసువు పెద్దకొడుకు. ఇతఁడు మగధదేశాధిపతి యయ్యెను. కొడుకులు జరాసంధుడు కుశాగ్రుఁడు. 2. మి॥ దేవరాథుని కొడుకు. 3. అం॥ బృహత్కర్ణుని కొడుకు. (భాగ)

బృహద్ధనువు : బా॥ బృహదిషుని కొడుకు బృహత్కాయుని తండ్రి

బృహద్భానుడు : అం॥ బృహద్రథుని కొడుకు (బృహన్మన)

బృహన్మనసుడు : అం॥ బృహద్భానుని కొడుకు

బృహన్నల : అజ్ఞాతవాస కాలమున పేడిగా ఉండిన అర్జునుని నామము. (భార)

బృహస్పతి : (1) బ్రహ్మ మానసపుత్రులలో ఒకడు అగు అంగిరసుని కొడుకు. దేవతలకు ఆచార్యుడు. మహాబుద్ధిమంతుడు. ఇతనికి వాచస్పతి అనియు పేరుకలదు ఇతని భార్య తార సహోదరుడు ఉతథ్యుడు సహోదరి యోగసిద్ధి (అంగిరసుడు అగ్నికి జ్యేష్ఠపుత్రత్వము వహించిన వెనుక అతనికి కలిగి ఏడుగురు పుత్రులలో బృహస్పతియు ఒక్కడుగ చెప్పి ఉన్నది. ఆ రూపమున ఇతనికి ఆరుగురు పుత్రులును ఒక్క పుత్రికయు కలిగిరి, (శివ,) (భాగ) (భార)

## బో

బోధన : రామగిరికి తూర్పున ఉండు ఒక కొండ.

## బౌ

బౌద్ధులు : బౌద్ధ మతమును అవలంబించినవారు ఈ మతమును స్థాపించినవాడు, శాక్యబుద్ధుఁడు, అని ప్రసిద్ధి కెక్కిన గౌతముఁడు, ఇతఁడు రమారమి రెండువేల నన్నూరు సంవత్సరములకు ముందు జీవించి యుండినటుల తెలియవచ్చుచు ఉన్నది. ఈ మతము సత్యశీల శమదమాది గుణములను విశేషముగా

బోధించును. ఎట్టివానికిని ఇది శాంతమును ఉపదేశించునేకాని వైరమును పుట్టింపదు. సత్వగుణ ప్రధానము అయి అడకువ, స్వమత, వినయము, ఇత్యాది సాధుగుణముల, నేర్చుటయందు మరియేమతమును, దీనిని మించి ఉండదు. అయినను బౌద్ధులు పురాణములను వేదములను విశ్వసింపరు. వర్ణాశ్రమ భేధముల ఒప్పుకొనరు కొందరు, నిరీశ్వరవాదులు మరికొందరు సృష్టికి కారణము ఏదియో యది ఒకటి కలదు. అని చెప్పుదురుకాని అందుల ధృఢమైన మనో నిశ్చయము గాని నమ్మకముగాని వీరికిలేదు. వీరు భరతఖండమున ఇపుడు సక్రృత్తుగాకాన బడుచూడున్నారు.

## బ్ర

బ్రహ్మ : త్రిమూర్తులలో ఒక్కఁడు. తొల్లి కల్పావసానమున సమస్తము జలార్ణము అయి అంతట అంధకార బంధురముగా ఉండువేళ ఆజల మధ్యమున శ్రీమన్నారాయణమూర్తి వటపత్రశాయియై యోగనిద్రను తేలుచు ఉండి వరాహ రూపమును పొంది తనదంష్ట్రాగ్రమున భూమిని జలమునందుండి పైకి ఎత్తినిలుపగా ఇతఁడు ఆ పంకజోదరుఁడు అగు నారాయణుని గర్భమున ప్రవేశించి అందు ఉండు బ్రహ్మాండముల తత్వమును ఎరిగి ఆ దేవుని నాభికమలమునందుండి వెడలి వచ్చి జగత్సృష్టి ఒనర్ప ఆరంభించెను. కనుక ఇతనికి పంకజభవుడు అను నామము కలిగెను. ఇతడు చతుర్ముఖుడు. తొలుత ఇతనికి ఐదు ముఖములు ఉండెను. ఒక కాలమునందు త్రిమూర్తులు కొలువుతీరి ఉండగా అచ్చటికి పార్వతీదేవి వచ్చి. పంచ ముఖములు అగు శివబ్రహ్మలు ఇరువురినిచూచి ఇతడు శివుడు, ఇతడు బ్రహ్మ అని తెలిసికోలేక పిమ్మట శివుని కనుసైగచేత అతనిని ఎఱిగి చేరబోయెను. అప్పుడు శివుడు తన భార్యకు ఇంత భ్రమ పుట్టుటకు కారణము బ్రహ్మకును అయిదు ముఖములు ఉండుటయే కదా అని అతని తలలలో ఒకటిని శివుడు తీసివేసెను. అంతట బ్రహ్మ అలిగి శివుడు కాపాలికత్వముచెంది భిక్షాటనముచేయునట్లు శపించెను. ఆ బ్రహ్మ హత్యాపాతకము పోవుటకై విష్ణువు యొక్క ఉపదేశమున శివుడు తీర్థయాత్రచేసెను. అటుల యాత్ర చేయుచూ కాశీ క్షేత్రమునకు రాగా అచటి ఆపాపము వలన విముక్తుడు అయ్యెను, ఇతని వ్యాపారము సృష్టి సేయుట. తొలుత ఇతనికి అనేకులు మానస పుత్రులు కలిగిరి. వారిలో తొమ్మండ్రుడు ప్రజాసృష్టికి కారణ భూతులు అయి నవ బ్రహ్మలు లేక

నవ ప్రజాపతులు అనబడిరి. వారు మరీచి. అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వశిష్ఠుడు, దక్షుడు, అనువారు. తక్కిన మానస పుత్రులలో సనకుడు. సనందుడు, సనత్సుజాతుడు, సనత్కుమారుడు, ఋభుడు నారదుడు, వరానుడు, అరుణి, యతి మొదలగువారు ముఖ్యులు. వీరు అందరును పూర్ధ్వ రేతస్కులు అయి సృష్టియందు ఇచ్ఛ లేక జన్మము మొదలు జ్ఞానులై తిరుగుచు ఉందురు.

బ్రహ్మయొక్క ఛాయవలన కర్దముడు పుట్టెను. భ్రూమధ్యమువలన అర్థనారీశ్వరుడు అగు రుద్రుడు పుట్టెను. ఈ ప్రజాపతుల యొక్కయు, మహర్షుల యొక్కయు ఉత్పత్తి పలు విధములుగా చెప్పుదురు. శ్రీమద్భాగవతమున ఉన్నరీతిని బ్రహ్మ యొక్క అంగుష్ఠమున దక్షుడును, నాభిని పులహుడును, కర్ణముల పులస్త్యుడును, త్వక్కున భృగువును, హస్తమున క్రతువు, ఆస్యమున అంగిరసుడును, ప్రాణమున వశిష్ఠుడును మనమునమరీచియు, కన్నులయందు అత్రియుపుట్టిరి. మరియు నారదుడు ఊరువులను, దక్షిణ స్తనము వలన ధర్మమును, వెన్నువలన అధర్మమృత్యువులును ఆత్మను రాముడును, భ్రూయుగళమున క్రోధుడును పుట్టినట్లు చెప్పియున్నది. ఇదిగాక బ్రహ్మ తనదేహమునుండి, సరస్వతి జనింపగా అమెనుకని విభ్రాంతిని పొంది, కామాతురుడు అయి భార్యగా చేసికొనెను.

(కూర్మ) (శివ) (దే. భా) (బ్రహ్మ) భాగ్య (భర్త)

బ్రహ్మ కైవర్తము : ఒక పురాణము ఇది వశిష్ఠ ప్రోక్తము స్రష్టృ, సృష్టి వివరణ వివిధ ధర్మాదులు ఇందు చెప్పబడి యున్నవి. దీనిగ్రంధ సంఖ్య పదునెనిమిదివేలు.

బ్రహ్మదత్తుడు : (1) రు॥ చూళి కొడుకు, కుశనాభుని కుమార్తెలకు మగడు. (2) బా॥ అణుహునికొడుకు, ఇతడు యోగ తంత్రము అను ఒక గ్రంథమును వ్రాసినట్లు తెలియ వచ్చును. (3) ఒక రాజు. ఇతడు ఒకప్పుడు గౌతమునికి అన్నము యిడుచుండు తరిని అందు మాంస ఖండము అగపడినందుకై అతనిచే గృధ్రము అగునట్లు శపింపబడి, ఆశాపము శ్రీరాముని కరస్పర్శముచే నివర్తికాగా దేవత్వమును వహించెను. (రామా) (ఉహ) (ఉరా)

బ్రహ్మము : చూ॥ త్రిమూర్తులు.

బ్రహ్మర్షిదేశము : కురుక్షేత్ర, మత్స్య, పాంచాల(కన్యాకుబ్జ), శూరసేన (మధుర) దేశములు బ్రహ్మర్షిదేశము అనబడును.

బ్రహ్మవిద్య : (భారతరీత్యా) ప్రజాపతి భార్య. ధ్రువుడు అను వసువుతల్లి.

బ్రహ్మశిరము : ఒక దివ్యాస్త్రము. అల్పులపైని దీనిని ప్రయోగింప గూడదు. (భార)

బ్రహ్మసూత్రము : వ్యాసులచే చేయబడిన బ్రహ్మమీమాంస. ఇది బ్రష్టృసృష్టి సంబంధమును తెలుపును. దీనిని త్రిమతస్థులును అంగీకరించి యున్నారు.

బ్రహ్మాండము : 1. చూ॥సృష్టి. 2 అష్టాదశపురాణములలో ఒకటి. ఇది బ్రహ్మ ప్రోక్తము. బ్రహ్మాండ విషయము కలది. దీని గ్రంథసంఖ్య పది రెండు వేలు. 3: ఉపపురాణములలో ఒకటి.

బ్రహ్మావర్తము : సరస్వతీ, దృషద్వతీనదులకు నడిమిదేశము.

## బ్రా

బ్రాహ్మము : ఒక పురాణము, ఇందు బ్రహ్మ మరీచ్యాదులకు బోధించిన బ్రహ్మ కల్పవిషయము మొదలగునవి చెప్పబడియుండును. దీని గ్రంథ సంఖ్య పదివేలు.

## భ

భంగాశ్వుడు / భంగాస్వనుడు : ఒకానొక రాజు. ఇతడు పురుష రూపముతో నూరుగురు సుతులను బడసి ఆవల స్త్రీ రూపముతో నూరుగురు సుతులను పడసెను. కడపట పురుషత్వమును ఒల్లక దేవేంద్రుని అనుగ్రహమున స్త్రీగానే ఉండెను. (భార)

భగదత్తుడు : నరకాసురుని కొడుకు. (భార)

భగవంతుడు : సంభర్తృత్వము, భర్తృత్వము, నేతృత్వము, గమయితృత్వము, స్రష్టృత్వము. సర్వశరీరత్వము సర్వభూతాంతరాత్మత్వము, నిరస్త నిఖిల దోషత్వము, షాడ్గుణ్యపూర్ణత్వము మొదలుగా గల గుణములు కలవాడు భగవంతుడని ఎఱుగవలయును.

సంభర్తృత్వము అనగా ఉపకరణ సంపాదనము. అనగా ప్రకృతిపురుషకారము లకు కార్యములను పుట్టించునట్టి యోగ్యతను కలుగజేయుట. భర్తృత్వము అనగా

స్థితిని కలుఁగఁ జేయుట, గమయితృత్వము అనఁగా సంహారముచేయుట. స్రష్టృత్వము అనఁగా సృజియించుట. సర్వశరీరత్వము అనఁగా ప్రపంచము శరీరముగా కలిగి ఉండుట. సర్వభూతాన్తరాత్మత్వము అనఁగా ఎల్లభూతములకు లోపల ఆత్మగా ఉండుట. నిరస్త నిఖిలదోషత్వము అనగా ప్రకృతి సంబంధముచేత వచ్చెడి దోషములు యేవియు లేకయుండుట. షాడ్గుణ్యా పూర్ణత్వము అనగా ఐశ్వర్యము, వీర్యము, యశస్సు. శ్రీ, జ్ఞానము, వైరాగ్యము, ఈ యాఱు గుణములను కలిగి ఉండుట.

భగవద్గుణములు ఇట్టివి అని నిరూపింప వాగ్బుద్ధీంద్రియ మానసములకు అలవిఁ గాదు. పరాపరములకు పరమమై, అనన్యమై, ప్రాక్ర్ప సిద్ధమై, సర్వవ్యాపకమై, ఆది కారణము అగు తత్వము అయిన అతఁడు నిర్గుణుఁడు. అయినను మేదిని యందు కలుగు గంధాది గుణములను ఆశ్రయించిన వాయువువలె, సర్వగుణ రూపుఁడు అయివెలుగుచుఉండును. అస్తి నాస్తి అను వస్తుద్వయములుకలిగి విరుద్ధ ధర్మములుగ ఉండును. వాసనా శాస్త్ర, సాంఖ్యశాస్త్రములకు సమమై వీక్షింపదగిన పరమమైన అతని తత్వస్వరూపము, ఎఱుగక వాక్యభేదములచే యోగీశ్వరులు మోహితులు అయి భేదమును ఆచ్ఛాదించి ఆత్మ తమకు సుఖదుఃఖములను ఇచ్చు ప్రభువు అని చెప్పుదురు. దైవజ్ఞులు గ్రహదేవతాదులకు ప్రభుత్వమును సంపాదింతురు. మీమాంసకులు కర్మమునకు ప్రాభవము ప్రకటింతురు. లోకాయతికులు స్వభావమునకు ప్రభుత్వము స్థాపింతురు జగదనుగ్రహము కొఱకు అతఁడు నామ రూపములచే ఎఱుగఁబడుచు ఉండును కాని తత్వము విచారింప అతనికి నామరూపములు లేవు. సర్వమును ఎవ్వనివలన ఉత్పన్నము అగునో ఎవ్వనివలన స్థితిని పొందునో, ఎవ్వనివలన లయము అగునో అట్టి అనంతగుణములు కల మహాత్ముని వర్ణింప ఎవరితరము.

"ఉ.నీ విభవంబు నీ జగము నుండుట యుండుట నాశ మొందుటన్ ।
నీ విమలాంశజాలములు నెమ్మి జగంబు సృజించు వారలో ।
దేవ భవద్గుణాంబుధుల తీరమె కానగ నీచబుద్ధితో ।
వావిరి జర్చ సేయుదురు వారికి వారలు దొడ్డవారలై॥"

"సీ॥ ఒక్కఁడై నిత్యుఁడై యెక్కడఁ గడలేక
స్వరిద జన్మాదుల శూన్యు డగుచు
సర్వంబునందుండి సర్వంబు దనయందు
నుండంగసర్వాశ్రయుండనంగ
సూక్ష్మమై స్థూలమై సూక్ష్మాదికములకు
సామ్యమై స్వప్రకాశమున వెలిగి
యఖిలంబు జూచుచు నఖిల ప్రభావుడై
యఖిలంబు దనయందు సడచి కొనుచు

తే॥ నాత్మ మాయాగుణముల నాత్మమయము
గాగ విశ్వంబు దన సృష్టి ఘనత నొంద
జేయుచుండును సర్వ సంజీవనుండు
రమణ విశ్వాత్ముడైన నారాయణుండు.

భగవద్గీత : భగవంతుఁడు అగు శ్రీకృష్ణుఁడు అర్జునుని కుపదేశించిన యోగ శాస్త్రము. ఇది భారత యుద్ధావసరమున అర్జునుఁడు రెండు బలముల యందును కలసోదరసుతమాతులాచార్యాదులు అగు బంధు శిష్టజనులను చూచి పరమ కృపావేశమున అత్యంత విషాదమును పొంది వారిని చంప నొల్లక శరశరాసనము లను విడిచి యుద్ధమందు ఉత్సాహము మానియుండెను. అంతట కృష్ణుఁడు అతనికి స్వధర్మమును పరిపాలించుట దోషముకాదు, అని బోధించి తత్వజ్ఞానము ఉపదేశము చేసెను. ఆయుపదేశవాక్యములే భగవద్గీత అనఁబడును. ఆవాక్యములచే బాధ్య బాధకత్వములు లేవు. అని అర్జునుఁడు తెలిసికొని కృపాశోకములకు మూలములు అయిన అహంకారమమకారములను వారించి రణోత్సాహము నకు కారణము అయిన స్వకర్మమును వదలక అవలంబించెను. ఈ యోగశాస్త్ర మును త్రిమతస్థులును మిక్కిలి భక్తితో ఆదరింతురు.

భగీరథుఁడు : ఇ॥ దిలీపుని కొడుకు. ఇతఁడు సగరుని కొమారులను తమ ప్రపితామహులను అయిన అరువదివేవురు సాగరులు కపిలమహాముని కోపముచే భస్మీభూతములుకాగా వారలకు సద్గతి కలుగజేయుటకై గోకర్ణమునందు మహత్తరము అగు తపము ఆచరించి దేవగంగను భూలోకముగుండ పాతాళము

నకు కొనిపోయి అందు ఉండిన తన ప్రపితామహుల భస్మరాసులను పావనము చేసి వారికి స్వర్గలోకము కలుగచేసెను. ఈ హేతువునుబట్టి గంగకు భాగీరథి అను పేరు కలిగెను. ఈతని కొడుకు శ్రుతుడు. లేక సుహోత్రుడు. 2. కా॥ కేతురథుని కొడుకు. దివోదాసుని తండ్రి. (ఆ. రా) (బ్రహ్మ)

**భగుడు** : ద్వాదశాదిత్యులలో ఒకడు. దక్షయాగమునందు వీరభద్రుడు ఇతని కన్నులు పెరికెను అని ప్రసిద్ధి.

**భగోళము** : (పురాణరీత్యా) సూర్యుడు ఉత్తరాయన దక్షిణాయణ విషువులు అను నామములు కల మాంద్యతీవ్రసమానగతుల ఆరోహణావరోహణాస్థానముల యందు దీర్ఘహ్రస్వ సమానములుగ చేయుచు ఉండును. మఱియు అతడు మేష తులలయందు అహోరాత్రముల సమముగాను, వృషభాది పంచమాసములను, రాత్రి ఒక్కొక్కగడియ తక్కువగాను, వృశ్చికాది పంచమాసములను ఒక్కొక్క గడియ రాత్రి. అధికముగాను దానికి తగినట్లు దినములయందును తిరుగును ఇవ్విధమున దివసములు ఉత్తరాయణ దక్షిణాయనముల వృద్ధిక్షయములను ఒందగా ఒక అహోరాత్రమున ఏకపంచాశ దుత్తర నవకోటి యోజనముల పరిమాణము గల మానసరోత్తర పర్వతమునందు సూర్యుని రథము తిరుగుచు ఉండును. ఆమానసోత్తరపర్వతమునందు తూర్పున దేవధాని అను ఇంద్రపురమును, దక్షిణమునయందు సయము అని యమనగరమును, పశ్చిమమునందు నిమ్లోచని అను వరుణపట్టణమును, ఉత్తరమున విభావరి అనుసోమునిపుట భేదనమును తేజరిల్లుచు ఉండును. సూర్యుడు ఎప్పుడు ఇంద్రనగరమునుండి గమనించునో అది మొదలు పదుయేను గడియలలోరెండుకోట్ల ముప్పదియేడు లక్షల డెబ్బదిఐదువేల యోజనములు నడుచును. ఇవ్విధమున ఇంద్ర యమవరుణపురముల మీద చంద్రాది గ్రహనక్షత్రములను కూడి సంచరించును. పంౘెండు అంచులును ఆరుకమ్ములును మూడు తొలులునుకలిగి సంవత్సరాత్మకమై యేకచక్రము కల సూర్యుని రథము ముహూర్తమాత్రమున అష్టశతాధిక చతుస్త్రింశల్లక్షయోజనములు సంచరించును. ఆరథమునకు గాయత్రిఛందము ఆదిగా సమస్తఛందములును అశ్వములు అయి ఉండును. సూర్యునకు అగ్రభాగమున అరుణుడు రథము గడపుచు ఉండును, అంగుష్ఠ పర్వమాత్రశరీరములు గల అరువదివేల వాలఖిల్యాఖ్యులు అగు ఋషివరులు అతని ముందట సూక్తములచే స్తుతియింప,

మఱియు అనేకములును గంధర్వ కిన్నర కింపురుష నాగాప్సరః పతంగాదులును, నెలనెలను వరుస చొప్పున సేవింప తొమ్మిదికోట్ల యేబదియొక్క లక్షయోజనముల పరిమాణము గల భూమండలమును అంతయు క్షణమునకు రెండువేలు నేబది యోజనములవంతున, ఒక అహోరాత్రముననే సూర్యుడు సంచరించును. ఇట్లు అతి వేగముగా తిరుగుచు ఉండు కులాల చక్రమువంటి చక్రమునందు చక్రభ్రమణము నకు వేరే బంతులుసాగి తిరిగెడు పిపీలికాదుల చందమున నక్షత్రరాసులతో కూడిన కాలచక్రము ధ్రువ మేరువులకు ప్రదక్షిణముగ తిరుగు నపుడు ఆకాలచక్రమునకు యెదుట సంచరించు సూర్యాది గ్రహణములకు నక్షత్రాంతరముల యందును రాశ్యంతరములయందును, ఉనికి కలుగుటజేసి సూర్యాది గ్రహములకు చక్రగతి స్వగతుల వలన గతిద్వయము కలుగుచు ఉండును. సూర్యుఁడు ఆదినారాయణ మూర్తి అగుచు లోకముల యోగక్షేమములకు వేదత్రయాత్మ వహించి కర్మసిద్ధి నిమిత్తము దేవర్షిగణములచే వేదాంతార్థముల అనవరతము వితర్క్యమానము అగు చున్న తన స్వరూపమును ద్వాదశవిధములుగ విభజించి వసంతాది ఋతువులను ఆయాకాల విశేషములలో కలుగచేయుచు జ్యోతిశ్చక్రాంతర్వార్తియై స్వకీయ తేజః పుంజదీపితాఖిల జ్యోతిర్గణములు కలవాడై ఒకసంవత్సరమున ద్వాదశరాసుల యందును సంచరించుచు ఉండును. అట్టి ఆదిపురుషుని గమన విశేషకాలమును లోకులు ఆయన, ఋతు, మాస, పక్ష, తిథ్యాదిభేదములచే వ్యవహరించుచు ఉండును. వెండియు అప్పరమపురుషుఁడు ఆ రాసులయందు షష్ఠాంశ సంచారమును ఒందిన సమయము ఋతు అవి వ్యవహరింపఁబడును. ఆరాసులయందు అర్థాంశ సంచారమున రాశి షట్కభోగమును పొందిన కాలము ఆయనము అని చెప్పఁ బడును. సమగ్రముగా రాసులయందు సంచారముచేయు కాలము సంవత్సరము అని నిర్ణయింపఁబడును. ఇట్టి సమగ్రరాశి సంచారమునందు శీఘ్రగతి, మంద గతి, సమగతి, అనియెడు త్రివిధగతి విశేషముల వలనను యేర్పడెడు ఆ సంవత్స రమును సంవత్సరము పరివత్సరము, ఇలా వత్సరము, అనువత్సరము. ఇద్వత్స రము, అని పంచవిధముగా చెప్పుదురు చంద్రుఁడును ఈ తెరగుననె ఆసూర్యమండ లముమీదలక్షయోజనలనుండి సంవత్సర పక్షరాశినక్షత్ర భుక్తులుపుచ్చుకొనుచు అగ్ర చారియై శీఘ్రగతినిచరించును. వృద్ధిక్షయరూపమున పితృగణములకుపూర్వపక్షాపర పక్షణములచేత అహోరాత్రములు కలుగచేయుచు సకల జీవప్రాణమై ఒక్క నక్షత్రము త్రింశ ముహూర్తములు అనుభవించుచు షోడశకళలు కలిగి, మనో

మయమును, అన్నమయమును, అమృతమయమును అగు దేహముతో. దేవ పితృ మనుష్యభూత పశుపక్షి సరీసృప వీరు ప్రభృతులకు ప్రాణాప్యాయన శీలుఁడు అగుటచే సర్వసముఁడు అనఁబడి ఉండును.

భజమానుఁడు : (1) య॥ సాత్వతుని కొడుకు. ఇతనికి ఇరువురు భార్యలుకలరు. అందు మొదటి భార్యయందు నిమ్రోచి, కంకణుఁడు, వృష్ణి అని మువ్వురు కొడుకులును, రెండవ భార్య యందు శతజిత్తు సహస్రజిత్తు అయుతజిత్తు అని మువ్వురు కొడుకులును కలిగిరి. (2) య॥ అంధకుని పెద్దకొడుకు (భార)

భజి : య॥ సాత్వతుని కొడుకు.

భట్టి : చంద్రశర్మ కొడుకు. విక్రమార్కుని, తమ్ముఁడు. మంత్రియును, ఇతఁడు కవియును అని చెప్పుదురు. చూ॥ భట్టికావ్యము.

భట్టికావ్యము : భట్టిచే రచింపఁబడిన పాణినీయ సూత్రాధార భూతమైన ఒక లక్ష్యగ్రంథము. ఈ గ్రంథకారుఁడు భట్టోజీదీక్షితుఁడు అని కొందరును విక్రమార్కుని మంత్రియైన భట్టి అని కొందరును చెప్పుచు ఉన్నారు. దీనికి మల్లినాథ సూరి సర్వపది అను ఒక వ్యాఖ్యానమును రచియించి ఉన్నాడు.

భట్టుమూర్తి : ఒక గొప్ప ఆంధ్రకవి. ఈతని జన్మభూమి బళ్లారికి సమీపము నందలి పాలమండలము అను ప్రదేశమున ఉండెడు భట్టుపల్లె. శాలివాహనశకము 13 వ శతమాన మధ్యకాలమున జీవించి ఉన్నట్లు తెలియవచ్చుచు ఉన్నది. ఇతడు రచియించిన గ్రంథములు వసుచరిత్రము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, కావ్యాలంకార సంగ్రహము. అందు మొదటిది రెండవదానివలె శుద్ధ శ్లేషమయము కాక పోయినను శ్లేషనే అను జీవించి ఉండును. దీనివలె కఠినశైలికలదియు మధురము అయినదియు అగు శ్లేషకావ్యము మరియొక్కటి తెనుగునలేదు. రెండవది కేవలశ్లేషమయమై హరిశ్చంద్రుని యొక్కయు, నలునియొక్కయు చరిత్రములను తెలుపుచు ఉన్నది. మూడవది కావ్యాలంకార లక్షణములను తెలుపునది. తెలుగునందు మేలైన అలంకారశాస్త్రము ఇది ఒక్కటియే కానబడుచు ఉన్నది. ఈతని కావ్యములు మిక్కిలి శ్లాఘనీయముగా ఉన్నవి. అయినను అవి ఇంచుక మంతాంతర లక్షణమును తెలుపును. ఇతనికి రామరాజ భూషణుడు, భట్టుమూర్తి అని రెండుపేళ్ళు కలవు. భట్టుమూర్తి అను బిరుదాంకము కృష్ణదేవరాయలచే ఇతనికి ఇయ్యబడెను.

భట్టోజీ దీక్షితుఁడు : పాణినీయవ్యాకరణ సూత్రములను సిద్ధాంత కౌముది అను పేర ఆయా ప్రకరణములను విభజించి వ్రాసిన ఒక పండితుఁడు. ఇతఁడు గౌడబ్రాహ్మ ణుడు. సుమారు 700 800, సంవత్సరములకు ముందు ఈయన ఉండినట్లు తెలియఁబడును.

భద్ర : 1. దుర్గాదేవికి నామాంతరము. 2. వసుదేవుని భార్య. ఈమెకు కౌసల్య అను నామము కలదు.
3. కృష్ణుని అష్టభార్యలలో ఒకతె. ఈమె కేకయరాజు కూతురు. (భాగ)

భద్రకర్ముడు : శుక్రకపుత్రుడు. దైత్యగురువు.

భద్రకాళి : పార్వతికి నామము. దక్షప్రజాపతి యజ్ఞముచేయు నపుడు తన భర్తఅగు రుద్రునికి యజ్ఞభాగము ఈయక తన్నును తిరస్కరించినందున ఉమాదేవి తండ్రి అగు దక్షుని పైని కోపించి పొందిన రౌద్రమూర్తిని భద్రకాళి, దుర్గా కాళి అని చెప్పుదురు. ఈమె అప్పుడు ఆ దేహము వదలి వెనుక హిమవంతుని కూతురు అయి పార్వతి అనబరగెను.

భద్రబాహువు : య॥ వసుదేవుని కొడుకు. సుభద్రుని భ్రాత.

భద్రరథుడు : అం॥ చంపుని పౌత్రుఁడు. బృహత్కర్ణుని తండ్రి.

భద్రసేనుఁడు : య॥ మహిష్మంతుని కొడుకు. భ,

భద్రావతి : హస్తినాపురికి ఏబదిమైళ్ళ దూరమున ఉండు ఒక పట్టణము.

భద్రుఁడు : య॥ వసుదేవుని కొడుకు. సుభద్రుని భ్రాత.

భయ : హేతి భార్య. విద్యుత్కేశుని తల్లి. (ఉ. రా.)

భరతఖండము / భరతవర్షము : హిమవంతమునకు దక్షణమున ఉండు కర్మభూమి ప్రియవ్రతుని పెద్దకొడుకును జంబూద్వీపమునకు రాజును అయిన అగ్నీధ్రుడు తన పాలికి వచ్చిన జంబూద్వీపమును తన తొమ్మండ్రు కొడుకులకు పంచి ఇచ్చునపుడు ఈ ఖండమును నాభి అనువానికి ఇచ్చెను. ఆనాభి యొక్క పౌత్రుడు అయిన భరతుడు అను రాజు వలన దీనికి ఈపేరు కలిగెను.

భరతుడు : (1) స్వాయంభువుని వంశస్థుఁడు అగు ఋషభుని జ్యేష్ఠపుత్రుఁడు. ఇతని నామముచే హిందూదేశమునకు భరత ఖండము అనుపేరుకలిగెను. భరత

మహారాజు సర్వసంగ పరిత్యాగముచేసి భగవదారాధన కావించుచు తపోవృత్తినుండి ఒకనాడు నదియందు అవగాహనము చేయునపుడు పూర్ణగర్భిణిఅగు ఒక లేడి నీరు త్రావను అచటికివచ్చి సింహగర్జనము ఒకటివిని భయపడి గంతు వేయగా దాని గర్భమందు ఉన్నపిల్లజారి ఆ నదీజలములపడి ఆ లేడి చచ్చెను. అంత భరతుఁడు ఆహరిణపోతమును చూచి కరుణార్ద్రచిత్తుడై దానిని కొనివచ్చితన ఆశ్రమమునందు ఉంచి పెంచుచు వచ్చెను. సర్వసంగ పరిత్యాగి అయ్యును ఇతనికి ఆహరిణము నందలి ప్రీతిప్రాణోత్క్రమణ కాలమునందుకూడ వదలమిజేసి మరుజన్మమున హరిణగర్భమున జన్మించెను. అట్లయినను పూర్వజన్మ సంస్కారమువలన ఇతడు తాను హరిణముగ పుట్టినందులకు కారణము ఎరిగినవాఁడు. కావున మహర్షుల యాశ్రమముల తిరుగుచు మృగదేహత్యాగావసరము కోరుచు ఉండెను. అనంతరము ఇతఁడు హరిణదేహమును పాసి ఆంగిరసుడు అను బ్రాహ్మణునికి కొడుకు ఆయి పుట్టి కర్మ మార్గమును ఒల్లక జ్ఞాన వైరాగ్యము కలవాడై జడునివలె అడవియందు సంచరించుచు ఉండ కొందరు క్రూరులు ఇతనిని నరపశువుగా కాళికాదేవికి బలి ఇయ్యపోయిరి. అప్పుడు ఆదేవి ఇతనిని కొనిపోయిన వారిని బలికొనెను. మరియొక వేళ సింధుదేశపురాజు అగు సౌవీరుని భటులు ఇతనిని పట్టుకొనిపోయి తమరాజు యొక్క పల్లకి మోయించిరి. అంత ఆ పల్లకి హెచ్చు తక్కువలుగా పోసాగెను. అదిచూచి రాజు దానికి కారణము విచారించి ఈతని వర్తమానము తెలిసి ఇతని వలన వేదాంతరహస్యములు తెలిసి కొనినట్లు తెలియవచ్చుచున్నది. ఈతని కొడుకు సుమతి. (2) ఇ॥ శ్రీరాముని తమ్ముఁడు. దశరథునికి కైకేయి వలన పుట్టిన కొడుకు. భార్య కుశధ్వజుని పుత్రిక అయిన మాండవి. (3) దుష్యంతుని కొడుకు. తల్లి శకుంతల. ఈ భరతుని వంశస్థుల చరిత్రయే భారతము. ఇతఁడు తన భార్య యందు సంతానము పడయనేరక యాగముచేసి భరద్వాజుని అనుగ్రహమున భుమన్యుఁడు లేక వితథమన్యుఁడు అను పుత్రుని పడసెను. (4) శయుడు అను అగ్ని యొక్క రెండవ కొడుకు. నా॥ పుష్టిమతి. (రామా) (భాగ) (భార)

**భరద్వాజి** : మాళవముగుండ ప్రవహించు ఒకనది.

**భరద్వాజుఁడు** : (1) రు॥ ఉతథ్యుని కొడుకు. తల్లి మమత. ఇతడు తన పెదతండ్రి అగు బృహస్పతి వలన జనించినాడు. ఇతని ఆశ్రమము శృంగిబేరపురమునకు దక్షిణమునందుకల ఇప్పటి ప్రయాగ. ఘృతాచిని చూచి ఇతఁడు ఒకప్పుడు చిత్త

చాంచల్యము పొందగా రేతస్సు జారెను. అంతట ఆరేతస్సును ఇతఁడు ద్రోణ మందు సంగ్రహించి ఉంచెను. దాని వలన ఇతనికి ద్రోణుడు అను కుమారుఁడు కలిగెను. కొందరు ఈరేతస్సు ఘటమునందు సంగ్రహింపబడెను అందురు. కనుక ద్రోణుడు కుంభసంభవుడు అనియు అనబడును (2) శయుడు అను అగ్నియొక్క జ్యేష్ఠపుత్రుఁడు

(భార)

**భర్గుడు** : రుద్రునికి నామము.

**భర్తృహరి** : ఒకానొక సంస్కృతకవి. విక్రమార్కుని భ్రాత. (చూ॥ చంద్రశర్మ) ఈయన శాలివాహనుని జననమునకు ముందు మూటముప్పది అయిదు ఏండ్లనాడు ఉజ్జైయినీ పట్టణమును యేలుచు ఉండెను. ఇతడు సుభాషిత రత్నావళి అను మహాగ్రంథమును, పాతంజల మహాభాష్య వ్యాకరణరూపమగు కారికలను, వాక్యప్రదీపము అను వ్యాకరణగ్రంథమును, ఇరువది రెండుశ్లోకములు కల రాహటి వాక్యమును, రచియించెను. మరియు ఇతఁడు చిన్నప్పటి నుండి తపస్వులు, యోగులు మొలగువారి సేవచేయుట యందు ప్రీతి కలవాడు అయి ఉండెను. ఇట్టి సద్గుణములు కలిగి ఇతఁడు రాజ్యముచేయుచు ఉండగా ఆ పట్టణమునందలి సకల మంత్రశాస్త్రములు తెలిసిన ఒక పేద బ్రాహ్మణుఁడు భువనేశ్వరి అను దేవతను ఉపాసించెనట. ఆదేవి ప్రత్యక్షమై ఒక పండును ఇచ్చి దీనిని భక్షించిన యెడ ముసలి తనమును చావును లేనివాడవు అగుదువు, అని ఆనతిచ్చి అంతార్ధానము అయ్యెను. అంతట ఆబ్రాహ్మణుఁడు తన లో నాను నేను కేవలము దరిద్రుడును, ఈ ఫలమును భక్షించియెవరిని రక్షింప పోయెదను. చిరకాలము భిక్షాటనముచేసి జీవింపవలసిన వాడనేకదా? కనుక దీనిని కొనిపోయి రాజునకిచ్చితినేని అతఁడు జరా మరణములు లేక చిరకాలము ప్రజలను పాలించును, అని విచారించి రాజు కొలువునకుపోయి అఫలమును ఆశీర్వచన పూర్వకముగా ఇచ్చి దాని మహిమను చెప్పెను. రాజు దానిని పుచ్చుకొని తనకు ప్రియురాలు అయిన అనంగసేన అను దానికి ఇచ్చెను. అది తనకు ప్రియుడైన గుఱ్ఱపువాఁడు ఒకడు ఉండగా వానికి ఇచ్చెను. వాడు తనకు ప్రేమాస్పదురాలు అయిన ఒక దాసికిని అది తన యిష్టుడు అయిన ఒక గొల్లవానికిని, ఆ గొల్లవాఁడు తనప్రియురాలు అయిన పేడ ఎత్తెడు దానికిని ఈయగా ఆ పేడ ఎత్తునది ఆ పండు పుచ్చుకొనిపేడను గంపకు నిండించుకొని దానిపైని ఆ ఫలమును ఉంచుకొని రాజమార్గమున తన యింటికి

పోవుచుండెను. విలాసార్థముగా బయటికిచ్చి విహరించుచు ఉండిన భర్తృహరి దానిని చూచి తానుతన ప్రియురాలికి ఇచ్చిన పండు ఈ పేద ఎత్తుడు దానికి ఎట్లు లభించెను? అని దానిని తన సమ్ముఖమ్మునకు రావించి సకలవృత్తాంతమును తెలిసికొని స్త్రీలు ఎంత ప్రియము చూపినను నమ్మతగిన వారుకారు అని నిశ్చయించి సంసారము వలన విరక్తుడు అయి ఆ పండును విక్రమార్కునికి ఇచ్చి తాను వనమునకు పోయి తపస్సుచేయుచు తన వైరాగ్యము విశదపడునట్లు నీతి శతకము, శృంగార శతకము, వైరాగ్య శతకము అను మూడు శతకములు కల సుభాషిత, రత్నావళిని రచించెను. అది ఇతని పేర భర్తృహరి అనియే వ్యవహరింపబడుచు ఉన్నది. విక్రమార్కుడును ఆ ఫలమును ఒక ముసలిబ్రాహ్మణుడు యాచింపగా అతనికి సమర్పించెను.

**భర్మ్యాశ్వుఁడు** : పూరువంశస్థుడగు అజమీఢుని రెండవ కొడుకు అయిన నీలుని వంశస్థుఁడు. నా॥ హర్యశ్వుఁడు, తండ్రి ముద్గలుఁడు. కొడుకులు ముద్గలుఁడు, యమీనరుఁడు, బృహదిషుఁడు కాంపిల్యుఁడు, సృంజయుఁడు చూ॥ పాంచాలము.

**భల్లాదుఁడు** : బా॥ ఉదక్సేనుని కొడుకు. ఇతఁడు భారతయుద్ధమున కర్ణునిచే చంపఁబడెను. (భార)

**భవభూతి** : ఒకానొక సంస్కృత కవి. ఇతఁడు కాశ్యపగోత్రోద్భవుఁడు. ఇతని జన్మదేశము విదర్భము. మఱియు ఇతఁడు భోజరాజు కాలమున ఉండెను. మాలతీ మాధవీయము ఉత్తరరామచరిత్ర అనునాటకములు ఇతనిచేత విరచింపఁ బడెను. నా॥ శ్రీకంఠుఁడు.

**భవాని** : పార్వతికి నామము.

**భవిష్యత్తు** : ఒక పురాణము ఇది శతానీకునకు సమంత్రుడు చెప్పిన అర్క ప్రభావ భవిష్యత్కల్ప విషయాదులను కలది. దీని గ్రంథ సంఖ్య 14000.

**భవుఁడు** : అష్టమూర్తులలో ఒకఁడు. శివునికి నామాంతరము.

**భవ్యుడు** : ప్రియవ్రతుని కొడుకులలో ఒకఁడు. ఇతని పాలికి శాకద్వీపము వచ్చెను. ఇతనికి కొడుకులు ఏడుగురు. (మార్క)

# భా

భాగవతము : ఒక పురాణము. ఇందు గాయత్రీదేవి విషయము పరమాత్మారాధన విచారము వృత్రాసుర చరిత్రము మొదలగునవి చెప్పఁబడి ఉండును. ఇది కృష్ణ లీలల వినోదకరంబై వెలయును. దీని గ్రంథ సంఖ్య 18000. ఇది వ్యాస ప్రోక్తము అయిన అష్టాదశపురాణములతో చేరునదికాదు అనియు బొప్పనభట్టు అనెడు కవీంద్రునిచే రచియింపఁబడి, బొప్పన భట్టీయము అనబరగిన భాగవతము అనియు దేవీభాగవతము అనునది అష్టాదశపురాణములతోచేరిన వ్యాసప్రోక్త పురాణము అనియు కొందఱు చెప్పుదురు. అందు జగత్సృష్ట్యాది కర్తృత్వము పరాశక్తిది, సర్వమును పరాశక్తివలననే సృజింపఁబడును. అనునవి మొదలగు కథలు చెప్పఁబడి ఉండును.

భానుఁడు : (1) వసుదేవుని తమ్ముఁడు. (2) సూర్యునికి నామము.

భానుమంతుఁడు : (1) మి॥ సీత తండ్రి యగు జనకుని కొడుకుగ కొందరు చెప్పుదురు. మఱికొందఱు అమితధ్వజుఁడు కృతధ్వజుఁడు అను నిరువురు జనకుని కొడుకులు అనియు అందు కృతధ్వజునికి కేశిధ్వజుఁడును, అమితధ్వజునికి ఖాండిక్యుఁడును కలిగిరి అనియు వారలలో ఖాండిక్యునికి ఈభానుమంతుంతుడు పుట్టెను అనియు చెప్పుదురు. (2) కళింగదేశపురాజు అగు, శృతాయువు అనువాని తమ్ముఁడు. (భార) (భాగ)

భానుమతి : 1. కార్తవీర్యార్జునుని చెలియలు. అహమ్యాతి భార్య. 2. దుర్యోధనుని భార్య. ఈమె కౌరవులును, పాండవులును. యుద్ధముచేయునపుడు ఒక ముంగిస నూరుపాములను చంపినట్లు కలకని అది ధృతరాష్ట్రుని కొడుకులను నూరుగురను భీముఁడు ఒక్కఁడు చంపును. అను దానికి సూచకముగా యెంచి చింతించుచు ఉండగా అది తెలిసి దుర్యోధనుఁడు కొంచము బెదరియు ధైర్యమును విడువక పాండవులతో పోరాడి చచ్చెను. (3) సహదేవుని భార్య కృష్ణుని పిన తండ్రి అగు భానుఁడు అనువాని కూతురు. (భార)

భానువు : రెండవ దక్షప్రజాపతి కూతురు. ధర్ముని భార్యలలో ఒకతె. ఈమె సంతతివారు భానువులు అనఁబడుచురు.

భానుహందు : వరరుచి భాష్యమునకు మనోరమ అను వ్యాఖ్యానమును వ్రాసిన ఒక వైయాకరణుడు.

భారతచంపువు : ఒకానొకకావ్యము. ఇది అనంతర భట్టుచే చేయబడినది. దీనికి రామకవీంద్రుఁడు వ్యాఖ్యానము రచించి ఉన్నాడు ఇది గాక దీనికి నృసింహపండితీయము అను ప్రాచీన వ్యాఖ్యానమును ఒకటి కలదు.

భారతము : భరతవంశపురాజుల చరిత్రము. ఇందు సర్వధర్మములు, సమస్తోపనిషద్ధర్మములు, సకల నీతులును ఇతిహాసములును తెలుపబడి ఉన్నవి. దీని గ్రంథసంఖ్య లక్షయు ఇరువదిఅయిదువేలు. ఇది సంస్కృతమున వ్యాసునిచేతను, తెనుగున నన్నయభట్టారకుఁడు తిక్కనసోమయాజి ఎఱ్ఱాప్రెగ్గడ వీరలచేతను రచింపబడెను. (చూ॥ నన్నయభట్టారకుఁడు తిక్కన) వ్యాసుఁడు సంస్కృత భారతమును చెప్పునపుడు విఘ్నేశ్వరుఁడు వ్రాయుటకు ఒప్పుకొనియెను అనియు అట్లు చేయునపుడు విఘ్నేశ్వరుఁడు గంటము నిలుపక వ్రాయునట్లువ్యాసుఁడు చెప్పునట్లును, వ్యాసుఁడు చెప్పెడు దానిని అన్వయించుకొని విఘ్నేశ్వరుఁడు వ్రాయునట్లును సంకేతము చేసికొనిరి అనియు, విఘ్నేశ్వరుఁడు నిదానించి వ్రాయగలందులకు, వ్యాసుఁడు నడుమనడుమ ఒక్కొక్క శ్లోకమును అర్థము సులభముగా అవగాహనము కాకుండునట్లు చెప్పుచు పోయెను అనియు, అట్టి శ్లోకము చెప్పబడిన చోటు వ్యాస ఘట్టము అనియు అందురు.

మరియు భారతమును వేదములను తులయందు ఇడి తూపగా మహత్వమునందును బరువునందును భారతము వేదములకంటె మొగ్గుకలిగి ఉండెనుఅనియు, అది కారణముగా దీనికి మహాభారతము అను పేరు వచ్చెను అనియు చెప్పుదురు. అందులకు నిదర్శనముగా నన్నయభట్టారకుఁడు భారతము యొక్క ఉపోద్ఘాతమునందు.

"సీ॥ ధర్మతత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు
నీతి విచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవి వృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణంబనియును
నైతిహాసి కులితహాసమనియు

బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని
మహిఁగొనియాడుచుండ

ద్వివిధవేద తత్వ వేదివేద
వ్యాసుడాది ముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు''

అని చెప్పి ఉన్నాడు.

భారవి : ఒకానొక సంస్కృత కవి. కిరాతార్జునీయము అను కావ్యమును రచియించెను. దానిని యితః పేర భారవి అనియే వాడుదురు. ఇతడు అర్థగౌరవము కల పదములనే కూర్చి రచియింప శక్తికలఁవాడు కనుక "భారవేరర్థ గౌరవం'' అని విద్వాంసులు ఒక్కాణించి ఉన్నారు.

భార్గభూమి : కా॥భార్గవుని కొడుకు. కాశ్యలలో ఇతఁడుకడపటివాఁడు. ఇతనికి ఏనూరుగురు పుత్రులు కలరు. ఇతఁడు ఒకప్పుడు ఇంద్రునికి బాధకలుగజేయు చున్న అసురులను పారద్రోలి అతనిని రక్షించి దివిజరాజ్యమును పొందించెను. అది కారణముగా ఇతని కొడుకులు దివిజ రాజ్యమును కోరి మదాంధులై దేవతలతో పోరాడి నశించిరి.

భార్గవము : ఉపపురాణములలో ఒకటి.

భార్గవుఁడు 1. కా॥ వీతిహోత్రుని కొడుకు 2. భృగువంశమున పుట్టినవానికిని ఈపేరు చెల్లుచు ఉన్నది.

భానకర్ణుఁడు : ర॥ సుమాలి కొడుకు.

భాస్కరవంతులు : ఒకానొక బ్రాహ్మణుఁడు ఈయన పెనుగొండ కొండవీడు మొదలగు ప్రదేశలందు ఉండిన కోమట్లకు ఆచార్యుడు అయి ఉండి ఆకాలమునందు ఒకానొకకోమటిసెట్టికి కుమార్తెగా పుట్టి విష్ణువర్ధన మహారాజు వలన అవమానింపబడిన కన్యకాపరమేశ్వరి యొక్క చరిత్రమును కన్యకాపురాణము అను పేర రచియించి అందు కొన్ని కట్టుబాటులకు అప్పటి కోమటులలో నూట రెండు గోత్రములవారిని లోపరచి తన యేర్పాటును మీరిన వారిని వర్ణభ్రష్టులుగా శపించి

విధేయులు అగువారికి ఆచార్యుడును పురోహితుఁడును అయి ఉండెను. ఇప్పటికిని కోమట్లకు పురోహితులు భాస్కరవంతుల వంశస్థులుగానే ఉన్నారు.

**భాస్కరరామాయణము** : భాస్కరుని వలన అయిన రామాయణము. ఇది భాస్కరుఁడు, అతని కొమారుఁడగు మల్లికార్జునభట్టు. శిష్యుఁడగు రుద్రదేవుఁడు, స్నేహితుఁడగు అయ్యలార్యుడు. ఈ నలువురు కవులచేతను రచియింపబడినది అయినను వారిలో భాస్కరుడు ముఖ్యుడు అగుటచేత ఈ గ్రంథము భాస్కరరామాయణము అని నెగడియున్నది. ఇది యిట్లు రచియింపఁబడుటకు కారణము, ఆకాలమునందు ఇతనికి ఆశ్రయుఁడు అయి ఉండిన రాజునొద్ద అతని బంధువు అయిన రంగనాథుఁడు అను నాతఁడు రాజు యొక్క ఆజ్ఞను పొంది ద్విపద రామాయణము రచియింప పూనుకొనగా. అతసి యందు తనకు కల సహజ మత్సరముచేత రాజుతో నీ ఘనతకు ద్విపదికావ్యము తగినది కాదు, నేను పద్యకావ్యముచేసికొని వచ్చెదను. దానిని పరిగ్రహింపుము అనగా ఇతఁడు చెప్పిన మాట తప్పుట యుక్తము కాదు కనుక రంగనాథుని గ్రంథమునే కైకొను తలంపున ఎవరు ముందు తెత్తురో వారి కృతిని గ్రహించెదను అని చెప్పి పంపెను. అప్పటికి రంగనాథుని రామాయణము మూడుపాళ్ళుతీరి ఉండెను. కనుక ఇతఁడు అది ముగియుటకు ముందే తన రామాయణమును ముగించుకొని పోవనెంచి మీద చెప్పిన ముగ్గురి సహాయముచే త్వరితముగా ముగించికొని పోయెను. అప్పటికి రంగనాథుఁడు తన రామాయణమును ముగించి ఆ స్థానమునకు తెచ్చియుండెను, అది చూచి రాజు రంగనాథుని తట్టు కుడిచేతిని భాస్కరుని తట్టు ఎడమచేతిని చాపెను. అందులకు భాస్కరుఁడు కోపగించుకొని పక్షపాతము కల నీవంటి రాజునకు ఇచ్చుటకంటె నాకృతిని ఒక గుఱ్ఱపువానికి ఇచ్చుట మేలు అని పలుకుచు ఆస్థానమునుండి వెడలిపోవుచు ఉండగా. అరాజు యొక్క గుఱ్ఱపువాఁడు కవిసార్వభౌమా ఆడిన మాట తప్పవద్దు అని దరికి అడ్డముగా వచ్చి మ్రొక్కెను అంతట అతఁడు వానికి తన కృతిని అంకితముచేసెను. కనుకనే గ్రంథాదియందు సాహిణిమారా అని సంబోధించి చెప్పబడి ఉన్నది.

**భాస్కరాచార్యులు:** ఒకానొక జ్యోతిష్కుఁడు. ఇతని నివాసస్థానము నిజామురాజ్యములో చేరిన బెదరు అను గ్రామము. ఇతడు ఒకగణిత శాస్త్రమును ఒకజ్యోతిషశాస్త్రమును రచియించి అందుమొదటి దానికి లీలావతి అనుపేరుకల తనకుమార్తె యొక్క

పేరుపెట్టి రచియించెను. రెండవ దానిని గోళాధ్యాయము సూర్యసిద్ధాంతము అని రెండు భాగములుగా విభాగించి దానికి సిద్ధాంత శిరోమణి అను పేరుపెట్టి ప్రకటించెను.

**భాస్కరుఁడు** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు శాలివాహన శకము 13 వ శతాబ్దమున ఉండినట్లు చెప్పుదురు. ఈతని ఊరు కొండవీడు. వాల్మీకి మహామునిచే రచియింపబడి ఆదికావ్యము అని ప్రసిద్ధికి ఎక్కిన శ్రీమద్రామాయణము ఇతనిచే తెనుగున పద్యకావ్యముగా చేయబడెను. అందు ఇతడు రచియించిన భాగము ఆరణ్యకాండమును యుద్ధకాండమునందు కొంత భాగమును. తక్కినభాగములు రచియించిన వారిని గూర్చి. చూ॥ భాస్కరరామాయణము. (2) మరియొక ఆంధ్రకవి ఇతఁడు అడిదము భాస్కరుఁడు అనంబడును. ఇతని కుమారుఁడు అడిదము సూరన. ఇతఁడు అచ్చతెనుఁగు రామాయణమును రచియించెను. ఇది ప్రస్తుతము దొరకక ఉన్నది.

**భాస్వరులు** : గణదేవతా భేదము. వీరు అరువది నలుగురు.

## భీ

**భీభత్సుఁడు** అర్జునునకు నామము.

**భీమరథి** : ఒకానొక నది. ఇప్పుడు దీనిని భీమానది అందురు.

**భీమరథుఁడు** : య॥ వికృతి కొడుకు.

**భీమసేనుఁడు** : 1. కు॥ మూడవ ఋక్షుని కొడుకు. ప్రదీపుని తండ్రి.

(2) పాండురాజు యొక్క రెండవ కొడుకు. ఇతనిని భీముఁడు అనియు అందురు. ఇతఁడు కుంతి యందు వాయుదేవుని ప్రసాదమున జన్మించినవాఁడు. ఇతఁడు పసిబిడ్డగా ఉండునపుడు ఒకనాఁడు కుంతి ఇతనిని ఎత్తుకొని ఒక కొండ ఎక్కిపోవుచూ ఉండగా చేయి జారి కొండమీదపడి అందుండి క్రిందికి దొర్లిపడెను. అప్పుడు ఇతఁడు ఎందుపడి దొర్లెనో ఆచోటగల రాళ్ళు అన్నియు పిండిఅయ్యెను, మరియు భారతయుద్ధమునందు ధృతరాష్ట్రుని యొక్క నూరుగురు కొడుకులను ఇతఁడు ఒకఁడే చంపెను. ఇతనికి హిడింబాసురుని చెల్లెలు అగు హిడింబయందు

ఘటోత్కచుడు అను కొడుకును జలధర అను భార్య వలన సుగుణుఁడు అను కొడుకును పుట్టిరి. ద్రౌపది వలన శ్రుతసోముండు ఉదయించెను.

(భార)

**భీముఁడు** : 1. విదర్భరాజు. దమయంతి తండ్రి. నలుని మామ. 2. పురూరవుని పౌత్రుఁడు అమవసువు పుత్రుఁడు. (భార)

3. అష్టమూర్తులలో ఒకడు. శివునికి నామాంతరమును.

**భీషణుఁడు** : 1. కాశిరాజు యొక్క భటుండు. హరిశ్చంద్రుఁడు అమ్మడు పోయి కాశిలో స్మశాన ఘట్టమున వీరబాహునికి సేవకుఁడు అయి ఉండు నప్పుడు అతని కొడుకు తక్షకునిచే కరవబడి చావగా ఆ చిన్నవాని తల్లి అగు చంద్రమతి వానిని శ్మశానమునకు ఎత్తుకొనిపోయి దహనము చేయపోగా, ఆశవమును కాల్చు ప్రదేశమునకు కొంతపన్ను కట్టవలయును అని హరిశ్చంద్రుఁడు చెప్పెను. ఆపన్ను పైకము తెచ్చుటకు ఆమె పోవుచు ఉండగా విశ్వామిత్రుని మాయచే ఒక దూత వచ్చి ఆ కాశిరాజు యొక్క శిశువును చంపి ఆమె యొడిలో పడవేసి పోయెను. అప్పుడు భీషణుఁడు ఆమెను పట్టుకొనిపోయి రాజునకు ఒప్పగించెను. (2) ర॥ బకాసురుని తమ్ముఁడు.

**భీష్మకుఁడు** : విదర్భదేశపురాజు. ఇతని కూతురు రుక్మిణి. కొడుకులు రుక్మి, రుక్మరథుఁడు, రుక్మకేశుఁడు. రుక్మబాహువు, రుక్మనేత్రుఁడు అని ఐదుగురు.

**భీష్ముఁడు** : కు॥ శంతనునకు మానుష స్త్రీరూపమును, ధరించిన గంగ వలన పుట్టిన అష్టవసువులలో ఒక్కఁడు అగు ప్రభాసుఁడు. ఇతనికి ఈ జన్మము కలుగుటకు కారణము వశిష్ఠ శాపము. (చూ॥ అష్టవసువులు) ఇతఁడు సర్వ ధర్మశాస్త్రవేత్త. విలువిద్యయందు మిగుల నేర్పరి. ఇతఁడు సత్యవతిని తండ్రికి వివాహము చేయు కొఱకు బ్రహ్మచర్యవ్రతమును తాల్చెను. అందుకుఁగాను ఇతనితండ్రి ఇతనికి స్వచ్ఛందమరణము (ఇచ్ఛవచ్చినపుడు చచ్చుట) కలుగు వరము ఇచ్చెను. కనుక భారతయుద్ధమునందు కౌరవసేనకు దళవాయి అయియుండి పది దినములు యుద్ధముచేసి కడపట అర్జునునిచేత పడగొట్టబడి యును ఉత్తరాయణము వచ్చునంతవరకు శరతల్పముపై శయనించి ఉండెను. (భార)

## భు

**భుమన్యుఁడు** : దుష్యంతుని పుత్రుండు అగు భరతుని భార్య సునంద యందు భరద్వాజుని అనుగ్రహమువలన జనియించిన పుత్రుడు. నా॥ హూత మన్యుఁడు. (భార)

**భువనేశ్వరి** : ఒకానొక స్త్రీదేవత. ఉత్కలము లేక ఓఢ్రదేశమందు ఉండును.

## భూ

**భూతజ్యోతి** : నృగుని పౌత్రుఁడు.

**భూతములు** : దేవయోని సంభూతులు. వీరు శ్మశానవాసులు. వీరి నిగ్రహార్థమై రుద్రుఁడు శ్మశానమునందు వసియించి ఉండును.

**భూతసంతాపనుఁడు**: ది॥ హిరణ్యాక్షుని కొమారుఁడు. (మత్స్య)

**భూతుఁడు** : య॥ వసుదేవుని కొడుకు, సుభద్రుని భ్రాత.

**భూరి** : కు॥ సోమదత్తుని పెద్దకొడుకు. బాహ్లికుని మనుమడు. (భార)

**భూరిశ్రవుఁడు** : కు॥ సోమదత్తుని రెండవ కొడుకు. భారతయుద్ధమునందు పదు నాల్గవనాడు అర్జునుఁడు సైంధవుని చంపుటకై ఒంటిరిగా పోరాడునపుడు, ధర్మ రాజ ప్రేరితుడై అర్జునికి తోడు పోయిన సాత్యకితో ఇతడు పోరాడి అతనిని క్రింద పడద్రోసి త్రొక్కి తల నరకుటకు కత్తితోడి చేతిని మీదికి ఎత్తగాఁ అర్జునుడు కృష్ణునిచే ప్రేరేపింపబడి ఆచేయి తెగవేసెను. అంతట సాత్యకి తెప్పిరిలి లేచి ఇతనిని చంపెను. (భార)

**భూరిసేనుఁడు** : ఇక్ష్వాకుని తమ్ముఁడు అగు శర్యాతి కొడుకులలో ఒకడు.

## భృ

**భృగుక్షేత్రము** : ఆనర్తదేశములకు సమీపమున పశ్చిమసముద్ర తీరమునందు ఉండెడు పుణ్యక్షేత్రము.

**భృగువు** : 1. బ్రహ్మమానసపుత్రులలో ఒకడు. కొందరు వరుణుని యజ్ఞ మందలి అగ్నినుండి ఇతడు పుట్టినట్లు చెప్పుదురు. ఇతని పుత్రుఁడు కవి.

పౌత్రుఁడు అసురులకు గురువు అయిన శుక్రాచార్యులు. ఇదికాక ఇతనికి ఖ్యాతి వలన ధాత విధాత అని ఇరువురు కొడుకులు కలిగిరి. అందు ధాతకు మృకండుడు, విధాతకు ప్రాణుఁడును జన్మించిరి. ప్రాణుని కొడుకు వేదశిరుఁడు. వేదశిరుని కొడుకు వుశేనస్సు ; మృకండుని కొడుకు మార్కండేయుఁడు.

(ఐ. ఉ.)

ఇతని మీసములను దక్షయాగమున వీరభద్రుఁడు పెరికివేసినట్లు పురాణముల వలన తెలియవచ్చుచున్నది. 2. ఒక మహర్షి, ఇతఁడు భాగీరథీ దక్షిణతీరమున మహాపద్మము అనియెడు పురమునందుండెను. ఇతఁడు ఒకప్పుడు అగ్నిహోత్రము చేయుటకు తన భార్య పులోమను అగ్నులను ఏర్పరుపుము అని ఆజ్ఞాపించి తాను స్నానము చేయుటకై నదికి పోయెను. అప్పుడు పులోముఁడు అనుదానవుడుఒకడు అచ్చటికివచ్చి అగ్నిదేవుని వలన ఆమె ఇతని భార్య అని ఎరిగి ఆమెను ఎత్తు కొనిపోవ యత్నింపగా వెరపుచేత పూర్ణగర్భిణి అయిన ఆమె తత్తరపడునపుడు గర్భము భేదిల్లి గర్భస్రావము అయ్యెను. ఆస్రావమైన పిండము చ్యవనుఁడు అనబరగిన ఋషి అయి తన కోపపు చూపుచేతనే ఆరక్కసుని భస్మముచేసెను. ఇది యంతయు భృగుమహర్షికి తెలిసి అగ్నిమీద అలిగి సర్వభక్షకుడవు కమ్ము అని శపియించెను. అట్లయినను బ్రహ్మ అగ్ని యొక్క శుచిత్వమునకు లోపము కాకుండునట్లు అనుగ్రహించెను.

భృగుస్రవణము : హిమత్పర్వతమునందు సగరుఁడు తపము ఆచరించిన కొండ.

## భే

భేరుశంఖుడు : య॥ నా॥ ఋశంకుఁడు. శ్వాహితుని కొడుకు. శశిబిందువు, పితామహుఁడు.

## భై

భైరవుఁడు : ఈశ్వరుని అవతార విశేషము. భక్షణాత్, రక్షణాత్, దమనాత్ భైరవః అని యుత్పత్తి. అనగా సృష్టిస్థితి సంహారకర్తయైన ఈశ్వరుఁడు అని అర్థము.

(భలి)

# భో

భోగవతి : 1. పాముల పట్టణము. వాసుకి యొక్క రాజధాని.2. పాతాళ గంగ.

భోజకటకము : నర్మదానది చెంతనుండు ఒకపట్టణము. ఇది కృష్ణుని మరది అగు రుక్మిచే కట్టింపబడినది.

భోజచంపువు : ఒకానొక సంస్కృత కావ్యము. ఇది విదర్భదేశపురాజు అగు భోజునిచే రచియింపబడినది. కనుక దీనికీ పేరు కలిగెను. ఇందు రామాయణ కథ చెప్పబడి ఉండును. కొందరు ఇది కాళిదాస ప్రణీతము అనియు చెప్పెదరు.

భోజుఁడు : 1. య॥ సాత్వతుని పుత్రుఁడు. కుంతి పెంపుడు తండ్రి. వీని వంశమును భోజవంశము అందురు. ఇతనిని మహాభోఁజుడు, కుంతిభోఁజుడు అనియు అందురు.

2. య॥ కృతవర్మ పితామహుఁడు. శినికొడుకు.

3. విక్రమార్కుఁడు గతించిన పిమ్మట కొంతకాలమునకు విదర్భదేశాధిపతియై ఉండినరాజు. ఇతని రాజధాని ధారాపురము. ఇతఁడు బాలుడుగా ఉండగానె ఇతని తండ్రి కాలధర్మమునుపొందినందున పినతండ్రిఅగు ముంజుఁడు రాజ్యాధిపతిఅయ్యెను ఆకాలమునందు ఒకజ్యోతిష్కుఁడు ముంజుని సమ్ముఖమునకు వచ్చి అచ్చట కూర్చుండి ఉన్న ఈ చిన్నవానిని చూచి ఇతఁడు మిగుల ప్రఖ్యాతి వహించి రాజ్య పాలనము చేయగలడని చెప్పెను. అది విని ముంజుఁడు సహింపక ఇతనిని అడవికి కొనిపోయి తల నరికి చంపి రండు అని తలవరులకు ఆజ్ఞాపించెను. అప్పుడు తల వరులు ఇతనిని అడవికికొనిపోయి తమ యేలినవాని వుత్తరువు తెలియపరుపగా ఇతఁడు దిగులుపడక-

శ్లో॥ మాంధాతాచ మహీపతిః కృతయుగాలంకార భూతోగతః ।
సేతుర్యేన మహోదధౌ విరచితః క్వాసౌదశాస్యాంతకః ।
అన్యేచాపి యుధిష్ఠిరప్రభృతయో యాతాదివం భూపతే ।
నైకేనాపి సమంగతా వసుమతీ, నూనం త్వయా యాస్యతి॥

అను ఈ శ్లోకమును ఒక పత్రికయందు వ్రాసి తన పినతండ్రియొద్దకు పంపెను. అతఁడు దానిని చదువుకొని అందలి అర్థమునుగ్రహించి వెంటనే ఇతనిని రప్పించి

రాజ్యాభిషేకముచేసి తాను విరక్తుఁడై తపస్సు చేయఁబోయెను. ఇతఁడు మిక్కిలి చదువుకొన్నవాఁడు గనుక కాళిదాసాది మహాకవులను అనేకులను గౌరవించి తన యొద్ద ఉంచుకొని యుండెను. ఇతని రాజ్యమునందు అపండితుఁడు ఒక్కఁడైన దొరకఁడు అందురు. మరియు ఇతఁడు సరస్వతి అవతారమని చెప్పుదురు.

భోజులు : యాదవులలో ఒక తెగవారు. సాత్వతుని పుత్రుఁడు అగు భోజుని వంశస్థులు. వీరలకు ముఖ్యపట్టణము ధారాపురము.

## భౌ

భౌముఁడు : అంగారకునికి నామము. భూపుత్రుఁడు అని వ్యుత్పత్తి.

## భ్ర

భ్రమరాంబ : శ్రీశైలమునందు ఉండు పరాశక్తి అవతారము.

## మ

మంకణుఁడు : ఋ॥ తపోమహిమచే సాస్వతమున నటనము సలిపినవాఁడు. ఇతని నటనమునకు మెచ్చి శివుఁడు ప్రత్యక్షమై నిజార్థాంగిని అగు ప్రకృతి యొక్క మాహాత్మ్యము వివరించెను. (భార)

మంకి : ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు ధనేచ్ఛ కలవాఁడై వర్తించుచు ఉండి ఒకప్పుడు తన కోడెలు రెండు చచ్చిన దానిచే నిర్వేదము పుట్టి సకలకామములను పరిత్యజించి ముక్తుఁడు అయ్యెను. (భార)

మంగళుఁడు : నా॥ అంగారకుఁడు, భౌముఁడు.

మంజుఘోష : ఒక అప్సరస.

మంజువంతము : హిమవంతమునకు ఉత్తరమున ఉండెడు ఒక పర్వతము. దీని యందు శతయోజన విస్తీర్ణము అయిన ఒక సరోవరము కలదు. అందు పంచవర్ణ కమనీయములు అగు కమలములు అనేకములు ఉండును. అందు ఒక్కనాళమున దేవేంద్రుఁడు దేవపద భ్రష్టుఁడై నహుషుని తేజమునకు ఓడి కొంతకాలముఁ దాగి ఉండెను.

మందకర్ణి : రు॥ ఇతఁడు వాయుభోజునుఁడును, శిలాశయనుఁడును అయి పదివేల సంవత్సరములు ఉగ్రతపము సేయ దేవతలు బెదరి ఇతని తపమును విఘ్నముచేయటకు అయిదుగురు అప్సరస్సలను పంపిరి. వారిని చూచి మోహ వికారము పొంది పంచాప్సరస్సు అను ఒక సరోవరమును కావించుకొని అందు వారి తోడ క్రీడించుచు ఉండెను.

మందపాలుఁడు : రు॥ ఇతఁడు బ్రహ్మచర్యమున అతి నిష్ఠతో అనేకవేల సంవత్సరములు తపము ఆచరించియు సంతాన హీనుఁడు అయినందున పుణ్యలోకమును పడయనేరక ఆవల సంతానవాంఛ కలిగి శీఘ్రముగా సత్పుత్రులను పడయుటకు శార్ఙ్గికజాతుఁడు అయిన పక్షియై తజ్జాతి స్త్రీ అగు జరిత అను దానియందు నలువురు పుత్రులను పడసి పుణ్యలోకమును పొందెను.

(భాగ)

మందవాహిని : శుక్తిమంతమున ఉత్పత్తి అయి ప్రవహించు ఒక నది.

మందాకిని : 1. దేవగంగ . మెల్లగ కుటిల గమనముచే ప్రవహించునది అని వ్యుత్పత్తి. ఈ నది సురలకు నడబావి అయినందున దీర్ఘిక అనియు చెప్పబడును. (2) ఋక్షపర్వతమునందు ఉండి వెలువడునట్టి ఒకనది. ఇది చిత్రకూటమునకు సమీపమున ప్రవహించును. దీని యిప్పటి నామము కాళీ గంగ.

మందారుఁడు : ఒక విద్యాధరుడు.

మందేహారుణులు : ర॥ నా॥ మందేహాలు. బ్రహ్మను గూర్చి తపము ఆచరించి సూర్యునితో పోరాడునట్లు వరము పడసినవారు. వీరి సంహారార్థము త్రిసంధ్యలయందును బ్రాహ్మణులు గాయత్రిచే అభిమంత్రించిన అస్త్రములను అర్ఘ్యమూలముగా విడుతురు. వారు, ఆయస్త్రములచేత సంహరింపబడియు వరదాన మహిమచే పునర్జీవితులు అగుదురు.

మండోదరి : రావణుని భార్య మిగుల గంభీరమైన రూపము కలది. ఈపె దితిపుత్రుడు అగు మయుని కూతురు.

(రామా)

మంథర : కైకేయి యొక్క దాసి. రాముఁడు బాల్యమున చెండాడుచు ఉండగా ఇది ఆ చెండును తట్టి వైచెను. అందుకు రాముడుకోపించి దీనిని కాలితో నేలఁబడ తన్నెను. ఇది ఆక్రోధమును మనసున ఉంచుకుని ఉండి, రామునికి

యువరాజ్యపట్టమును కట్టనీయక విఘ్నముచేసెను. ఇట్లు చేయుటకే ఈ మంథరను దేవతలు పుట్టించిరి అని చెప్పుదురు. ఇది గూనుకలదియు, వికారరూపము కల యును అయి ఉండును. (రామా)

మకరాక్షుడు : ర॥ ఖరుని కొడుకు. రాముని వలన ఆగ్నేయాస్త్రముచే లంక ముట్టిడివేసిన కాలమునందు చంపబడెను.

మగధము : వంగదేశమునకు పశ్చిమమున ఉండు ఒక దేశము. ఇందలి రాజులు మహాశూరులు అగు జరాసంధుడు మొదలగువారు. వీరి వంశస్థులు ఇంచు మించుగ క్రీస్తు శకపర్యంతము రాజ్యము చేయుచుండిరి. దీనికి పాటలీపుత్రము రాజధాని. ఇందు కొంతకాలము బౌద్ధమతము నెలకొని యుండెను. వెనుక ఇందలి రాజులు ఆంధ్రరాజ్య స్థాపకులు అయిరి.

మణికర్ణిక : గంగ యందలి ఒకానొక ఘట్టము. (కాశీ)

మణిగ్రీవుడు : కుబేరుని కొడుకు. నలకూబరుని సహోదరుడు. చూ॥ నలకూబరుడు.

మణిపురము : ఇది వంగదేశమునకు తూర్పున ఉండును. నా॥ మణలూరు పురము. అర్జునుని కొడుకు అగు బభ్రువాహనుని రాజధాని.

మణిపుష్పము : సహదేవుని శంఖము.

మణిమంతుడు : కుబేరుని అనుచరుడగు ఒక యక్షుడు. వార్షసేనుడు అను మునియొక్క ఆశ్రమమున పాండవులు ఉండు కాలమున పంచవర్ణసౌరభ కుసుమములు కొన్ని వాయువశమున వచ్చి తన యెదుటపడగా వానిని చూచి ద్రౌపది ఇట్టిపువ్వులను తనకు తెచ్చి ఇమ్మని భీముని వేడెను. అపుడు అతడు వానిని తేపోవు నవసరమున ఇతడు భీముని అడ్డగించి అతనితో పోరాడి మృతిపొందెను. తొల్లి కుశావతి అనుపుణ్యనదీతీరమున అమరులు ఎల్లసత్రయాగముచేయుచు ఉండగా అచ్చటికి మణిమంతుడు కుబేరునితో గూడ ఆకాశమార్గమున పోవుచు వుండి తాను పోవు మార్గమునకు సరిగా భూమిని అగస్త్యుడు ఉండుటను కానక నిష్ఠీవనము చేసెను (నిష్ఠీవనము = ఉమియుట) అంతటి అగస్త్యుడు కన్నుకానక తనపై నిష్ఠీవనము చేసిన ఖేచరుడు మనుజునిచే మరణము పొందునుగాక అని శాపము ఇచ్చెను. కనుక వీడు భీమసేనునిచే చచ్చెను. (భార)

**మణిమతి** : ఒకానొక పట్టణము. ఇది ఇల్వల వాతాపుల యొక్క ఉనికిపట్టు

**మతంగుఁడు** : 1. ఒక విప్రుని భార్యయందు మంగలికి పుట్టిన చండాలుఁడు. ఇతఁడు బ్రాహ్మణత్వమును కోరి అనేకవేల సంవత్సరములు తపము అచరించియు బ్రాహ్మణత్వమును పడయజాలక, దేవేంద్ర ప్రసాదమువలన చండదేవుడు అను పేరుచే ప్రశస్తి వహించి సుస్త్రీయులు పూజచేయ కామరూపధారియై ఉండెను. (2) మతంగకులమున బుట్టిన ఒక ఋషి. ఇతఁడు తపము ఆచరించి పరాశక్తిని తన కుమార్తెగా పడసెను. ఆమె మతంగుని కుమార్తె అగుటచే మాతంగి అనియు నిర్మాల్యముచే పూజించుటబట్టి ఉచ్ఛిష్ఠ శ్యామలాదేవి అనియు వాడఁబడును - చూ। (3) దుందుభి.

**మతిసారుఁడు** : పు॥ నా॥ అంతిసారుఁడు. ఋచేయువు కొడుకు,

(భార)

**మత్తుఁడు** : ర॥ మాల్యవంతుని కొడుకు.

**మత్స్యదేశము** : ఈ పేరుచే రెండు దేశములు కలవు. ఒకటి ఘూర్జనమునకు పశ్చిమమునను, మరి ఒకటి ప్రకృతమున "డినాజపురము" అనబడు చోటను ఉండెను.

**మత్స్యయంత్రము** : పాండవులు లక్కఇంట కాలిపోయిరి, అను వృత్తాంతమును విని అర్జునునికి ద్రౌపదిని ఇచ్చుటకు లేక పోయెను అని విచారగ్రస్తుఁడై, ద్రుపఁదుడు తన కూఁతురు అగు ద్రౌపది యొక్క స్వయంవరముకయి పన్నినఒకయంత్రము. ఇందు పొడుగుగడ ఒకటి నాటి దాని కొనయందు స్వర్ణరూపము అగు మత్స్యము ఉంచి దాని క్రింద నిరంతరము గిరగిర తిరుగునట్లు ఒకచక్రమును నిలిపి ఆగడ మొదట ఒక వింటిని అయిదు బాణములను ఉంచి ఎవ్వఁడు ఆవింటిని ఎక్కుపెట్టి ఆచక్రముఁగుండ ఐదుబాణములతో ఒక్కయేటున ఆచేపకన్ను తగులునట్లు కొట్టునో అతనికి ద్రౌపదిని ఇచ్చి పాణిగ్రహణము, చేయించెదను అని చాటించెను. అప్పుడు బ్రాహ్మణ వేషముతో ఏకచక్రపురమునందున్న పాండవులు ద్రుపదుని పట్టణమునకు వచ్చిరి. వారిలో అర్జునుఁడు ఆవిల్లు ఎక్కుపెట్టి అయిదు బాణములతో ఆ మత్స్యయంత్రమును కొట్టెను. దీనిని మత్స్యయంత్ర భేదనము అందురు. ఆవల పాండవులు అయిదుగురును ద్రౌపదిని వివాహము అయిరి. (చూ॥

ద్రౌపది) ఇట్టి మత్స్యయంత్ర భేదనముననే కృష్ణుఁడు మద్రరాజుకూఁతురు అగు లక్షణ అను కన్యను వివాహము అయ్యెను.

**మత్స్యావతారము** : విష్ణువు యొక్క దశావతారముల యందు మొదటిఅవతారము సోమకుఁడు అను అసురుఁడు, వేదములను అపహరించి సాగరములో దాగి ఉండు నవసరమున విష్ణువు మత్స్యావతారము యెత్తి, వానిని చంపి వేదములను తెచ్చెను. (మత్స్య) (భార)

**మత్స్యుఁడు** : కు॥ ఉపరిచరవసువు యొక్క మూఁడవ కొడుకు. ఇతఁడు ఏలి నదియే మత్స్యదేశము .

**మదనద్వాదశీవ్రతము**: ఆశ్వయుజ శుక్లపక్ష ఏకాదశి మొదలు కార్తిక శుక్లపక్ష ఏకాదశి వఱకు విధిపూర్వకముగ విష్ణువును తులసిదళములతోపూజచేసి కార్తికశుద్ధ ద్వాదశి నాడు అనుష్ఠించునట్టి వ్రతము. దీనిని నారఁదుఁడు కృష్ణునకు ఉపదేశించెను.

**మదాలస** : (1) ఒక అప్సరస. (2) విశ్వావసుఁడు అను గంధర్వుని కూతురు. కువలయాశ్వుని భార్య. అలర్కుని తల్లి. ఈమె తాళకేతుఁడు అను రాక్షసుఁడు మోసముచే పతి మృతుడయ్యెను. అని యెంచి ప్రాణవియోగము పొందెను. అందులకు కువలయాశ్వుఁడు దైన్యము పొందగా చూచి కనికరముతోచి ఈశ్వరుఁడు ఆమెను పునర్జీవితురాలుగా చేసెను.

(మార్క)

**మదిర** : వసుదేవుని భార్యలలో ఒకతె.

**మద్రము** : శిబి కొడుకు అగు మద్రుని వలన హిమవత్పార్శ్వమున యేర్పడిన దేశము.

**మద్రుఁడు** : శిబిచక్రవర్తి నలుపురు కొడుకులలో ఒఁకడు.

**మధుఁడు** : 1. ఒక అసురుఁడు చూ॥ కైటభుఁడు. (2) శ్రీరాముని జ్యేష్ఠ పుత్రుఁడు అయిన కుశుని వంశమున పుట్టిన, రాజు. ఈతఁడు ఇప్పటికిని కలాప గ్రామమున యోగనిష్ఠతో ఉండునట్లును, ముందుజన్మమున మరల సూర్యవంశ ప్రతిష్ఠను జేయును అనియును చెప్పుదురు. ‡ (3) ర॥ రావణుని మరది. వీని కొడుకు లవణాసురుఁడు. (5) వైడూర్య పర్వతమున అశ్వినీదేవతలను సోమ

పానముచేయు నవసరమున ఇంద్రుని జయించుటకై చ్యవనునిచే పుట్టింపఁబడిన రాక్షసులు. వీనిని చ్యవనుఁడు మద్య, స్త్రీ మృగయాక్షములను ఆశ్రయించి ఉండ నియమించెను. 5. యII కార్తవీర్యార్జునుని నాల్గవ కొడుకు. 6. యII దేవ వ్రతుని కొడుకు. (దే. భా) (భార) (విష్ణు) (ఉ.రా.)

**మధుమంతము** : ఒక పట్టణము. చూII జనస్థానము, (ఉ. రా.)

**మధుర** : 1 యమునానది ఒడ్డున ఉండు ఒక ప్రసిద్ధ పట్టణము. మొట్ట మొదట ఈ చోటు అడవిగా ఉండెను. మూడవ మధుఁడు శివుని ఉద్దేశించి తపము ఆచరించి శూలాయుధము ఒక్కటి సంపాదించుకొని మధువు అను పట్టణమును నిర్మించి మిగుల గొప్పగా వర్తించెను. పిదప వాని కొడుకు అయిన లవణా సురుఁడు అచ్చట ఉండు ఋషులకు మహోపద్రవములు కావించుచుండు తఱిని శ్రీరాముని అనుజుఁడు అగు శత్రుఘ్నుఁడు అతనిని తెగటార్చి ఆ స్థలమున మధుర అనుపట్టణమును నూతనముగా కట్టించెను. ఇందు కృష్ణుని జనన మప్పుడు కంసుఁడు రాజ్యభారము చేయుచుండెను. దీని సమీపముననే గోకులమును బృందా వనమును ఉండును. దీనిని శ్రీరాముఁని తమ్ముఁడు అగు శత్రుఘ్నుని కొడుకులు సుబాహువు శూరసేనుఁడు అనువారు నిర్మాణముచేసి రాజ్యము చేయుచు ఉండినట్లు కొందఱు చెప్పుదురు. (దే. భా.)

(2) పాండ్యదేశమునకు రాజధాని అయి మిగుల ప్రబలి ఉండిన ఒక పట్టణము. ఇది ఇప్పటును ప్రసిద్ధివహించిన గొప్పపట్టణములలో ఒకటిగా ఉన్నది

**మధువు** : (1) యమునానదిగట్టున ఉండెడు ఒకానొక వనము. ఇందు ధ్రువుఁడు ఆశ్రమము కావించుకొని తపము సలిపెను. (2) సుగ్రీవుని ఉద్యానము. ఇది కిష్కింధకు సమీపమున ఉండును. (రామా)

**మధుశ్ఛందుఁడు** : విశ్వామిత్రుని కొడుకు.

**మధ్యదేశము** : వినాశకు తూర్పునను ప్రయాగకు పశ్చిమమునను ఉండు హిమవద్వింధ్యమధ్యగతదేశము.

**మధ్వాచార్యులు** : ద్వైతమత స్థాపకుఁడు. ఇతని మతము మధ్వము అనఁబడును. చూII (1) ద్వైతము. ఈతఁడు ఉడిపికి సమీపమున ఉండు పాచక క్షేత్రము

అను ప్రదేశమున సుమారు ఏడునూరు సంవత్సరములకు ముందు జనించినట్లు తెలియును. ఈయన పుట్టిన దినము పుష్యశుద్ధ నవమి.

మనస్యుడు : పు॥ ప్రవీరుని కొడుకు.

మనస్వి : రు॥ దేవలుని రెండవ కొడుకు. క్షమావర్తుని తమ్ముఁడు.

మనస్విని : (1) ప్రజాపతి భార్య. సోముఁడు అను వసువు తల్లి.
(2) మృకండుని భార్య. (భార)(మార్క)

మనుఁడు : మి॥ హర్యశ్వుని కొడుకు. కీర్తిరథుని పితామహుడు.

మనుర్దేవుఁడు : బ్రహ్మపుత్రులలో ఒకఁడు అని భారతమున చెప్పఁబడి ఉన్నది

మనుమసిద్ధి : పూర్వకాలమునందు నెల్లూరును పాలించిన రాజు. ఇతని ఆస్థాన పండితుఁడు తిక్కనసోమయాజి. చూ॥ తిక్కన.

మనువు : సృష్ట్యాదియందు భగవన్నామకుఁడు అయి భూమిని పాలించు రాజు. మనువులు పదునలుగురు. స్వాయంభుఁడు, స్వారోచిషుఁడు. ఉత్తముఁడు. తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్య సావర్ణి, దక్ష సావర్ణి, బ్రహ్మ సావర్ణి, రుద్రసావర్ణి, ధర్మసావర్ణి, రౌచ్యుఁడు, భౌచ్యుఁడు.

మనుస్మృతి : అష్టాదశ స్మృతులలో ఒకటి. ఇది స్మృతులలోపల శ్రేష్ఠమైనది. ఏ స్మృతివాక్యమైనను దీనికి విరుద్ధముగా ఉండెనేని ఆవాక్యము ప్రమాణము కాజాలదు. దీనికి పుల్లూకభట్టు అను పండితునిచే సంగ్రహముగా స్పష్టముగాను ''మన్వర్థము'' అను పేర వ్యాఖ్యానము చేయఁబడి ఉన్నది.

మనోరమ : (1) మేరువు కూతురు. ఈమె హిమవంతుని పెండ్లాడి అతనివలన గంగాదేవి పార్వతి అను నిరువురు కూతులను పడసెను. నా॥ మేనక. (2) ఇందీవరాక్షుఁడు అను గంధర్వరాజునకు మరుదశ్వ పుత్రుయందు పుట్టిన కూతురు ఈమె స్వరోచికి అస్త్రవిద్యను ఉపదేశించి ఆతని వివాహమయ్యెను. (3) వరరుచి భాష్యము యొక్క వ్యాఖ్యానము. భానుమహునిచే చేయఁబడినది.

మన్మథుఁడు : విష్ణువుయొక్క మానస పుత్రుఁడు లక్ష్మికి పుట్టినట్లును చెప్పుదురు. ఇతఁడు రతిపతి. మీనకేతుఁడు. మకరధ్వజుఁడు, పుష్పధన్వుఁడు మంచి

రూపము కలవాఁడు (చూ॥ జయంతుఁడు) ఇతఁడు రుద్రునకు కామవికారము కలుగఁజేసి అతని రౌద్ర దృష్టిచే అనంగత్వమును పొంది అనంగుఁడు అను పేరు పొందెను.(చూ॥ అంగదేశము. ప్రద్యుమ్నుఁడు) ఈతని బాణములు మోదనము. ఉన్మాదనము, సంతాపనము, శోషణము, నిశ్చేష్టాకరణము అనునవి.అరవిందము, అశోకము, చూతము, నవమల్లికా, నీలోత్పలము అనునవి ఐదు మన్మథుని బాణములు అనియు అందురు. ఇతఁడు విష్ణు పుత్రుఁడు అయినందున బ్రహ్మకు తమ్ముఁడు అగును. ఇతనికి స్మరుఁడు, అంగజుడు, శంబరారి మొదలగు నామములు అనేకములు కలవు.

**మన్వంతరాధిపులు** : స్వారోచిష మన్వంతరమున విపశ్చిత్తు అను నిలింపపతియు తుషితాది దేవతలును ఊర్జాది సప్తఋషులును ప్రవర్తిల్లిరి. ఉత్తమ మన్వంతరమున సుశాంతుఁడు అను అమరపతియు, సుధామాది దేవతాగణమును, రజోఘ్నాది సప్తర్షులును ఉండిరి. తామస మన్వంతరమున శిబి అను ఇంద్రుఁడును, సురాయాది దేవతలును, జ్యోతిర్ధాముఁడు మొదలగు సప్తర్షులును వెలసిరి. రైవత మన్వంతరమున వసువు అను వాసవుఁడును, వైకుంఠాది దేవతలును హిరణ్యా రోమాది సప్తర్షులును వెలసిరి. చాక్షుషమన్వంతరమున మనోజవసుఁడు అను దేవపతియు ఆద్యాది లేక ఆప్యాదిదేవతలును, సుమేధాది సప్తర్షులును చెలగిరి. వైవస్వత మన్వంతరమున పురందరుఁడు అను బృందార కేంద్రుఁడును ఆదిత్యాది దేవతలును వసిష్ఠాది సప్తర్షులును ఒప్పుచు ఉన్నారు.

**మమత** : ఉతథ్యుని భార్య. దీర్ఘతముని తల్లి. ఈమెకు బృహస్పతి వలన భరద్వాజుఁడు జనియించెను.

**మయుఁడు** : దితిపుత్రుఁడు. దానవ విశ్వకర్మ కొడుకులు మాయావి దుందుభి కూతురు రావణుని భార్య అగు మండోదరి. (ఉ. రా.)

**మయూరుఁడు** : ఒక సంస్కృతకవి. ఇతఁడు అంధుఁడు అయి సూర్యశతకము చేసి కన్నులు పడసినాఁడు అని వాడుదురు.

**మరీచి** : బ్రహ్మమానసపుత్రులలో ఒక్కఁడు. ఇతనికి కర్దముని కూఁతురు అగు కలయందు కశ్యపుడు అను కొడుకును. పూర్ణిమ అను కూతురును పుట్టిరి. ఈ పూర్ణిమనుకొన్నియెడల కొడుకు అనియు చెప్పియున్నారు.

(భార) (భాగ)

**మరుఁడు** ; మన్మథుఁడు. చూ॥ స్మరుఁడు.

**మరుత్తు** : ఒక చక్రవర్తి. ఇక్ష్వాకుని తమ్ముని కొడుకు అయిన నాభాగుని వంశస్థుఁడు అగు అవీక్షిత్తు కొడుకు. ఇతఁడు చేసినట్లు యాగములు ఎవ్వరును చేయలేదు అనియు యాగవస్తువులు అన్నియు బంగారు మయము అయి ఉండెను అనియు అందురు. కొడుకు నరిష్యంతుఁడు.

**మరుత్తులు** : వాయువులు. దితి ఇంద్రుని చంపునట్టి కొడుకు కావలయును అని కశ్యపుని ప్రార్థింపగా అతఁడు అనుగ్రహించి గర్భమును కలుగచేసి నూరేండ్లు ఈగర్భమును నియమముతో కాపాడు కొంటివేని అట్టి బిడ్డఁడు నీకు పుట్టును అనిచెప్పెను. ఆమె అట్లే అతినియమముతో ఉండి నూరేండ్లు నిండుటకు కొంతకాలము కొరత ఉండగా ఏమరి ఆనిష్టను ఇసుమంత తప్పెను. అంత సమయము చూచుచుండిన దేవేంద్రుఁడు ఆమెగర్భమునందు ప్రవేశించి ఆ శిశువును తన వజ్రాయుధముతో యేడుతునియలుగానరికెను. అప్పుడుఆశిశువు తుండెములై రోదనచేయుతరి దితి మారుద మారుద అని చెప్పెను. కనుక వీరు మరుత్తులు అనఁబడిరి. అంత ఇంద్రుఁడు దితి గర్భమునుండి వెలువడి వచ్చి తల్లీ నీవు అశుచివై ఉండినందున ఇంతపనిచేయ చాలితిని అని ఆమెను మంచి మాటలచే సమాధాన పరిచి ఆమె కోరినట్లు ఆ ఏడు పిండములకు దీర్ఘాయువును ఒసగి సప్తలోకముల యందును వాయు రూపముగా తిరుగునట్లు అనుగ్రహించి వెడలిపోయెను. అది కారణముగా మరుత్తులును దేవతలును కూడి ఉందురు, (బ్రహ్మ) (మత్స్య)

**మరుద్వంతుఁడు** : ధర్మునికి మరుద్వతి యందు పుట్టిన పెద్దకొడుకు.

**మరుదేశము** : భారతయుద్ధ మపుడు కురుసైన్యమునకు ఒక విడిదల.

**మరుద్వతి** : దక్షుని కూతురు. ధర్ముని భార్య. ఈమె కొడుకులు జయంతుఁడు, మరుత్వంతుఁడు.

**మరుభూములు** : సింధుదేశము రాజపుత్రస్థానము మొదలగువానిసమీపప్రదేశములు ఇచటి గొప్పయిసుకబయళ్ళు ఉండుటచే వీనికి యీ నామము కలిగెను.

**మలదకరూశములు:** అంగదేశమునకు సామీప్యమున గంగకు దక్షిణమున ఉండు రెండు దేశములు. తొల్లి వృత్రవధచేసి ఇంద్రునకు బ్రహ్మహత్య ఘటింపగా దేవతలు అతనికి ఇచ్చట గంగాభిషేకము చేయించి అతని యందలి మలమును

కారూశమును వదలించిరి. అదికారణముగా దీనికి మలదకరూశములు అనునామము కలిగెను. మరియు యివి పుణ్యక్షేత్రములును అయ్యెను.

మలయధ్వజుఁడు : అశ్వత్థామచే చంపబడిన పాండ్యదేశపురాజు.

మలయము : ఒక కొండ. పడమటి కనుమలయొక్క దక్షిణభాగము. దీనిని గంధపుకొండ అనియు అందురు.

మల్లన : (1) ఒక ఆంధ్రకవి. ఇతఁడు బమ్మెర పోతన కుమారుడు. రుక్మాంగద చరిత్రము అను గ్రంధమును రచియించెను. ప్రౌఢకవి మల్లన అనునది ఇతనికి బిరుదాంకము. (2) మరి ఒక ఆంధ్రకవి, ఇతఁడు గణింప తగిన కవులలో ఒకఁడు. ఇతఁడు చేసినది చంద్రభాను చరిత్రము. అందు దేశ్యములును అన్యదేశములును అగు తెనుగు పదములే మిక్కుటముగా కానబడుచు ఉన్నవి శైలియు మిగుల వర్ణనీయము.

మల్లరాష్ట్రము : మహారాష్ట్ర దేశమునకు ప్రాచీననామము.

మల్లికార్జున భట్టు : ఒక ఆంధ్రకవి. హులిక్కి భాస్కరుని పుత్రుఁడు. ఇతఁడు భాస్కర రామాయణమున బాలకాండమును, కిష్కింధాకాండమును, సుందరకాండమును తెనిగించెను. చూ॥ భాస్కరరామాయణము. భాస్కరుఁడు.

మల్లినాథుడు : ఒక సంస్కృత పండితుఁడు. ఇతఁడు మాఘము, రఘువంశము, నైషధముమొదలగు అనేక కావ్యములకు వ్యాఖ్యానము వ్రాసెను ఇతనికి పెద్దిభట్టు అనియు పేరు.

మల్హణుఁడు : ఒకానొక సంస్కృత కవి. ఇతఁడు బిల్హణుని సహాధ్యాయుఁడు అని కొందరును, సహోదరుఁడు అని కొందరును చెప్పెదరు.

మహతి : నారదుని వీణ.

మహాకాలము : ఒకానొక పుణ్యక్షేత్రము. మహాకాలుఁడు అను శివమూర్తి ఆవిర్భవించినచోటు.

మహాకాలుఁడు : (1) శివునికి నామాంతరము (2) అ॥ జనమేజయుని కొడుకు.

మహాజ్వాల : ఒకానొక నరకము. ఇందు జారులు బాధింపబడుదురు.

మహాదేవుఁడు : (1) అష్టమూర్తులలో ఒకఁడు (2) శివునికి నామాంతరము.

**మహానంది** : మగధదేశములకు రాజులు అయి ఉండిన శైశునాగులలో కడపటి వాఁడు. ఇతనికి వెనుక నందుఁడు రాజు ఆయెను.

**మహానాభుడు** : ది॥ హిరణ్యాక్షుని కొడుకు (మత్స్య.)

**మహాపద్మ్యుఁడు** : చూ॥ నా॥ నందుఁడు

**మహా పార్శ్వుఁడు** : (1) ర॥ రావణుని పినతల్లి కొడుకులలో ఒకఁడు. (2) ర॥ రావణుని కొడుకు ఋషభునిచే ఖండింపబడెను. (రామా)

**మహాబలుడు** : ర॥ సుమాలి కొడుకు.

**మహాబాహువు** : ది॥ హిరణ్యాక్షుని కొడుకు.

**మహాభిషుడు** : ఒక రాజు. చూ॥ ప్రదీపుడు. (భాగ)

**మహాభోజుడు** : య॥ సాత్వతుని పుత్రుడు. ఇతడు అతి ధార్మికుడు. ఇతని వంశమువారు భోజులు అనబడుదురు. నా॥ భోజుడు. (భాగ)

**మహాధృకుడు** : మిధిలుని వంశస్థుడు అగు ఒక రాజు. కీర్తిరాతుని తండ్రి.

**మహామఘము** : సింహరాశియందు బృహస్పతి ప్రవేశించియుండు సంవత్సరము నందలి మాఘశుద్ధ పౌర్ణమి. ఈ దినమున కుంభఘోణమున కుంభేశ్వరుని తీర్థము నందు స్నానము ఆచరించిన మహావిశేషము అని స్థల పురాణమునందు చెప్పబడి ఉన్నది.

**మహామనుడు** : అ॥ మహాకాలుని కొడుకు. ఇతని కొడుకులు ఉశీనరుడు, తితిక్షుడు.

**మహామాయుడు** : అధోలోకములలో ఒక్కటి అగు అతలమునకు రాజు.

**మహాయుగము** : నాలుగు యుగముల చేరిక. 4320000 సంవత్సరములకాలము. చూ॥ యుగములు.

**మహారాజికులు** : గణదేవతాభేదము. వీరు ఇన్నూట ఇరువురు.

**మహారాష్ట్రము** : ఘూర్జరమునకు దక్షిణము కర్ణాటకమున కుత్తరమునన ఆంధ్రదేశమునకు పశ్చిమమును ఉండు దేశము. ఈదేశపు భాషయును. ఇదియే ప్రాకృతము అనియును చెప్పుదురు.

**మహారాష్ట్రులు** : మహారాష్ట్రదేశస్థులు. పంచద్రావిళ్ళలో ఒక్కరు.

**మహారోముడు** : మి॥ కీర్తిరాతుని కొడుకు.

**మహారౌరవము** : ఒక నరకము. తొమ్మిదివేల యోజనముల విశాలముకలది అయి రౌరవమునందువలె అగ్నికుండములచే వెలుగుచు ఉండును. ఇందు కలుష కర్ము లను కరచరణములు బంధించి పడ్రతోయుదురు. వారు వానిలో పొరలుచు ఉండు నప్పుడు అచ్చటి కాకులు గద్దలు, లేళ్ళు, తోడెళ్ళు మొదలగునవి వారిని బాధించుచు ఉండును. ఆబాధచే వారు తమవారిని పేర్కొని ఎలుగెత్తి ఏడ్చుచు ఉందురు.

**మహావీరచరిత్రము** : (1) హేమచంద్రునిచే రచియింపబడిన ఒక గొప్ప చరిత్ర రూపము అయిన గ్రంథము. (2) కాళిదాస రచితము అయిన ఒకనాటకము.

**మహావీరుడు** : జైన గురువులలో ఒకడు. ఇతడు కడపటి తీర్థకారుడు.

**మహావీర్యుడు** : (1) పు॥ భుమన్యుని కొడుకు. రుక్షయుని తండ్రి. (2) మి॥ బృహద్రథుని కొడుకు.

**మహాహయుడు** : య॥ శతజిత్తు పెద్దకొడుకు.

**మహిషాసురమర్దని** : పార్వతికి నామాంతరము. మహిషాసురుని చంపినందున ఈమెకు ఈ పేరు కలిగెను.

**మహిషుడు** : (1) ఒక అసురుఁడు. దేవాసుర యుద్ధమునందు దైత్యులు ఎల్లరును సమసిపోఁగా దితితపము ఒనర్చి బ్రహ్మవరము వలన కనిన సగము మహిషాకృతియు సగము నరాకృతియునుగా జనించినవాఁడు. వీడు మహాసంప న్నుడు. వీనిని బ్రహ్మ రుద్రాది దేవతల వివిధ తేజములవలన పుట్టిన రౌద్రశక్తిని సహాయముగా కొని కుమారస్వామి పరిమార్చెను. ఎల్ల దేవతల తేజస్సునను ఒక్కొక్క అంశముకొని పరాశక్తి అగు పార్వతియే భద్రకాళి రూపమును వహించి ఈ అసురుని వధించెను అనియు కొందరుచెప్పుదురు. చూ॥ మహిషాసుర మర్దని. (వరా)

(2) ది॥ అను హ్లాదుని రెండవ కొడుకు బాష్కలుని తమ్ముఁడు.

(భాగ)

మహిష్మంతుఁడు : య॥ సనాజిత్తు కొడుకు. ఇతఁడు నర్మదానదీతీరమున మహిష్మతీపురమును నిర్మాణము చేసెను.

మహేంద్రము : ఒకానొక కొండ. ఇది ఉత్కలము (ఒరిస్సా) మొదలు ఖాండవము. (గాండ్వానా) వరకు వ్యాపించి ఉండును. ఇది కులపర్వతములలో ఒకటి. ఇది కొంతకాలము పరశురామునికి నివాస స్థలముగాను ఉండెను. ఇచట ఉన్నప్పుడే పరశురాముఁడు, వివాహము చేసికొని మిథిలనుండి వచ్చుచు ఉండిన శ్రీరాముని ఎదిరించి ఓడిపోయి అతనికి విశ్వకర్మ నిర్మితమయిన విష్ణుధనుస్సును ఇచ్చెను. సీతను పెండ్లాడుటకై శ్రీరామునిచే విరువఁబడిన ధనుస్సు రుద్ర ధనుస్సు అనబడును.

మహోదయము : మగధదేశమునందలి ఒక పట్టణము. విశ్వామిత్రుని రాజధాని. ఇది కుశికుని కొడుకు అగు కుశనాభునిచే నిర్మింపఁబడెను. ఈ చోట ప్రకృతమున కనోజ ఉన్నది. చూ॥ కన్యాకుబ్జము.

మహోదరుఁడు : (1)ర॥ రావణుని పినతల్లి కొడుకు. (2) ర॥ రావణుని కొడుకు నీలునిచే చంపఁబడెను. (రామా)

మాండవి : దశరథ పుత్రుఁడు అగు భరతుని భార్య. కుశధ్వజుని పుత్రిక. నా॥ మాళవి.

మాండవ్యుఁడు : ఒక బ్రహ్మర్షి. ఇతఁడు తపస్సుచేయు కాలమున ఒకనాడు కొందరు దొంగలు తమ్ము తలారులు తఱుముకొనిరాగా ఇతని ఆశ్రమమునకు వచ్చిదాగిరి. అప్పుడు తలారులు ఆదొంగలను పట్టుకొనినది కాక ఈ ఋషినికూడ దొంగ అని పట్టుకొనిపోయి తమ రాజు యొక్క ఆజ్ఞ చొప్పున కొఱత వేసిరి. అందులకు ఇతఁడు చలింపక తపోనిష్ఠయందు ఉండెను. అనంతరము రాజు ఇతని వాస్తవ స్థితి తెలిసి ఆ కొఱ్ఱునందుండి తొలగింపగా, తపస్సు చాలించి ఎల్ల లోకములు తిరుగుచు ఒక్కనాడు యమలోకమునకుపోయి స్వధర్మమునందు వర్తించుచు ఉన్న తనకు ఇటువంటి దారుణదండము కలుగుటకు కారణము యమధర్మరాజును అడుగగా, అతఁడు నీవు చిన్నప్పుడు తూనీగలను పట్టి ఛీపురు పుల్లలతో గ్రుచ్చిన ఫలము ఇది అని చెప్పెను. అందులకు మాండవ్యుఁడు కోపించి పుట్టుక మొదలు 12 సంవత్సరములు అగునంతకు నరుఁడు బాలుఁడు గనక

ఆకాలమున వాఁడు ఏమి చేసినను వానిని పాపము చెందదు. నీవు అట్టి ధర్మమును విచారింపక క్రూరదండము నాకు తగును అని విధించితివి కనుక భూలోకమందు శూద్రుఁడవు అయి పుట్టుము అని యమునికి శాపము ఇచ్చెను. అంత అతఁడు విదురుఁడు అయి పుట్టెను. చూ॥ విదురుఁడు (భార) (మార్క)

**మాండూకేయుడు** : ఋ॥ ఇంద్రప్రమితి శిష్యుఁడు. ఋగ్వేదాధ్యేత.

**మాంధాత** : ఇ॥ రెండవ యవనాశ్వుని కొడుకు. ఇతని భార్య శశిబిందుని కూతురు అగు బిందుమతి. ఇతఁడు పురుకుత్సుఁడు, అంబరీషుడు ముచికుందుడు అను మువ్వురు కొడుకులను ఏబండ్రు కుమార్తెలను పడసెను. ఆయేబండ్రు కుమార్తెలను సౌభరి అను మునికి ఇచ్చి వివాహము చేసెను. ఇక్ష్వాకు వంశస్థులలో ఇతడు మహాఖ్యాతి కెక్కిన రాజు. (విష్ణు) (ఉ. రా.)

**మాకంది** : దక్షిణ పాంచాలమునకు ముఖ్యపట్టణము.

**మాగధి** : (1) మగధదేశపు భాష. ఇది ఆరువిధములు అగు ప్రాకృత భాషలలో ఒకటి. (2) శోణనదికి నామాంతరము.

**మాఘము** : ఒక సంస్కృత కావ్యము. మాఘునిచే చేయబడినది అగుటచే దీనికి ఈ పేరుకలిగెను. ఇది శ్రీకృష్ణుడు రాజసూయ యాగమునకు ధర్మరాజు పిలువ బంపగా పోయి శిశుపాలుని వధించి వచ్చిన కథ. దీనికి కవి ఉంచిన పేరు శిశుపాల వధ. మల్లినాథసూరి దీనికి వ్యాఖ్యానముచేసి యున్నాడు అది సర్వంకషము అనబడును. "దండినః పదలాలిత్యం భారవేరర్థ గౌరవమ్. ఉపమాకాళిదాసస్య మాఘస్యైతేత్రయో గుణాః" అని విద్వాంసులు మాఘమును మిక్కిలి శ్లాఘింతురు.

**మాఘుడు** : ఒకానొక సంస్కృత కవి. ఈతడు రచియించిన కావ్యము మాఘము. అది మిగుల ప్రసిద్ధికి ఎక్కి ఉన్నది.

**మాణిభద్రుడు** : ఒకానొక యక్షుడు. కుబేరుని సేనాపతి. వీఁడు మిక్కిలి శూరుడు. కుబేరునకును రావణునకును యుద్ధము జరిగినప్పుడు, రావణుని ఎదిరించి పోరాడి, అతని గదపెట్టుచేత తలఒరగగా అది మొదలు పార్శ్వమౌళి అనబడెను. (భార)

మాతలి :దేవేంద్రునకు సారథి. (భార).

మాతృకలు : అంధకాసురునితో యుద్ధము చేయునపుడు రుద్రుని అంగము నుండియు, నృసింహమూర్తి అగు విష్ణువుయొక్క అంగమునందుండియు పుట్టిన కొందరు స్త్రీ గణదేవతలు. ముల్లోకములయందును వీరికి బలిపూజాదులు ఒసంగెడి వారు, వీరిచే రక్షింపబడుచు ఉందురు, అనియు తక్కినవారు భక్షింపబడుచు ఉందురు అనియు చెప్పుదురు. వీరిలో ముఖ్యులు ఏడుగురు. బ్రాహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి చాముండి.

మాత్స్యము : అష్టాదశ పురాణములలో ఒకటి. ఇది మత్స్యావతారము ఎత్తిన విష్ణుమూర్తిచే మనువునకు తెలుపబడిన సప్తకల్ప ప్రభావము. నృసింహావతారకథ నాదులు కలది దీని గ్రంథసంఖ్య ౧౪౦౦౦ (14000).

మాద్రి : మద్రరాజు కూతురు. శల్యుని చెల్లెలు. మిక్కిలి సౌందర్యవతి పాండురాజుయొక్క రెండవ భార్య. ఈమె తనమగనితో సహగమనము చేసెను. ఈమెకు అశ్వినీదేవతల ప్రసాదమువలన నకులుడు, సహదేవుడు అను అమరులు పుట్టిరి. (భార)

మాధవి : యయాతి కూతురు. ఈమె గాలవునిచే పరిగ్రహింపబడి అష్టకుడు మొదలగు వారిని కనెను. (భార)

మాధవీయము : పరాశరస్మృతియొక్క వ్యాఖ్యానము. చూ॥ పరాశరస్మృతి.

మాధవీయనం
హితాకాలనిర్ణయం: } విద్యారణ్య తీర్థులచే చేయబడిన జ్యోతిష గ్రంథము.

మాధవుడు విష్ణువునకు నామము. లక్ష్మిపతి అని శబ్దార్థము.
మానవము : ఉపపురాణములలో ఒకటి.

మానససరస్సు కైలాసమునందు కుబేర భవనమున బ్రహ్మచే నిర్మితమైన ఒక సరస్సు. (భార)

మాయ : హరిద్వారమునకు నామము.

మాయాదేవి : శంబరాసురుని భార్య.

మాయావతి : శంబరాసురుని ఇంట పాతివ్రత్యమును నడుపుచు ఉన్న రతీదేవి పేరు. ఒకానొకప్పుడు శివుడు తపోదీక్ష వరించి ఉండగా ఆ తపస్సునకు విఘ్నము చేయపూని మన్మథుడు ఆయన మనస్సును వికలత పొందించెను. అంతట రుద్రుడు రౌద్రాకృతి వహించి నొసటి కన్ను తెంచి మన్మథుని దహించెను. అది తెలిసి రతీదేవి తన భర్తృవియోగమునకు దుఃఖించి పతిభిక్ష పెట్టుము అని శివుని ప్రార్థింపగా శివుడు శాంతము వహించి రాగల ద్వాపర యుగము కడపట విష్ణువు కృష్ణావతారము ఎత్తి దుష్టనిగ్రహమును శిష్టానుగ్రహమును సలుపుచు, భూలోకమున ద్వారకానగరమున నివసింపగలడు. అప్పుడు అతని పట్టపుదేవిఅగు రుక్మిణీదేవికి ప్రద్యుమ్నుడు అనుపేర నీమగడు జనియించి నిన్ను ఏలుకోగలడు. అంతపర్యంతము నీవు మాయావతి అని పేరు పెట్టుకొని శంబరాసురుని ఇంటపాతివ్రత్యము నడుపుచు ఉండుము అని చెప్పి పంపెను. చూ॥ ప్రద్యుమ్నుడు.

(విష్ణు)

మాయావి : ఉ॥ మయుని పెద్ద కొడుకు. మండోదరి సహోదరుడు. దుందుభి అన్న వాలిచే చంపబడెను. (రామా)

మారన : ఒక ఆంధ్రకవి. తిక్కన సోమయాజి పుత్రుడు. ఇతడు మార్కండేయ పురాణమును తెనిగించెను.

మారిష : (1) ప్రచేతసుల భార్య. కండుడు అను ఒకమహర్షికి ప్రమ్లోచ అను అప్సరసయందు పుట్టిన కన్య. తొల్లి కండు అను ఒక రుషి తపము చేయుచు ఉండగా దేవేంద్రుడు దానికి విఘ్నము కావించుటకయి ప్రమ్లోచ అను ఒక అప్సరసను పంపెను. దానిని చూచి ఆఋషి చిత్తచాంచల్యముచెంది అనేకసంవత్సరములు దానితోకూడిఉండి పిదప ఒకనాడు తెలివినొంది దానిని కోపదృష్టితో చూచుచు విడనాడెను. అపుడు కడుభీతిచెంది ఆ మహర్షిచే తనకు కలిగిన గర్భము చెడి స్వేదరూపముగా శరీరమునుండి బయట వెడలగా ఆ స్వేదమును ప్రమ్లోచ వృక్ష పల్లవములచేత తుడిచెను. ఆ వృక్ష పల్లవములను అంటిన స్వేద బిందువులను ఎల్లను వాయువు ఒక్కటిగ కూర్చి ఒక స్త్రీరూప పిండమునుచేసెను. దానిని చంద్రుడు తనకిరణములచల్లదనముచే తపించెను. అట్లు జనియించి పెరిగిన ఈ కన్యకకు వాయువును చంద్రుడును తలితండ్రులు అయిరి అనియు చెప్పుదురు.

ఈమె పూర్వజన్మమున పడుచుతనమునఉండునపుడే భర్త గతించిపోయి, సంతానము లేనందున విష్ణువునుగూర్చి తపస్సు చేయ, అతడు ప్రత్యక్షము అయి పైది జన్మమున నీకు పదుగురు భర్తలు అగుదురు అనియు ప్రజాపతేజోధైర్య స్థైర్యములుకల ఒక కొమరుడు కలుగును అనియు వరము ఇచ్చెను. కనుక సోదరులు అయిన ప్రచేతసులు పదుగురికిని భార్యఅయి వారివలన పూర్వ జన్మమున బ్రహ్మపుత్రుడు అయి ఉండిన దక్షప్రజాపతిని కొడుకుగా కనెను.

(విష్ణు) (మత్స్య)

(2) వసుదేవుని తల్లి.

**మారీచము** : ఉప పురాణములలో ఒకటి.

**మారీచుడు** : ర॥ తాటకయొక్క కొడుకు. సుబాహుని అన్న. మిక్కిలి టక్కులమారి. విశ్వామిత్రుడు యాగమును చేయ యత్నింపగా మారీచ సుబాహువులు ఆ యజ్ఞమునకు విఘ్నము చేయవచ్చిరి. అప్పుడు విశ్వామిత్రుడు అయోధ్యకు పోయి, దశరథుని అడిగి రామలక్ష్మణులను పిలుచుకొనివచ్చి తనయాగమునకు విఘ్నముచేయవచ్చువారిని సంహరింపుము అని చెప్పగా, రాముడు ఆగ్నేయాస్త్రము ప్రయోగించి సుబాహునిచంపి, వాయువ్యాస్త్రమును ప్రయోగించి మారీచుని సముద్రమున పడునట్లు చేసెను. అంతట మారీచుడు రాముని పరాక్రమము ఎఱిగినవాడు అయి ఆతని తెరువుకు పోరాదు అని దక్షిణ సముద్ర తీరమున ఆశ్రమము కావించుకుని అచ్చట తపస్సు చేయుచు వుండెను. అనంతరము వనవాసము చేయవచ్చిన రాముడు దండకారణ్యమున ఉండగా రావణుడు ఆతని భార్యను ఎత్తుకొనిపోవుటకు ఈ మారీచుని సహాయము కోరెను. అప్పుడు వీడు రాముని పరాక్రమమును వానికి తెలిపి ఆ కార్యము వలదు అని బహుభంగుల బోధించియు వాడు వినకపోయినందున తాను ఒక బంగారుజింక అయి రాముని ఆశ్రమమునకు ఎదుట పచ్చిక మేయుచు ఉండెను. సీత దానినిచూచి : దాని రూపరేఖాలావణ్యాది గుణములకు సంతసిల్లి తోడనే ప్రియునకు తెలిపి దానిని తనకు పట్టి ఇయ్యవలయును అని ప్రార్థించెను. అంతట రాముడు దానిని పట్టబోయి అది తనకు చిక్కక పరుగెత్తగా దానిని తరుముకొని బహుదూరముపోయి మాయామృగము అని యెఱిగికొని బాణప్రయోగము చేయగా మారీచుడు నిజరూపమును పొంది "హా సీతా! హా లక్ష్మణా!" అని అరచుచు ప్రాణములు విడిచెను. ఆ కూత

విని సీత దిగులుపడి రామునకు ఏమో ఆపద పొసగినట్టున్నది. నీవుపోయి ఆ ఆపద తొలగించి పిలుచుకొని రమ్ము అని లక్ష్మణుని పంపెను. ఆ సమయమున ఒంటరిగానుండెడు ఆమెవద్దకు సన్యాసివేషముతో రావణుడువచ్చి, ఆమెను ఎత్తుకొని పోయెను. (రామా)

మార్కండేయము : ఒకపురాణము. ఇది మార్కండేయ ప్రోక్తము అయి ధర్మాధర్మ విచార విస్తారము అయి యుండును. దీని గ్రంధ సంఖ్య 9000 చూ॥ ధర్మ పక్షులు.

మార్కండేయుడు రు॥ మృకండు మహర్షి కొడుకు. (మార్క-)

మాలి : ర॥ మాల్యవంతుని తమ్ముడు. సుకేశుని కొడుకు. వీడు దేవాసుర యుద్ధమున విష్ణువుచే చంపబడెను. (ఉ. రా)

మాలిని : (1) ఒకానొక నది. ఇది అయోధ్యకు వాయవ్యమున అపరతాల పర్వతములకును ప్రలంబ పర్వతములకును నడుమపుట్టి కోసలదేశమున ప్రవహించును.

(2) అజ్ఞాతవాస కాలమున సైరంధ్రీవేషమును ధరించిన ద్రౌపది ఉంచుకొనిన నామము. (భార) (హరి) (మార్క-)

మాల్యవంతము : ఒకానొక కొండ. ఇది కిష్కింధకు సమీపమున ఉండును. ఇందు రామలక్ష్మణులు, వాలివధ అయిన పిమ్మట వర్షాకాలము అంతయు జరపిరి.

మాల్యవంతుడు : ర॥ సుకేశుని కొడుకు. (రామా)

మావసుడు : అచ్ఛోద తండ్రి. చూ॥ అచ్ఛోద.

మాలవము : ఒకానొక దేశము. దీనికి తొలుత ఉజ్జయనియు ఆవల ధారాపురియు రాజధానులుగా ఉండెను. దీనిని విదర్భ దేశము అనియు చెప్పుదురు.

మాళవి : మద్రదేశాధిపతి అగు అశ్వపతి భార్య సావిత్రిమాత. (భార)

మాళవికాగ్నిమిత్రము : కాళిదాసప్రణీతము అయిన ఒక నాటకము. మౌర్యవంశస్థుడు అగు మగధదేశపురాజు బృహద్రథుడు అను వానిని వాని సేనాపతి అగు పుష్యమిత్రుడు రాజ్యభ్రష్టునిగా చేసి తన కొడుకు అగు అగ్నిమిత్రునకు యిప్పించిన కథ ఇందు చెప్పబడి యున్నది.

మహిషకము : ఇప్పటి మైసూరు దేశము.

మహిష్మతి : నర్మదా నదీతీరమునందుండెడి పట్టణము. ఈచోట ఇపుడు చూళి మహేశ్వరము ఉండునట్లు తెలియవచ్చుచున్నది. ఇది తాళజంఘులు అనబడు కార్త వీర్యార్జునుని వంశస్థులకు రాజధాని.

ఒకానొకప్పుడు అగ్ని బ్రాహ్మణుని వేషము ధరియించి ఈపట్టణమునందు వేదాధ్యయనము చేయుచు ఉండి, ఒక్కనాడు ప్రమాదవశమున పరదారగమనము చేయగా అది రాజు ఎరిగి అతనిని దండింపఁబోయెను. అప్పుడు అగ్ని తన నిజ స్వరూపమును అగుపరచి ఆ రాజు ముకుళితకరకమలుడు అయి, తన్ను ప్రార్థింపగా ప్రసన్నుడు అయి ఈ పురమునకు శత్రుబాధలేకుండునట్లును ఇందలి స్త్రీలు, మిగుల మనోజరాగిణులు కావున స్వైరిణీవృత్తిని వుండునట్లును అనుగ్రహించెను.

మహేయులు : ఇప్పుడు ముల్తాను అనబడు దేశమున ఉండిన ప్రాచీనపు కాపులు.

మహేశ్వరము : ఉప పురాణములలో ఒకటి.

## మి

మిత్రసహుఁడు : ఇ॥ చూ॥ కల్మాషపాదుడు.

మిత్రాయువు : పా॥ దివోదాసుని కొడుకు.

మిత్రుడు : అరిష్టపిప్పలుల తండ్రి. నాలవరేవతి మగఁడు;

మిథిల : ఒకానొక పట్టణము. దీనికి ఈనామము మిథిలుడుఅను రాజు వలన కలిగెను. ఇది గండకీ కౌశికీ నదుల మధ్యమున ఉండును. మరియు, ఇది పంచగౌడ దేశములలో ఒకటి దీనిని విదేహరాజ్యము అనియు వాడుదురు. ఇది ఉండెడు దేశమునకును, ఈ పేరు చెల్లును.

మిథిలుడు : నిమి కొడుకు. విదేహుడు, జనకుడు అనియు నామములు కలవు. అందు జనకుడు అనునామము ఈతని వంశస్థులకు వంశనామము అయిచనును. వశిష్ఠుని శాపమున నిమి విగతదేహుడు అయినందున భూమి అరాచకముగా ఉండుటను చూచి నిమి కళేబరమును మధింపగా ఒక కుమారుడు పుట్టెను. అందు

వలన ఇతనిని మిధిలుడు అందురు. దేహమాత్రము నుండి పుట్టినందున విదేహుడు అనియు చెప్పబడును. ఈ మిధిలునిచే నిర్మింపబడినది మిధిలానగరము.

మిత్రకేశి : వసుదేవుని తమ్ముడగు, వత్సకుని భార్య.

## మీ

మీనాంకుడు : మన్మధుడు.

మీనాక్షి : రెండవ మధుర యందలి దేవి.

మీమాంస : వేదార్థము ఇట్టిది అని నిశ్చయింప దగిన న్యాయమును తెలుపునట్టి శాస్త్రము. ఇందు కర్మకాండము, పూర్వమీమాంస, బ్రహ్మకాండము, ఉత్తర మీమాంస అనియు ద్వివిధము అయి యుండును. వీనినే కర్మ మీమాంస బ్రహ్మ మీమాంస అని అందురు.

## ము

ముంజుడు : భోజరాజు పినతండ్రి చూ॥ భోజుడు.

ముచికుందుడు : ఇ॥ మాంధాత కడపటి కొడుకు. ఇతడు దేవహితార్థము బహుకాలము మేలుకొని వుండి, అలసి ఒక కొండ గుహలో పండుకొని ఇంద్రియసంచారము లేక నిద్రించుచు ఉండెను. అది తెలిసి కృష్ణుడు తన్ను కాలయవనుడు తరుముకొని వచ్చునప్పుడు ఆపర్వతగుహలో దూరెను. అది చూచి వారును అతనితో గూడ ఆ గుహలో దూరి పండుకొని నిద్రించుచు ఉన్న ఇతనిని కృష్ణుడు అని తలచి కాలితో తన్ని లేపి ఇతని క్ర్యూరదృష్టిచే నీరు అయ్యెను. అనంతరము కృష్ణుడు ఇతనికి కనబడెను. అపుడు ఇతడు నమస్కరించి వినుతింపగా గంధమాదనపర్వతమునందలి బదరికాశ్రమమునందు తపము ఆచరింప పొమ్ము అని ఇతనికి ఉపదేశము చేసెను. ఇతడును అట్లే చేసెను.

ముదావతి : నా॥సౌనంద.విదూరథుని కూతురు. ఈమె ఒకప్పుడు సఖీజనముతోవనవిహారార్థముపోయి ఉండగా కుజంభుడు అను రక్కసుడు ఈమెను కొనిపోయిపాతాళమునందు ఉంచెను. ఆ కుజంభుని వత్సంధ్రుడు అను రాజు చంపి ఈమెను వివాహము అయెను. చూ॥ (2) కుజంభుడు, (మార్క)

**ముద్గలుడు** : 1. రు॥ఇతడునిర్జితవిషయేంద్రియుడు అయి ఉంఛవృత్తినిజీవించుచు దేవ పితృపూజనములు ఆచరించుటయందు దుర్వాసాది మునులను ప్రమోదమగ్న మానసులుగ చేసెను. మరియు ఇతడు దేవలోకమును కేవల సత్యమునుచేకొని నిర్వికల్పము అయిన జ్ఞానయోగమును అవలంబించి తుల్యనిందాస్తుతియును. సమ లోష్టకాంచనుడును అయి పరమ సిద్ధిని పొందెను.

(2) అజమీఢుని రెండవ కొడుకు అగు నీలుని వంశస్థుడు. తండ్రి భర్మ్యాశ్వుడు. లేక హర్యశ్వుడు. కొడుకు దివోదాసుడు. కూతురు గౌతముని భార్య అగు అహల్య ఇతడు క్షత్రియుడు అయినను తపోమహిమచే ఇతని వంశజులు బ్రాహ్మణులు అయిరి. వారే మౌద్గల్య గోత్రులు. (భార)

**ముద్దుపళని** : ఒకానొక వేశ్య. ఈపె తెనుగున రాధికా స్వాంతనము అను గ్రంథమును రచియించెను.

**ముద్రారాక్షసము** : విశాఖదత్తుడు అనువానిచే కల్పింపబడిన ఒక నాటకము.

**ముని** : దక్షప్రజాపతి కూతులలో ఒకతె. మగడు కశ్యపుడు. (భార)

**ముర** : తొమ్మిదవ నందుని భార్య. ఈమెశూద్రస్త్రీ. కొడుకు చంద్రగుప్తుడు.

**మురారి** : ఒకానొక సంస్కృత కవి. ఇతడు అనర్ఘరాఘవీయము అను ఒక నాటకమును రచియించెను.

**మురాసురుడు** : ద॥ నరకాసురుని అన్న. కృష్ణునిచే చంపబడెను.

**ముష్టికుడు** : కంసుని భటుడు అగు మల్లుడు. చాణూరుని చెలికాడు. వీడు మధురాపురియందు కంసునికి ఎదుట జరిగిన మల్లయుద్ధమున బలరామునిచే పొలియింపబడెను.

**ముహూర్త** : రెండవ దక్షప్రజాపతి కూతురు. ధర్ముని భార్య. ఈమెకు జనించిన వారు మౌహూర్తికులు అనబడుదురు.

## మూ

మూకాంబ : సహ్యపర్వత సమీపమున ఆవిర్భవించి ఉండెడు పరాశక్తి యవతారము.

మూకుడు : రుద్రుడు. మాయాకిరాతుడుఅయి అర్జునునకు ప్రత్యక్షము అయినపుడు రుద్రప్రేరితుడు అయి, వరాహరూపము తాల్చివచ్చి అర్జునుని కలతపెట్టిన రక్కసుడు.

మూర్తులు : చూ॥ అష్టమూర్తులు.

మూలకుడు : ఇ॥ నా॥ నారీకవచుడు. అశ్మకుని కొడుకు; పరశురాముడు భూమిని ఎల్ల క్షత్రియ శూన్యముగా చేసినపుడు ఇతనిని స్త్రీలు తమకు నడుమను ఎవ్వరికి తెలియకుండునటుల ఉంచుకొని కాపాడినందున ఇతనికి నారీకవచుడు అనియు ఇతని మూలముగ క్షత్రియవంశము మరల వృద్ధిచెందినందున మూలకుడు అనియు ఇతనికి నామములు కలిగెను. (విష్ణు)

మూషికము : ఒక దేశము. ఇప్పటి ట్రావెన్కూరును కొచ్చియును కలది.

## మృ

మృకండుడు : భృగుమహర్షి కొడుకు అయిన ధాతకు ఆయతి యందు పుట్టిన కొడుకు. మార్కండేయుని తండ్రి. (భాగ)

మృచ్ఛకటిక : ఒక నాటకము. ఇది శూద్రకునిచే రచియింపబడినది.

మృడుడు : రుద్రునికి నామము. సుఖింపచేయువాడు అని శబ్దార్థము.

మృత్తికావతి : మాళవదేశము నందలి ఒకపట్టణము.

మృత్యువు : (1) చంపెడు దేవత. తొల్లి ప్రజాపతి ప్రజల సృజియించి పదపడి తత్సంహారము లేమిజేసి భూమికి తదీయ భారము దుర్భరము అగుట అనుసంధించి రక్తాస్యయు అసితాంగయు అరుణాంబరయును అగు ఒకఇంతిని కల్పించి దానికి ఈపేరుపెట్టి, జంతుసంహారమునకు నియమించెను. అందుకు ఆమె పరమ దుఃఖితఅయి యింత కష్టపు పనిని నేను చేయజాలను అని కన్నీరు తొరగ ఏడ్వగా

బ్రహ్మదేవుడు ఆ అశ్రుబిందువులను తనపాణిపుటంబులబట్టి ఆ బిందువులు ఎన్ని ఉన్నవో అన్నియు అన్ని రోగములు అయి, జంతువులను చావచేయగలవు అనియు, లోభమును, క్రోధమును, ఈర్ష్యయు, అసూయయు జంతువుల శరీరములను వికలత పొందింపగలుగు అనియు, చెప్పి ఆ మృత్యుదేవిని సమాధానపరచి పంపెను. (2) యముడు. (భార)

మృదుకుడు : య॥ అకవారుని తమ్ముడు.

మృదువత్తు : య॥ అకవారుని మరియొక తమ్ముడు.

## మే

మేఖల కన్యక : నర్మదానది మేఖల పర్వతమున పుట్టినందున దీనికి ఈ పేరు కలిగెను.

మేఖలము : (1) నర్మదానదీతీరదేశము. (2) నర్మదానది ఉత్పత్తి అయిన కొండ.

మేఖలుడు : వింధ్యపర్వత ప్రాంతమున ఉండిన ఒకరుషి.

మేఘనాధుడు : రావణునికి మండోదరియందు పుట్టిన కొడుకు. దేవేంద్రుని జయించినందున వీనికి ఇంద్రజిత్తు అనునామధేయమును కలిగెను. విభీషణుని తోడుపాటుచే లక్ష్మణుడు వీనిని చంపెను. (రామా)

మేదిని : (1) భూమికి నామాంతరము. (2) ఒకసంస్కృత నిఘంటువు, ఇందు నానార్థపదములు మాత్రము కలవు.

మేధాతిధి : (1) ప్రియవ్రతుని కొడుకులలో ఒకడు. ఇతని పాలికిప్లక్షద్వీపము వచ్చెను. ఈతని కొడుకులు ఏడుగురు. (2) కణ్వుని పుత్రుడు. అప్రతిరథుని పౌత్రుడు. ఇతనికి ప్రస్కంధుడు మొదలు అగు బ్రాహ్మణులు జనియించిరి వారు కాణ్వాయనులు అనబడుదురు. (భాగ)

మేధానిధి : రు॥ చిరకారి.

మేన (మేనక) : పితరులకును స్వధకును పుట్టిన కూతురు. ఈమె చెలియలు వైతరణి.

మేనక : (1) ఒక అప్సరస. ఈమె విశ్వామిత్రునియొక్క తపోభంగము చేయ, దేవేంద్రునిచే పంపబడి అతనికి కామవికారము పుట్టించి అతనితోకూడి బహు సంవత్సరములుఉండి, శకుంతలను కనెను. (2) మేరువు కూతురు. హిమవంతుని భార్య. నా॥ మనోరమ. కుమార్తెలు. గంగ, పార్వతి.
(బ్రహ్మ)

మేరుదేవి : నాభిభార్య. ఋషభుని తల్లి.

మేరువు : ఒకానొక గొప్ప పర్వతము. దీనిచుట్టి సప్తద్వీపములు ఉండును అనియు ఇది స్వర్ణమయమయి దేవతలకు స్థానమై యుండును అనియు పురాణముల యందు చెప్పబడి యున్నది. ఇందు ఉండు వారికి ఉత్తరాయణము పగలును, దక్షిణాయనము రేయును అయి ఉండును. ధైర్యమున సాధారణముగా మేరువును పోల్తురు. ఈ పర్వతము కూతురు అగు మేనకయే హిమవంతుని భార్య. (బ్రహ్మ)

మేలుకోటి : మైసూరికి సమీపమున ఉండెడు ఒకానొక పట్టణము. దీనిని తిరు నారాయణపురము అనియు అందురు. ఇచ్చట కొండమీద కృష్ణుని లీలారూపము లలో ఒక్కటి అగు చల్వపిళ్ళరూపమును ప్రతిష్ఠించి కొలుతురు.

## మై

మైందుడు : ఒకానొక వానరుడు. సోదరుడు ద్వివిదుడు. అశ్వినీ దేవతవలన పుట్టినవాడు. సుగ్రీవుని సేనానాయకులలో నొకడు.

మైత్రేయుడు : (1) ఋ॥ కుశీలవుని కొడుకు. పరాశరుని శిష్యుడు. ఇతనికి పరాశరుడు విష్ణు పురాణమును చెప్పెను. ఇతడు కామ్యక వనమునఉన్న పాండవుల వద్దనుండి ధృతరాష్ట్రుని వద్దకువచ్చి దుర్యోధనునకు హితముపదేశముచేసి అది వాడు వినక పరిహాసము చేయగా మిగుల అలిగి భీముని గదాఘాతమున తొడలు విరిగి చత్తువుగాక అని శపించి పోయెను. (భార)

మైనాకుడు : హిమవంతునికిని మేరు పుత్రిక అయిన మేనకకును పుట్టిన సుతుడు. పూర్వము కృతయుగమున పర్వతములు అన్నింటికి రెక్కలు ఉండెను. అప్పుడు అవి ఎల్లయెడల అతిరయముతో తిరుగుచు ఉండినందున ప్రాణులకు మిక్కిలి భయము కలుగుచు ఉండెను. అది నిలుపుటకై ఇంద్రుడు తన వజ్రాయుధముచే

పర్వతముల రెక్కలు తెగగొట్ట సాగెను. ఆ సమయమున వాయుదేవుని సాహాయ్యమువలన మైనాకుడు తప్పించుకొనిపోయి సాగరములోచొచ్చి దాగిఉండెను. ఆకృతజ్ఞతనుబట్టియే మైనాకుడు వాయుపుత్రుడు అగు హనుమంతుడు సీతను వెదకుచు లంకకు పోవుచూ సముద్రమును దాటు నవసరమున తనపై కొంతసేపు నిలిచిపొమ్ము అని సముద్రము వెలువడివచ్చి హనుమంతుని ప్రార్థించెను. అది తనకు ప్రియము అయిన కార్యము అగుటచే ఇంద్రుడు మైనాకునితో స్నేహము చేసి అభయము ఇచ్చి పంపెను. (రామా)

## మొ

మొల్ల : ఒక కుమ్మరవాని కూతురు. ఈపె చదువుకొని విద్వాంసురాలు అయి రామాయణమును పద్యకావ్యముగా రచించెను. దానిని మొల్లరామాయణము అందురు. ఈపె యొక్క కవిత్వము మిక్కిలి ప్రౌఢము అయి, పురుష ప్రణీత కావ్యములను పోలియుండును.

## మో

మోఘవంతుడు : నృగుని వంశస్థుడు అగు ఒకరాజు.

మోఘవతి : (1) మోఘవంతుని కూతురు. సుదర్శనుని వివాహము అయ్యెను. ఈమెతో నృగుని వంశము ముగిసెను.

(2) భారత యుద్ధము జరిగినచోటు అగు కురుక్షేత్రమునకు సమీపమున ఉండెడు ఒక నది. దీనిగట్టున పాండవులు అయిదుగురును కృష్ణసాత్యకులతో భారత యుద్ధము ఆరంభించిన పదునెనిమిదవనాటిరేయి నివసించి నిద్రించిరి. దీనిని ఓఘవతి అనియు అందురు.

మోహనాంగి : మరీచిపరిణయము. కృష్ణదేవరాయల కుమార్తె రచించిన గ్రంథము.

మోహిని : (1) విష్ణువు యొక్క స్త్రీ రూపము క్షీరసముద్రము చిలికి అమృతమును ఎత్తినపుడు అసురులు దానిని ఉపయోగింప ప్రయత్న పడిరి. అపుడు విష్ణువు వారిని మోసముచేయుటకు ఒక కృత్రిమ స్త్రీరూపమును ఎత్తెను. ఆరూపమే మోహిని. అట్లు విష్ణువు స్త్రీరూపమువహించి అసురులకు మోహముకలుగజేసి అమృతమును పుచ్చుకొని దేవతలకు ఇచ్చువేళ రాహువు వేల్పులవలె వేషము ధరించుకొని వారి పంక్తియందుచేరి అమృతమును తానును

ఉపయోగింపపమకట్టెను. అది వా ప్రక్కను ఉండిన సూర్యచంద్రులు తెలిసికొని విష్ణువుకుతెలియచేసిరి. అంతట విష్ణువు. ఆయమృతము వాని కంఠబిలము చొరక మునుపే తనచక్రమును ప్రయోగించి రాహువు కంఠము తెగి దేహముభూమియందు పడగొట్టెను. వాని ముఖమును అమృతము సోకెను. కావున చక్రముచే నరక బడియు క్షయింపక ఆకాశమునందే నిలిచెను. అది కారణముగా నాడు మొదలు రాహువునకును చంద్ర సూర్యులకును విరోధము శాశ్వతమై నిలిచెను.

మరియు ఈమోహినీ రూపమును ఒకప్పుడు శివుడు చూచి మోహించెను. అని చెప్పబడి యున్నది.

(2) బ్రహ్మ కూతురు. ఈమె బ్రహ్మ అనుమతి వడసి రుక్మాంగదుడు పూని యున్న ఏకాదశి వ్రతము చెరుపపూని కడపట తన యత్నము నెరవేర్చుకో లేక పోయెను. (భార)

## మౌ

మౌద్గల్యుడు : శాకల్యుని శిష్యుడు. (భార)

మౌద్గల్యులు : ముద్గలగోత్రోద్భవులు అగు బ్రాహ్మణులు. చూ॥ ముద్గలుడు.

మౌనేయులు : కశ్యపునికి మునియందు పుట్టిన గంధర్వులు. వీరు పురుకుత్సునిచే నాగలోకమునుండి. తరుమ కొట్టబడిరి. చూ॥ పురుకుత్సుడు.

మౌర్యులు : చంద్రగుప్తుని వంశస్థులు అయిన మగధదేశపురాజులు వీరు పదుగురు నూటముప్పది యేడు సంవత్సరములు రాజ్యము చేసిరి.

మౌహూర్తికులు : ధర్మునికి ముహూర్తయందు పుట్టిన దేవగణము. వీరు సకల భూములకును, ఆయాకాలముల యందు కలిగెడు ఆయాఫలములను ఇత్తురు.

## య

యక్షులు : కశ్యపునికి సురనయందు జనియించిన వారు. వీరు కుబేరాదులు చూ॥ రాక్షసులు.

యజ్ఞకోపుడు : ర॥ మాల్యవంతుని కొడుకు. (రామా)

యజ్ఞఘ్నుఁడు : చ॥ యజ్ఞమూర్తి అగు విష్ణువుచే చంపఁబడినవాఁడు.

యజ్ఞదత్తుడు : ఒకానొక బ్రాహ్మణ కుమారుఁడు. ఒకప్పుడు దశరథుడు వేఁటాడపోయినపుడు అచట ఇతఁడు కమండలముతో కొలనునందు నీళ్ళు ముంచుచుండ, అతఁడు ఏనుఁగు నీరు త్రాగుచు ఉన్నది. అని తలచి బాణప్రయోగము చేయగా ఇతఁడు చచ్చెను. అంత ఇతని తల్లిదండ్రులు పుత్రశోకముచే ప్రాణములు విడుచుచు దశరథుఁడును మావలెనే పుత్రశోకమున మృతుఁడు అగుఁగాక అని శపించెను. చూ॥ దశరథుడు. (రామా)

యజ్ఞము : దేవతాప్రీతిగాచేయు అగ్నిహోత్రకార్యము. ఇది ఇరువదియొక్క విధము. అవి సప్తపాక యజ్ఞములు సప్తహవిర్యజ్ఞములు సప్తసోమసంస్థలు అనఁబడును. అందు స్మార్తాగ్ని యందు చేయఁబడు యజ్ఞములు పాక యజ్ఞములు, స్మార్తాగ్నియు ఔపాసనాగ్ని హవిర్యజ్ఞములును. సోమసంస్థలు రెండును, శ్రౌతాగ్నియందు చేయఁబడునవి. సోమరహితములు అయినవి, హవిర్యజ్ఞములు. ఈయజ్ఞములు నిత్యములు అనగా అకరణప్రత్యవాయ జనకములు. ఇది కాక అశ్వమేధము, రాజసూయము, పౌండరీకము, బృహస్పతిసవము మొదలయిన అభ్యుదయక యజ్ఞములు అనేకములు కలవు. యజ్ఞధాన వివరణము ఆపస్తంబసూత్రమునందు చెప్పఁబడి ఉండును మఱియు బ్రాహ్మణుఁడు నియతముగా చేయవలసిన యజ్ఞములు అయిదు కలవు. వానిని పంచయజ్ఞములు అని చెప్పుదురు. అవి దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్య యజ్ఞము, బ్రహ్మయజ్ఞము అనఁబడును. దేవయజ్ఞము అనగా ఔపాసనము. ఇందు సూర్యాగ్నులు అర్చింపఁబడుదురు. పితృయజ్ఞము అనగా శ్రాద్ధతర్పణములు. ఇందు పితృదేవతలు అర్చితులు అగుదురు. వసురుద్రాదిత్యులుగా ఉందురు కావున దానివలన పితృదేవతలకును, దేవతలకును ప్రీతి అగును. భూత యజ్ఞము బలిరూపముగా ఉండును. మనుష్య యజ్ఞము అన ఎవ్వరికైనను భోజనము పెట్టుట బ్రహ్మయజ్ఞము వేదాధ్యయనము. ఒక్క ఋక్కు అయినను బ్రాహ్మణుఁడు ప్రతిదినము పఠింపవలయును.

యజ్ఞవరాహావతారము: చూ॥ వరహావతారము.

యజ్ఞుడు : రుచి ప్రజాపతికిని స్వాయంభువు మనువు కూతురు అయిన ఆకూతికిని పుట్టిన కొడుకు. ఇతఁడు తన చెలియలు అగు దక్షిణను వివాహము అయ్యెను

అది మిథునము అగుటచే అది నిషిద్ధము కాదయ్యెను. ఇతనికి పన్నిద్దరు పుత్రులు. వారు యాములు అనబడుచురు. మరియు ఈ యజ్ఞుని విష్ణువు యొక్క అవతారము అందురు.

(భాగ)

**యతి** : (1) బ్రహ్మమానసపుత్రులలో ఒకడు ఇతడు ఊర్ధ్వరేతస్కుడు అయి చనెను.

(2) నహుషుని జ్యేష్ఠ పుత్రుడు. యయాతి యన్న. ఇతడు యోగిఅయి రాజ్యము వదలిపెట్టి పోయెను.

(భార)

**యతిరాజకవి** : ఇతడు హరినాటకమును చెప్పెను.

**యతిరాజు** : చూ॥ నా॥ రామానుజాచార్యులు.

**యదుగిరి** : మైసూరి చెంత ఉండు విష్ణుక్షేత్రము ఇది మేలుకోటకు ప్రాచీన నామము. దీనిని యాదవగిరి అనియు అందురు.

**యదువు** : యయాతి సుతుడు. చూ॥ యయాతి. ఇతని వంశస్థులే యాదవులు

(భార)

**యమ.డు** : కశ్యప ప్రజాపతి కొడుకు అగు వివస్వతుని లేక సూర్యుని కొమరుడు. ఇతడు అష్టదిక్పాలకులలో ఒకడు. మరియు పితృలోకమునకు అధిపతి. ఇతని దిక్కు దక్షిణము. భార్య శ్యామలాదేవి. పట్టణము సంయమని. వాహనము మహిషము. ఆయుధము దండము. దేహఛాయ నలుపు. ఇతనిని ధర్ముడు అనియు అందురు.

తొల్లి మార్కండేయు మహర్షి శివుని గూర్చి తపము ఆచరించుచు ఉండుతరి యముడు అతని పట్టి బంధించి నిజసదనమునకు కొనిపోవ సమకట్టెను. అప్పుడు శివుడు కోపగించి ఇతనిని తన్ని ఆఋషిని విడిపించెను.

(మార్క) (బ్రహ్మ)

**యమున** : ఒక నది సూర్యుని కూతురు. నా॥ కాళింది. దీని దాపున ఉండు గోకుల బృందావనములయందు శ్రీకృష్ణుడు అనేక లీలలు సలిపినట్లు తెలియవచ్చుచు ఉన్నది. దీని జలము, నల్లగా ఉండును.

(భాగ)

**యయాతి** : నహుషునికిని ప్రియంవదకును పుట్టిన ఏవురు కొడుకులలో ఒక్కడు. నహుషునికి అనంతరము ఇతడు మహాఖ్యాతితో రాజ్యము ఏలెను. ఇతడు శుక్రాచార్యుల కుమార్తె అయిన దేవయానను పెండ్లియాడి ఆమె యందు యదువు, తుర్వసువు అను ఇద్దరు కొడుకులను, వృషపర్వుని కూతురును, దేవయాని చెలికత్తెయును అగు శర్మిష్ఠయందు ద్రుహ్యుఁడు అనువు, పూరుడు, అను మువ్వురు కొడుకులనుకనియెను. మరియు ఇతని వివాహకాలమునకు శుక్రుడు దేవయానవలెనే సర్వవిషయములయందును శర్మిష్ఠను చూచుకొనుము శయన విషయమున మాత్రము శర్మిష్ఠను పరిహరింపుము అని నియమించెను. అందులకు ఇతడు ఒప్పుకొనియుండియు ఆ నియతి తప్పెను కనుక శుక్రుడు కోపించి నీవు యవ్వన గర్వముచే నా కుమార్తెను అవమానించితివి కావున ముసలివాడవు అగుము అని శపింపగా అతడు ఇంకను కొన్ని దినములు దేవయానతోడి విషయ భోగములను అనుభవింపవలయును అనుకోరిక ఉన్నది, మరల యౌవనము కలుగునట్లు అనుగ్రహింపుము. అని వేడగా నీకొడుకులలో ఒకనియందు నీముదిమిన్ని ఉంచి వాని యౌవనముకొని విషయ సుఖములు అనుభవింపుము. నీ ముదిమి తీసికొన్న కొడుకునకు నీ రాజ్యము ఒసగుము: అని ఆనతిచ్చెను. అట్లు శుక్రశాపము చేత ముసలితనమును పొంది తనకు ముసలితనము వచ్చిన విధమును తనకు కల విషయాభిలాషయు తన కొడుకులకు తెలియఁజేసి నాముదిమి నిక్కైకొనుము అని కొడుకులను అడిగెను. అందులకు పెద్దకొడుకులు నలువురును సమ్మతింపక పోయిరి. కడపటివాఁడు అయిన పూరుడు మాత్రము సమ్మతించెను. అంతట యయాతి వానివలన యౌవనమునుకొని తన మాట వినని కొమాళ్లను రాజ్యార్హులు కాకుండునట్లు శపియించి విషయానుభవమువలన తృప్తిపొంది, పూరుని యౌవనమును వానికిచ్చి తన ముదిమిని తానుకైకొని, వానిని రాజ్యాభిషిక్తునిజేసి తపస్సు చేయపోయెను. ఇట్లు యయాతి శాపముచే యాదవులు రాజ్యమునకు అనర్హులు అయిరి. అనంతరము ఇతఁడు అతిఘోరము అగు తపముచేసి ఆమహాత్మ్యమువలన బ్రహ్మలోకము మొదలుగాగల దేవలోకము లు అన్ని తిరిగి కడపట ఇంద్రలోకమునకు పోయి ఇంద్రునితో తన తపోమహాత్మ్యమును పొగడు కొనెను. అందులకు ఇంద్రుడు సహింపక ఆత్మస్తుతిచేసికొనువారు ఈలోకమున ఉండను అర్హులుకారు అని అతనిని అధోలోకమున పడద్రోసెను. అంత యయాతి భిన్నుడు అయి ఇంత కాలము తపముచేసి ఈలోకమునకు వచ్చి మరల భూలోకమునకు పోను. ఓపను

నన్ను మన్నించి అంతరిక్షమున సద్భువనము (నక్షత్రలోకమున) ఉండునట్లు అనుగ్రహింపుము, అని వేడగా అతడు అట్లే అనుగ్రహించెను. అట్లే అతడు నివసించెను. ఈ యయాతి కొడుకులలో జ్యేష్ఠుడు అగు యదువునుండి యాదవవంశము కలిగెను. (చూ॥ యాదవులు) రెండవ కొడుకుఅగు తుర్వసువునుండి పాండ్య, చోళ, కేరళ వంశములు కలిగెను. మూడవ కొడుకు అగు ద్రుహ్యునినుండి గాంధారవంశము కలిగెను. నాల్గవ కొడుకు అగు అణువు వంశస్థుడు అయిన ఉశీనరుని కొడుకు అగు శిబికి శౌవీరమద్రకేకయ అంబష్ఠ దేశాధిపతులుపుట్టిరి. ఆఉశీనరుని తమ్ముని వంశస్థుడు అగు బలికి అంగ, వంగ, కళింగ, పౌండ్ర దేశాధిపతులు పుట్టిరి. ఐదవ కొడుకగు పూరువునుండి బార్హదిష, పాంచాల, కౌరవ, రాజవంశములును, కాన్వయ గార్గ్యాది బ్రాహ్మణవంశములును, కలిగెను. అందు కురువంశస్థుడు అగు ఉపరిచరవసువునుండి మగధవంశము ఉత్పన్నము ఆయెను. (భార)

**యవనము** : ఒకానొక దేశము. దీనిని ఇప్పటివారు అరేబియా అందురు గ్రీకులనుకూడ యవనులనెడువారు.

**యవీనరుడు** : (1) పు॥ ద్విమీఢుని కొడుకు. (2) రెండవముద్గలుని తమ్ముడు.

**యశోద** : (1) కృష్ణుని పెంపుడు తల్లి. నందుని భార్య. (2) హస్తికుని భార్య.

**యశోవతి** : ఈశానునిపుట భేదనము.

## యా

**యాజ్ఞవల్క్యము** : అష్టాదశ స్మృతులలో ఒకటి. దీనికి విజ్ఞానేశ్వరయోగిచే రచింపబడిన "మితాక్షర" అను వాఖ్యానము ఒకటి కలదు. అది 'విజ్ఞానేశ్వరీయము' అని వాడబడును. కొందరు మూలగ్రంథమును సహితము వ్యాఖ్యానముతోడ చేర్చి విజ్ఞానేశ్వరీయము అని చెప్పుదురు. మరి కొందరు ధర్మశాస్త్రమునకు ముఖ్యుడు అయిన మనువుయొక్క గ్రంథనామముతోచేర్చి రెంటికిని సాధారణముగా మను విజ్ఞానేశ్వరీయము అని వాడుకొందురు.

**యాజ్ఞవల్క్యుఁడు**: ఋ॥ యజుర్వేద దురంధరుఁడు అయిన వైశంపాయనుని శిష్యుఁడు. ఇతఁడు గురుపునకు అపరాధముచేయగా ఆయన కుపితుఁడుఅయి తనవలన గ్రహించిన వేదములను మరల తనకు ఇచ్చి పొమ్మ్న అనిన అతఁడు తానుచదివిన యజుర్గణమును తనుక్త క్రమమున క్రక్కెను. అంత అది నెత్తుటివేత తడుపబడి నది అయి యెర్రని రూపముతాల్చెను అప్పుడు యజుర్గణ ధిష్ఠిత శాఖాధి దేవతలు చిత్తిరి పక్షులు అయి దానిభుజించిరి. అది మొదలు ఆశాఖలు తైత్తిరీయములు అయ్యెను. అనంతరము వేదపర్షిక్షుఁడు అగు ఈయాజ్ఞవల్క్యుఁడు అపరిమిత విచారమునుపొంది ఉగ్రతపమున సూర్యుని సంతుష్టుని కావింపగా అతఁడు సంత సిల్లి హయరూపముతో సాక్షాత్కరించి యజుర్గణమును అతనికి ఉపదేశించెను. కావున అది వాదిసనేయ శాఖ అని చెప్పబడును. దానినే శుక్లయజుస్సు అనియు చెప్పుదురు. (బ్రహ్మ) (విష్ణు)

**యాజుఁడు** | : ఒకానొక ముని. ఇతని అనుగ్రహమున ద్రుపదరాజునకు అగ్ని కుండమున ధృష్టద్యుమ్నుఁడు అనుకొమారుఁడును, కృష్ణ అను కొమార్తెయు కలిగిరి. (భార)

**యాదవ నిఘంటువు**: ఒక సంస్కృత నిఘంటువు.

**యాదవులు** : యదు వంశస్థులు. యాదవవంశము అనేక శాఖలుకలిగి మిక్కిలి ప్రసిద్ధులు అగు రాజులను పలువురను కలిగి ఉండెను. అందు యదువునకు జ్యేష్ఠ పుత్రుఁడు అయిన సహస్రజిత్తునుండి హేహయ వంశము ఆయెను. వారికి మాహిష్మతి ముఖ్యపట్టణము. ఆవంశమున కార్తవీర్యార్జునుఁడు మిగుల ప్రసిద్ధికి యెక్కినరాజు. అతని వంశస్థులు తాళజంఘులు అనుపేర వెలసిరి. యదుని రెండవ పుత్రుఁడుఅగు క్రోష్టువు వంశమున ప్రసిద్ధికియెక్కిన రాజులు శశిబిందువు, జ్యామఘుఁడు, విదర్భుఁడు, వారలలో విదర్భుఁడు విదర్భ రాజవంశస్థాపకుడు ఆయెను. ఆతని మూడవ కొమరుని నుండి చేదివంశమువచ్చెను. రెండవ కొమరుని వంశస్థుఁడు అగు సాత్వతుని నుండి భోజవంశమును, అంధక వంశమును, వృష్ణి వంశమును కలిగెను. అందు భోజవంశస్థులు ధారాపురాధిపులు అయిరి. అంధక వంశమున కృష్ణుఁడు పుట్టెను. వృష్ణివంశమున సత్రాజిత్తును, సాత్యకియు పుట్టిరి. క్రీ॥శ॥ 15వ శతమున కృష్ణానదికి దక్షిణ భాగమునకల రాష్ట్రము అంతయు పాలించుచు ఉండిన విద్యారణ్యము (విజయనగరము) రాజులు యాదవ వంశస్థులు

అని తోచుచు ఉన్నది. ఈ వింధ్యారణ్యపు రాజులకు లోపడి ఉండిన చంద్రగిరి సంస్థానము వారివద్దనుండి ప్రప్రథమమున ఇంగ్లీషువారు చెన్నపురియందు చేరుటకు అనుమతి పడసిరి.

**యామి** : నా॥ జామి. రెండవ దక్షప్రజాపతి కూతురు. ధర్ముని భార్య. ఈమెకు దుర్గభూములకు అధిష్ఠానదేవత జనియించెను. చూ॥ నాగవీధి.

**యాముడు** : యజ్ఞుని కొడుకులు వీరు పన్నిద్దరు. స్వాయంభువ మన్వంతరమునందలి దేవతలు.

## యు

**యుగంధరుడు** : (1) సాత్యకి వంశస్థుడు అగు ఒక యాదవుడు. (2) ప్రతాపరుద్రుని మంత్రి. అతి యుక్తిశాలి.

**యుగములు** : కృత త్రేతద్వాపరకలినామకములు అగు నాలుగు యుగములు. వీని పరిమాణము సంధి సంధ్యాంశకాలములతో కూడ పండ్రెండువేల దివ్యసంవత్సరములు మరియు ఒక దివ్య సంవత్సరముకు మున్నూటఅరవై మానుష వత్సరములు కనుక నాలుగు యుగములకు 4320000 మానుషవత్సరములు అగును. ఈనాలుగు యుగములుచేరి ఒక మహాయుగము అనబడును. అందు కృత యుగమునకు 1728000 సంవత్సరములు. త్రేతాయుగమునకు 1296000 సంవత్సరములు ద్వాపరయుగమునకు 864000 సంవత్సరములు. కలియుగమునకు 432000 సంవత్సరములు అందుమహాయుగ పరిమాణము 4320000 మానుషసంవత్సరములు. ఇట్టి మహాయుగములు ఒకవెయ్యికాగా చతుర్ముఖ బ్రహ్మకు ఒకపగలు మరియు ఒకవేయి ఒకరేయి అగును. అట్టిదినములు మున్నూటఅరవై అతనికి ఒక సంవత్సరము అగును. అట్టి నూరుసంవత్సరముల కాలము అతని ఆయుష్కాలము. అందు ముందటి 50 సంవత్సరములు పాద్మకల్పము అనియు వెనుకటి 50 సంవత్సరములు వరాహకల్పము చెప్పబడును, ఇప్పుడు నడచునది వారాహ కల్పము.

బ్రహ్మయొక్క ఒక్కొక్క పగలు పదునాలుగు మన్వంతరములు అగును. ఆయా మన్వంతరమున వెలయు దేవతలు దేవేంద్రులు సప్తరుషులు మొదలగువారు

ఆయామనుమన్వంతరమునవేపుట్టిగిట్టెదరు. మరియు బ్రహ్మకు రాత్రిప్రళయముఅని బడును. ఆ ప్రళయకాలమున భూలోక, భువర్లోక, స్వర్లోకములు అనెడి మూడులోకములు జలములో మునిగిన మహర్లోకవాసులు తాపమును ఓర్వనేరక జనలోకముచేరి ఉందురు. కృతయుగమున నాలుగు పాదములను, త్రేతాయుగమున మూడుపాదములను ద్వాపరయుగమున రెండుపాదములను కలియుగమున ఒకపాదమునను ధర్మము ప్రవర్తిల్లును. మెండియు కృతయుగమున ధ్యానము, త్రేతాయుగమున ధ్యానయజ్ఞములు ద్వాపరయుగమున యజ్ఞమును కలియుగమున దానమును ఆచరించుట శ్రేయస్కరము అని చెప్పుదురు.

యుధాజిత్తు : (1) య॥ వృష్ణి రెండవ కొడుకు. ఇతని కొడుకులు శిని అనమిత్రుడు. 2. కేకయదేశాధిపతి. దశరధునిభార్య అగు కైకేయి సహోదరుడు భరతుని మేనమామ. ఇతని పట్టణము గిరివ్రజము.

యుధిష్ఠిరుడు : కు॥ ధర్మరాజునకు పేరు.

యుయుత్సుడు ; ధృతరాష్ట్రునికి వైశ్య స్త్రీయందు పుట్టిన కొడుకు. ధృతరాష్ట్రునికి పిమ్మట ఇంద్రప్రస్థమునకు ఇతడు రేడు ఆయెను. (భార)

యుయుధానుడు : య॥ సా॥ సాత్యకి.

యువనాశ్వుడు : (1) ఇ॥ ఇందుని కొడుకు. శబస్తుని తండ్రి. (2) ఇ॥కృతాశ్వుని కొడుకు. కృతాశ్వునికి సేనజిత్తుఅను నొక పుత్రుడు ఉండినట్టును, అతని పుత్రుడు ఇతడు అనియు కొందరు చెప్పుదురు. మరికొందరు, ఇతడుఅరుణాశ్వుని పుత్రుడు అని చెప్పుదురు. మాంధాంత తండ్రి. ఇతడు తనకు చిరకాలము పుత్రసంతానములేకఉండగా అందుకై ఇంద్రయాగముఒకటి సల్పిపెను. ఆ యాగకాలమున ఇతనిభార్యకొరకై మంత్రించి ఉంచిన జలమును ఇతడు తెలియక రాత్రివేళ అతి పిపాసాతురుడు అయి పానము చేసినందున తనపత్ని ధరియింపవలసిన గర్భమును తాను ధరియింపవలసివచ్చెను. అదికారణముగా మాంధాత ఇతని గర్భమును చీల్చుకొని బయలువెడలెను. అప్పుడు తల్లి ఆ శిశువునకు పాలు ఇచ్చుటకు వల్ల లేకపోయినందున ఇంద్రుడు తనవ్రేలుకుడిపించి పెంచెను, దానఁజేసి అతడు మాంధాత అనబడెను. (భార)

## యూ

**యూపాక్షుడు** : ద. రావణుని సేనాపతులలో ఒకడు. ఇతడు హనుమంతునిచే అశోకవనమునందు పొలియింపబడెను.

## యో

**యోగము** : ఇంద్రియములను వశపరచుకొని చిత్తము ఈశ్వరునియందు లయింపచేయుట. ఇది సౌఖ్యమునకు సాధకము.

**యోగశాస్త్రము** : పతంజలిచే యేర్పరుపబడినది.

**యోగసిద్ధి** : అంగిరసుని కూతురు, బృహస్పతి చెలియలు. ప్రభాసుని భార్య విశ్వకర్మ తల్లి. (భాగ)

## యౌ

**యౌవనాశ్వుడు** : ఇ. అంబరీషుని కొడుకు. హరితుని తండ్రి.

**యౌవనుడు** : ప్ర. ధీమంతుని కొడుకు.

## ర

**రంగనాథుడు** : ఒక ఆంధ్రకవి. ఇతడు రామాయణమును ద్విపద కావ్యముగ తెనిగించెను. ఆ రామాయణము రంగనాథ రామాయణము అనబడును.

**రంగరాజు** : ఒకానొక ఆంధ్రకవి. ఇతడు భానుమతి పరిణయమును రచియించెను.

**రంతిదేవుడు** : పు. సంకృతి కొడుకు. ఇతడు తన సంచితార్థమును అంతయు దీనులకు ఇచ్చి అడవుల తిరుగుచు ఒకప్పుడు మిక్కిలి అలసి కడు దప్పితోను, క్షుత్తుతోను భుజింపబోవు తరిని ఒక బ్రాహ్మణుడు భిక్షము అడుగవచ్చెను. అపుడు అతనికి తన యన్నములో అర్ధభాగము ఇచ్చెను. తోడనే మఱియొక బ్రాహ్మణుడును అర్థి అయి వచ్చెను. అప్పుడు ఇతడు మిగిలియున్న అన్నములో అర్థభాగము అతనికి పెట్టెను. అటుపిమ్మట మఱియొకడు వచ్చి ఆకటి కొంటిని అన్నము పెట్టుము అని అడిగెను. అంతట అతనికి తక్కిన అన్నమున

అంతయు ఇచ్చివేసెను. మరికొంతసేపటికి ఇంకొక అతిథివచ్చి మిక్కిలి దప్పి అగుచు ఉన్నది అని ఇతఁడు ఉంచుకొనిఉన్న జలమును త్రాగిపోయెను. అట్లు అన్నపానీయములు రెండును తనకుదక్కకపోగా ఇతఁడు తనకు ఒదవిన ఆకలిదప్పులకు ఓర్చి ఈశ్వరధ్యానము చేయుచు నిర్విచారముతో ఉండగా బ్రహ్మాది దేవతలు ఇతని ధార్మికత్వమునకు మిగులమెచ్చుకొని ప్రసన్నులు అయి ఇతనికి మోక్షము ఇచ్చి చనిరి. (భార) (భాగ)

రంభ : ఒక అప్సరస, ఈమె రూపరేఖాలావణ్యాదుల యందు మిగుల పేర్కొనబడినది. (దే. భా)

రంభుడు : ఆయువు పుత్రుఁడు. పురూరవుని పౌత్రుఁడు. నహుషుని యనుజుఁడు. (దే. భా)

రక్తబీజుఁడు : ది శుంభనిశుంభుల తోడఁబుట్టిన దాని కొడుకు. వీని దేహము నందలి రక్తము స్రవించెనేని ఆరక్తము ఎన్ని బిందువులు నేలపడునో అన్నికోట్ల రక్కసులు పుట్టుదురు . కనుక కాళికాదేవి వీనిని చంపునపుడు కరాళవక్త్ర అయి వీని రక్తము ఒకబిందువు అయినను నేల బడకుండ పానముచేసి వీనిని చంపెను. (దే. భా)

రఘువు : ఇ। దీర్ఘబాహుని కొడుకు. అజుని తండ్రి. (రా. మా)

రచన : దితి కూతురు. త్వష్టభార్య.

రజస్సు : అనేనస్సు వంశస్థుఁడు. త్రికకుత్తుతండ్రి.

రజి : ఆయువు పుత్రుఁడు. పురూరవుని పౌత్రుఁడు. నహుషుని తమ్ముఁడు. ఇతనికి ఏనూర్గురు పుత్రులు కలరు. వారు మహాబలాఢ్యులు. దేవతల చేత ప్రార్థింపబడి ఈతఁడు దైత్యులను జయించి దేవేంద్రునకు స్వర్గమును ఇప్పింపగా ఇతని పుత్రులు స్వర్గాధిపత్యము దేవేంద్రునకు ఇయ్యక తామే అనుభవింప ప్రయత్నించినందున ఇంద్రుఁడు వారిని అందరను నిర్మూలము చేసెను (మత్స్య)

రజుఁడు : ప్రి। విరజుని కొడుకు.

రతీదేవి : మన్మథుని భార్య. చూ। మాయావతి.

రత్నసానువు : మేరుపర్వతమునకు పేరు. రత్నములు ఉండెడు చరులు కలది అని అర్థము.

రత్నాపణము : ప్రతాపరుద్రీయమునకు వ్యాఖ్యానము.

రత్నావళి : శ్రీహర్షదేవుఁడు అనుపేరుగల కాశ్మీరదేశపురాజు చే విరచితము అయిన ఒక సంస్కృత నాటకము. ఇందు పాండవ వంశస్థుఁడగు ఉదయనుఁడు అనురాజుయొక్క చరిత్రము చెప్పఁబడిఉండును.

రథీతర ' క్షత్రులు : రథీతరుని భార్యలయందు ఆంగిరసుఁడు అను మునీంద్రుడు పుట్టించి బ్రహ్మతేజోధనుల సంతతి వారు.

రధీకరుఁడు : ఇక్ష్వాకుని తమ్ముఁడు అగు నభగుని వంశస్థుఁడైన అంబరీషుని పుత్రుఁడు అగు విరూపుని పౌత్రుఁడు.

రవిపుత్రుడు : కృ॥ జయత్సేనుని కొడుకు

రభసుడు : (1) ఆయువు పౌత్రుఁడు రంభుని పుత్రుఁడు. గంభీరుని తండ్రి.

(2) ఒకానొక నొక సంస్కృత నిఘంటువు చేసిన పండితుఁడు. ఇతఁడు చేసిన నిఘంటువునే రభస కోశము అందురు.

రస : (భారతరీత్యా) ప్రజాపతిభార్య. అహఁడు అను వసువుయొక్కతల్లి.

రసనిరూపణము : ఒక అలంకార గ్రంథము. ఇది శృంగార రస నిరూపణము, అష్టరస నిరూపణము. భావనిరూపణము అను భాగములు కలిగి ఉండును.

రసరత్నాకరము : ఒక రసవాద గ్రంథము. నవరత్నములు, పంచలోహములు, గంధకము మొదలైన వానిని భస్మము చేయుటను, కరగించుటను, గురించిన విషయములు ఇందు చెప్పబడిఉండును. ఇదినిత్యనాథ సిద్ధునిచే చేయబడినది.

రసాతలము : ఒక అధోలోకము. ఇది పర్వతమయము. అయి ఉండును. దీనికి వాసుకిరేడు అయి ఉండు. దీనికి ముఖ్యపట్టణము భోగవతి. ఇంకే వామనునిచే అణగద్రొక్కఁబడిన బలియు నివసించుచుండును. కనుకనే బలి సద్మము అనియు దీనికి ఒకపేరు వాడబడుచు ఉన్నది.

# రా

రాక : (1) ధాతభార్యలలో ఒకతె (2) ర॥ సుమాలి కూతురు. విశ్రవసునిభార్య. ఖరదూషణ త్రిశిరసుల తల్లి.

రాక్షసులు : వీరును యక్షులును కశ్యపునికి సురసయందు జన్మించినవారు. వీరు పుట్టినతోడనే క్షుత్పిపాసలచేత పీడితులు అయి కొందరు యక్షామ అనియు మరి కొందరు రక్షామ అనియు పలికిరి. అది కారణముగ యక్షులు అనియు రక్షస్సులు లేక రాక్షసులు అనియు వీరుపేరు పొందిరి.

రాజధర్ముఁడు : చూ॥ నాడీజంఘుఁడు.

రాజరాజ నరేంద్రుఁడు : } వేగిదేశాధిపతి చూ॥ నన్నయభట్టారకుఁడు.

రాజాధిదేవి : వసుదేవుని చెల్లెలు. జయత్సేనునిభార్య. ఈమె కొమరులు విందాను విందులు.

రాజు : చంద్రునకు నామము.

రాధ : (1) శ్రీకృష్ణునికి ప్రియురాలు. నందుని చెల్లెలు.

(2) కర్ణుని పెంపుడు తల్లి. ఈమెచే పెంపబడుటచేతనే కర్ణుఁడు రాధేయుఁడు అనబడెను.

రామకృష్ణుఁడు : (తెనాలి) ఒక ఆంధ్రకవి. ఇతని ఊరు తెనాలి. ఇతఁడు కృష్ణదేవరాయలవద్ద ఉండిన ఎనమండ్రు కవులలో ఒకఁడు. సమయోచిత వాక్యనిర్వాహక మహాశక్తి కలవాడు. ఇతఁడు పాండురంగ మహాత్మ్యము అనఁబడు మహాకావ్యమును రచించెను. అందలి వర్ణనాదులు విలక్షణముగా ఉన్నయవి. కూర్పు మిగుల మనోజ్ఞము అనుటకు "పాండురంగ విభుని పదగుంభనంబును" అనువాక్యము నిదర్శనము. మరియు నితఁడు నిరోష్ఠ్యరామాయణాది చిత్ర కావ్యములు కొన్ని చేసినట్లు వినుచున్నాము. అవి ప్రస్తుతము ఎక్కడను దొరకలేదు. మరియు ఈ రామకృష్ణుఁడు వికటకవి అనియు రాయలవారి సభలో హాస్యకారుఁడుగా ఉండెను అనియు, ఇతని విషయమై అనేక కథలు వాదబడుచు ఉన్నవి.

నేటి చరిత్ర కారుల స్థలకాల నిర్ణయములు జనశ్రుతిచే భేదింపఁ చున్నవి.

రామగిరి : నాగపురము చెంత ఉండు ఒక కొండ.

రామభద్రుడు : ఒక ఆంధ్రకవి. ఇతడు కృష్ణదేవరాయలవద్ద కవులు ఎనమండ్రులో ఒకడు. రామాభ్యుదయము అను మహాకావ్యమును ఇతడు రచించెను.

రామమంత్రి : ఒకానొక ఆంధ్రకవి. ఇతడు ఆధునిక కవులలో ఒకడు. ఇతనిచే దశావతార చరిత్రము రచియింపబడెను.

రామరాజ భూషణుడు : } చూ॥ నా॥ భట్టుమూర్తి.

రామానుజాచార్యులు: విశిష్టాద్వైత మతోద్ధారకుడు. ఈయన ఎనమన్నూరు సంవత్సరములకు ముందు అవతరించినట్లు తెలియవచ్చెడిని. ఈయన తండ్రి ఆసూరికేశవాచార్యులు. తల్లి కాంతిమతి. జన్మస్థానము చెన్నపురికి సమీపమున ఉండు శ్రీ పెరుంబూదూరు. (భూతపురము) విద్యాభ్యాసము చేసినచోటు కాంచీపురము సకల శాస్త్రములను యాదవ ప్రకాశులు అను అద్వైతమతావలంబి అగు సన్యాసి వద్ద చదివి వానికెల్ల విశిష్టాద్వైతపరముగా అర్థము సాధించి ఆ మతమునుస్థాపించి పిమ్మట త్రిదండసన్యాసి అయి యతిరాజు అని పేరుపొంది మేలుకోటి (తిరునారాయణపురము) శ్రీరంగము తిరుపతి మొదలగు అనేక దివ్యస్థలములయందు మఠములను ఏర్పరచి అచ్చటచ్చట వైష్ణవమతమును స్థాపించెను. వెండియు ఈయన బహుదేశాటనముచేసి పలుమతములవారిని జయించి శిష్యసంఘమును సంపాదించి తన మతమును వృద్ధిపొందించెను. ఈయన వ్యాససూత్ర భాష్యము, గీతాభాష్యము, తర్కభాష్యము, వేదార్థసంగ్రహము, న్యాయామృతము, వేదాంత ప్రదీపము, వేదాంత తత్వసారము, నారదీయ పాంచరాత్రాగమము, రంగనాథస్తవము, గద్యత్రయము, మరియు స్వరూపగ్రంథము రచియించెను. కనుక ఈయనకు భాష్యకార్లు అనియు, యంబెరుమానారు అనియు నామధేయము కలిగెను.

ఈ రామానుజాచార్యులు శేషాంశసంభూతుడు. ఈయనకు ముందు విశిష్టాద్వైతము ప్రతిపాదించినవారు కొందరు కలరు. వారిలో ముఖ్యులు పన్నిద్దరు.

1. సరోయోగి (పోయ్‌హైయాళ్వారు.) ఈయన కంచియందలి పోయ్‌హై అను పుష్కరిణియందు ఒక బంగారు తామరపువ్వులో ద్వాపరయుగాంతము నందు పాంచజన్యాంశమున అయోనిజుడై జనించెను,

2. భూతయోగి. (పూదత్తాళ్వారు.) ఈయనకు సరోయోగి అవతరించిన మరునాడు మల్లాపురి (తిరుక్కడల్ మల్లై) అను గ్రామమునందు ఒక సరస్సునందలి నల్లి కలువ పూవునందు గదాంశమున అయోనిజుఁడై అవతరించెను.

3 మహాయోగి (పేయాళ్వారు) ఈయన భూతయోగి అవతరించిన మరునాడు మాయూరము. (మామైలై నగరు) అను ఊరియందు ఒక సరస్సునందలి ఎఱ్ఱ కలువ పూవునందు నందకాంశమున అయోనిజుఁడు అయి అవతరించెను.

4. భక్తిసారుఁడు (తిరుమళి శైయాళ్వారు) ఈయన మీద చెప్పిన ముప్వురును అవతరించిన మూడు నెలలకు మహీసారక్షేత్రము (తిరుముషి) అనుచోట తపస్సు చేయుచున్న భృగుమహర్షికి ఇంద్రునిచే ప్రేరేపింపఁబడి ఆ ఋషిని మోహింపఁజేసిన అప్సరవలన చక్రాంశసంభూతుఁడు అయి జనించెను భగవద్భక్తుఁడును బిడ్డలులేని వాడును అగు ఒక మేదరవాఁడు వెదుక్క తి. అచ్చటికివచ్చి ఆ శిశువును తనయింటికి ఎత్తుకొనిపోయి పెంచెను.

5. శఠారి. (నమ్మాళ్వారు) ఈయన కలియుగాదిని కురుకాపురి, (తిరుక్కురుగై) అను గ్రామమునందు, కారి, అనుపేరుగల సచ్ఛూద్రునికి ఉదయనంగై అను భార్యయందు విష్వక్సేనాంశమున జనియించెను. అట్లు అవతరించి ఎల్లశిశువుల వలె స్తన్యపానముచేయక అభివృద్ధి పొందెను.

6. పరాంకుశదాసుఁడు (మధురకవి ఆళ్వారు) ఈయన ద్వాపరయుగాంతమున పాండ్యదేశమునందలి తిర్కుకోళూరు అను గ్రామమునందు ఒక పురశ్చూడుడు (ముందరి జుట్టువాఁడు) అగు బ్రాహ్మణునికి కుముదాంశమున జనించి సామ వేదాధ్యాపకుఁడు అయి దివ్యదేశయాత్ర చేయుచు అయోధ్యకుపోయి ఉండెను. అప్పుడు ఇచ్చట దక్షిణ దేశమునందు నమ్మాళ్వారు అవతరించి ఆ తేజస్సు తనకు కనబడగా అందుండివచ్చి నమ్మాళ్వారువల్ల తత్వవిషయమును గ్రహించెను.

7. కులశేఖరాళ్వారు. ఈయన కలియుగాది యందు ధృఢవ్రతుడు అను రాజునకు పుత్రుఁడు అయి కౌస్తుభాంశమున అవతరించి ధనుర్వేదాది విద్యలు నేర్చి, పరమ జ్ఞానసంపన్నుఁడై భగవత్ కటాక్షమును పొందెను.

8. విష్ణుచిత్తుఁడు (పెరియాళ్వారు) ఈయన కలియుగాదియందు శ్రీ విల్లిపుత్తూరు అను గ్రామమునందు ఒక పురశ్చూడుఁడు అను వైష్ణవునకు గరుడాంశమున పుత్రుఁడై అవతరించి వేదవేదాంగములెల్ల నభ్యసించి అచ్చటి వటపత్రశాయి అను విష్ణుమూర్తికి తులసి కైంకర్యము చేయుచు ఉండి పాండ్యదేశపురాజు నొద్ద పరతత్వ నిర్ణయముచేసి బహుమతి పడసి పిదప లక్ష్మీపతి అగు శ్రీమన్నారాయణుని ప్రత్యక్షముచేసికొని తులసివనమునందు అయోనిజయై జనించి తన కుమార్తె అయిన ఆముక్తమాల్యదను (చూడికొడుత్త నాచ్చారును.) ఆదేవునికి భార్యగా సమర్పించి కృతార్థుఁడు అయ్యెను.

9. గోద. (చూడికొడుత్తాల్) ఈమె కలియుగాదిని శ్రీవిల్లిపుత్తూరియందు విష్ణుచిత్తునియొక్క తులసిపత్రమునందు అయోనిజయై భూమ్యాంశమున జనించి ఆ పెరియాళ్వారుచే పెంపఁబడి ఆయన పెరుమాళ్ళకు కట్టికొనిపోయెఁడు తులసిమాలలు తాను ముందు ధరించి పిమ్మట పూలబుట్టలో పెట్టుచు వచ్చి కడపట అ పెరుమాళ్లకు భార్య అయ్యెను. కనుక ఈమె ఆడుది అయినను తక్కిన ఆళ్వారులలో చేర్చి యెన్నఁబడును.

10. భక్తాంఘ్రిరేణువు. (తొండరడిప్పొడియాళ్వారు) ఈయన కలియుగమున పుట్టిన ఇన్నూరేండ్లకు పిమ్మట చోళదేశమునందు మండంగుడి అను గ్రామమునందు ఒక పురశ్చూడ వైష్ణవునకు పుత్రుఁడై వనమాలాంశమున జనియించి విప్రనారాయణుఁడు అను పేరువహించి భగవత్ కైంకర్యపరుఁడై కాలము గడపెను.

11. మునివాహనుఁడు.(తిరుప్పాణాళ్వారు)ఈయన కలియుగము పుట్టిన మున్నూరు యేండ్లకు పిమ్మట చోళదేశమునందలి నిచుళాపురము (ఉరయూరు) అను గ్రామమునందు వడవలిగంటలలో అయోనిజుఁడు అయి శ్రీవత్సాంశమునందు జనియించి బిడ్డలులేనివారైన చండాలదంపతులచే పెంపఁబడి వీణాగానము నందు నిపుణుఁడై భగవన్నామ స్మరణచేసి కృతార్థుఁడు అయ్యెను.

12. పరకాలుఁడు. (తిరుమంగైయాళ్వారు) ఈయన కలియుగముపుట్టిన నన్నూరు సంవత్సరముల కాలమున తిరువాలిత్తిరునగరు అను గ్రామమునందు నీలుఁడను అను ఒక శూద్రునికి పుత్రుఁడై అవతరించి ధనుర్విద్య మొదలగు అనేక విద్యలు నేర్చి చోళరాజు నొద్ద కొంచపాటి అధికారము

ఒకటి సంపాదించుకొని తనకు తగిన నలుగురు మంత్రులను చేర్చుకొని మెలగుచు అయోనిజయై జనించిన కుముదవల్లి అను కన్యకమ వివాహము అగుట కొఱకు దొంగిలించియు మోసపుచ్చియు ధనమును ఆర్జించి శ్రీరంగపురంగనాథుని దేవాలయగోపుర ప్రాకారాదులను కట్టించి ఆమెను పెండ్లాడి పరమ భాగవత భక్తుఁడు అయి ముక్తుడు అయ్యెను. ఈ చెప్పబడినవారే పన్నిద్ద ఱాళ్వారులు అనఁబడుదురు.

రామాయణము : రాముని చరిత్రమును తెలిపెడి ఇతిహాసము. ఇది సంస్కృతమున వాల్మీకి మహామునిచే రచియింపఁబడెను. దీని రచనకు మునుపు ఇట్టి పద్య కావ్యము లేనందున, ఇది ఆదికావ్యము అని పేర్కొనఁబడుచున్నది. మఱియు ఇది బాలకాండము, అయోధ్యకాండము, ఆరణ్యకాండము, కిష్కింధాకాండము, సుందరకాండము, యుద్ధకాండము, అని యేడు కాండములు కలది. దీని గ్రంథ సంఖ్య ఇరువదినాలుగువేలు. ఒక్కొక్కవేయిని మొదటి శ్లోకము ఒక్కొకచో గాయత్రీ మంత్రాక్షరములచే ఆరంభింపఁబడి, ఉండుటనుఁ బట్టి ఇది గాయత్రీ రూపము అని అందురు. దీనిని తెనుగున అనేకులు అనేక రూపముల రచించి యున్నారు. చూ॥ భాస్కరరామాయణము.

రాముడు : విష్ణువు యొక్క దశావతార మూర్తులలో ఏడవమూర్తి. ఇతఁడు ఇక్ష్వాకువంశసంభవుఁడు అగు అజమహారాజు కొడుకు అయిన దశరథునికి కౌసల్య యందు జనించిన పుత్రుఁడు. భార్య సీత. తమ్ములు భరత లక్ష్మణ శత్రుఘ్నులు. ఇతఁడు భార్యతోను, తమ్ముఁడు అగు లక్ష్మణునితోను పితృవాక్య పరిపాలన చేయుటకు పదునాలుగు సంవత్సరములు అరణ్యవాసముచేసి రావణకుంభకర్ణాది రాక్షసులను చంపి దండకారణ్యవాసులు అగు బ్రాహ్మణులకుసుఖము కలుగ జేసెను. మఱియు ఇతనికి దశరథుని కొమరుఁడు అగుటచే దాశరథియని కకుత్స్థునివంశమున జనించుటచే కాకుత్స్థుడనియు రఘుకులమునందు పుట్టినందున రాఘవుఁడు అని యునామములు కలిగెను. ఈతఁడు దండకారణ్యమున నుండునపుడు సీతను రావణుడు యెత్తికొనిపోగా భార్యను వెదకుచుపోయి ఋష్యమూక పర్వతమునందు సుగ్రీవునితో సఖ్యముచేసి, అతనిని ఇల్లు వెడలగొట్టిన అతని అన్న అగు వాలినిచంపి వానరరాజ్యమునకు అతనిని రాజుగాచేసి అతని సహాయమున లంక ప్రవేశించి రావణునితో యుద్ధముచేసి చంపెను. రావణుని చంపునపుడు రామునకు నలువది వత్సరముల ప్రాయము అని యెఱుఁగునది.

పూర్వము దేవాసురుల యుద్ధమున దైత్యులకు క్షేమము కోరుచు ఉండిన భృగు మహర్షి పత్నిని విష్ణువు శిరచ్ఛేదముచేసెను, అనికోపించి విష్ణువును మానవుడుగా పుట్టునట్లును పత్నీవియోగ దుఃఖమును అనుభవించునట్లును శపించినందున రాముఁడు కేవలమనుష్యమాత్రుఁడు అయి సీతావియోగదుఃఖమును అనుభవించెను. (రామా)

రామేశ్వరము : శ్రీరాముఁడు రావణునిచంపినపిదప సేతువునెంబడి శివలింగమును ప్రతిష్ఠచేసి పూజసలిపిన స్థలము. ఈలింగమును దర్శనముచేసినవారిని చెంది ఉండు మహాపాతకములు తొలఁగిపోవును అని ప్రసిద్ధి.

రావణుఁడు : రాక్షసులరాజు. ఇతని రాజధానిలంక. తండ్రి పులస్త్యుని కొడుకు అగు విశ్రవసుఁడు తల్లి సుమాలి కూతురుఅగు కైకసి. భార్య మయుని కూతురు అగు మండోదరి. సోదరులు కుంభకర్ణవిభీషణులు. కొడుకులు ఇంద్రజిత్తు మొదలగు వారు. ఇతనికి పదితలలు ఉండుటచే దశకంఠుఁడు, దశగ్రీవుఁడు అను నామధేయ ములు కలిగెను. మఱియు ఇతఁడు, మహత్తరము అగు తపముసలిపి బ్రహ్మవలన తనకు మనుష్యులు తప్ప తక్కినవారిచే చావులేకుండ వరముపొంది ఆ వరప్రభావ ముచే మిగుల గర్వితుఁడు అయి త్రిలోకములయందు ఉండు సాధువులను ఎల్ల వారిని మిగుల హింసపెట్టుచు ఉండెను. ఆ హింసలకు ఓర్వఁజాలక మునులును దేవతలును బ్రహ్మచెంతకుపోయి మొరలిడిరి,

అప్పుడు బ్రహ్మవారిని పిలుచుకొని పాలసముద్రమున ఉండు విష్ణువు దగ్గఱకు పోయి ప్రార్థింపగా అతఁడు మనుష్యరూపమున శ్రీరాముఁడు అనుపేర భూమిని అవతరించి ఈ రావణుని చంపెను. చూ॥ జయవిజయులు. ఈ రావణుఁడు దిగ్వి జయముచేయ బయలుదేరినపుడు తొలుత కుబేరునితో తలపడి యుద్ధమునందు జయము పొంది అతని విమానముఅగు పుష్పకమును అపహరించుకొని దానిపై యెక్కి సంచరించుతఱిని అది కైలాసగిరి సమీపమున నిలుపఁబడగా అందులకు కారణము విచారించి శివుని మహిమ అని నందివలన యెఱిగి నా విమానమును అడ్డ గించిన శివుని కొండతోడ యెత్తిపాఱవైతును గాక అని కైలాసమును పెల్లగించు నట్లు ఎగరవైవ నారంభించెను.

అప్పుడు ఆకొండపై ఉన్న శివుఁడు తన కాలి పెనువ్రేలితో ఆ కొండను అదుమగా వీని చేతులు దాని క్రింద చిక్కుకొని ఊడదీసికొన కూడకపోయెను. ఆబాధచే వీడు చిరకాలము గొంతెత్తి ఏడ్చి ఏడ్చికడపట శివుని పలుదెరగుల స్తుతి

చెను. అంత అతఁడు కరుణార్ద్ర చిత్తుఁడు ఆయి తన కాలి వ్రేలిని ఎత్తగా వీఁడు తన చేతులను ఊడదీసికొనెను, ఇట్లు ఆ కొండ క్రింద చేతులు తగులకోగా వీఁడు గొప్ప ధ్వనితో రోదనము చేసినందున వీనికి రావణుఁడు అను పేరు కలిగెను. ఇది కాక ఈ రావణుఁడు ఒకానొకప్పుడు వాలితో యుద్ధము చేయకోరి కిష్కింధకు పోయి అచ్చట వాలిని కానక అతఁడు దక్షిణ సముద్రమునకు స్నానార్థముపోయి ఉన్నారు అని విని అచటికిపోయి చూచి సంధ్యవార్చుచు ఉన్న అతని వెనుక ప్రక్కజేరి మెల్లిమెల్లిగాపోయి పట్టుకొన యత్నింపగా అతఁడు అది తెలిసికొని రావణుని చేతులు తన సంగిట చొప్పింపబడునంతవరకు కదలక మెదలక ఉండి సందిట అదిమిపట్టుకొని నాలుగు సముద్రముల యందు ముంచి అలయించి పిమ్మట ఏమి ఎరుగని వానివలె దిగవిడిచి దశగ్రీవా ఎక్కడనుండి వచ్చితివి అని పరిహసించెను. అంతట రావణుఁడు లజ్జితుఁడు ఆయి ఆతనితో స్నేహముచేసి ఆవల పోయెను. మరియొక సమయమున కార్తవీర్యార్జునునితో పోరాడవలెననిపోయి అతని చేత చెరసాలలో ఉంచబడెను. చూ॥ కార్తవీర్యార్జునుఁడు.

మరియు ఈ రావణుఁడు స్వర్గముమీద దండెత్తి పోవుచు మేరుపర్వతపు శిఖరమునందు దండుతోడ విడిసి ఆవారిని నలకూబరుని వద్దకుపోవుచు ఉన్న రంభను బలాత్కారముగా పట్టి రమించి విడిచెను. ఆవృత్తాంతము నలకూబరుఁడు తెలిసికొని రోషాయత్తచిత్తుఁడై రావణుఁడు రంభను పట్టినట్టు ఇక మీద బలాత్కారముగా ఏయాఁడు దానినైన పట్టెనేని వాని తలలు అప్పుడే వేయివ్రక్కలు అయి చచ్చును గాక అని శపించెను. ఇంతేకాక రావణుఁడు దేవేంద్రునితో యుద్ధము చేయునపుడు ఇంద్రుని ఏనుగు అగు ఐరావతము తన కొమ్ములతో వీని రొమ్మున క్రుమ్మగా ఆ కొమ్ములు తునిగిపోయెను. కనుక వీఁడు మిగుల దృఢమైన దేహము కలవాఁడు అని ఊహింపవలయును: మెండియు ఇతనికి బ్రహ్మవర ప్రభావముచేత కడుపున అమృతకలశము ఒకటి కలిగి ఉండుటచే వీని తలలు ఎన్నిమారులు నరికినను మరల మరల మొలచుచు ఉండును. ఆసంగతి విభీషణునికి తెలియును కనుక అతఁడు చెప్పగా తెలిసికొని రాముఁడు ఆ యమృత కలశమును భేదించి తలలు నరకగా వీఁడు చచ్చెను. (రామా)

షష్ఠిపాలిక : ఉగ్రసేనుని అయిదవ కూతురు. సృంజయుని భార్య.

రాష్ట్రపాలుఁడు ; ఝ॥ కంసుని తమ్ముఁడు.

రాసులు : లగ్నములు ఇవి పన్నెండు

1. మేషము 2. వృషభము
3. మిధునము 4. కటకము (కర్కాటకము)
5. సింహము 6. కన్య
7. తుల 8. వృశ్చికము
9 ధనుస్సు 10. మకరము
11. కుంభము 12. మీనము

ఇవి సౌరమానమున మాసములును అగును.

రాహువు : ద॥ ఒక గ్రహము. ఇతని తండ్రి విప్రచిత్తి. తల్లి సింహిక. ఇతని తమ్ముఁడు కేతువు. వీరు ఇరువురు కశ్యపుని పౌత్రులు. విష్ణువు మోహినీవేషము తాల్చి అమృతము పంచువేళ రాహు కేతువులు దేవతల వేషము ధరించుకొని దానిని గ్రహింప యత్నింపగా సూర్యచంద్రులు ఆ మర్మమును ఎఱిగి విష్ణువుతో చెప్పినందున సూర్యచంద్రులకును రాహువునకును విరోధము వాటిల్లెను అని ప్రసిద్ధి, మరియు రాహువు సర్పరూపి అనియు చెప్పబడును. ఇతఁడే విష్ణువుచే నరకబడి శిరోభాగము రాహువు అనియు తక్కిన మొండెము కేతువు అనియు అనబడెను. (భార) (బ్ర. పు.)

## రి

రిపుంజయుఁడు : మ॥ బృహద్రథుని వంశమున పుట్టిన మగధదేశాధీశులలో కడపటివాఁడు. ఇతఁడు తన మంత్రి అగు సునీకునిచే చంపబడెను. అనంతరము ఆ రాజ్యమును అతని సుతుఁడు అయిన ప్రద్యోతుఁడును వారి వంశము వారును ఏలిరి.

రిపుఁడు : యమువు యొక్క నాలవ కొడుకు.

(మత్స్య) (భాగ)

## రు

రుకుఁడు : ఇ। విజయుని కొడుకు. వృకుని తండ్రి

రుక్మకేశుఁడు
రుక్మరథుఁడు
రుక్మనేత్రుఁడు
రుక్మబాహువు } రుక్మి తమ్ములు

రుక్మి : విదర్భదేశపురాజు అగు భీష్మకుని పెద్దకొడుకు. రుక్మిణి అన్న. (భార)

రుక్మిణి : కృష్ణుని జ్యేష్ఠభార్య. విదర్భదేశాధిపతియగు భీష్మకుని కూతురు. ప్రద్యుమ్నుని తల్లి. (భాగ)

రుక్ముఁడు
రుక్మేషువు } : య॥ రుచికుని కొడుకులు. జ్యామఘుని సహోదరులు.

రుక్షయుఁడు : పు॥ మహావీర్యుని కొడుకు. ఇతనికి పుష్కరారుణి. కవి, త్రయ్యారుణి అని మువ్వురు కొడుకులు. వీరి సంతతివారు బ్రాహ్మణులు అయిరి.

రుచి : ఒకానొక ప్రజాపతి. భార్య శతరూప కూతురు అయిన ఆకూతి. కొడుకు యజ్ఞుఁడు. (భాగ)

రుచికుఁడు : య॥ ధర్ముని కొడుకు. ఇతని కొడుకులు జ్యామఘుడు, పృథువు, రుక్మేషువు, రుక్ముఁడు, పురుజిత్తు. (భాగ)

రుచిరథుఁడు : పు॥ చూ॥ నా॥ గురుఁడు.

రుచిరాశ్వుఁడు : బా॥ సేనజిత్తు కొడుకు. ప్రాజ్ఞుని తండ్రి. (భాగ)

రుద్రకోటి : ఒకానొక తీర్థము. ఇందు ఒకప్పుడు రుద్రుడు ఋషులకు ప్రత్యక్షము అయి కోటిరూపములుగా కనిపించినందున దీనికి ఈనామము కలిగెను.

రుద్రపర్వతము : ఇది జాహ్నవి అగు గంగకు సమీపమున ఉండును

రుద్రప్రయాగ : మందాకినికిని అలకనందకును నడుమను ఉండు క్షేత్రము.

రుద్రాక్షము : శివభక్తులు ధరించెడు ఒకానొక కాయ. త్రిపురాసురుల వధ కొరకు రుద్రుఁడు దేవస్వరూపిణి అగు గాయత్రిని బాణముగాచేసి కన్నులు మూసికొని ధ్యానముచేయువేళ అతని కనురెప్పలనుండి పడిన జలబిందువులచే రుద్రాక్షము పుట్టినట్లు తెలియవచ్చుచు ఉన్నది. అది అనేక భేదములు కలిగి ఉండును. దీని

ధరించుట మహామోక్షసాధకము అని, స్మార్తులును, శైవులును విశ్వాసముతో ధరింతురు.

రుద్రుఁడు : (1) అష్టమూర్తులలో ఒక్కఁడు. శివునికి నామాంతరము.

(2) బ్రహ్మపుత్రులలో ఒక్కఁడు. ఇతఁడు బ్రహ్మముఖమునం దుండి పుట్టెను. బ్రహ్మ తొలుత తానుపుట్టించిన సనకసనందనాదులు పరమయోగు లైన సృష్టికర్తలు కానందునమిక్కిలికోపమును వహించెను. అప్పుడు ఆకోపము ఈతని రూపముగా అతని యొక్క భ్రూమధ్యముననుండి రోదనము చేయుచు పుట్టెను గాన ఇతనికి రుద్రుఁడు అను నామము కలిగెను. ఆవల బ్రహ్మ కొంత శాంతి వహించి స్వాయంభువుని, శతకోపను పుట్టించెను.

రుద్రులు : బ్రహ్మమానసపుత్రులు. వీరుపదునొక్కరు. 1. అజుఁడు, 2. ఏక పాదుఁడు. 3. అహిర్బుధ్న్యుఁడు, 4. హరుఁడు, 5. రంభుఁడు, 6. త్ర్యంబకుఁడు, 7. అపరాజితుఁడు, 8. ఈశానుఁడు, 9. త్రిభువనుఁడు, 10. త్వష్ట, 11. రుద్రుఁడు మఱియు వీరిని రుద్రుని మానసపుత్రులు అనియు వాడుదురు.

రుమ : సుగ్రీవుని భార్య. (రామా)

రురుఁడు : చ్యవనుని కొడుకుఅగు ప్రమతకిని ఘృతాచి అను అప్సరస్సకును పుట్టిన ఋషి. ఇతనిభార్య ప్రమద్వర. ఇతఁడు తనభార్యను సర్పము కఱచి చంపగా ఆమెను తన తపో మహిమచేత బ్రతికించి తనకు కనఁబడిన సర్పముల ఎల్లకొట్టి చంపుచు ఉండి కడపట డుండుభము అను సర్పరూపముపొందిఉన్న సహస్రపాదుఁడు అను మునియొక్క ప్రార్థనచే ఆదిమానెను. ఈ రురునికి ప్రమ ద్వర వలన శునకుఁడు అనునతఁడు పుట్టెను. (భార)

## రూ

రూప : శక్తిమంతమున ఉండి వెలువడు ఒకనది.

రూపవాహికలు : రూపానది తీరవాసులు.

రూపాశ్వుఁడు : ఇ॥ నా॥ కృతాశ్వుఁడు.

# రే

**రేణుక** : పరశురాముని తల్లి. జమదగ్ని భార్య. ఈమెకు ఒకప్పుడు పరపురుష వీక్షణమున మనసు చలింపగ, జమదగ్ని అది తెలిసికొని పరశురామునిచే ఈమె శిరచ్ఛేదము చేయించి అనంతరము ఆ పరశురాముఁడు వేడినంతట ఈమెను పునర్జీవితురాలుగ చేసెను. ఈమె పరాశక్తి అంశము. (భార) (బ్రహ్మ)

**రేణుమతి** : నకులునిభార్య. (భార)

**రేవంతుఁడు** : ఒకగుహ్యకుఁడు.

**రేవతి** : (1) రైవత పర్వతము మీది తామరకొలనులో పుట్టిన ఒక కన్యక. ఈమెను ఆ కొలనుచెంత ఉండిన ప్రముచుఁడు అను ముని యెత్తిపెంచెను. కొడుకు రైవతమనువు.

(2) బలరాముని పత్ని. రైవతునికూతురు. ఈమెశర్యాతి పౌత్రుఁడుఅగు రైవతుని కొడుకు అయిన కకుద్మికూతురు అనియు చెప్పుదురు. చూ॥ కకుద్మి.

(3) ఇరువదియేడు నక్షత్రములలో ఒకటి.

(4) అరిష్ట పిప్పలుల తల్లి. మిత్రునిభార్య. (విష్ణు) (భాగ) (మార్క)

# రై

**రైభ్యుఁడు** : (1) పు॥ నా॥ ఈశినుఁడు. సుమతికొడుకు. (2) రు॥ అర్థావసు పరావసువులతండ్రి. (భార) (భాగ)

**రైవతకము** : ఒకానొక కొండ. నా॥ కుముదము ఇదిద్వారకకు సమీపమున ఉండును. ఋతవాక్కు శాపముచే రేవతీ నక్షత్రము ఈ పర్వతము మీదపడెను. అదికారణముగ దీనికి ఈపేరు కలిగెను. మఱియు ఆ రేవతీ నక్షత్రము ఈ పర్వతమునందుపడి ఒకతామరకొలను అయ్యెను. అందు ఒకకన్య పుట్టెను. ఆ కన్యక రేవతిఅనఁబడును. చూ॥ రేవతి. (మార్క)

**రైవతుఁడు** : (1) అయిదవమనువు. ప్రియవ్రతుని వంశమునందుఁజనించిన దుర్దమునికి రేవతియందు పుట్టిన కొడుకు. ఇతఁడు ప్రియవ్రతుని పుత్రుఁడు అని భాగవతమున చెప్పి ఉన్నది. (2) ఆనర్తుని కొడుకు. కకుద్మి తండ్రి. (భాగ) (మార్క)

## రో

రోచన : వసుదేవునిభార్యలలో ఒకతె.

రోమపాదుఁడు : (1) అం॥ నా॥ దశరథుఁడు. ధర్మరథుని కొడుకు. ఇతఁడు తనకు సంతానము లేకపోయినందున శ్రీరాముని తండ్రిఅగు దశరథుని కొమార్తెఅగు శాంతను పెంచుకొనెను. కొడుకు చతురంగుఁడు. (2) య॥ విదర్భుని మూడవ కొడుకు.

(భాగ)

రోమశుఁడు : ఋ॥ ఇంద్రుని పంపున ధర్మరాజునకు అర్జునుఁడు నాగలోకమందు ఉన్నాఁడు అని యెఱిగించి అతనిచే తీర్థయాత్ర చేయించినవాఁడు. (భాగ)

రోమహర్షనుఁడు : ఉగ్రశ్రవసుని తండ్రి. చూ॥ ఉగ్రశ్రవసుఁడు (భాగ)

రోహినము : (1) ఒకానొక పర్వతము. ఇందు రత్నముల గనులు మెండుగా ఉండును.

(2) ఒకానొక వృక్షము. ఇది అలంబతీర్థము గట్టున వుండును. ఇందు వాలఖిల్యులు అధోముఖముగా వ్రేలాడుచుతపస్సుచేయుచు ఉండిరి. గరుత్మంతుఁడు తాను అమృతమును తెచ్చుట కొఱకు పోవునపుడు తనకు బలము కలుగవలెను అని గజకచ్ఛపములను ఆహారముచేయ ఎత్తుకొనిపోయి ఈ వృక్షపుకొమ్మయందు పెట్టుకొనగా అది విఱిగెను. అంతట గరుత్మంతుఁడు గజకచ్ఛపములతోడ ఆ కొమ్మను కూడ ఎత్తుకొని దాని పట్టి వ్రేలుచు ఉన్నవాలఖిల్యులు వదలిపోగా కొని పోయి నిష్పురుష నగము అను కొండయందు పడవైచి అచ్చట గజకచ్ఛపములను భుజించి పోయెను. చూ॥ గరుడుఁడు.

(భార)

రోహిణి : (1) ఇరువదియేడు నక్షత్రములలో ఒకటి. దక్షప్రజాపతికూతురు. చంద్రుని ప్రియభార్య చూ॥ ప్రభాసము.

(2) బలరాముని తల్లి. వసుదేవునిభార్య.

(భాగ)

## రౌ

రౌద్రాశ్వుఁడు : పు॥ అహంయాతి కొడుకు. ఇతనికి ఘృతాచియందు పదుగురు పుత్రులు కలిగిరి. అందు ఋచేయువు జ్యేష్ఠుఁడు.

(భాగ)

**రౌరవము** : ఒక నరకము. ఈ నరకమును కూటసాక్షియు, అనృతవాదియు అనుభవింతురు. ఇది రెండువేల యోజనముల చదరము కలది అయి క్రిందిప్రదేశమున మోకాలి లోతుపల్లముకల రాగిసంబంధపు భూమి అయి గొప్పనిప్పులచే యెప్పుడు మండుచు ఉండును. అందు యాతనాశరీరులు పాదములు పెట్టగానే అవి దగ్ధములు అయి మరల మొలచుచు ఉండును.

**రౌహితము** : ఒకానొక అడవి. భారతయుద్ధమునకు వెడలినప్పుడు కౌరవ సైన్యమునకు ఇది ఒక విడిదల.

## ల

**లంక** : రావణాసురుని రాజధాని. ఇది దక్షిణసముద్రమున త్రికూట పర్వత శిఖరమున విశ్వకర్మచే నిర్మింపఁబడి తొలుత మాల్యవంతునికి రాజధానిగా ఉండి పిదప కుబేరునికి రాజధాని అయి ఆవల రావణునిచే ఆక్రమింపఁబడెను. దీనికి యేడు ప్రాకారములు కలవు. (విరా)

**లంకిని** : లంకను కాపాడునట్టి ఒకరాక్షసి. ఇది తరుచుగా లంక అనియే గ్రంథములయందు వాడఁబడినది. హనుమంతుఁడు సీతను వెదక వచ్చినపుఁడు పట్టణముశోధింపనీక ఇది ఇతనిని అడ్డగించి అతనిచే ఓటువడియెను.

**లంఘ** : నా॥ లంబ. దక్షపుత్రి. ధర్మునిభార్య.

**లంబోదరుఁడు** : వినాయకునికి నామము.

**లక్ష్మణకవి** : (ఏనుఁగు.) ఒకానొక ఆంధ్రకవి. తండ్రిలిమ్మన, ఇతఁడు భర్తృహరిచే రచియింపఁబడిఉండిన సుభాషిత రత్నావళి అను గ్రంథమును తెనిగించెను.

**లక్షణవతి** : చూ॥ నా॥ గౌడపురి.

**లక్ష్మణుఁడు** : శ్రీరాముని తమ్ములలో ఒకఁడు. తండ్రి దశరథుఁడు. తల్లి సుమిత్ర ఇతఁడు తన అన్న అగురామునియందు మిక్కిలిభక్తికలవాఁడు. చిన్నప్పటినుండి రాముని ఎడబాయక మెలగుచు ఉండి విశ్వామిత్రుఁడు కౌశికయాగ సంరక్షణమునుచేయ పోయి నపుడు, అతని వెంటపోయినదే కాక అరణ్యవాసము చేయపోయినప్పుడును వెంటపోయి ఎల్లకష్టములకు ఓర్చి అన్నను కొలుచుచు ఉండెను. కనుకనే భరతుఁడు ఇతనికంటె పెద్దవాడుగా ఉండగాను, రామలక్షణ భరతశత్రుఘ్నులు అని అను

క్రమవిరుద్ధముగా వీరు చెప్పఁబడుదురు. ఇతనిభార్య, జనకమహారాజుకూతురు, అయిన ఊర్మిళ. (రామా)

(2) దుర్యోధనుని కొడుకు. (భార)

**లక్ష్మి** : విష్ణువుయొక్క భార్య. పాలసముద్రమున అమృతమధనమపుడు పుట్టెను. ఈమె ధాత. విధాతలలో కూడా జ్యేష్ఠాదేవికి చెల్లెలై బ్రహ్మకు పుట్టెను. అని కొన్ని యెడల చెప్పఁబడిఉన్నది. మఱియు భృగుమహర్షి కూతురు అనియు ఈమెను చెప్పుదురు. దానినిబట్టియే ఈమెకు భార్గవి అని ఒకపేరు కలిగెను. ఇన్ని జన్మములకును కల్పభేదములచే అవతారభేదములును కలిగెను.

(దే. భా) (బ్ర. వై) (భార)

**లత** : ఒక అప్సరస. చూ॥ నారీతీర్థములు. (భార)

**లవణుఁడు** : ఒకానొక అసురుఁడు. మధువు కొడుకు. వీడు మిగుల క్రూరుఁడు అయి, సాధువులకు బాధలు కలుగజేయుచు ఉండగా వీనిని రామునియనుజుఁడు అయిన శత్రుఘ్నుఁడు చంపి లోకమునకు హితము కావించెను. (ఉ. రా)

**లవుఁడు** : చూ॥ కుశలవులు.

## లా

**లాంగలిని** : మహేంద్ర పర్వతమున ఉత్పత్తిఅగు ఒకనది.

## లి

**లింగన** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు మదనమోహినీ విలాసమును రచియించెను.

**లింగము** : రుద్రునియొక్క నిర్గుణ స్వరూపము. చూ॥ దేవదారువనము.

(బ్రహ్మ)

## లీ

**లీలావతి** : (1) హిరణ్యకశిపుని భార్య. ప్రహ్లాదునితల్లి. (2) భాస్కరాచార్యుల కూతురు. (3) భాస్కరాచార్యులచే రచియింపఁబడిన గణితము. చూ॥ భాస్కరాచార్యులు.

(భాగ)

## లై

**లైంగము** : ఒక పురాణము. ఇది ఈశానకల్పవిషయములను తెలిపెడిది. నంది కేశ్వరప్రోక్తము. దీని గ్రంథసంఖ్య 11000.

## లో

**లోకపాలురు** : భూమినలుదిక్కులకు రక్షకులై లోకాలోక పర్వతము మీద ఉండు సుధన్వుఁడు, శంఖపాలుఁడు, హిరణ్యరోగుఁడు, కేతుమంతుఁడు అను దిక్పాలకులకు ఈ పేరు చెల్లుచు ఉన్నది.

**లోకాలోకము** : ఒకానొక పర్వతము. నా. చక్రవాళము. దీని లోపలి భాగము మాత్రము సూర్యకిరణములచే ప్రకాశించును, వెలుపలి భాగము ప్రకాశింపదు, కనుక కొంత కానఁబడుచును కొంత కానఁబడకయు ఉండునది ఆయెను. అందు వలన దీనికి ఈ నామము కలిగెను.

**లోపాముద్ర** : (1) అగస్త్యునిభార్య. విదర్భరాజుకూతురు. మిక్కిలి పతివ్రత. (2) దధీచిభార్య. (బ్రహ్మ) (భార)

**లోలార్కుఁడు** : కాశియందలి ఒకదేవత. (కాశీ)

**లోహితాశ్వుడు** : ఇ॥ హరిశ్చంద్రుని కొడుకు. (మార్క)

**లోహిత్య** : ఒకనది. దీని తీరమున దేవారణ్యము ఉన్నది.

## వ

**వంగము** : ఒకానొక దేశము. ఇది బంగాళా దేశముయొక్క తూర్పు భాగము.

**వంగుఁడు** : అ॥ బలిరెండవకొడుకు. వంగదేశము ఇతని నామముచే పరగును.

**వంది** : రు॥ జనక మహారాజుయొక్క యజ్ఞశాలయందు ఇతనితో అష్టావక్రుఁడు వాదముచేసి జయించెను. (భార)

**వక్త్రయోధి** : ద॥ విప్రచిత్తికొడుకు.

**వజ్ర** : ఒక అప్సరస చూ॥ నారీతీర్థములు.

వజ్రజ్వాల : కుంభకర్ణునిభార్య.

వజ్రదత్తుఁడు : భగదత్తునికొడుకు.

వజ్రదంష్ట్రుఁడు : ర॥ రావణుని భటులలో ఒకఁడు. వీడు కపిసేనలు లంకను ముట్టడించినపుడు అంగదునిచే దక్షిణద్వారమున చంపఁబడెను. (రామా)

వజ్రనాభుఁడు : ది॥ విప్రచిత్తి కొడుకు. వీనితల్లి హిరణ్యకశ్యపుని కూతురుఅయిన సింహిక. సోదరుఁడు సునాభుఁడు. కూతురు ప్రభావతి.

వజ్రముష్టి : ర॥ మాల్యవంతుని కొడుకు.

వజ్రాంగి : ది॥ వజ్రాంగుని భార్య. తారకుని తల్లి.

వజ్రాంగుఁడు : ది॥ కశ్యపుని కొడుకు. హిరణ్యాక్షహిరణ్యకశిపుల మరణానంతరము దితి పుత్రునిఁ కోరి తపము ఆచరించి గర్భము ధరించి ఆగర్భము ఇంద్రునిచే భిన్నమై సప్తమరుత్తులుజనియించిన పిమ్మట మరలపుత్రార్థిని అయి కశ్యపుని సేవించి అతని అనుగ్రహముచే వజ్రాంగుని కనియెను. అట్లు జనియించిన ఇతఁడు ఇంద్రుని జయించునట్టి కొడుకును కోరి బ్రహ్మను గూర్చి తపస్సుచేసి ఆ వరము పడసి తారకాసురుని కనియె. (శివ.)

వజ్రుఁడు : య॥ కృష్ణుని పౌత్రుఁడు అగు అనిరుద్ధుని కొడుకు. కృష్ణ నిర్యాణము అయిన పిమ్మట మధురాపురికి ఇతఁడు రాజు ఆయెను.

వటస్థానము : భారత యుద్ధమప్పుడు కురుసేనకు ఇది ఒక విడిదల.

వడముడి : భీమునికి నామము.

వద్దికవి : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు శృంగార రసాలవాలమును రచియించెను.

వత్సంద్రుఁడు : చూ॥ నా॥ వత్సప్రీతి. (మార్క-)

వత్సకుఁడు : య॥ వసుదేవుని తమ్ముఁడు.

వత్సప్రీతి : దిష్టుని వంశస్థుఁడు అయిన బలంధముని కొడుకు.

వత్సరుఁడు : ధ్రువుని రెండవ కొడుకు ఇతని భార్య సర్వర్ధి. కొడుకులు — పుష్పార్ణుఁడు చంద్రకేతుఁడు ఇషుఁడు, ఊర్జుఁడు. వసువు జయుఁడు. అని ఆరుగురు. (భాగ)

**వత్సుఁడు** : (1) బా॥ సేనజిత్తు కొడుకు (2) కా॥ నా॥ ప్రతర్దనుఁడు. కువలయాశ్వుఁడు. ఋతధ్వజుఁడు అలర్కుని తండ్రి. (3) ర॥ కంసుని భటులలో ఒకఁడు. కృష్ణుడు యమునానదీతీరమునందు గోవులను మేపుచు ఉండగా నొకప్పుడు వీఁడు కోడెదూడ రూపము పొంది ఆవులను దూడలను పొడిచి బాధింప సాగెను. అది తెలిసికొని కృష్ణుడు వీనిని చంపెను. (భార)

**వధూసర** : ఒకానొక నది. భృగుమహర్షి యొక్క భార్యను ప్రలోముఁడు అను రక్కసుఁడు కొనిపోవునపుఁడు ఆమె కన్నీరు వరదలై కాఱ యేడ్వగా ఆ కన్నీటి ధారలచే ఈ నది యేర్పడెను. (భార)

**వపుష్ట** : కాశిరాజు కూతురు. మూడవ జనమేజయుని భార్య. (భార)

**వపుష్మంతుఁడు** : ప్రియవ్రతుని కొడుకులలో ఒక్కఁడు. ఇతని పాలికి శాల్మల ద్వీపము వచ్చెను, ఇతని కొడుకులు ఏడుగురు. (బ్రహ్మ)

**వపుస్స** : ఒక అప్సరస. ఈమె నారదోపదేశమున దూర్వాసమహాముని తపోభంగము చేయపోయి ఆయన కోపించి శపింపగా పక్షిఅయి పుట్టెను చూ॥ తార్క్షి.

**వరణ** : ఒకానొక నది. ఇది కాశి ప్రక్కను ప్రవహించును

**వరద** : ఒకానొకనది. ఇది విదర్భదేశమున ప్రవహించి పూర్వదక్షిణ వాహినియై గోదావరినదితో సంగమించుచు ఉన్నది.

**వరరుచి** : (1)పాణినియొక్క వ్యాకరణమునకు వార్త్తికము చేసిన ఋషి. నా॥ కాత్యాయనుఁడు. (2) ప్రాకృతభాషకు వ్యాకరణము చేసిన ఒక ముని, ఈయన విక్రమార్కుని అన్న అని చెప్పెదరు.

**వరలక్ష్మీవ్రతము:** శ్రావణమాసమున శుక్లపక్షమున శుక్రవారమున ముత్తైదువలు లక్ష్మీదేవిని అర్చించి చేసెడు ఒక వ్రతము. కుండినముఅను ఒక పట్టణమున ఉండిన చారుమతి, అను ముత్తైదువ యొక్క పాతివ్రత్యమునకు లక్ష్మీదేవి మెచ్చి అమెకు స్వప్నమందు ప్రత్యక్షమై తన్ను అర్చింపుము అని చెప్పి అనేకవరములను ఇచ్చి ఈవ్రతమును అనుష్టించి ఇల్లాండ్రు మహాభాగ్యసంపన్నులును పుత్రపౌత్రాభి వృద్ధిగలవారును. అగుదురు అని అనుగ్రహించి అంతర్ధానము ఆయ్యెను. (భార)

వరాంగి : శర్యాతి భార్య.

వరాహకర్ణుఁడు : ఒక యక్షుఁడు.

వరాహమిహిరుఁడు : ఒక జ్యోతిష్కుఁడు. ఇతఁడు 1400 సంవత్సరములకు ముందు ఉండినట్లు తెలియవచ్చుచు ఉన్నది. బృహత్సంహిత అనునొక జ్యోతిషగ్రంథమును ఇతఁడు వ్రాసెను. అందు గ్రహణములు చంద్రుని వృద్ధిక్షీణతలు మొదలైనవి సకారణములుగ నిరూపింపఁబడి ఉన్నవి. బృహజ్జాతకము అనునదియు ఇతనిచే వ్రాయబడినది.

వరాహము : (1) విష్ణుని దశావతారములలో ఒకటి. కల్పాంతమునందు సమస్తము జలమయము అయి యెల్లయెడల చీకట్లు నిండుకొనగా సర్వేశ్వరుఁడు ఆజలార్ణవమున వటపత్రశాయి అయి యోగనిద్రను తెలుచు ఉంది నిత్యులు అగు కొందఱు మహాత్ములు మహర్లోక నివాసులు ప్రస్తుతింప ప్రసన్నుఁడై జలార్ణవమున మునిగిన భూమిని తేల్చుట కొఱకు శ్వేతవరాహరూపమును పొందెను. అదియే వరాహావతారము అనఁబడును. అప్పుడు భూమి ఆవరాహము యొక్క కోరపంటిచే పెకలించి యెత్తఁబడి అడగిపోక నిలిచెను. ఈ అవతారమున లోకకంటకుఁడు అగు హిరణ్యాక్షుని విష్ణువు తెగటార్చెను. (2) ఒకానొక పర్వతము. ఇది మగధదేశమునందు ఉండును. (3) ఒక పుణ్యక్షేత్రము. ఇది నేపాళదేశమున ఉండును.

(భాగ) (స్కాంద)

వరుణ : ఆర్యావర్తమునందు ఉండునట్టి ఒకనది,

వరుణుడు : అష్టదిక్పాలకులలో ఒకఁడు. ఇతని దిక్కు పడమర. భార్య శ్యామలాదేవి. పట్టణము శ్రద్ధావతి. ఆయుధము పాశము. వాహనము మొసలి. హంసయును ఇతనికి వాహనముగా కొన్ని యెడల చెప్పఁబడి ఉన్నది. మరియు ఇతఁడు జలాధిదేవత అయి ఉండెను. (కాశీ)

వరూధిని : ఒక గంధర్వస్త్రీ, ప్రవరుఁడు అను బ్రాహ్మణుని చూచి మోహించి అతఁడు తన్ను పరిగ్రహింపకపోగా విచారగ్రస్తఅయి ఉండెను. అది తెలిసి దానిని వలచి ఉండిన ఒక గంధర్వుఁడు ఆ బ్రాహ్మణునిరూపము ధరించి వచ్చి ఆపెను కూడెను. వారికి స్వరోచి అను కొమరుఁడు కలిగెను. అతనికి స్వారోచిషమనువు జనించెను. (మార్క)

వర్చస్సు . చంద్రుని కొడుకులలో ఒకఁడు.

వర్ణములు : జాతులు. ఇవి బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రభేదములచే నాలుగు విధములు. అందు బ్రహ్మయొక్క ముఖమునుండి బ్రాహ్మణులును, భుజములనుండి క్షత్రియులును, ఊరువులనుండి వైశ్యులును పాదములనుండి శూద్రులును జన్మించిరి.

బ్రాహ్మణోస్యముఖమాసీత్
బాహూరాజ న్యఃకృతః।
ఉరూతదస్యయ ద్వైశ్యః।

పద్భ్యాగ్ం శూద్రో అజాయత॥అని ఇందులకు ప్రమాణము. చూ॥ ఆచార కాండము. ఈ నాలుగు వర్ణములు జనులకును నాలుగు ఆశ్రమములు చెప్పబడి ఉన్నది. అవి బ్రహ్మచర్యము, గార్హస్థ్య ము, వానప్రస్థము,సన్యాసము అనబడును. బ్రాహ్మణుఁడు ఉపనయనము అయిన తోడనే గురువును ఆశ్రయించి వేదమును అభ్యసించుచు అగ్నిపూజలు నడుపుచు ఉండుట బ్రహ్మచర్యముఅనియు, పిదప అతఁడు గురువుయొక్క ఆజ్ఞకొని పెండ్లాడి సత్కర్మములు నడుపుచు ఉండుట గార్హస్థ్యము అనియు, ఆగృహస్థుఁడు వనమునకు అరిగి తపోనియతిని ఉండుట వానప్రస్థము అనియు, సర్వసంగ పరిత్యాగి అయి దేశాటబిక్షాటన లచే కాలముగడుపుట సన్యాసము అనియు పేర్కొనబడుచు ఉండును. ఇందు వైశ్య శూద్రులకు బ్రహ్మచర్యమున వేదాధ్యయనమును వినుచు గురు శుశ్రూష నడుపుట ధర్మము. సత్యము, శౌచము, అహింస., అనసూయత, క్షమ, అనృశంస్యము, అకార్పణ్యములు సంతోషము అను ఎనిమిది గుణములుసకల వర్ణాశ్రమముల వారును కలిగి ఉండవలెను. అవిలేనివారు దండనార్హులు అగుదురు.

ధర్మధృక్కు : య॥ అక్రూరుని తమ్ముఁడు.

వర్ష : మరీచి భార్యలలో ఒకతె. ఈమె కొడుకులు ఆరుగురు బ్రహ్మశాప ముచే దేవకి గర్భమున పుట్టి కంసునిచే చంపబడి సుతలమునందు చేరి ఉండిరి. పిమ్మట కొంతకాలమునకు వెనుక కృష్ణుఁడు దేవకీదేవి ప్రార్థనచే ఆమెకు వారిని తెచ్చి చూపి వారికి శాప విమోచనము కావించెను.

వలలుఁడు : భీముఁడు అజ్ఞాతవాసకాల మప్పుఁడు వంటవాని వేషము ధరించు కొని పెట్టుకొన్న పేరు.

వల్లభి : రాజ పుత్రస్థానమునందలి ఒక పట్టణము.

వసిష్ఠుఁడు : రు॥ బ్రహ్మమానసపుత్రులలో ఒకఁడు. మహాతప స్సంపన్నుఁడు. ఇక్ష్వాకువంశస్థులకు పురోహితుఁడు. వైవస్వత మన్వంతరమున సప్తర్షులలో ఒకడు. ఇతని భార్య అరుంధతి. కొడుకులు శక్తి మొదలగువారు నూరుగురు. ఈతఁడు దక్షప్రజాపతి కూతురు అగు ఊర్జను వివాహమై ఆపెయందు రజుఁడు, గోత్రుఁడు, ఊర్ధ్వబాహువు, సవనుఁడు; అనఘుఁడు, సుతపుఁడు, శుక్రుఁడు అని ఏడుగురు పుత్రులను పొందెను. వారు స్వాయంభువ మన్వంతరమున సప్తర్షులుగ ఉండిరి. ఇతఁడు తొలుత బ్రహ్మమానసపుత్రుఁడు అయి ఉండి నిమిశాపముచేత అశరీరమునకు నాశము కలుగఁగా మిత్రావరుణులకు మరలజన్మించెను. ఒకప్పుడు మిత్రావరుణులకు ఊర్వశిని చూచి రేతస్సు స్ఖలితము అయి అది ఒక కుంభము నందు చేర్పఁబడగా అందుండి వషిష్ఠుఁడును అగస్త్యుఁడును పుట్టిరి కనుక వీరు ఇరువును కుంభజులు అనఁజడుదురు.

వసుద : ఒక గంధర్వస్త్రీ. మాలి అను రాక్షసుని భార్య) (ఉ. రా,)

వసుదుఁడు : ఇ॥ చూ॥ నా॥ త్రసదస్యుఁడు.

వసుదేవుడు : (1) య॥ నా॥ ఆనకదుందుభి. శూరుని కొడుకు. దేవకి మగఁడు. కృష్ణ బలరాముల తండ్రి. కొందఱు కశ్యపుఁడు వసుదేవుఁడుగాను అదితి దేవకిగాను పుట్టిరి అని చెప్పుదురు. (2) చూ॥ కణ్వుఁడు. (భాగ)

వసుపదుఁడు : ఉపరిచరవసువుయొక్క సేనాపతి. కోలాహల సంగమమున శుక్తిమతియందు జనించినవాఁడు గిరికతోడబుట్టువు.

వసుమంతుఁడు. : చూ॥ నా॥ శ్రుతాయువు.

వసువు : (1)కు,, చేదిరాజు. కృతికొడుకు. శుక్తిమతికి కోలాహల సంగమముచే పుట్టినగిరికను పెండ్లాడెను. ఇతఁడు సద్యోజాత వైరాగ్యమున ఒకముని యాశ్రమమందు తపముచేయుచు ఉండగా ఇతని తపమునకు దేవేంద్రుఁడు మెచ్చి పెక్కు వస్తువులతోడ ఒక విమానమును ఇతనికి ఇచ్చెను. దానినెక్కి ఇతఁడు ఉపరిమున సంచరించుచు ఉండును. దానిచే ఇతఁడు ఉపరిచర వసువు అనఁబడును. ఒకానొకప్పుడు ఇతఁడు అడవికి వేఁటాడపోయి ఆవనమునందలి మనోజ్ఞతను చూచు నపుడు ప్రియభార్యయగు గిరిక తలపునకు రాగా రేతస్సు జారెను. అంతట

ఇతఁడు ఆ రేతస్సును ఒక దొప్పలో సంగ్రహించి తస పెంపుడు డేగచేత యిచ్చి గిరికవద్ద చేర్పుము అని పంపెను. అట్లు ఆడేగ ఆ దొప్పను కొనిపోవుచు ఉండగ మఱియొక డేగ వచ్చి దానితో పోట్లాడి ఆ దొప్పను గ్రహింపపోయెను. అప్పుడు దొప్పలో నిది యమునానదిని పడెను. పడగానే ఆనదిని శాపవశమున చేప అయి వున్న అద్రిక అను అప్సరస్స దానిని త్రాగి గర్భిణి అయి ఒక కూతును ఒక కొడుకును కనెను. అ కొడుకు మత్స్యుఁడు అనఁబరగి మత్స్యదేశమునకు ఱేఁడు ఆయెను. ఆ కూఁతురు దాశరాజు నొద్ద పెరిగి కన్యాత్వముననే పరాశరునకు వ్యాసుని కని పిదప శంతనుని పెండ్లాడెను. ఇది గాక ఉపరిచరవసువునకు అయిదు గురు కొడుకులు కలరు. వారు బృహద్రథుఁడు. కుసుంబుఁడు. మత్స్యుఁడు ప్రత్య గ్రుఁడు, చేదిషుఁడు, అనఁబడుదురు. (భారతమునందు ఇతని కొడుకులు బృహ ద్రథుఁడు మణివాహనుఁడు, సౌబలుఁడు, యదువు, రాజన్యుఁడు అను వారు అయిదుగురు అని ఉన్నది.)

(2) నృగుని వంశస్థుడగు భూతజ్యోతి కొడుకు.

(3) కుశికుని నాలవ కొడుకు. ఇతఁడు గిరివ్రజపురమును కావించెను.

(4) య॥ వసుదేవునికి శ్రీదేవియందు పుట్టిన కొడుకు.

(5) ద॥ మురాసురుని కొడుకు. శ్రీకృష్ణునిచే చంపబడెను.

(6) దక్షప్రజాపతి కుమార్తె. ధర్మని భార్య. అష్టవసువుల తల్లి.

వసువులు : చూ॥ అష్టవసువులు. (భార)

వసుసేనుడు : కర్ణుఁడు.

వహ్ని : (1) అగ్నికి నామాంతరము. (2) యయాతిపౌత్రుఁడు. తుర్వసువు పుత్రుఁడు.

## వా

వాజసనేయశాఖ : చూ॥ యాజ్ఞవల్క్యుఁడు.

వాతాపి : ద॥ విప్రచిత్తికి సింహికయందు పుట్టినకొడుకు. చూ॥ అగస్త్యుఁడు. భాగవతమున వాతాపి ఇల్వలులు. ప్రహ్లాదుని తమ్ముఁడు అగు హ్లాదుని కొడుకులు అని చెప్పి ఉన్నది. (విష్ణు) భార)

**వాచ్యుఁడు** : రు॥ శాకల్యుని శిష్యుఁడు.

**వామదేవుఁడు** : వశిష్ఠునితో కూడ అయోధ్య యందు ఉండిన దశరథుని పురోహితుఁడు.

**వామనము** : (1) ఇది అష్టాదశ పురాణములలో ఒకటి. శ్వేతవరాహకల్ప సంబంధమును, వేదత్రయ విషయమును త్రివిక్రమాభివర్ణనమును కలది. ఇది బ్రహ్మప్రోక్తము. దీని గ్రంథ సంఖ్య 14000 (2) దక్షిణపు దిక్కునందలి ఏనుఁగు.

**వామనుఁడు** : బలిని సంహరింపుటకు అయి అదితి గర్భమున అవతరించిన విష్ణువు, ఈ విష్ణువు తనకు పుట్టవలయును అని కశ్యపప్రజాపతి అనేక సహస్ర సంవత్సరములు తపము ఆచరించెను ఇతఁడు మూడు లోకములను వ్యాపించి నందున త్రివిక్రముఁడు అనియు ఇంద్రుని తమ్ముడు అయినందున ఉపేంద్రుఁడు అనియు చెప్పబడును. ఈవామనావతారము విష్ణువుయొక్క దశావతారములలో అయిదవది. (భాగ)

**వాయువు** : నా॥ అనిలుఁడు. అష్టదిక్పాలకులలో ఒకఁడు. ఇతని దిక్కు పశ్చిమోత్తరము. భార్య అంజన. వాహనము జింక. పట్టణము గంధవతి ఆయుధము ధ్వజము. ఇతఁడు బలమునందు ప్రసిద్ధుఁడు, (కాశీ)

**వారణావతము** : ప్రయాగ, ఇందు దుర్యోధనుఁడు లక్కయిల్లు కట్టించి అందు పాండవులను కాపురము ఉంచి చంప ప్రయత్నించెను. భారత యుద్ధకాలమున కురుసైన్యమునకు ఇది ఒక విడిదల.

**వారణాసి** / **వారాణసి** : కాశి, వరణ, అసి అను రెండు నదులు రెండుప్రక్కల ప్రవహించుటచే దీనికి ఈ పేరు కలిగెను.

**వారాహము** : (2) ఒక కల్పము. చతుర్ముఖ బ్రహ్మ యొక్క ఆయుః పరిమాణమున కడపటి సగము. మనుష్య సంవత్సరములు ఎనమున్నూట అరువది నాలుగు కోట్లు చేరిన అతనికి ఒక్కదినము అట్టి 360 దినములు అతనికి ఒక సంవత్సరము అట్టి 100 సంవత్సరములు అతని ఆయువు ఇప్పుడు జరుగునది వారాహకల్పమే. (2) ఇది ఒక పురాణము. వరాహరూప నారాయణ ప్రోక్తము మానకల్ప విచారాదులుకలది. దీని గ్రంథ సంఖ్య 24000.

**వారుణము** : ఒక ఉపపురాణము.

**వారుణి** : మధ్యమునకు అధిదేవత. వరుణుని వలన కలిగినది.

**వాలఖిల్యులు** : వీరు బ్రహ్మమానస పుత్రులలో ఒకఁడు అయిన క్రతువునకు పుట్టిన అంగుష్ఠప్రమాణ దేహులు అగు అరువదివేవురు. మహాతపస్సంపన్నులు. నిరంతరము సూర్యరథము చుట్టు తిరుగుచు ఉండుదురు మరియు వీరు, బ్రహ్మరోమ కూపమునుండి పుట్టినటుల కొందరు వాడుకొందురు.

(బ్రహ్మ) (భార)

**వాలి** : సుగ్రీవుని యన్న. అంగదుని తండ్రి. ఇతని భార్య తార. చూ॥ సుగ్రీవుఁడు.

(ఉ. రా. రామ)

**వాలేశ్వరుఁడు** : భల్లాణ చరిత్రమును పద్యకావ్యముగా రచియించిన ఒక ఆంధ్రకవి

**వాల్మీకి** : సంస్కృత రామాయణమును రచించిన ఒక ఋషి ఇతఁడు చిర కాలము తపస్సుచేయుచు సమాధిని ఉండగా ఇతనిపై పుట్టపెట్టెను ఛందోనిబద్ధ ముగా కవనము సృష్టిచేసినవాఁడు ఇతఁడే అని తెలియ వచ్చుచు ఉన్నది "భువికవి తాకన్యఁ బుట్టించె నెవ్వాఁడు" అని భట్టుమూర్తి.

(ఉ. నా )

**వాసవదత్త** : ఒక సంస్కృత కావ్యము ఇది సుబంధునిచే కల్పింపఁ బడినది.

**వాసవుఁడు** : ఇంద్రుఁడు.

**వాసుదేవుఁడు** : (1) కృష్ణుఁడు. వసుదేవుని కొడుకు అని అర్థము. (2) కరూశ దేశమునకు రాజు. ఇతఁడు బలగర్వమున మదోన్మత్తుఁడు అయి వాసుదేవనామ మున తాను ఒక్కరుఁడే ఉండ తగును, కాని మఱియొక్కఁడు ఉండతగునా, అని కృష్ణునితోమత్సరించి అతనిచే మడిసెను. (3) ఒక పండితుఁడు. ఇతడు ఆంధ్ర శబ్దచింతామణికి వృత్తివ్రాసి ఉన్నాడు. అది వాసుదేవ వృత్తి అన బడును.

## వి

**విందానువిందులు** : జయత్సేనునికి వసుదేవుని చెలియలైన రాజాధిదేవి యందు పుటిన కొడుకులు.

(భార)

వింధ్యావళి : బలిచక్రవర్తి భార్య.

వికటుఁడు : ర॥ సుమాలి కొడుకు.

వికర్ణుడు : దుర్యోధనుని తమ్ముడు. (భార)

వికుక్షి : ఇ॥ కుక్షి కొడుకు. కకుత్స్థుని తండ్రి.

వికృతి : య॥ జీమూతుని కొడుకు.

విక్రమార్కుడు : ఒక శక పురుషుఁడు. చంద్రశర్మ అను బ్రాహ్మణునికి ఉజ్జయిని రాజు అగు శ్రుతకీర్తియొక్క కూతునందు పుట్టినవాఁడు. ఇతఁడు ఘోరమైన తపస్సుచేసి కాళికాదేవి అనుగ్రహమును పడసి యెటువంటి పనినైనను సాహసించి చేయుచు సాహసాంకుఁడు అను బిరుదును పొందెను మఱియు మహాఖ్యాతితో ఉజ్జయిని యందు రాజ్యము చేసి కడపట శాలివాహనునిచే చంపఁబడియెను. ఆర్యావర్తమున నేఁడును విక్రమార్కశకమున వ్యవహరింతురు. ఇతని జననము ఇప్పటికి వెయ్యిన్ని తొమ్మన్నూట ముప్పది ఐదు. సంవత్సరములనాడు.

విక్రమోర్వశీయము · ఒకానొక సంస్కృతనాటకము. ఇదికాళిదాసునిచే రచింపఁబడినది. ఇంద: ఊర్వసి పురూరవుని విడిచిపోవ అతఁడు చెందిన విరహవేదనను అనుసరించిన కథ చెప్పఁబడి ఉండును.

విచిత్రవీర్యుఁడు : ధృతరాష్ట్ర, పాండురాజుల తండ్రి. ఇతని తండ్రి శంతనుఁడు, తల్లి సత్యవతి, అన్న చిత్రాఁగదుఁడు. (భార)

విజితాశ్వుడు
విజయాశ్వుఁడు } : పృథుచక్రవర్తి కొడుకు నా॥ అంతర్ధానుఁడు. (భాగ)

విజయుఁడు : (1) ఇ॥ సుదేవుని కొడుకు. ఋకుని తండ్రి. (2) విష్ణు పరిచరులలో ఒకఁడు. చూ॥ జయవిజయులు. (3) అర్జునునకు నామాంతరము. (4) చూ॥ నా॥ అమవసువు. (5) అం॥ జయద్రథుని కొడుకు. (6) మి॥ జయుని కొడుకు.

విటఁకుడు : ర॥ సుమాలి కొడుకు.

విమారథుఁడు (1) వత్సప్రీతి మామ, ముదావతి తండ్రి. (2) య॥ రెండవ భజమానుని కొడుకు.

విథతుఁడు : నా॥ భరద్వాజుఁడు. ఇతఁడు ఉతథ్యుని భార్యయందు బృహస్పతికి పుట్టెను. తలిదండ్రులు ఇరువురును ఈతఁడు పుట్టినతోడనే వదలిపెట్టి చనిరి. అప్పుడు ఇతనిని మరుత్తులు యెత్తిపెంచి సంతానములేని పూరువంశజుడు అయిన భరతునికి తెచ్చి యిచ్చిరి. ఇతనికి పుట్టిన భుమన్యుఁడు భరతుని పుత్రుఁడు ఆయెను.

వితలము : నల్లని చాయ కలిగిన ఒక అధోలోకము.

వితస్త : చంద్రభాగకు ఉపనది.

విదర్భము : ఇది ఇప్పటి బీరారు., బీదరుదేశములు.దీనికి విదర్భుని వలన ఈ నామము కలిగెను.

విదర్భుడు : య॥ జ్యామఘుని కొడుకు. ఇతఁడు ఏలిన దేశమే విదర్భము. ఇతనికి కుశుఁడు, క్రధుఁడు, రోమపాదుఁడు, అని ముప్వురు కొడుకులు.

విదిశ : (1) మాళవదేశమున ప్రవహించునట్టినది. (2) మాళవదేశమున విదిశానది గట్టున ఉండు పట్టణము.

విదురుఁడు : ధృతరాష్ట్రుని మంత్రి. అంబికయొక్క దాసి యందు వ్యాసుని వలన జన్మించినవాఁడు. ఈయన మాండవ్యుని శాపము వలన శూద్రుఁడు అయి పుట్టిన యముఁడు. ఈతఁడు మహాధర్మాత్ముడు ధృతరాష్ట్రుఁడు పాండవుల కెగ్గు చేయకుండునట్లు పెక్కుమారులు అతనికి బుద్ధి చెప్పెను. చూ॥ మాండవ్యుడు. (భార)

విదుషుఁడు : ఇంద్రునికి శచీదేవియందు పుట్టిన మూడవ కొడుకు.

విదూరథుఁడు : కు॥ సురథుని కొడుకు. (మార్క) (భార)

విదేహుఁడు : నిమికొడుకు. నా॥ మిథిలుఁడు. ఇతనిపేర మిథిలదేశమునకు విదేహదేశము అనియు నామము కలిగెను. చూ॥ మిథిలుఁడు.

విద్యాధరులు : దేవతలలో ఒక తెగవారు. మాలికాంజనాది విద్యలను ధరించిన జీమూత వాహనాదులు.

విద్యానాధుఁడు : ఒకనొక అలంకారిక సంస్కృత కవి. ఇతఁడు 500 సంవత్సరములకు ముందు ఏకశిలానగరమున పుట్టెను. తన ప్రభువు అయిన ప్రతాపరుద్రుని

యొక్క మహిమను తెలుపునట్టి ప్రతాపరుద్రీయము, అను అలంకార గ్రంథము ఒకటి రచియించెను.

**విద్యారణ్యస్వామి :** మాధవాచార్యుఁడు. ఈయన తుంగభద్రానదీతీరమున పంప అను గ్రామమున రమారమి 500 సంవత్సరములకు ముందు విద్యానగర రాజులు అయిన హరిహరబుక్కరాయుల కాలమున ఉండెను. ఈయనను విద్యానారాయణుడు అనియు అందురు పరాశరమాధవీయము ఈయన చేతనే వ్రాయఁబడెను.

**విద్యుజ్జిహ్వుడు :** (1) రా॥ రావణుని భటులలో ఒకఁడు. వీఁడు మహామాయావి. సీత అశోకమున ఉండునపుడు తన మాయచే రామలక్ష్మణుల తలలను కల్పించి నీ పెనిమిటియు అతని తమ్ముఁడును రావణునిచే చంపఁబడిరి. ఇవే వారితలలు అని ఆమెకు చూపి బెదరించెను.

(2) రా॥ శూర్పణఖ భర్త. వీఁడు కాలకేయవంశమున జనించినవాఁడు. రావణుఁడు దిగ్విజయార్థముపోయి కాలకేయులతో పోరాడునపుడు వీనిని ఆ సందడిలో తనమరది అని తెలిసికోలేక చంపెను. అంతట వీని భార్య అగు శూర్పణఖ అన్న అగు రావణునిచేరి దుఃఖింపగా వాఁడు తాను తెలియక చంపితిని అనియు భర్తచచ్చుటవలని చింతమాని స్వేచ్ఛగా నీవు చరింపుము అనియు చెప్పి ఖర దూషణ త్రిశిరులను తోడుచేసి దండకారణ్య మందలి జనస్థానమునకు పంపెను. శూర్పణఖ తన భర్త చచ్చునప్పటికి అరు నెలలగర్భిణి అయి ఉండెను. కనుక పదినెలలు నిండగానే జంబు కుమారుఁడు అను కొడుకును కనెను. వాఁడు తన మేనమామ వలన తన తండ్రికి కలిగిన కీడు ఎఱిఁగి అపగతీర్పగోరి సూర్యుని గూర్చి పంచవటి సమీపమున ఒక వెదురు పొదయందుచేరి తపస్సు చేయుచుండెను అట్టియెడ సీతారాములకు శుశ్రూష చేయుచు వనవాసము చేయుచు ఉండిన లక్ష్మణుఁడు సమిధలు, దర్భలుతేగోరి ఆ వెదురు పొదకడకు వచ్చి దానియందు మెండుగా దర్భపెరిగి ఉండగా, కత్తితో ఆ పొదతోడ జంబు కుమారుని తలను నఱికి ఎవడో తపస్వి తనచే చంపఁ బడెను. అని విచారపడుచు ఉండెను. అంత ఆ సమీపాశ్రమముల ఋషులు వాఁడు రాక్షసుఁడు అగుటను తెలియచేసి అతని విచారమును పోగొట్టిరి. అది తెలిసి శూర్పణఖ రాముని వంచింపఁబోయి భంగపడి సీతను కొనిపోవ రావణుని ప్రేరేపించెను. (రామా)

**విద్యుత్కేశుడు :** రా॥- హేతికొడుకు. తల్లి భయ.

విద్యుద్రూపుడు : ర॥ కుబేరుని అనుచరులలో ఒకఁడు. కంకుఁడు అను పక్షిని చంపి కంధరుఁడు అను పక్షిచే చంపఁబడెను.

విధాత : ధాత తమ్ముఁడు. ఇతని భార్య నియతి చూ॥ ధాత. [బ్రహ్మ]

విధువు : చూ॥ నా॥ చంద్రుడు.

వినత : కశ్యపుని భార్యలలో ఒకతె. దక్షప్రజాపతి కూతురు. ఈమె కొడుకులు అనూరుఁడు– గరుడుడు చూ॥ గరుడుడు. [భార]

వినతుఁడు : సుగ్రీవునిచే సీతను వెదకుటకై తూర్పుదిశకు పంపఁబడిన వానర సేనాధిపతి. (రామా)

వినాయకుఁడు : విఘ్నేశ్వరుఁడు. ఒకప్పుడు పార్వతి సుత కామిని అయి చెలికత్తెలతోడ దారుమయములు అగు బొమ్మలను పెట్టుకొని ఆడుకొనుచు ఉండి గంధయుక్త తైలమును మేన పూసి నలుగుయిడుకొని నలచునపుడు రాలిన నలుగుపిండిచే గజాననమును నరాకారమును కలబొమ్మను చేసి పుత్రుఁడు అని భావించుచు గంగలో వదలెను. అంత కొంతకాలమునకు ఆ బొమ్మ దృఢ శరీరమును ప్రాణమను కలిగి లోకము అంతయు వ్యాపించెను. అంత అతనిని గంగయు పార్వతియు తమ పుత్రుఁడు అని కైకొనిరి. చతుర్ముఖ బ్రహ్మ అతనికి వినాయకాదిపత్యమును ఒసంగెను. అతఁడు గణనాయకుఁడు అనియు విఘ్నేశ్వరుఁడుఅనియు చెప్పఁబడి సమస్త కార్యములయందును మొదల పూజింపఁబడును. మఱియు ఇతనికి ఏకదంతుఁడు. మూషకవాహనుఁడు మోదకహస్తుడు, లంబోదరుఁడు ఇత్యాదినామములు అనేకములు కలవు. మఱియు ఇతని విషయమై అనేకులు అనేక విధములుగా చెప్పెదరు. చూ॥ గజాస్యుఁడు.

పాండవులు వనవాసము చేయుకాలమున ఒకప్పుడు ధర్మరాజు సూతుని యాశ్రమమునకుపోయి రాజ్యము సిద్ధింపజేయునట్టి ఒకవ్రతము ఆనతిమ్ము అని అతనిని వేడగా అతఁడు (సాంబమూర్తి. కుమారస్వామికి చెప్పిన విధమున) భాద్రపద శుక్ల చతుర్థిని విఘ్నేశ్వరుని ప్రతిమచేసి పూజించిన శత్రుజయము కలుగును అని చెప్పెను. ఈ వ్రతమును వినాయయక వ్రతము అందురు. దీనిని ఆచరించునట్టివారికి వట్టి అపవాదము యేవియైన కలిగినను అది తొలగిపోవును. ఇంతకు ముందుఒకప్పుడు వినాయకుఁడు కైలాసమున కుబ్జరూపుడుఅయి వెలుగుచుఉండ

అతని కని చంద్రుఁడు పరిహసింప అపుడు వినాయకుఁడు ఆ చంద్రుని పొడగని నిన్ను చవితినాఁడు చూచువారికి అపవాదము సిద్ధించును అనిశపియించి ఉండెను. చంద్రుఁడు ఖిన్నుఁడై అట్లుకాకుండ అనుగ్రహింపుము అని వేడగా పైన చెప్పినట్టి వినాయకవ్రతము ఆచరించువారికి ఆ యపవాదము తొలగును అని ప్రసాదించెను.

విపాశ : ఒకానొక నది. ఇది హిమవత్పర్వతమునకు దక్షిణమున ఉత్పత్తి అయి శతద్రూ నదితో సంగమము అగును. "పుత్రశోకాత్పాంశంభద్వాప్రప విష్టం వసిష్ఠం పాశాద్విమోచిత. పతీతి" విపాశ అని వ్యుత్పత్తి.

విపులుఁడు : య॥ బలరాముని తమ్ముఁడు.

విప్రచిత్తి : వీఁడు కశ్యపునికి దనువునందు పుట్టిన పుత్రుఁడు. దితి కూతురు అయిన సింహికను పెండ్లాడెను. వీని కొడుకులు రాహువు. కేతువు, నముచి వాతాపి. ఇల్వలుఁడు, నరకుఁడు. దుస్వర్భానుఁడు, పులోముడు, వక్త్రయోధి మొదలగువారు.

(విష్ణు) (శివ) (వరా)

విభండకుఁడు / విభాండకుడు : ఋ॥ కశ్యపుని కొడుకు, ఇతఁడు అఖండిత బ్రహ్మచర్యమున తపము సలుపుచు ఒకనాఁడు ఒకమడుగున నీరాడుచు ఉన్న సమయమున ఊర్వశిని చూచి ఇతనికి రేతస్సు స్ఖలితము అయ్యెను. వానితో మిశ్రమైన జలమును ఒక్క పెంటి మృగము త్రావి గర్భము తాల్చి ఋశ్యశృంగుఁడు అను కొమారుని కనియెను.

(భార)

విభావసి : మందారుఁడు అను విద్యాధరుని కూతురు. ఈమె స్వారోచికిమృగ పక్షిజాతుల భాషలు తెలిసికొను విద్యను ఒకటిఇచ్చి అతనిని పెండ్లి యాడెను.

విభావసుఁడు : (1) ద॥ దనువు యొక్క పుత్రులలో ఒకఁడు. (2) ద॥ మురాసురుని కొడుకు. వీఁడు శ్రీకృష్ణునిచే చంపఁబడెను.[2] ఒక బ్రాహ్మణుఁడు. ఇతఁడు తన తమ్మునిచే కూర్మము అగునట్లు శపింపఁబడి అమృతహరణార్థము పోవునపుడు గరుత్మంతునిచే భక్షింపఁబడెను. చూ॥ గరుడుఁడు (4)వసువు పుత్రుఁడు.

(భార)

విభీషణుఁడు : రా॥ విశ్రవసునకు కైకసియందు పుట్టిన మూడవ కొమారుఁడు రావణాసురుని యనుజుఁడు. ఇతఁడు శ్రీరామునకు సీతాదేవిని మరల కొనిపోయి ఇమ్మని తన అన్నయగు రావణునికి బహువిధముల బోధించి అది అతఁడు

వినక అవమానించినందున అతనిని వదలి రాముని శరణుజొచ్చెను. అంతట శ్రీరాముడు ఇతనికి అభయము యిచ్చి రావణుని మరణానంతరము లంకకు రాజును చేసెను. ఇతఁడు చిరంజీవి. (రామా) (భార)

విభువు : (1) కా॥ సత్యకేతువు కొడుకు సువిభువు తండ్రి.
(2) య॥ బభ్రువు కొడుకు

విభూతి : స్మార్తులును శైవులును త్రిపుండ్రముగా ఉంచుకొను భస్మము. ఇది ఐశ్వర్యప్రదాయకము. అనియు సకల పాపనాశకము అనియు భూతప్రేత పిశాచాది గ్రహముల వలని భయమును పోగొట్టి రక్షించును, అనియు ప్రసిద్ధి. ఈకారణములఁ బట్టి, ఇది విభూతి, భసితము, భస్మము, క్షారము, రక్ష. అను నామములుం కలిగి ఉండును. భస్మస్నానము, ఆగ్నేయ స్నానము, అనంబడు దీనిని వారుణ స్నానము కంటె విశేషము అని భావింతురు.

విభ్రాజుఁడు : బా॥ సుకృతి కొడుకు.
[1] రు॥ జాత కర్ణి శిష్యుడు. [2] ప్రి॥ త్వష్టకొడుకు

విరటుఁడు / విరాటుఁడు : మత్స్యదేశాధిపతి. ఇతని రాష్ట్రమునందు పాండవులు తమ అజ్ఞాత వాస కాల సంవత్సరమును గడపిరి. అప్పుడు ఇతడు తన పుత్రిక అగు ఉత్తరను అర్జునుని పుత్రుడు అయిన అభిమన్యునకు యిచ్చి పాణిగ్రహణము చేయించెను. ఇతడు భారత యుద్ధమున పాండవులకు తోడు అయ్యెను. (భార)

విరాధుఁడు : ర॥ పూర్వమున తుంబురుఁడు, అను గంధర్వుఁడు కుబేరుని శాపముచే రాక్షసత్వము పొంది, శ్రీరాముఁడు దండకారణ్యము ప్రవేశించినప్పుడు అతనిని అడ్డగించి అతనిచే శాపవిముక్తుఁడు అయ్యెను.

విరూపాక్షుడు : (1) ర॥ మాల్యవంతుని కొడుకు సుగ్రీవునిచే చంపఁబడెను. (భార) (రామా)
(2) దనువు పుత్రుడు.

విరూపుఁడు : రెండవ అంబరీషుని పెద్దకొడుకు

విరోచనుఁడు : ది॥ ప్రహ్లాదుని కొడుకు. బలిచక్రవర్తి తండ్రి [విరోహనుఁడు]. (భార)

విరోహణుడు : ప్రి॥ నరుని కొడుకు.

**విలోమతనయుఁడు** : య॥ కుకురుని పౌత్రుఁడు అయిన వృష్ణికొడుకు.

**వివస్వతుఁడు** : ద్వాదశాదిత్యులలో ఒకఁడు. తండ్రి కశ్యపుఁడు, తల్లి అదితి. ఇతనినే సూర్యుఁడు అని చెప్పుదురు. ఇతఁడు విశ్వకర్మ కొమార్తెలు అగు సంజ్ఞాదేవి, ఛాయాదేవి అను వారిని వివాహమయ్యెను. ఈ వివస్వతునికి వైవస్వత మనువు, యముఁడు, శని అని మువ్వురు కొడుకులును యమున, తపతి అని ఇరువురు కొమార్తెలును పుట్టిరి. చూ॥ వైవస్వత మనువు.

**వివింశుఁడు** : రెండవ ఖనిత్రుని తండ్రి.

**విశాఖదత్తుడు** : ముద్రారాక్షసమును వ్రాసిన కవి.

**విశాలము** : గిరివ్రజమునుండి మిథిలానగరమునకు పోవు మార్గమున ఉండు దేశము.

**విశాలాక్షి** : కాశీ విశ్వేశ్వరుని భార్య.

**విశాలుడు** : ఇక్ష్వాకుని తమ్ముఁడు అగు నభగుని వంశస్థుఁడు అయిన తృణబిందుని కొడుకు. ఇతడు ఏలినదేశమే విశాలము. ఇతనికొడుకు హేమచంద్రుఁడు.

**విశిష్టాద్వైతము** : త్రిమతములలో ఒకటి. ఈ మతమునందు చిత్తు, అచిత్తు, ఈశ్వరుఁడు, అని పదార్థములు మూఁడు. అందు చిత్తు అనగా ఆత్మ. ఆ ఆత్మ జ్ఞానేంద్రియ మనోబుద్ధి విలక్షణమై, అజడమై, ఆనందరూపమై, నిత్యమై, అణువై నిరవయవమై, నిర్వికారమై, జ్ఞానాశ్రయమై ఈశ్వరునికి శేషమై ఉండునది. అజడము అనగా స్వయం ప్రకాశము. జ్ఞానాంతరాపేక్ష లేక తనకు తానే ప్రకాశించునది. అణువు అనగా అత్యల్పపరిమాణము కలది. అట్టి పరిమాణము కలిగి ఒకచోట ఉన్నను శరీరమునందంతట సుఖదుఃఖానుభవము కలుగుట; దీపము ఒకచోట ఉన్నను దాని ప్రభ అంతట వ్యాపించునట్లు, వ్యాపించునట్టి జ్ఞానముచే, కలుగుచు ఉన్నది, శేషము అనగా లోపడినది. జ్ఞానాశ్రయము అనగా జ్ఞానముకు ఆశ్రయమైనది. ఈ జ్ఞానము ధర్మభూతము అని చెప్పఁబడును. ఇది సుషుప్తి మూర్ఛాదులయందు ప్రసరణము లేనందున ప్రకాశింపదు.

(2) ఆత్మబద్ధుఁడు,. ముక్తుఁడు. నిత్యుఁడు, అని మూఁడుభేదములు కలవాఁడు. బద్ధుడు అనగా జననమరణాది రూపసంసారమును అనుభవించెడి, మన యాత్మ. ముక్తుఁడు అనగా భగవద్భక్తిచే సంసారము వదలి మోక్షమును పొందిన యాత్మ.

నిత్యుఁడు అనగా ఒకప్పుడును సంసారసంబంధము లేని అనంత గరుడ విష్వక్సేనాదుల యాత్మ. ఈముత్తెఅంగులు కల ఆత్మలు ప్రత్యేకములు.

(3) అచిత్తు అనగా జ్ఞానశూన్యమై వికారాస్పదమై ఉండునది. జలమునకు అగ్ని సంబంధము చేత వేడిమి కలుగునట్లు ఈ బద్ధాత్మకు అచిత్సంబంధముచేత అవిద్యా, కర్మవాసనా, రుచులు కలుగుచున్నవి. అవిద్య అనగాఁ అహంకార మమకారములు. కర్మము పుణ్యపాపములు. వాసన కర్మములచేత కలిగెడి సంస్కారము. రుచి విషయములయందు ఇచ్ఛ. ఆత్మకు విషయ భోగములును తత్సాధన ప్రవృత్తులును అచిత్సంసర్గము చేత కలుగుచు ఉన్నవి. ఈశ్వరారాధన ప్రవృత్తియు, తద్గుణానుభవములును, తజ్జన్య పరమానందము. స్వాభావికములు. ఈ అచిత్తు శుద్ధసత్వము, మిశ్రసత్వము, సత్వశూన్యము అని మూఁడు విధములు కలది. అందు రజస్తమస్సులు కలియని కేవల సత్వగుణము కలది శుద్ధసత్వము. అది నిత్యమై జ్ఞానానంద ప్రకాశమై కేవల భగవదిచ్ఛచేత గోపుర ప్రాకారాది రూపముగా పరిణమించి అధోదేశమున ఎల్లకలిగి, ఊర్ధ్వభాగమునందును ప్రక్కల యందును ఎల్లలేనిదిగా ఉండును. ఇది నిత్య విభూతి అని, పరమపదమని చెప్పఁబడుచున్నది, మిశ్రసత్వముసత్వాది గుణములు మూఁడునుకలది. ఇది బద్ధుల జ్ఞానానందములచే కప్పుచు విపరీతజ్ఞానమును పుట్టించుచు నిత్యమైఁ మహదాదివికారముల పుట్టించునదియై ఈశ్వరునకు క్రీడాసాధనముగా ఉన్నది.

మఱియును ఈ అచిత్తు ప్రకృతి అని, అవిద్య అని. మాయ అని చెప్పఁబడుచు ఉన్నది. ఇది చతుర్వింశతితత్వమయముగా ఉన్నది. అందు మొదటితత్వము ప్రకృతి. దీనికిసత్వరజస్తమస్సులుగుణములు. ఇవిప్రకృతికి సహజములైప్రకృతి తత్వావస్థయందు అప్రకాశములై కడమ అవస్థలయందు ప్రకాశములై ఉండును. సత్వము జ్ఞాన సుఖములను వాని యందు ఇచ్ఛను పుట్టించుచున్నది. రజస్సు రాగ తృష్ణలయందు సంగమును పుట్టించుచున్నది. తమస్సు విపరీతజ్ఞానమును నిద్రాలస్యాదులను పుట్టించు చున్నది. ఈ గుణములు ప్రకృతియందు సమములై ఉండినను ఈశ్వరునకు జగముల సృజియింపవలయునని ఇచ్ఛకలుగఁగా వైషమ్యము పొందును. ఆవల ఆప్రకృతినుండి మహత్తు అను తత్వము కలుగుచున్నది. అది సాత్వికము, రాజసము తామసము అని మూడు విధములు కలది. అందుండి వైకారికము తైజసముభూతాది అని మూడుఅహంకారతత్వములు కలుగుచున్నవి. వైకారికము అనుసాత్వికా అహంకారమువలన జ్ఞాన కర్మేంద్రియములును

అంతరింద్రియమైనమనస్సును పుట్టుచున్నవి. భూతాది అనెడు తామసాహంకారము వలన శబ్దతన్మాత్ర పుట్టుచున్నది. అందుండి ఆకాశమును స్పర్శతన్మాత్రయు పుట్టుచున్నది. ఆతన్మాత్రనుండి వాయువును, రూపతన్మాత్రయు పుట్టుచున్నవి ఆతన్మాత్రనుండి,తేజమునురసతన్మాత్రయు పుట్టుచున్నవి.ఆతన్మాత్రనుండిఅప్పును గంధతన్మాత్రయు పుట్టుచున్నవి. ఆతన్మాత్రమునుండి పృదివి పుట్టునున్నది. తన్మాత్రలు అనగా భూతముల సూక్ష్మావస్థలు. ఆతైజసముఅనెడి రాజసాహంకారము కడమ రెండు అహంకారములు కార్యముల పుట్టించుచున్నప్పుడు తోడుపడి ఉండును.

(5) సత్వశూన్యము కాలము. ఇది ప్రకృతి పరిణామములకు ఎల్ల హేతువై క్షణదినాది రూపముగా పరిణమించుచు, నిత్యమై ఈశ్వరునకు క్రీడాపరికరమై శరీరభూతమై ఉండును. ఇది సర్వవ్యాపకము.

(6) ఈశ్వరుడు నిఖిల హేయప్రత్యనీకుడై, అనంతుడై, జ్ఞానానందైక స్వరూపుడై, జ్ఞానశక్త్యాది కల్యాణ గుణపరిపూర్ణుడై. సకల జగముల సృష్టిస్థితి లయములకు కర్తయై చతుర్విధ పురుషార్థప్రదుడై, విలక్షణ విగ్రహ ముక్తుడై, శ్రీభూమి నీళానాయకుడై ఉండును. నిఖిలహేయ ప్రత్యనీకుడు అనగా అంధకారమునకు తేజమువలె వికారాదిదోషములకు విరోధిగానుండువాడు. విలక్షణ విగ్రహముక్తుడు అనగా అప్రాకృత దివ్యశరీరము గలవాడు. ఇతనికి సృష్ట్యాది వ్యాపారములకు ప్రయోజనము కేవల లీల.

(7) ఈశ్వరుడు విచిత్రరూపముగా పరిణమించునట్టి ప్రకృతిని అధిష్టించి ఉండుటచేసి జగములకు ఉపాదానకారణము అని చెప్పబడును. ఆతనికి చిత్తును అచిత్తును శరీరములు అని వేదములు చెప్పుచున్నవి మన దేహములను ఆత్మ అధిష్టించి ఉండునట్లు ఈశ్వరుడు ఆత్మలను శరీరాదులను అధిష్ఠించియున్నాడు. ఆత్మకు ఆత్మఅయినందున పరమాత్మ అని చెప్పబడుచున్నాడు.

(8) ఈమతమునందు (మృత్తుఘటాది రూపముగ పరిణమింపగా అమృద్ఘట ములకు నామభేదములు కాక వేరుభేదము లేనియట్లు) ఒక బ్రహ్మమే కార్యకారణ ములను అధిష్ఠించి ఉండుటవలన కారణ విశిష్ట బ్రహ్మమునకును కార్యవిశిష్ట బ్రహ్మమునకును, భేదములేదు. ఇదియే విశిష్టాద్వైతము అనబడుచు ఉన్నది. విశిష్టము అనగా కూడినది.

(9) ఈశ్వరునకు పరవ్యూహ విభవాంతర్యామ్యర్చలు అని ఐదు రూపములు కలవు. పరము అన నిత్యవిభూతియందు శుద్ధసత్వమయమై ఉండునట్టి దివ్యమంగళవిగ్రహము. వ్యూహము అన సృష్టి స్థితి సంహారాద్యర్థమై గ్రహించిన సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధరూపములు. విభవము రామకృష్ణాద్యవతారములు అంతర్యామి అని జీవులతో ప్రవేశించి ఉండునదియు శుభాశ్రయమైన విగ్రహము తోడ వారికి ధ్యానము చేయతగి వారి హృదయ కమలములయందు వాసము చేయునదియు అయిన రూపము. అర్చ అన ఆశ్రితులకు అభిమతములు అయిన ద్రవ్యములయందు మంత్రమూలముగా ఆవిర్భవించి ఉండునట్టి ఉనికి.

(10) ఈ మతమునందు సర్వపదార్థములును సత్యములు. కలలో కన్న అర్థములు సత్యములు. ఈశ్వరుఁడు ప్రాణుల యదృష్టాను రూపముగా అస్థిరములైన పదార్థములను సృజించుచున్నాఁడు అని శృతులు చెప్పుచున్నవి.

(11) బద్ధజీవుఁడు విషయ వైరాగ్యాదులచేత మోక్షేచ్ఛకలిగి సదాచార్యుని వలన వేదాంతార్థములను విని మననముచేసి వర్ణాశ్రమోచిత కర్మజ్ఞానములతో కూడిన నిధిధ్యాసనరూప భగవదుపాసనముచేత సంసారము వదలి అర్చిరాదిమార్గముగాపోయి నిత్యవిభూతికిని లీలావిభూతికిని నడుమను ఉండెడు విరజ అనునదిలో స్నానముచేసి దివ్యశరీరము పొంది నిత్య విభూతిని చేరి నిత్యముక్తులతోడ ఈశ్వరుని కల్యాణగుణములను అనుభవించుచు సర్వవిధ కైంకర్యములను చేయుచు పునరావృత్తిలేని నిరతిశయానందమును అనుభవించుచున్నాడు.

(12) ఇది వైష్ణవ విశిష్టాద్వైత మత స్వరూపము. శైవమతము సహితము విశిష్టాద్వైతమే. అందు సర్వము శివపరత్వము అని చెప్పుచున్నది. చిత్తు అచిత్తు ఈశ్వరు డనుటకు బదులుగా పశువు పాశము పతి అని చెప్పఁబడుచున్నది. వైకుంఠమునకు బదులు కైలాసము మోక్షస్థానమై ఉండును.

విశ్రవసుఁడు : పులస్త్యుని కొడుకు. ఇతనికి భార్యలు నలుగురు. అందు మొదటి భార్య తృణబిందువు కూతురు అగు ఇలబిల, ఆమెయందు కుబేరుఁడు పుట్టెను. రెండవ భార్య సుమాలి కూతురు అగు కైకసి. ఆమె యందు రావణ కుంభకర్ణ విభీషణులు పుట్టిరి. మూడవభార్య కైకసిచెల్లెలు అగు పుష్పోత్కట. దానియందు మహోదర మహాపార్శ్వాదులు జనించిరి. నాలవ భార్య కైకసి రెండవ చెల్లెలు అగు రాక. ఆమె ఖరదూషణ త్రిశిరులను కనెను.

విశ్వ : దక్షప్రజాపతి కూతురు. ధర్ముని భార్య. కొడుకులు విశ్వేదేవతలు. (మత్స్య)

విశ్వకర్మ : ప్రభాసునకు యోగసిద్ధియందు పుట్టిన కొడుకు. ఇతఁడు దేవశిల్పి. (బ్ర. వై).

విశ్వకుఁడు : (1) ఇ। చూ॥ నా। విశ్వగంధుఁడు. (2) అంగిరసుని వంశస్థుఁడగు ఒక అగ్ని.

విశ్వగంధుఁడు : ఇ॥ పృథుని కొడుకు, నా॥ శాశ్వతుఁడు. విశ్వకుఁడు, ఇందుఁడు, చంద్రుఁడు, అలి చాంద్రుఁడు.

విశ్వజిత్తు : బా॥ జయద్రథుని కొడుకు, సేనజిత్తు తండ్రి.

విశ్వపతి : అంగిరసుని వంశస్థుడగు ఒక అగ్ని.

విశ్వభుక్కు : అంగిరసుని వంశస్థుడగు ఒక అగ్ని.

విశ్వము : ఒకానొక సంస్కృత నిఘంటువు. విశ్వుఁడు అను నతఁడు చేసినది కనుక దీనికి ఈ పేరు కలిగెను.

విశ్వరూపుడు : త్వష్టకు రచనయందు పుట్టిన కొడుకు. ఒకప్పుడు దేవగురువు అగు బృహస్పతి ఇంద్రసభకురాగా ఇంద్రుఁడు మదోద్రేకముచే అతనిని గౌరవించి ఉపచరింపకపోయెను. అంతట బృహస్పతి మిగుల కోపించి తన అధ్యాత్మ మాయచే ఇంద్రునకు కానఁబడక పోయెను. అప్పుడు గురువు లేమిచే దేవతలు తమ యైశ్వర్యము అంతయు దైత్యులచే కోలుపోయి బ్రహ్మతో తమ అవస్థ చెప్పుకొనగా అతఁడు విశ్వరూపుని గురువుగా వేడుకొండు అని ఉపదేశించెను. వారును అట్లు చేసిరి. అంత విశ్వరూపుఁడు ఇంద్రునకు నారాయణ కవచమును ఉపదేశముచేయగా దాని మహత్వము వలన మరల ఇంద్రుఁడు తన పూర్వికపు ఐశ్వర్య స్థితిని పొందెను. అట్లు పొందినవాఁడు అయ్యును ఇంద్రుఁడు మాతృపక్షమును అవలంబించి అసురులకు అనుకూలుఁడుగా ఉండిన విశ్వరూపుని చూచి ఓర్వజాలక అతనిని పరిమార్చెను.

ఈవిశ్వరూపునకు తలలు మూఁడు. అందు ఒకటి సోమపానముచేయుటకును, మఱియొకటి సురాపానము చేయుటకును, ఇంకొకటి అన్నము భుజియించుటకును

ఉపయోగించుచు ఉండెను. ఆ మూఁడు తలలును ఇంద్రునిచేత నరకఁబడి ఒకటి కపిం జలమును, ఒకటి కల వింకమును, ఒకటితిత్తిరియును అయి ఇంద్రుని ఆక్ర మించెను. అంత ఇంద్రుఁడు తనకు పొసగిన పక్షిరూపమగు ఆ బ్రహ్మహత్య పాతకమును నాలుగు భాగములుగ భాగించి భూజలవృక్షస్త్రీలయందు నిలిపి తాను విముక్తుఁడు అయ్యెను. చూ॥ ఇంద్రుఁడు.

విశ్వసహుఁడు : ఇ। వృద్ధశర్మని కొడుకు. ఖట్వాంగుని తండ్రి.

విశ్వానరుఁడు : రు॥ శాండిల్యవంశమున జనించినవాఁడు. ఇతని కొడుకు వైశ్వా నరుఁడు. (అను అగ్ని) (కాశీ)

విశ్వామిత్ర : వైడూర్యపర్వతమున ఉత్పత్తి అగు నొకనది.

విశ్వామిత్రుఁడు : రు॥ పురూరవుని మూడవ కొడుకు అగుఅమవసువు వంశస్థుఁడు. గాధిపుత్రుఁడు. వసిష్ఠునితోడి స్పర్ధముచే తపము సలిపి బ్రహ్మర్షి అయ్యెను. ఇఁతడు మహాకోపిగాన ఇతని తపమునకు పలుమాఱు విఘ్నములు సంభవించు చుండెను. మెండియు ఇతఁడు నలుదెసలకుపోయి తపము ఆచరించినట్టు చెప్పిఉన్నది. ఒకప్పుడు ఇతని తపస్సు మేనకచే విఘ్నము చేయబడియెను. అప్పుడు పుట్టిన శకుంతల కణ్వమహర్షి ఆశ్రమముచేరి, దుష్యంతునకు భార్య అయ్యెను. మఱి యొకప్పుడు స్వర్గమునకు త్రిశంకుని పంపగోరి తన తపోఫలమును పోగొట్టుకొని యెను, ఒకానొకప్పుడు హరిశ్చంద్రుని బొంకింపదలచి తన తపోఫలమును ఎల్ల తదర్థమై వినియోగపరచెను. చూ॥ త్రిశంకు. హరిశ్చంద్రుఁడు. మఱియు యాగ పశువునకుఁ బదులుగా కొనఁబడిన శునస్సేఫుని కాపాడుట కొఱకు కొంత తపః ఫలమును పోగొట్టుకొనెను. (భార) (రామా)

విశ్వావసుఁడు : ఒక గంధర్వరాజు. ఇతనికి యాజ్ఞవల్క్య మహర్షి తత్వోపదేశము చేసెను అని ప్రసిద్ధి. (భార)

విశ్వేదేవతలు : శ్రాద్ధకాలమునందు అర్చింపఁబడు దేవతలు. శ్రాద్ధాగ్రమునందు ప్రవేశించువారు, అని వ్యుత్పత్త్యర్థము. వీరు పదుగురు. వసుబంధులు. క్రతుదక్షులు. కాలకాములు. దురివిరోచనులు. పురూరవార్ద్రవులు.

విశ్వేశ్వరుఁడు : కాశియందు ఉండు చంద్రశేఖరస్వామి. ఇతనికి అన్నపూర్ణ విశాలాక్షి అని ఇరువురు భార్యలు.

**విష్ణుపురాణము** : అష్టాదశపురాణములలో ఒకటి. ఇది పరాశరప్రోక్తము. వరాహ కల్పసంబంధ విష్ణుమహిమాభివర్ణనాదులు ఇందు చెప్పఁబడును. దీని గ్రంథ సంఖ్య 24000.

**విష్ణువర్ధనుఁడు** : చూ॥ భాస్కరవంతుఁడు.

**విష్ణువు** : త్రిమూర్తులలో ఒకఁడు. చూ॥ త్రిమూర్తులు. ఇతని వ్యాపారము జగత్తును రక్షించుట. మఱియు ఇతఁడు దుష్టనిగ్రహమును శిష్టపరిపాలనమును చేయుట కొఱకు భూమియందు పెక్కు అవతారములు చేసెను. అందు ముఖ్యములు పది 1. మత్స్యావతారము. 2. కూర్మావతారము. 2. వరాహావతారము. 4. నరసింహావతారము. 5. వామనావతారము. 6. పరశురామావతారము 7. శ్రీరామావతారము. 8. బలరామావతారము ఇది కృష్ణావతారము అనియు అనఁబడును, 9. బౌద్ధావతారము. 10. కల్క్యవతారము. ఇతఁడు పీతాంబరుఁడు, గరుడధ్వజుఁడు, చక్రాయుధుఁడు, లక్ష్మీపతి ఇత్యాది నామములు అనేకములు కలవాఁడు. మఱియు ఇతనికి ఆయుధములు అయిదు. సుదర్శనము (చక్రము) పాంచజన్యము (శంఖము) కౌమోదకీ (గద) నందకము (ఖడ్గము) శార్ఙ్గము. (ధనుస్సు) ఇతఁడు ధరించు మణికౌస్తుభము. రొమ్మునందలి మచ్చ శ్రీవత్సము. ఇతఁడు శరణాగతులు అగు అసురులకు అడ్డము వచ్చిన భృగుపత్నిని చంపి అందులకై భృగుమహర్షి యేఁడుమార్లు నరరూపమున భూమిని జనింపుము అని శపింపగా రామకృష్ణాద్యవతారములు ఎత్తెను. (భాగ)

**విష్ణుశర్మ** : (1) దేవనారాయణపురము అనెడి అగ్రహారమున వసించిన ఒక బ్రాహ్మణుఁడు. ఇతని కొడుకు విక్రమార్కుని తండ్రి అగు చంద్రశర్మ.

(2) ఒకానొక విద్వాంసుఁడు. ఇతఁడు సుదర్శనుఁడు అను రాజు యొక్క కొడుకులకు పంచతంత్రములనుపేర ఒక నీతిశాస్త్రమునుచేసి దాని మూలమున అనేక రాజనీతులను తెలిపెను. (భాగ)

**విష్వక్సేనుఁడు** : (1) బ్రహ్మదత్తుని కొడుకు. (2) విష్ణు పరిచరులలో ఒక్కఁడు ఇతఁడు వైకుంఠసేనానాయకుఁడు. (భాగ)

**విష్వగ్జ్యోతి** : ప్రియవ్రతుని వంశస్థుడు అగు ఒకరాజు.

**విసృష్టుఁడు** : య॥ కంసుని తమ్ముఁడు.

విహారము : ఒకానొక దేశము. ఇది వంగదేశమునకు ఉత్తరమున ఉండును.

## వీ

వీణ : తపతీనదికి నామాంతరము.

వీతిహోత్రుఁడు : (1) య॥ తాళజంఘుని కొడుకు. (2) కా॥ దృష్టకేతుని కొడుకు. భార్గవుని తండ్రి. (3) ఇంద్రసేనుని కొడుకు. (భార)

వీరకుఁడు : (వీరకుఁడు) వినాయకుని నామాంతరము.

వీరణుఁడు : ఒక ప్రజాపతి.

వీరదాసు : హరిశ్చంద్రుఁడు వీరబాహునికి దాసుఁడుగా ఉండునపుడు పొందిన నామము.

వీరనగరము : దేవికానదీతీరమున పులస్త్యబ్రహ్మ తపము ఆచరించిన స్థలము.

వీరనృసింహుఁడు : కృష్ణదేవరాయల అన్న.

వీరబాహువు : విశ్వామిత్ర ప్రార్థనచే హరిశ్చంద్రుని దాసునిగా కొనుటకై చండాల రూపమున కాశిలో అవతరించిన యముఁడు.

వీరభద్రుఁడు : శివుని కుమారులలో ఒకఁడు. రౌద్రమూర్తి వహించిన శివుఁడు తన జడను పెరికి నేలను తాడింపఁగా ఇతఁడు జనించెను. దక్షుఁడు బ్రహ్మచేయు సత్రయాగము చూడవచ్చినప్పుడు తన్ను కని లేచి మాటలాడని తన అల్లుఁడు అగు శివునిపై కోపించి శపించి పోయెను. నాటినుండి దక్షునకు హరునిపై వైరము విడువక ఉండెను. కాఁబట్టి అతనిని అతని భార్యయు తన కూతురును అగు ఉమను పిలువకయే బృహస్పతి సవనమును చేయఁదొడగెను. అది తెలిసి ఉమ తన తండ్రి చేయు యాగమును చూడ వేఁడి విభునిచే అనుజ్ఞవడసిపోయి తండ్రిచే అవమానిత అయి అతని నిందించుచు సమాధినుండి యోగాగ్నిని కల్పించుకొని దాన దగ్ధ రాలు అయ్యెను. అంత ఆవృత్తాంతమును అంతయు శివుఁడు నారదముని వలన ఎఱిఁగి కుపితుఁడై తన జడ ఒకటి పెరికి పుడమిపైవైవ, అందు వీరభద్రుఁడు పొడమి ఘోరమూర్తి అయి దక్షునిని అతని యజ్ఞమును ధ్వంసముచేయ శివుని వలన ఆనతి పొంది దక్షుని యజ్ఞశాలకు చని యజ్ఞధ్వంసమును దక్షవధయును కావించెను. అంత బ్రహ్మ మొదలగు దేవతలు శివుని ప్రార్థింప శివుఁడు ప్రస

న్నుఁడు అయి మరల దక్షాదులను అనుగ్రహించెను. ఇట్లు దక్షయజ్ఞము ధ్వంసము అగు కాలమున యజ్ఞపురుషుఁడు మృగరూపము దాల్చి పారిపోవుచు నుండఁగా ఆ మృగమును వీరభద్రుఁడు వధింప శివుఁడు మరల ఉజ్జీవింప చేసెను.

**వీరసేనుఁడు** : నిషధదేశపురాజు అగు నలుని తండ్రి.

# వృ

**వృకుఁడు** : (1) ఇ॥ రుకుని కొడుకు. బాహుకుని తండ్రి. (2) ది॥ శకుఁడు అను దైత్యుని కొడుకు. వీడు శివుని గూర్చి తపము ఆచరించి తన పాణి తలము ఎవ్వని తలమీద పడునో వానికి శిరస్సు నూఱు వ్రక్కలు అగునట్లు వరము పొంది అవరపరీక్షార్థము శివుని తలమీఁదనే తన పాణితలమును ఇడబోవ అతఁడు భయపడి పాఱుచు ఉండగా విష్ణువు ఒక వటువేషముతో ఆ దైత్యునికి కనఁబడి శివుఁడు బొంకులనూఱి అని నీకు తెలియదుకాబోలు, అతఁడు దక్షుని శాపముచే పిశాచాధిపతి అయి బొంకుచు తిరుగుచు ఉండును, అతని మాటలు నమ్మి ఏల పరుగువాఱి బడలెదవు. అయినను నీవు అతనిని అంటగోరుదువేని స్నానము ఒనర్చి శుచివై తఱుముకొని పొమ్ము, నీకు అతఁడు చిక్కును అని చెప్పగా అట్లుచేయుదును అని స్నానము చేయబోయి అఱచేయి తన తలనుచేర్చి కొని వాఁడు మడిసెను. (3) య॥ వసుదేవుని అనుజుఁడు. (4) వసుదేవుని తమ్ముఁడు అగు వత్సకుని పుత్రుడు.

**వృకోదరుఁడు** : భీమునికి నామము.

**వృషణుఁడు** : కార్తవీర్యార్జునుని పౌత్రుఁడు. మధువుయొక్క పుత్రుఁడు. వృష్ణి తండ్రి.

**వృజినవంతుడు** : య॥ క్రోష్టువుయొక్క కొడుకు.

**వృత్తరత్నాకరము**: కాళిదాస కృతము అగు ఒక లక్షణ గ్రంథము.

**వృత్రుఁడు** : ఒకానొక అసురుఁడు. తన జ్యేష్ఠపుత్రుఁడు అగు విశ్వరూపుని ఇంద్రుఁడు చంపినందులకు త్వష్ట కోపించి (చూ॥ విశ్వరూపుఁడు) ఇంద్రుని జయించుటకై వీనిని పుట్టించెను. అట్లు పుట్టింపబడి వీఁడు ఇంద్రుని ఎదిరించిపోరాడు

నపుడు అతని మ్రింగగా అతఁడు అతి సూక్ష్మగాత్రుఁడు అయి మరల వెలుపలికి వచ్చి వీనితో మైత్రిచేసి కపటవృత్తితో మెలగుచు ఉండి కొంతకాలమునకు అనంత రము విష్ణు సహాయమున వీనిని చంపెను. (చూ॥ ఇంద్రుఁడు, చిత్రకేతుఁడు) దేవ తలు నర్మదాతీరమున ఈ వృత్రాసురునితో కృతయుంగాతమున కియ్యము ఆరంభించి త్రేతాయుగ ప్రారంభమువరకు పోరిరి. (భార)

వృద్ధక్షత్రుఁడు : జయద్రధుని తండ్రి. (భార)

వృద్ధశర్మ్ముఁడు : ఇ॥ దశరథుని కొడుకు. ఇతనికి దిలీపుఁడు అనియు ఒక పేరు కలదు. కొడుకు విశ్వసహుఁడు.

వృషకుఁడు : శకుని తమ్ముఁడు. [భార]

వృషణుఁడు : య॥ కార్తవీర్యార్జునుని మూడవ కొడుకు.

వృషదర్భుఁడు : శిబిచక్రవర్తి జ్యేష్ఠపుత్రుఁడు. ఉశీనరదేశాధిపతి.

వృషధ్రుడు : ఇక్ష్వాకుని తమ్ముఁడు. వైవస్వతుని కొడుకు. ఇతడు గురు శాపముచే శూద్రత్వమును పొంది మరల అతని యనుగ్రహముచే మహా తపము ఆచరించి పరబ్రహ్మమును చెందెను.

(మార్క-)

వృషపర్వుఁడు : దానవరాజు. శుక్రుని శిష్యుఁడు. ఇతఁడు కశ్యపునకు దనువువలన పుట్టినవాఁడు. ఈ వృషపర్వుని కూతురు అగు శర్మిష్ఠ, శుక్రుని కూతురు అగు దేవయానను ఒకప్పుడు అవమానింపగా అందుకై శుక్రుఁడు మిగుల కోపించెను అందులకు వృషపర్వుఁడు వెరచి తన కూతురు అయిన శర్మిష్ఠను దేవయానకు దాసిగా ఇచ్చెను. అనంతరము దేవయాన యయాతిని పెండ్లాడి అతని యొద్దనుండు కాలమున ఆమెతో గూడ ఉండిన శర్మిష్ఠకును యయాతికిని సంగమము కలుగునట్లు ప్రాప్తమయినందున దేవయానవలె శర్మిష్ఠయు యయాతికి భార్య అయ్యెను. చూ॥ యయాతి.

(భార)

వృషభగిరి : ఒకానొకపర్వతము. ప్రస్తుతము దీనిని రత్నగిరి అందురు. ఇది మగధదేశమున వరాహపర్వతముతో కూడి ఉండును.

వృషరథుడు : కర్ణుని తమ్ముడు.

వృషసేనుడు : కర్ణుని కొడుకు. ఇతడు అర్జుననిచే చంపబడెను. (భార)

వృషుడు : శృంజయుని కొడుకు. తల్లి రాష్ట్రపాలిక .

వృష్ణి : (1) య॥ వృష్ణుని కొడుకు. (2) విదర్భుని రెండవ కొడుకు, వంశస్థుడు అయిన సాత్వతుని నాలవ కుమారుడు. ఇతని వంశస్థులు వృష్ణులు అనబడుదురు. కొడుకులు సుమిత్రుడు. యుధాజిత్తు, అని యిరువురు. (3) అంధకుని పౌత్రుడు. కుకురుని కొడుకు. (4) భజమానుని కొడుకులలో ఒకడు. (భాగ)

## వె

వెంకమ్మ : (తరిగొండ) ఒక విద్వాంసురాలు. ఈమె వేంకటేశ్వర మహాత్మ్యము అను ఒక పద్యకావ్యమును రాజయోగ సారము అను ఒక ద్విపద కావ్యమును తెనుగున రచించెను. ఇవి రెండును వేదాంత గ్రంథములు; అద్వైతమును ప్రతిపాదించునవి.

## వే

వేంకటకవి : (పైడి మఱ్ఱి) (1) ఒకానొక ఆంధ్రకవి. ఇతడు చంద్రాంగద చరిత్రము అనుకావ్యమును రచించెను.

(2) (చేమకూర) ఒకానొక ఆంధ్రకవి. ఇతడు విజయవిలాసమును: సారంగధరుని చరిత్రమును రచించెను.

వేంకటపతి : (శేషము) ఇతడు శశాంకవిజయమును రచియించెను.

వేంకటాచల మహాత్మ్యము : ఇది తిరుపతిక్షేత్రము యొక్క మహిమను తెలుపును చూ॥ తిరుపతి.

వేంకటాద్రి విభుడు: ఆకువీటి పురమునకు రాజు. ఇతని ప్రేరేపణచే పింగళి సూరన రాఘవపాండవీయమును రచియించెను.

**వేంకట్రంగకవి** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు శశిరేఖాపరిణయమును కావించెను.

**వేగవతి** : ఒకానొక యేరు. ఇది దక్షిణ మధురగుండ ప్రవహించి దక్షిణ సముద్రమున చేరును.

**వేణీసంహారము** : ఒక సంస్కృత నాటకము. ఇది భట్టి నారాయణుఁడు అను కవీంద్రునిచే చేయబడియెను. ఇందు దుర్యోధనాదులతో ధర్మరాజు జూదము ఆడి ఓటువడినప్పుడు ద్రౌపదిని దుశ్శాసనుఁడు సభలో కొప్పుపట్టి ఈడువగా భీముఁడు చూచి కోపించి దుశ్శాసనుని రొమ్ము పగిల్చి నెత్తురుత్రాగి, ఆనెత్తురు తోడి చేతులతో ద్రౌపది తలవెండ్రుకలను ముడివేయునట్లు శపథముచేసి ఆశపథమును నెరవేర్చుకొను కథ చెప్పబడి ఉండును.

**వేణుహాయుడు** : య॥ శతజిత్తు రెండవ కొడుకు.

**వేదగర్భ** : దుర్గాదేవికి నామాంతరము.

**వేదములు** : శ్రుతులు ఇవి ఋగ్యజు, స్సామాధర్వణము అని నాలుగు భేదములు కలవి. ఆనాలుగును బ్రహ్మకాండము, కర్మకాండము అని రెండు భాగములుగ ఉండును. అందు బ్రహ్మకాండము సాక్షాత్తుగ బ్రహ్మము యొక్క స్వరూపమును ప్రతిపాదించును. అదియే ఉపనిషత్తులు కర్మకాండము. వర్ణాశ్రమోచిత కర్మములు లోనగు వానిని వివరించును. ఆ కర్మములు అన్నియు అగ్నీంద్రాదిదేవతల పూజారూపములు అగుచు సర్వాంతర్యామి అగు ఈశ్వరునికే పరంపరగా ప్రీతిజనకములు అయి ఉన్నవి.

ఆవేదములు ఈశ్వరప్రతిపాదకములై అనంతములై బ్రహ్మకు ఆధీనములై ఉండగా సోమకాసురుడు బ్రహ్మ నిద్రించునప్పుడు వీనిని అపహరించుకొనిపోయి సముద్రమున దాచెను. అప్పుడు విష్ణువు మత్స్యావతారము ఎత్తి సముద్రమునచొచ్చి సోమకాసురుని కనిపట్టి చంపి వేదములను తెచ్చి బ్రహ్మకు ఇచ్చెను. అటు పిమ్మట విష్ణువు కృష్ణద్వైపాయనుని అవతారము ఎత్తి అట్టి అనంతములు అయిన వేదములను ఋగ్యజు స్సామాధర్వణములు అని నాలుగు భాగములుగా విభజించి వేదవ్యాసుఁడు అనబడెను.

అందు ఋగ్వేదము బహుతరముగ మంత్రభాగము అయి ఉండును. యజుర్వేదము విశేషించి విధులయొక్క రీతులను బోధించును. సామము స్తోత్రరూపము అయి ఉండును. అధర్వణము శాంత్యాదులను గురించి చెప్పును.

వేదమునకు అంగములు ఆరు. అవిశిక్ష, వ్యాకరణము, చందస్సు, జ్యోతిషము, నిరుక్తము, కల్పము. శిక్షయందు వేదములు యొక్క స్వరము మొదలైనవాని లక్షణములు చెప్పబడును స్వరము వేదమునకు మిక్కిలి ముఖ్యమైనది. అది తప్పిన దాని అర్థము సైతము వేరుఅగును. వ్యాకరమునందు శబ్దలక్షణము చెప్ప బడును. ఛందమున శ్లోక లక్షణములు వివరింపబడును. నిరుక్తమున వేద మంత్రోక్త శబ్దములకు అవయవార్థములతోడ అర్థము చెప్పబడును. జ్యోతిషమున వేదముచే విధింపబడిన కర్మములకు ఉచితమైన కాలములను ఎరుగ దగిన మార్గము చెప్పబడును. కల్పమునందు యాగాది క్రియలను చేయవలసిన రీతులు బోధింపబడి ఉండును ఇవిగాక ఉపవేదములు నాలుగు కలవు. అవి యజుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వవేదము, అర్థవేదము అనబడును.

“యతోవా ఇమానిభూతానిజాయంతే, ఏన భూతాని జీవంతి, యత్ప్రయత్యభి సంవిశంతి,” ‘సర్వజ్ఞ బ్రహ్మ జగతః కారణమ్’ ‘సర్వం ఖల్విదం బ్రహ’ ‘ఆకాశ శరీరం బ్రహ్మ’ సః ఇమాన్ లోకాన్ అసృజత్’ ‘యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి’ ‘కో హ్యేవాన్యాత్ = కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందోనస్యాత్’ ‘తద్విష్ణోః పరమంపదంసదాపశ్యంతి సూరయః.’ “అనేన జీవేన ఆత్మనాను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి” “వేదాహమేతం పురుషం మహాంతం ఆదిత్య వర్ణంతమసః పరస్తాత్” “యమే వైషవృణుతే తేన లభ్యః” ‘ఏకం సంతం బహుధాకల్పయతి’ “తత్సృష్ట్వా తదేవ అను ప్రవిశతి” ‘సదేవసోమ్యే దమగ్ర ఆసీత్, బ్రహ్మవా ఇదమగ్ర ఆసీత్, ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, న బ్రహ్మ, నేశానః నేమేద్యావా పృథివీ నక్షత్రాణి.’

“తరతిశోకమాత్మవిత్” “సోకామయత బహుస్యాం ప్రజాయేయ” ‘పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చభవ్యం’” తత్త్వమసి, అయమాత్మా బ్రహ్మ” ‘ఏతదాత్మ్య మిదం సర్వం’ ‘సవై శరీర ప్రథమః’ ‘నకర్మణాన ప్రజయా ధనేన త్యాగే నైకేన అమృతత్వమానశుః’ ‘సతం జ్ఞాన మనన్తం బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, యత్సాక్షాద పరోక్షద్బ్రహ్మయ ఆత్మాసర్వాంతరః

ఆత్మైవేదం సర్వం, ఆత్మనః ప్రాణ ఆత్మనోమన ఆత్మ ఆకాశ ఆత్మ తస్స్వర, ఆత్మ తస్తేజ ఆత్మత ఆప ఆత్మత అవిర్భావతిరోభావౌ ఆత్మతోన్నం' 'సనం దృశే తిష్ఠతిరూపమస్య నచక్షుషా పశ్యతికశ్చ నైనం, అశబ్దమస్పర్శ మరూప మవ్యయం" ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మ స్వరూపమును తెలుపును.

వేదవతి : సీత యొక్క పూర్వజన్మ నామధేయము. ఈమె కుశధ్వజుఁడు అను మునికి మానస పుత్రి అయి జన్మించి అతఁడు తన్ను విష్ణువునకు ఇచ్చి పెండ్లి చేయవలెను అని నిశ్చయించు కొనియుండగా దంభుఁడు అను రాక్షసుఁడు ఈమెను తనకు ఇమ్మని అడిగెను. అతఁడు అందులకు సమ్మతింపకపోగా ఒకనాడు రాత్రివేళ వచ్చి నిద్రించుచూ ఉన్న కుశధ్వజుని చంపి ఆ బ్రహ్మ హత్య తన్నుపట్టి బాధింపగా వాఁడును మృతుఁడు అయెను. అంతట ఈమె తండ్రి నిశ్చయించిన చొప్పున విష్ణువునే వివాహము కాతలచి ఘోరతపము ఆచరించుచు ఉండెను. అప్పుడు దిగ్విజయార్థము ఆదారిని పోవుచున్నరావణుఁడు ఈమెను చూచి మోహించి తన్ను వరింపుము అనగా ఈమె దానికి సమ్మతింపక వాఁడు బలాత్కారమున పట్టి రాగా, ఓరి దుష్టుఁడా! నీవు నన్ను అవమానించితివి కావున నేను ఈ భూమియందే అయోనిజను అయి పుట్టి నీ వంశమును నిన్నును నాశము సేయుటకు కారణభూతురాలను అగుదును చూడుము అని పలికి యోగాగ్నిని కల్పించుకొని అందు ప్రవేశించి దేహమును విడిచి పిమ్మట లంకలో ఒక తామరకొలనిలో జనించి అందు శివపూజకొరకు తామరపూవులు కోయుచున్న రావణునికి ఒక కమలమునందు కనబడెను. ఆ శిశువును రావణుఁడు కొనిపోయి అది లంకకు నాశకురాలు అగునుఅని బ్రహ్మరక్షస్సులు తెలుపగా, దానిని ఒక పెట్టెలో ఉనిచి సముద్రమున వైచెను అది అలలతాకుఁడుచే అవలిదరికి కొట్టుకొని పోయి భూమిలో పాదుకొని యజ్ఞము నిమిత్తము నేలను దున్నునపుడు జనకునకు దొరకెను. అంతట అతఁడు ఆపెట్టెను తెరచి చూచి అందు ఉన్న శిశువును ఎత్తి పెంచి రామునికి ఇసగెను. అనంతరము ఈమె రావణునిచే అపహరింపబడిన పుత్రపౌత్ర బాంధవముగా వాని నశింపజేయుటకు కారణము అయెను.

వేదశిరుఁడు : పాణుని కొడుకు. ఉసేనన్ను తండ్రి. మార్కండేయుని కొడుకు అని కొన్ని యెడల చెప్పబడి ఉన్నది. (మార్క) (బ్రహ్మ)

వేదిక : ధర్మరాజు భార్య.

వేగుఁడు : రు॥ పౌష్యరాజుకు ఉపాధ్యాయులు. అయోద ధౌమ్యుని శిష్యుఁడు

వేధ : బ్రహ్మ.

వేనుఁడు : స్వాయంభువుని వంశస్థుఁడు అగు అంగుని కొడుకు పృథుచక్రవర్తి తండ్రి. ఇతని మాత మృత్యువు పెద్దకూఁతురగు సునీథ. ఇతఁడు మాతామహుఁడు అగు మృత్యువువలె కడు క్రూరుఁడు అయి ప్రవర్తించుచూ ఉండగా ఆక్రూరత్వము ఓర్వఁజాలక బ్రాహ్మణులు తమ శాపములచేత వీనిని ప్రాణహీనునిగా చేసి పిమ్మట తమ దివ్యజ్ఞానము వలన అందులకు కారణమును ఎరిగి అతనికి సంతతిని కలిగించువారై అతని తొడలను ఒండొంటితో రాయగా అందుండి బాహుకుఁడు అను ఒక నిషాదుఁడు నల్లని వికార రూపముతో వెడలి వచ్చెను. అపుడు వానిని పరిగ్రహింపను వల్లక పురమునుండి వెడలకొట్టిరి. అట్లు వెడలకొట్టబడినవాని వంశస్థులు నిషాదులు అనిబడుచు అడవులయందును కొండలయందును తిరుగుచు ఉండుదురు. ఇట్లు నిషాద రూపమున వేనుని దేహమునందలి పాపము వెలువడిరాగానే వాని బాహువులను ఒండొంటి చేర్చి ఒరసిరి. అప్పుడు అందు పృథుచక్రవర్తి పుట్టెను.

(బ్రహ్మం)

వేల : మేరువు కూతురు. సముద్రుని భార్య.

## వై

వైదూర్యము : ఒకనొకపర్వతము. ఇది నర్మదా తపతీనదుల మధ్యగత ప్రదేశమున ఉండునది. చూ॥ మధుఁడు.

వైతరణి : (1) నరకమునందు ఉండెడు ఏఱు. ఇది పాపులు పుణ్యలోకమునకు పోకుండ అడ్డముగా ప్రవహించుచు ఉండును. (2) పితరులకు స్వధవలన పుట్టిన రెండవ కూఁతురు. (3) కళింగదేశముగుండ ప్రవహించునట్టి ఒక నది. ఇందు సకల యజ్ఞములందును ప్రశస్తము అయిన పశుభాగమును పశుపతికి దేవతలును ఋషులును కల్పించిరి.

వైదూర్యము : నా॥ వైదూర్యము.

వైన్యుఁడు : చూ॥ నా॥ పృథువు. ఇతఁడు వేనుని వామబాహువున పుట్టెను.

వైభ్రాజ : మేరువుకు పశ్చిమమున ఉండు ఒక గొప్ప అడవి.

వైవస్వతుఁడు : ఒక మనువు. వివస్వతుని కొడుకు. భార్య శ్రద్ధ. కొడుకులు ఇక్ష్వాకుఁడు, నృగుఁడు, శర్యాతి, దిష్ఠుఁడు, ధృష్టుఁడు, కరూశుఁడు నరిష్యంతుఁడు, వృషధ్రుఁడు, నభగుఁడు, కవి అను పదుగురు. వారలలో కవి అనువాఁడు బాల్యమునందే మృతుఁడు అయినందున సాధారణముగ ఇతనికి తొమ్మండ్రు కొడుకులు అనియే యెల్లవారలు చెప్పు కొందురు.

ఈతనినుండివచ్చిన వంశములలో, ఇక్ష్వాకువంశముఅనబడు ఇక్ష్వాకునిజ్యేష్ఠపుత్రులు అయిన కుక్షివంశమువారికి అయోధ్యానగరము రాజధానిగా ఉండెను. కుక్షితమ్మఁడు అగునిమివంశమువారికి మిథిలానగరము ముఖ్యపట్టణముఆయెను వైవస్వతునిపుత్రులలో కరూశుఁడు అనువాఁడు వారిపత్రపర్వతసమీపమున మహాబలపరాక్రములు అగు కరూశులుఅనెడు క్షత్రియులకు ఆదిపురుషుఁడు ఆయెను. అతని పుత్రులలోనే మఱి ఒకఁడు అగు నభగుని వంశస్థులు, గంగా, గండకీ నదుల సంగమ సమీపమున గండకి దక్షిణతీరమున ఉండు విశాల రాజ్యములకు ప్రభువులు అయిరి. వేఱొకఁడు అగు శర్యాతి వంశస్థులు ఆనర్తదేశములయందు కుశస్థలిని ముఖ్యపట్టణముగా కలిగి ఉండిరి.

ఈ కుమారులు పుట్టకమునుపు వైవస్వతుఁడు పుత్రార్థియై ఒక యజ్ఞము చేయగా, అపుడు వైవస్వతుని భార్య తనకు కూతురు పుట్టునట్లు వేల్వుము. అని యజ్ఞము నడపెడు హోతను వేఁడెను. కావున ఆతఁడు అందులకు తగిన మంత్రములను పఠించి వేల్చెను. అంతట ఇలఅను కూతురు పుట్టెను. దానితో వైవస్వతుఁడు తృప్తిపొందక కొడుకు కావలెను, అని వశిష్ఠుని వేఁడగా అతఁడు ఆ కూతును కొడుకుగ జేసెను. ఆ కొడుకు సుద్యుమ్నుఁడు అను నామము పడసి రాజ్యము చేయుచు ఉండు తఱిని ఒకప్పుడు వేఁటాడఁబోయి కుమారస్వామియొక్క, జన్మభూమి అగు శరవణవనము చొచ్చి యెప్పటివలె ఆడుతనమును పొందెను. అందులకు హేతువు యేమనగా ముందు ఒకప్పుడు పార్వతీపరమేశ్వరులు ఆవనమునందు క్రీడించుచు ఉండినప్పుడు, ఆరహస్యము తెలియక కొందఱు మునులు ఆచ్చటికిరాగా పార్వతి సిగ్గుపడెను. అది చూచి పరమేశ్వరుఁడు ఇది మొదలు యేమగవాఁడు ఈఆశ్రమము ప్రవేశించినను మగువ అగును అని పలికి ఉండెను. అది యెఱుగక సుద్యుమ్నుఁడు ఆ ఆశ్రమము

ప్రవేశించి మగువ అయ్యెను. అట్లు స్త్రీత్వమును వహించిన ఇలబుధుని పెండ్లాడి అతని వలన పురూరవుని కనెను. వాని వలన చంద్రవంశము అభివృద్ధి పొందెను. పిదప వైవస్వతుఁడు వసిష్ఠుని వేడి అతఁడు రుద్రుని గూర్చి తపము సలిపి ఆ దేవుని ప్రసాదమున ఒక మాసము స్త్రీరూపమున ఇలగాను, మఱియొక మాసము పురుష రూపమున సుద్యుమ్నుఁడుగాను ఉండునట్లు వరము పడయగా వంతసించి గురువును సమ్మానించెను. (భాగ)

వైశంపాయనుఁడు: రు॥ విశంపుడు అను ఒక ఋషి కొడుకు. వ్యాస శిష్యులలో ఒకఁడు. ఇతఁడు జనమేజయునకు వ్యాసోపదేశమున భారతమును వినిపించెను. ఇతఁడు యజుర్వేదాధ్యేత. (బ్రహ్మ) (భార)

వైశ్రవణుఁడు : కుబేరుఁడు. విశ్రవుని కొమారుఁడు అగుటచే ఇతనికి ఈ పేరు వచ్చెను.

వైశ్వదేవము : భోజనార్థమయ్యును జీవహింసా ప్రయుక్తపాప నివృత్త్యర్థమయ్యును బ్రాహ్మణులు నిత్యము చేయవలసిన కర్మ.

వైశ్వానరుఁడు : 1. అంగిరసుని వంశస్థుడగు అగ్ని. ఇతఁడు శాండిల్య వంశస్థుఁడు అగు విశ్వానరుని కొడుకు అని కొన్ని యెడల చెప్పఁబడి ఉన్నది.

2. దనువు పుత్రుఁడు. ఇతనికి ఉపదానవ. హయశిర, కాలక, పులోమ అని నలువురు కొమార్తెలు. అందు ఉపదానవిహిరణ్యాక్షునికిని, హయశిరకతువునకును, కాలకయు పులోమయు కశ్యపునికిని భార్యలు అయిరి (విష్ణు)

వైహారము : ఒకనొక పర్వతము. ఇది మగధదేశమునకు రాజధాని అగు గిరివ్రజమునకు చుట్టును ఉండు కొండలు ఐదింటిలో ఒకటి.

## వ్య

వ్యాసుఁడు : రు॥ కృష్ణద్వైపాయనముని తండ్రి పరాశరముని. తల్లి సత్యవతి. వేదములను ఇతఁడు విభజించి చక్కఁజేసి ఈ పేరు పొందెను. మఱియు ఇతఁడు భారతమును రచియించినదియే కాక పదునెనిమిది పురాణములను కావించి బ్రహ్మ సూత్రము మొదలగు వేదాంత గ్రంథములను అనేకములను రచించెను. ఇతని కొడుకు శుకుఁడు. చూ॥ వేదములు.

**వ్యుష్టి** : పుష్పార్ణునికి దోషయందు పుట్టి నకడపటి కొడుకు, ఇతని భార్య పుష్కరిణి. కొడుకు సర్వతేజస్సు. అన్నలు ప్రదోషుఁడు, నిశీథుఁడు.

**వ్యోముఁడు** : (1) కంసుని భృత్యుఁడు అగు ఒక అసురుఁడు. వీఁడు కృష్ణునిచే వ్రేపల్లెయందు చంపఁబడెను. (2) య॥ దశార్హుని కొడుకు.

(భాగ)

## శ

**శంకరకవి** : ఒక ఆంధ్రకవి. ఇతఁడు హరిశ్చంద్రోపాఖ్యానమును రచియించెను.

**శంకరాచార్యులు** : అద్వైత మతోద్ధారకుఁడు అగు ఒక ఆచార్యులు. ఈయన సుమారు 1200 సంవత్సరములకు ముందు మళయాలదేశమున నొక నంబూరి బ్రాహ్మణునికి జన్మించి జైన బౌద్ధాది నాస్తికమతముల ఖండిలచి స్మార్తము, వైష్ణవము, సౌరము, శాక్తేయము, గానపతము, పాశుపతము అను షణ్మతములను స్థాపన చేసిన అవతారపురుషుఁడు. గోవింద భగవత్పాదాచార్యుల శిష్యుడు. ఈయన సశరీరముగ కైలాసమునకుపోయి యోగభోగాది నామకములు అగు అయిదు చంద్రమౌళి లింగములను ఈ పుడమికి కొనివచ్చెను అనియు, పరకాయ ప్రవేశాది మహామహిమ కలిగి ఉండెను అనియు శంకరవిజయాది గ్రంథముల వలన తెలియనగు. మఱియు ఈయన అనేక దేశాటనముచేసి అచ్చటచ్చట అనేకులతో వాదించి వారిని జయించి అద్వైత మతమును స్థాపించెను. ఇది కాక ఈయన ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు, భగవద్గీత మొదలగు అనేక మత గ్రంథములకు మహాభాష్యములను రచియించెను. హిమవంతమున ముప్పదిరెండవ యేట ఈయన సమాధి చెందెను.

**శంకరుఁడు** : శివునికి నామము.

**శంకుఁడు** : య॥ కంసుని తమ్ముడు.

**శంకుశిరస్సు** : దను పుత్రులలో ఒకఁడు.

**శంఖచూడుఁడు** : ఒక గుహ్యకుఁడు. ఇతఁడు బృందావనమున ఉండిన గోపికలను ఒకప్పుడు ఉత్తరదిక్కునకు కొనిపోయి కృష్ణునిచే మడిసిన కుబేరభటుఁడు.

(శివ) (బ్ర. వై)

**శంఖపాలుఁడు** : నలుఘరు లోకపాలురలో ఒక్కఁడు.

**శంఖుఁడు** : విరాటరాజు కొడుకు. ఉత్తరుని అన్న. (భార)

**శంతనుఁడు** : కు॥ ప్రదీపునికి సునంద యందు పుట్టిన కొడుకు. ఈతనికి మొదటి భార్య అగు మానవరూప ధారిణియైన గంగయందు భీష్ముఁడును, రెండవ భార్య అగు సత్యవతియందు చిత్రాంగద విచిత్రవీర్యులును పుట్టిరి. సముద్రుఁడు శంతనుఁడుగా పుట్టెను అని చెప్పెదరు. చూ॥ ప్రదీపుఁడు. భీష్ముడు. (భార)

**శంబరుఁడు** : ద॥ ప్రద్యుమ్నుఁడు పుట్టినతోడనే పురిటింట చొచ్చి ఆశిశువును కొనిపోయి సముద్రమున వైచిన రాక్షసుఁడు. వీఁడు అతి మాయావి. ప్రద్యుమ్నునిచే చంపఁబడెను. చూ॥ ప్రద్యుమ్నుఁడు. ఇతని చంపుటచే మన్మథునికి శంబరారి అను నామము కలిగెను. (విష్ణు)

**శంభుఁడు** : శివుఁడు,

**శంయ్వుడు** : యాగములయందు మొదటి హవిస్సునందలి ఆజ్యమును కొనునట్టి అగ్ని. తండ్రి బృహస్పతి. భార్య సత్య.

**శతంధర** : ఆంధ్రదేశమునందలి ఒక సామంత రాజు యొక్క పట్టణము. ఒకానొకదేశము అనియు చెప్పుదురు.

**శకటాసురుఁడు** : ర॥ కంసుని భటులలో ఒకఁడు. వీఁడు కృష్ణుఁడు వ్రేపల్లెయందు శిశువుగా ఉండునపుడు శకట రూపముగా వచ్చి అతని పాదతాడనముచే వికలాంగుఁడు అయి చచ్చెను.

**శకము** : ఒకానొకదేశము. ఇది సింధునదీ సంగమ స్థానమునందలి పశ్చిమ దిగ్భాగము. ఈదేశమున వసించువారు శాకులు అనఁబడుదురు.

**శకుంతల** : దుష్యంత మహారాజు భార్య. భరతుని తల్లి ఈమె విశ్వామిత్రునికి మేనకయందు పుట్టెను. పుట్టినతోడనే ఈమెను జననీజనకులు ఇరువురును మాలినీనది యందలి యిసుక దిబ్బలలో పారవైచిపోగా అచటి పక్షులు తమ తెక్కలతో కప్పి క్రూరమృగముల వాత పడకుండునటుల రక్షించెను. అది కారణముగా ఈమెకు శకుంతల అను పేరు కలిగెను. అట్లు ఈమె పక్షులచేత రక్షింపఁబడుచు ఉండగా అచటికి స్నానముచేయు నిమిత్తము కణ్వమహాముని

వచ్చి ఈ బిడ్డను చూచి యెత్తుకొనిపోయి తన ఆశ్రమమున ఉంచి పెంచుకొనెను అట్లు పెరిగి ఈమె కణ్వాశ్రమమున ఉండగా ఒకనాడు దుష్యంతుడు వేటాడుచు అచటికి వచ్చి గాంధర్వవిధిని ఈమెను పెండ్లి ఆడి భరతుని కనెను.

**శకుని** : (1) ది॥ హిరణ్యాక్షుని కొడుకు. (2) య॥ దశరథుని కొడుకు (3) గాంధారదేశపు రాజు అగు సుబలుని కొడుకు. గాంధారికి సోదరుడు. దుర్యోధనుని మేనమామ. వీడు దుర్యోధనునికి మారుగా ధర్మరాజుతో జూదమాడి పాండవుల సంపద అంతయు గెలుచుకొనెను. వీడు ద్వాపరాంశమున జనించిన వాడు. (భార)

**శక్తి** : 1. ఋ॥ వశిష్ఠుని పెద్దకొడుకు. పరాశరుని తండ్రి. వ్యాసుని తాత. 2. లోకకారణ కర్త్రి అగు స్త్రీ దేవత. (భార)

**శక్రదేవుడు** : కళింగదేశపురాజు అగు శ్రుతాయువు యొక్క రెండవ కొడుకు. (భార)

**శక్రుడు** : చూ॥ నా॥ ఇంద్రుడు.

**శచి** : ఇంద్రుని భార్య. పులోముని కూతురు. (భార)

**శతజిత్తు** : 1. య॥ భజమానుని కొడుకు. 2. ప్రి॥ రజుని కొడుకు. ఇతనికి నూరువురు కొడుకులు. అందు జ్యేష్ఠుడు విష్వగ్జ్యోతి. 3. య॥ మొదటి సహస్రజిత్తు కొడుకు. ఇతని కొడుకులు మహాహయుడు, వేణుహయుడు, హైహయుడు. భాగ।

**శతద్రువు** : ఒక నది. ఇది హిమవత్పర్వతమునకు ఉత్తరమున ఉత్పత్తి అయి సింధునదిలో సంగమము అగుచున్నది.

**శతధన్వుడు** : య॥ హృదికుని కొడుకు. దేవమీఢుని తమ్ముడు. ఇతడు సత్యభామను తనకు ఇయ్యకపోయెను అని సత్రాజిత్తు నిద్రపోవుచుండు తటిని అతని చంపెను. అందుకై కృష్ణుడు ఇతని చంపెను. చూ॥ శమంతకమణి. (భాగ)

**శతధృతి** : (1) బ్రహ్మ. (2) ప్రాచీన బర్హి భార్య. సముద్రుని కూతురు, ప్రచేతసుల తల్లి.

శతపర్వ : శుక్రుని భార్య.

శతమఖుఁడు : దేవేంద్రుఁడు, నూఱు యజ్ఞములు చేసినవాఁడు, అని వ్యుత్పత్త్యర్థము.

శతాయూపుఁడు : కేకయవంశజుఁడు అయిన ఒక రాజర్షి. ధృతరాష్ట్రుఁడు వనవాసము చేయునపుఁడు ఈతని ఆశ్రమమునందు కొన్ని దినములు ఉండెను.

శతరూప : స్వాయంభువుని భార్య. ఈమె బ్రహ్మచే మొట్టమొదట సృజియింపఁబడిన స్త్రీ. (మత్స్య.)

శతవలి : సుగ్రీవుని సేనాపతులలో ఒకఁడు. వీఁడు సీతను వెదుకుటకై ఉత్తర దిక్కునకు పోయిన వానరులకు మొనగాఁడు. ఇతని శతబలి అనియు అందురు.

శతశృంగము : ఒకానొక పర్వతము. ఇచ్చట పాండురాజు మృగశాపమువలన చింతాక్రాంతుఁడు అయి కుంతీ మాద్రులతో తపము సల్పెను. ఇచట ఉండునపుడె కుంతీ మాద్రులకు దూర్వాసుఁడు ఉపదేశించిన మంత్రబలముచే పాండవులు అయిదుగురును జనియించిరి.

శతసేనుఁడు : యదు వృష్ణి వంశస్థుఁడు అగు ఉగ్రసేనుని కొడుకు.

శతానందుఁడు : 1. బ్రహ్మ. 2. గౌతమునకు అహల్యయందు పుట్టిన కొడుకు. జనకమహారాజు పురోహితుఁడు. (భార)

శతానీకుఁడు : 1. నకులునకు ద్రౌపది యందుఁ బుట్టిన కొడుకు. 2. అభిమన్యుని పౌత్రుఁడు అగు జనమేజయుని కొడుకు. (భార)

శతాయువు : చూ॥ నా॥ చిరాయువు. (భార)

శత్రుఘ్నుఁడు : 1. దశరథుని కడపటి కొడుకు. తల్లి సుమిత్ర. రాముని తమ్ముఁడు. భార్య కుశధ్వజుని కూతురు అగు శ్రుతకీర్తి. ఇతఁడు రాముని యనుజ్ఞను పొంది లోకకంటకుఁడు అయిన లవణాసురుని చంపి లోకుల బాధ నివారించెను. 2. య॥ అక్రూరుని అనుజుఁడు 3. య॥ ఏకలవ్యుని అన్న. దేవశ్రవసుని పెద్దకొడుకు. (రామా)

శత్రుజిత్తు : కా॥ చూ॥ నా॥ ప్రతర్దనుఁడు.

శని } శనైశ్చరుఁడు : నవగ్రహములలో ఏడవ గ్రహము. సూర్యుని కొడుకు. యముని తమ్ముఁడు.

శబరి : పంపాతీరమునందలి, మతంగాశ్రమమున ఉండిన రామభక్తురాలు అయిన ఒక బోయెత. మతంగుని శిష్యురాలు. ఈమె రాముని యనుగ్రహము పడసి మోక్షము చెందెను.

శబస్తుఁడు : ఇ॥ మొదటి యువనాశ్వుని కొడుకు. బృహదశ్వుని తండ్రి ఇతఁడు గౌడదేశమున శబాస్తి అను పట్టణమును నిర్మించెను.

శమంతకమణి : ఇది సూర్యునిచే సత్రాజిత్తునకు ఈయఁబడిన మణి. ఇది ప్రతి దినమును, యెనిమిది బారువుల సువర్ణమును ఒసగును. ఒక్కనాఁడు సత్రాజిత్తు యొక్క తమ్ముఁడు అగు ప్రసేనుడు దీనిని కంఠమున తాల్చి అడవికిపోగా అతనిని ఒక సింహముచంపి ఆమణిని కొనిపోవుచు ఉండెను. అదిజూచి జాంబవంతు డాసింగమునుచంపి దానివద్ద ఉన్నమణిని కొనిపోయి తన కూతురు అగు జాంబవతియొక్క ఉయ్యాలయందు వ్రేలకట్టెను. అంతకు ముందు ఈమణిని కృష్ణుఁడు తనకు ఇమ్మని సత్రాజిత్తును అడిగి ఉండినందున ఈమణికై కృష్ణుఁడే ప్రసేనుని చంపెను అని ఒక అపవాదము కలిగెను. అంతట కృష్ణుఁడు ఆ నిందను పోగొట్టుకొను నిమిత్తము, జాంబవంతుఁడు ఉన్న గుహకుపోయి అతనితో ఇరువది యెనిమిది దినములు పోరాడి ఆమణిని కొనివచ్చి సత్రాజిత్తునకు ఇప్పించెను. అంతట సత్రాజిత్తు కృష్ణునిపై లేని అపవాదమును కల్పించితిని. ఇందు వలన విరోధము మానునట్టి ఉపాయము యేది, అని విచారించి తన కుమార్తె అగు సత్యభామను కృష్ణునకు యిచ్చి అతని వలన మన్నన పడసెను. ఈ సత్యభామను తొలుత శతధన్వునకు ఇచ్చునట్లు వాగ్దత్తముచేసి ఉండెను. కనుక అట్లు జరపక తప్పినందులకై శతధన్వుఁడు కోపించి సత్రాజిత్తును చంపి ఆ మణి తీసికొనిపోయి అక్రూరుని వద్ద దాచి సత్యభామ వలన ప్రేమచే కృష్ణుఁడు తన్ను చంపును అని తలచి వెఱచి ఒక వేగముఁ గల గుఱ్ఱమును యెక్కి మిథిలానగరమును గూర్చి పోయెను. ఆ సంగతి కృష్ణుఁడు తెలిసికొని వానిని వెంబడించి తఱిమిపట్టి చంపి వాని వస్త్రములయందు మణిని వెదకి కానక వచ్చి ఆవృత్తాంతము సత్యభామకు చెప్పి, మణిపోయిన పోఁబడి విచారించుచు ఉండెను. అది తెలసి అక్రూరుఁడు మణి తనవద్ద ఉండుటచే తనకు యేమి కీడు మూఁడునో అని ద్వారక విడిచి దేశాంతరము పోయెను. అంతట ద్వారకలో పెక్కులు ఉత్పాతములు పుట్టెను. అందులకు కారణము అక్రూరుఁడు ఊరు విడిచిపోవుటయే అని తెలిసికొని కృష్ణుఁడు అతని వెదకి పిలుచుకొని వచ్చి సన్మానించి మణి నీవద్దనే ఉంచుకొమ్ము అని

చెప్పెను. అది విని అక్రూరుఁడు మణి తాను గ్రహించుటకు ఒప్పుకొనక కృష్ణునకే తెచ్చి యిచ్చి తనంతటఁ తానుపోయెను.

**శమంతపంచకము** : కురుక్షేత్రము త్రేత ద్వాపరయుగ సంధియందు పరశురాముఁడు మదాంధీ భూతులు అయిన క్షత్రియులతో ఇరువది యొక్కమాఱు పోరాడి రాజులను ఎల్ల చంపి వారి రక్తముతో ఐదు మడుగులు కావించి ఆ రుధిరజలముల పితృతర్పణము చేయగా ఆ పితృగణముచే ప్రార్థితుఁడు అయి ఉపశమిత క్రోధుఁడు ఆయెను. దానజేసి తత్సమీప ప్రదేశము శమంత పంచకము అనఁ బరగెను. అందు పాండవులును కౌరవులును పదునెనిమిది అక్షౌహిణుల బలముతో పదునెనిమిది దినములు యుద్ధము చేసిరి. అదికారణముగా దీ కి కురుక్షేత్రము అను పేరును కలిగెను. (భార)

**శమతుఁడు** : రు॥ ఇతఁడు ధర్మరాజుతో కూడా తీర్థయాత్ర చేసెను

**శమీకుఁడు** : 1. రు॥ శృంగి తండ్రి. చూ॥ పరీక్షిత్తు. (భార)
2. భోజవంశమున జనించిన ఒకరాజు.

**శముఁడు** : ధర్మునికి శ్రద్ధయందు పుట్టిన పెద్దకొడుకు. ఇతని యనుజులు కాముఁడు, హర్షుఁడు. భార్య సంప్రీతి.

**శరద్వంతుడు** : రు॥ నా॥ సత్యధృతి. శతానందుని కొడుకు.

**శరభంగుఁడు** : దండకారణ్యమున ఉండిన ఒక మహర్షి. ఇతనిని స్వర్గలోకమునకు పిలుచుకొనిపోవ ఇంద్రాది దేవతలు తామే ఇతని యాశ్రమమునకు వచ్చిరి. రాముఁడు దండకారణ్యమునకు రాగానే అతని దర్శనము చేసికొని శరభంగమహాముని స్వర్గస్థుఁడు ఆయెను. ఇతని యాశ్రమము జాహ్నవీనదికి సమీపమున ఉండెను. (రామా)

**శరభుఁడు** : సుగ్రీవుని సేనానాయకులలో ఒకఁడు. ఈ వానరుఁడు పర్జన్యుని వలన పుట్టెను.

**శరావతి** : ఒకానొకయేరు. దీని ఒడ్డున రెల్లు విశేషముగా మొలిచి ఉండును. కనుక దీనికి ఈ నామము కలిగెను.

**శర్మిష్ఠ** : యయాతి యొక్క రెండవ భార్య. వృషపర్వుని కూతురు. చూ॥ వృషపర్వుఁడు. (భార)

శర్యాతి : (1) వైవస్వతమనువు కొడుకులలో ఒక్కఁడు. ఇతఁడు ఇక్ష్వాకుని తమ్ముఁడు. ఇతనికి ఉత్తాన బర్హి, ఆనర్తుఁడు, భూరిసేనుఁడు అను మువ్వురు కొడుకులును, సుకన్య అను కూతురును కలిగిరి. చూ॥ సుకన్య. (2) (చూ॥ నా॥) పు॥ చ॥ నా॥( సంయ్యాతి. (భార. భాగ. మత్స్య)

శర్వుఁడు . 1. అష్టమూర్తులలో ఒకఁడు, 2. శివునికి నామాంతరము.

శలుఁడు : పరీక్షిత్తునకు సుశోభయందు పుట్టిన కొడుకు. ఇతఁడు వామదేవ ఋషి యొక్క గుఱ్ఱములను అడిగి పుచ్చుకొని మరల ఈయనందున ఆ ఋషి కోపానలమున ఇతఁడును, ఇతని తమ్ముఁడు తలుఁడును మడిసిరి. (భార)

శల్యుఁడు : 1. మద్రదేశపురాజు. మాద్రి తోబుట్టు. నకుల సహదేవులకు మేన మామ. పగరకు హృదయ శల్యము అగుటచే ఇతనికి ఈ నామము కలిగెను. అశ్వ హృదయ జ్ఞానమున ఇతఁడు ప్రసిద్ధుఁడు. కనుక దుర్యోధనుఁడు ఇతనిని కృష్ణసారథ్యమునకు యెదురుగా కర్ణునికి సారథ్యము కావింప ప్రార్థించెను. అట్లు అయినను ఇతఁడు అర్జున పక్షపాతియై కర్ణకఠోరములు ఆడి కర్ణుని యుత్సాహ మును మిగుల కొఱతపడ చేసెను. ఇతఁడు ధర్మరాజుచే చంపఁబడెను.

(2) సోమదత్తుని మూడవ కొమారుఁడు. (3) ద॥ విప్రచిత్తి కొడుకు. (భార)

శశాంకుఁడు : చంద్రుడు. శశమును చిహ్నముగా గల వాడని వ్యుత్పత్తి.

శశిబిందువు : య॥ క్రోష్టువంశజుడు అగు చిత్రరథుని పుత్రుడు. ఇతడు అనేక భార్యలును, పుత్రులును కలవాడు. అందు ముఖ్యులు ఆర్గురు. ప్రుధుశ్రవుడు, ప్రుధుదాసుడు, పృథుకీర్తి పృథుజయుడు, పృధుకర్ముడు. ప్రుథుయశుడు. ఈ శశిబిందువు చతుర్దశమహారత్నుడు అయిన చక్రవర్తి అని పేర్కొన బడియెను.

## శా

శాండిలి : (1) ఋషపర్వతమున తపము ఆచరించుచు ఉండిన ఒక బ్రాహ్మణ స్త్రీ ఈమెను గాలవమహర్షి గుర్వర్థము గరుడునితోకూడి, గుఱ్ఱములను వెదకవోవు నపుడు దర్శనముచేసికొనెను. (2) ప్రజాపతి భార్య. అగ్ని అను వసువు తల్లి. (భార)

శాండిల్యుడు : 1. ఒకానొక ఋషి. 2. నందుని వంశస్థుల వలన చంద్రగుప్తునికి రాజ్యమును రాబట్టి ఇచ్చిన ఒక బ్రాహ్మణుడు.

(రామా)

శాంత : రోమపాదుని పెంపుడు కూతురు. ఋష్యశృంగుని భార్య ఈమెను కాంత అనియు చెప్పుదురు.
(రామా)

శాంతి : 1. అజమీఢుని పౌత్రుడు. నీలుని పుత్రుడు. (2) దేవకుని కూతురు. వసుదేవుని భార్య.
(భాగ)

శాకల్యము : మద్రదేశమునకు రాజధాని.

శాకల్యుడు : 1. ధృతరాష్ట్రుడు వనవాసమునకు పురజనులచే అనుజ్ఞవడయు కాలమున అతనికి దుఃఖోపశమనముగా తత్వోపదేశము చేసిన ముని. (బ్రహ్మ)
(2) వేదమిత్రుని శిష్యుడు అయిన సౌభరికొడుకు. ఇతడు తాను అభ్యసించిన ఋగ్వేద శాఖను అయిదు విధములుగ విభజించి వాత్స్యుడు, మౌద్గల్యుడు, శాలీయుడు, గోముఖుడు, శిశిరుడు అను శిష్యులకు ఉపదేశముచేసెను. 3. ఋగ్వేదమును సంహితలుగ భాగించిన ఒక ముని.

శాకుంతలము : ఒక సంస్కృత నాటకము. ఇది కాళిదాస ప్రణీతము. స్వభావోక్తి యందు మిగుల ప్రసిద్ధికెక్కి ఉండెను. కణ్వమహర్షి యాశ్రమమున దుష్యంతుడు శకుంతలను వివాహము అయి తన తొలిసంగమమున గర్భము అయిన ఆమెను కణ్వుడు తన వద్దకు పంపగా దూర్వాసుని శాపముచే ఆమెను పెండ్లాటను మరచి అనాదరముచేసి పిమ్మట స్మృతికి వచ్చి మారీచమహర్షి యాశ్రమమున ప్రసవించి కొడుకుతో కూడా ఉండిన శకుంతలను తోడుకొనివచ్చిన కథ ఇందు తెలుపబడి ఉండును.

శాకులు : సింధునదీ సంగమస్థానము యొక్క పశ్చిమ దిగ్భాగము అగు శకదేశమున వాసము చేయువారు.

శాక్తేయులు : తంత్రోపాసకులు. వీరు "సర్వం శక్తిమయం జగత్" అని శక్తి యందు సర్వద్రష్టృత్వాది కర్తృత్వమును స్థాపించి అర్ధనారీశ్వరుడు అగు శివుని యందలి శక్త్యంశము విశేషము విశ్వసించి వామాచార సాంప్రదాయమును అవలంబింతురు.

శాక్యముని : ఇక్ష్వాకు వంశస్థుడు అయిన బృహద్బలుని వంశమున జనించిన వాడు. ఇతని తండ్రి గోతముడు. కనుక ఇతడు గౌతముడు అనియు అనబడును. క్రీ. శ. 600 సంవత్సరములకు ముందు ఇతడు ఉండినట్లు తెలియును. ఇతనికి యేడవతరమువాడు, ఇక్ష్వాకు వంశమునకు కడపటివాడు అయిన సుమిత్రుడు. ఇతనినే బౌద్ధమత స్థాపకుడు అయిన బుద్ధుడు అని నుడుపుదురు.

శాబస్తి : గౌడదేశమునందు శబస్తుచే నిర్మింపబడిన పట్టణము.

శార్ఙ్గికులు : మందపాలుని కొడుకులు. వీరు నలువురును మందపాలుని ప్రార్థనచే ఖాండవదహన మపుడు అగ్నిచే కాల్పబడరైరి.

శార్దూలుడు : రావణాసురుని చారులలో ఒకడు. (రామా)

శాలివాహనుడు : ఒక శక పురుషుడు ఇతనిచే విక్రమార్కుడు చంపబడెను ఇతడు నాగేంద్రుని వరప్రసాదము వలన కుమ్మర కన్యకు జనించెను అని చెప్పెదరు. "శకకర్తా విక్రమజిత్. కానీన నశ్యా వివాహనః" అని ప్రమాణము. పైఠణము అను పట్టణమునందు సోమకాంతరాజు రాజ్యము చేయుచుండగా అందు నీతిసంపన్నుడును, ధార్మికుడును అయిన సులోచనుడు అను బ్రాహ్మణుడు ఒకడు ఉండెను. ఇతనికి సుమిత్ర అనుకూతురు ఒకతెకలదు. దానికి నాలుగేండ్లప్రాయమున దాని తల్లి చనిపోయినందున తండ్రిచేతనే పెంపబడి వివాహము కాకమునుపే ఋతుమతి అయి దైవికముగా తటస్థించిన ఒకపురుషుని కూడి గర్భిణి ఆయెను. అప్పుడు సుమిత్ర తనకు గర్భము కలుగుటచే తన్ను లోకులుని నిందింతురు అను వెరపుచే చింతాక్రాంతయై తన యొద్దకు వచ్చుచున్న పురుషునితో తన మనోదుఃఖమును చెప్పెను. అందుకు అతడు నేను మనుష్యమాత్రుడను కాను ఆదిశేషుడను, నీకు నాసంగమము వలన శకకర్తయు, పరాక్రమశాలియు అగు సత్పుత్రుడు జనింపగలడు, దీనిచే నీకు గాని, నీ తండ్రికిగాని సంకటములు పొసగునెడ నన్ను తలపుము. నేను అప్పుడే వచ్చి మీ సంకటములను తొలగించి పోయెదను అని చెప్పి తన నిజరూపమును చూపి అంతర్ధానము అయి పోయెను. అంతట ఈవర్తమానముఅంతయు సుమిత్ర తన తండ్రితో చెప్పి అతడు దైవసంకల్పము చొప్పున ఏది ఎట్లు జరగవలెనో అట్లు జరగకపోదు అని చెప్పి తన్ను మన్నింపగా, నిశ్చింత అయి ఉండెను. అనంతరము సుమిత్ర పెండ్లి కాకమునుపే ఈడేరుటయు, వెంటనే గర్భము

ధరించుటయు వారి చుట్టములకు అందరకు తెలిసి ఈ తండ్రి బిడ్డలను వెలివేసి రాజునకును ఈవృత్తాంతము తెలిపిరి. అందులకు రాజు వారిని తన పట్టణమునుండి వెళ్ళగొట్టించెను. అంతట సులోచనుఁడు పట్టణమునకు వెలుపల ఒక కుమ్మరివాని యింటికిచేరి కాలము గడపుచు ఉండగా శాలివాహనుఁడు జనించి బాల్యమునందే తనతోడి బాలురను కూర్చుకొని తాను రాజు అనియు, తక్కినవారు మంత్రి మొదలగువారు అనియు నిరూపించుకొని రాజ్యభారము చేయువానివలె ఆటలాడుచు ఉండెను వీని ఆటలు చూచునట్టి కుంభకారులు అందరు ఆశ్చర్యపడుచు మెచ్చుకొనుచు ఉందురు. అట్టి యెడ శాలివాహనుఁడు ఆకుంభకారులను చూచి రాజు యొక్క దర్బారులో నడచునట్టి వ్యవహారములు నానాడు విచారించుకొని వచ్చి నాకు తెలియజేయుడు అని చెప్పగా వారును అట్లే జేయుచు ఉండిరి. అంత ఒకనాడు శాలివాహనుఁడు తన సహవాసులు అగు బాలురతోడ కొలువుతీరి ఉండగా ఒక బ్రాహ్మణుఁడు వచ్చి యెగతాళికి పంచాంగము చెప్పెను. అప్పుడు శాలివాహనుఁడు ఓ బ్రాహ్మణుఁడా మన రాజ్యమునకు యోగము ఎట్లున్నది అని అడిగెను. అందుకు ఆ బ్రాహ్మణుఁడు మీ రాజ్యమునకు ఏమి లెస్సగా ఉన్నది అని చెప్పగా అచ్చటికుమ్మరావములో ఉన్న కడవ ఒకటి ఎత్తి అతనికి బహుమానముగా ఇచ్చి పంపెను అది మరునాడు స్వర్ణమయము అయినందున ఈ బాలుఁడు బంగారు కడవలు దానముచేయువాఁడు అని లోకమందు అంతట ఒక ప్రవాదము విస్తరిల్లెను. అనంతరము ఇతఁడు అచ్చటి కుమ్మరవారిచే ఏనుగులు, గుర్రములు, రథములు, పదాతులు అనెడు చతురంగబలములను మట్టితో చేయించుచుండెను. అట్టి యెడ ఈవృత్తాంతము అంతయు విక్రమార్కుఁడు విని వీనిని తన పట్టణమునకు రప్పించి చూచి సంభాషింపవలెను, అని బహు ప్రయత్నములు చేసెను. కాని ఆయత్నములు ఏవియు కొనసాగకపోయెను. అప్పుడు పురందరపురము అను పట్టణమునందు ఉన్న ధనంజయుఁడు అను వైశ్యుఁడు తన మరణకాలమున తాను పండుకొనెడు మంచము నాలుగు కోళ్ళ క్రిందను పూడ్చియుండు ధనమును మీరు నలుగురును సమభాగముగా పంచుకొని జీవింపుడు అని కుమారులకు చెప్పి మరణమును పొందెను. ఆ కుమారులును తండ్రికి జరగవలసిన అగ్ని సంస్కారాది క్రియలు నెరవేర్చి తమ తండ్రి చెప్పిన చొప్పున మంచపుకోళ్ళ క్రింద త్రవ్వి అందు కనబడిన వస్తువులను చూచి వానిని పంచుకొనువిధమిట్టిది అని తెలియక అప్పుడు ప్రసిద్ధులైయున్న రాజులను న్యాయాధి

పత్రులను తమకు విభాగ నిర్ణయము తెలుప ప్రార్థించి ఎవరివల్లను కాకపోగా తుదకు విక్రమార్కుని యొద్దకు పోయి అతనివల్లను కాకపోవుటచే, ఇక తిరిగి ప్రయోజనము లేదు అని నిస్పృహులై తమ నివాసములకు పోవుచు మార్గవశమున ఈ శాలివాహనుఁడు ఉన్నచోటికి వచ్చిరి. అప్పుడు శాలివాహనుఁడు వారి సంగతి విచారించి పైనాలుగు వస్తువులను జ్యేష్ఠాను క్రమముగా ఒక్కొక్కఁడు ఒక్కొక్క దానిని తీసికోవలసినది అని మీ తండ్రి యభిప్రాయము. అది ఎట్లు అనగా పెద్దవానికి మట్టి ఇచ్చెను. దానికి తన భూమి అంతయు అతనిది అని అర్థము. రెండవవానికి ఊముక ఇచ్చెను. దానికి తన ధాన్యమంతయు వానిది అని అర్థము. మూడవ వానికి బొగ్గు ఇచ్చెను. దానికి బంగారు వెండి మొదలగు లోహ ద్రవ్యము సర్వమును అతనిది అని అర్థము. నాలవవానికి ఎముకలుఇచ్చెను. దానికి గోధనము సర్వమును వానిది అని అర్థము అని భాగ నిర్ణయమును వివరించెను. వారు అది సరియైన తీర్పు అని సంతోషించి తమ పట్టణమున సుఖముగా ఉండిరి అనంతరము విక్రమార్కుఁడు ఈ వృత్తాంతమును విని శాలివాహనుని తోబరచుకొనని యెడల తన కీర్తి మాసిపోవును అని ఎంచి చతురంగబలములతో శాలివాహనుఁడు ఉన్న పట్టణమునకురాగా ఆ సంగతి తెలిసి శాలివాహనుఁడు మట్టితో చేయించి ఉంచిన చతురంగ బలములను నాగేంద్రుని యనుగ్రహమువలన జీవముకలవానిగా జేసికొని ఎదిరించి విక్రమార్కుని చంపి అతని సైన్యమును నర్మదానదివరకు తరుముకొనిపోయి అందుండి వెనుకకు మరలెను కనుక నర్మదకు దక్షిణముగా శాలివాహన శకమును ఉత్తరమున విక్రమార్కశకమును వాడబడుచు ఉన్నది. ఇతఁడు పిమ్మట మహాకవియై వైద్యశాస్త్రము, అశ్వశాస్త్రము, సప్తశతి అను అలంకార గ్రంథమును రచించెను.

శాలిహోత్రుడు : ఒకానొక మునీశ్వరుఁడు. పాండవులు లక్క యిల్లు వెలువడి హిడింబుని వనముగుండ ఈ మహర్షి యాశ్రమమునకు పోయిరి. అచట వారిని వేదవ్యాసుఁడు చూచి దుఃఖోపశమనముగ హితోపదేశముచేసి పోయెను. ఈ మునీశ్వరుని యొక్క తపః ప్రభావమున ఇతని యాశ్రమమునందు ఉండిన కొలని జలము త్రావిన వారికి ఋభుక్షా పిపాసలు లేక ఉండును. అని పాండవులకు వేదవ్యాసుఁడు వక్కాణించెను.

2. అశ్వశాస్త్రమును చేసిన ఋషి.

3. సామవేద ధ్యాపకుఁడు అయిన ఒక ఋషి (భార)

శాలీయుఁడు : రు॥ శాకల్యుని శిష్యుఁడు.

శాల్మలి : ఇది గిరివ్రజపురమునకు దక్షిణమున ఉండును.

శాశ్వతుఁడు : ఇ॥ నా॥ విశ్వగంధుఁడు, విశ్వకుఁడు పృథుని కొడుకు.

## శి

శింశుపాయనుఁడు; ఒక పౌరాణికుఁడు.

శింశుమారము : జ్యోతిశ్చక్రము. ఇది ఖగోళమున అన్నిటికిని పైని ఉండును. చూ॥ ఖగోళము.

ఈచక్రమున ధ్రువుఁడు ఇంద్ర వరుణ కశ్యప ప్రముఖులతో కూడి నిత్యము ప్రదక్షిణము తిరుగుచు ఉండును. మరియు దీని పుచ్ఛమున ప్రజాపతియు అగ్నీంద్ర ధర్ములును, పుచ్ఛమూలమున ధాతృ విధాతలును కటిప్రదేశమున ఋషి సప్తకమును ఉత్తర హనువున అగస్త్యుఁడును అపరహనువున యముఁడును, ముఖమున అంగారకుఁడును, గుహ్యమున శనైశ్చరుఁడును, మేఢ్రమున బృహస్పతియును, పక్షమున ఆదిత్యుఁడును, నాభినిశుక్రుఁడును, చిత్తమున చంద్రుఁడును, స్తనముల అశ్వినులును, ప్రాణాపానముల బుధుఁడును, సర్వాంగములను శనికేతు గ్రహములును, రోమముల తారలును ఉండును. ఇది సర్వదేవతామయము అయిన పుండరీకాక్షుని దివ్యదేహముగా ఎఱుగవలయును.

శిఖండి : (1) అంతర్ధానుని మొదటి భార్య, (విష్ణు)

(2) ద్రుపదరాజు రెండవ కొడుకు. కాశిరాజు కూతురు అయిన అంబ అను ఆమె భీష్ముని చంపవలయును అని తపస్సుచేసి మొదట ఆడుదిగా పుట్టి స్థూలకర్ణుఁడు అను ఒక యక్షుని వలన పురుషత్వమును పొంది భారత యుద్ధమున భీష్ముని చంపెను, ఇతఁడు గుహ్యకుని వంశము చూ॥ అంబ)

(భార)

శిబి : (1) పు॥ గర్గుని కొడుకు గార్గ్యుని తండ్రి. (2) య॥ యుధాజిత్తు కొడుకు. (3) య॥ అనమిత్రుని కొడుకు. (4) య॥ విదూరథుని పుత్రుడు అగు శూరుని పుత్రుఁడు. (భాగ) (భాగ)

శిబి : (1) అ॥ ఉశీనరుని పెద్దకొడుకు. ఇతఁడు తొల్లి ఒకప్పుడు యజ్ఞము చేయుచు నుండ ఇంద్రాగ్నులు ఇతని మహాగుణములు ఎరుగవేడి ఇంద్రుడు శ్యేనమును అగ్నిపావురమును అయి స్యేనభయమున పావురము పర తెంచునట్లు పరువిడి వచ్చి శిబి మరువు చొచ్చెను. దానిని తరుముకొని వచ్చిన శ్యేనము శిబిని చూచి "శ్యేనాః కపోతాన్ ఖాదయంతి" అను వేద వచన ప్రకారము ఇది నాకు ధర్మ విహితము అయిన ఆహారము. దీనిని నేను విడువను అనగా అతఁడు ఆశ్రిత త్యాగము ధర్మవిరుద్ధము అని దాని విడువక శ్యేనము కోరిన ప్రకారము తన దేహమును కోసి దానికి ఆహారముగా ఇచ్చెను అంత ఇంద్రాగ్నులు తమ నిజరూపములతో శిబికి కనబడి అతనికి నిత్యకీర్తికలుగ వరము నిచ్చి చనిరి. ఇతఁడు ఒక గొప్ప చక్రవర్తి ఇతని కొడుకులు వృష దర్భుడు, సువీరుఁడు, కేకయుఁడు, మద్రుఁడు. (భార) (భాగ)

(2) ది॥ ప్రహ్లాదుని కొడుకు. (మత్స్య)

శిలాదుఁడు : రు॥ నందీశ్వరుని తండ్రి. జపేశ్వరమున ఇతఁడు రుద్రుని గూర్చి తపము ఆచరించి అయోనిజుఁడును, మృత్యుంజయుఁడును, అగు నందిని పుత్రుఁడుగా పడసెను. (శ్రీ. శై)

శిలోద్భదము : ఒక తీర్థ విశేషము.

శివ : అగ్నిజ్యేష్ఠపుత్రిక. అంగిరసుని భార్య.

శివగంగ : కైలాసపర్వతమున పుట్టిన ఒక నది.

శివధర్మము : ఉప పురాణములలో ఒకటి.

శివరాత్రి : మాఘ బహుళ చతుర్దశి. ఈ దినము అర్ధరాత్రివేళ ఈశ్వరుఁడు నైమిత్తిక ప్రళయానంతరము లింగరూపి అయి పునఃస్సృష్టి చేసెను. అను ఒక ప్రసిద్ధమైన ఐతిహ్యమును పట్టి ఒక వ్రతముగా అనుష్ఠించి శివపూజ సలుపుదురు

శివుఁడు : (1) త్రిమూర్తులలో ఒకఁడు. (చూ॥ రుద్రుఁడు) వృషధ్వజుఁడు ఉమాపతి, చర్మవాసుఁడు. నందివాహనుఁడు. శూలి. కపాలమాలాధరుఁడు. సర్పకుండలుఁడు. ఇత్యాద్యనేక నామములు ఇతనికి కలవు. ఇతఁడు సంధ్యాకాలము నందు నర్తనము చేయుట ప్రసిద్ధము. మరియు ఇతఁడు లోకకంటకులు అయిన

త్రిపురాసురులను సంహారము చేసెను. అప్పుడు ఈతనికి భూమి రథముగాను, సూర్యచంద్రులు రథచక్రములుగాను, వేదములు గుఱ్ఱములుగాను, బ్రహ్మ సారధిగాను మేరుపర్వతము విల్లుగాను, సాగరము అమ్ముల పొదిగాను, విష్ణువు బాణముగాను, అయ్యెను.

మెండియు ఈశివునికి కన్నులు మూడు. అందు ఒక నేత్రము నుదుట ఉండును కాన ఇతనికి ఫాలనేత్రుడు, త్రినేత్రుడు, అను నామములు కలిగెను. ఆ ఫాల నేత్రమును ఎల్లపుడు మూసికొనియే ఉంచును. దానిని తెరచిన లోకములు అన్నియు భస్మీభూతములు అగును. అని నుడువుదురు,

భగీరథుడు తన పితరులను స్వర్గలోక ప్రాప్తులుగా చేయుటకై గంగను ప్రార్థించి భూలోకమునకు తెచ్చు నవసరమున ఆ గంగను (చూ॥గంగ) శివుడు తన శిరస్సున ధరించెను. కాన ఇతనికి మందాకిని మౌళి, గంగాధరుడు, అను పేర్లు కలిగెను. అమృతమధనకాలమునందు పాలసముద్రమున పుట్టిన విషమును ఇతడు భుజించి కంఠమునందు నిలిపికొనెను. కాన ఇతనికి గరళకంఠుడు అను నామము కలిగెను. మెండియు ఇతడు చంద్రుని శిరమున ధరించుటచే చంద్ర శేఖరుడు, చంద్రమౌళి అనబడును.

(శివ) (స్కాంద) (భార) (మార్క) (బ్ర వై).

(2) యా॥ అక్రూరుని తమ్ముడు.

శిశిరుడు : ఋ॥ శాకల్యుని శిష్యుడు. (మత్స్య) (భార)

శిశునాగుడు : శైశునాగులకు మూల పురుషుడు అయిన మగధదేశపురాజు.

శిశుపాలుడు : చేదిదేశపురాజు దమఘోషునకు వసుదేవుని చెలియలు అయిన శ్రుతశ్రవ వలన పుట్టిన కొడుకు. వీడు చతుర్భుజ లలాటనేత్రములతోపుట్టి పుట్టిన తోడనే రాసభస్వరమున ఏడ్చుచునుండగా తల్లిదండ్రులు భయమును విస్మయ మును కలవారై ఏమి తోచక ఉండిరి. అప్పుడు అశరీరవాణి యెవడు ఎత్తుకొను నపుడు వీని లలాట నేత్రమును రెండు చేతులును అడగిపోవునో వాడు వీనిని చంపును కనుక మీరు ఇందులకు విచారపడక నెమ్మదిని ఉండుడు అని పలికెను. అంతట వీని తల్లిదండ్రులు తమ్ము చూడ వచ్చిన వారికెల్ల వానిని ఎత్తుకొన ఇచ్చుచుండి ఒకప్పుడు బలరామ కృష్ణులు తమ మేనత్తను చూడరాగా వారిచేతికి

ఇచ్చి ఎత్తుకొమ్మనిరి. అప్పుడు కృష్ణుఁడు ఎత్తుకోగానే వీని నొసటి కన్నును రెండు చేతులును అడగిపోయెను. అంతట వారు ఆశ్చర్యపడి తమ కొడుకును నూరు నేరములు చేయునంతవరకు మన్నించునట్లు కృష్ణుని ప్రార్థించి వరము పడసిరి. పిమ్మట బహుకాలమునకు ధర్మరాజు రాజసూయ యాగము చేయుచు ఉండగా అచ్చటికి వచ్చి కృష్ణుని పలుతెరగుల నిందించి అతనిచేతనే చచ్చెను. చూ॥ దంతవక్త్రుఁడు. (భార)

## శు

**శుంభని శుంభులు :** హిరణ్యకశిపు వంశజులు అగు సుందోపసుందుల యొక్క కొడుకులు, వీరు పుష్కరక్షేత్రమున బ్రహ్మను గూర్చి ఉగ్రతపము కావించి ఇంద్రాది సురలను పరిభవించు శక్తినొందిరి. వీరు గౌరీకాయకోశమున ఉండి పుట్టిన కౌశికీదేవిచే చంపబడిరి, (దే. భా) (మార్క)

**శుకుఁడు :** (1) వ్యాసుని కొడుకు. వ్యాసుఁడు పుత్రార్థిఅయి రుద్రుని గూర్చి తపము అచరించి జలపవనాంబర వసుధానల సమవీర్యుఁడు అగు ఒక సుతుని పొందునట్లు వరముపడసి ఒకనాడు అగ్నికార్యపరుఁడు అయి అరణి పుచ్చుకొని మథించుచు ఉండగా ఘృతాచి అను అప్సరస్స అతనికి లోచన గోచర అయి అతనిని కామగోచరునిగాచేసి తాను వంచనను చిలుక అయి ఉండెను. అంత వ్యాసుని యొక్క శుక్లము అరణియందు పడి దాని వలన ఇతఁడు పుట్టెను. శుక రూపిణి వలన మోహితుఁడు అయి కన్నకొడుకు అగుటచే ఇతనికి వ్యాసుఁడు, శుకుఁడు అని నామకరణము చేసెను. ఇతఁడు జన్మించిన మాత్రమున జ్ఞాని అయ్యెను. యోగి అయి మహాయోగ గమనముకైకొని సర్వాంతర్యామిత్వము వహించిన ఇతడు పోవు సమయమున వ్యాసుఁడు శుక శుక అని వెంటనంటి పిలుచుచూరాగా ఆధ్వని మృగపక్షి శైల సరిత్సరసీ తరు గుల్మలతలు ఓయని ప్రత్యుత్తరములు ఇచ్చునట్లు ఆయెను. ఇతని కూతురు కీర్తిమతి.

(భాగ)

(2) రావణుని చారులలో ఒకఁడు. వీడును సారణుఁడును రాముఁడు కపి సేనతో సముద్రతీరమున విడిసి ఉండఁగా ఆసేనయందలి మర్మములను తెలిసికొని రమ్మని రావణునిచే పంపఁబడినవారు, (రామా)

శుక్తిమతి : కటకపురి యొద్ద ప్రవహించునట్టి ఒకానొక నది.

(భార)

శుక్రుడు : బ్రహ్మమానస పుత్రులలో ఒకడు అయిన భృగువు యొక్క పౌత్రుడు. అసుర గురువు. చూ॥ బలి. ఇతని కూతురు దేవయాన. ఇతని తల్లి దేవలోకమున ఇంద్రుడు లేక ఉండునట్లు తపము చేయుచు నుండగా ఆమెను విష్ణువు చంపెను. (కాశీ)

శుచి : (1) మిథిల వంశస్థుడు అగు ఒక రాజు.

(2) య॥ అంధకుని కొడుకు. (3) శుద్ధుని కొడుకు.

శుద్ధుడు : ఆయువు పౌత్రుడు అనేనసుని కొడుకు. మూడవ శుచి యొక్క తండ్రి.

శునకుడు : (1) కృత్స్నమదుని కొడుకు, తపో నియతుడు, అయి చనిన శౌనకుని తండ్రి. (భార)

శునశ్శేఫుడు : (2) రు॥ రురునికి ప్రమద్వర వలన పుట్టిన కొడుకు. ఋచికుని రెండవ కొడుకు. చూ॥ ఋచికుడు. ఇతనికి దేవరాతుడు అనియు పేరుకలదు.

(రామా)

శుభదంతి : పుష్పదంతము అను దిగ్గజము భార్య.

## శూ

శూద్రకుడు : మగధదేశపు రాజు అగు సుశర్మ యొక్క భృత్యుడు. ఇతడు ఆంధ్రుడు. సుశర్మను చంపి రాజ్యమును అపహరించెను, ఈతని వంశస్థులు ఆంధ్ర భృత్యులు అనబడుదురు.

శూరసేనము : ఒకానొక దేశము. దీనికి మధురాపురి రాజధానిగా నుండెను. రాముని తమ్ముడు అగు శత్రుఘ్నుని కుమారుడు అయిన శూరసేనుని వలన దీనికి ఈ నామము కలిగెను.

శూరసేనుడు (1) య॥ కార్తవీర్యార్జునుని రెండవ కొమారుడు.

(2) ఇ॥ శత్రుఘ్నుని రెండవ కొడుకు. (భాగ)

శూరుఁడు : ఈ పేర అనేక యాదవులు కలరు.

(1) కార్తవీర్యార్జునుని ఐదవకొడుకు. నా॥ ఊర్జితుడు. (2) అంధకుని పౌత్రుడు అయిన విదూరథుని కొడుకు. శిని తండ్రి. (3) దేవమీఢుని కొడుకు. వసుదేవుని తండ్రి. (1) వసుదేవునికి మదిరయందు పుట్టిన పుత్రులలో ఒకడు.

(బ్రహ్మ) (భాగ)

శూర్పకుడు : ర॥ వీడు మన్మథునిచే చంపబడెను. వీనిని చంపినందుననే మన్మథునికి శూర్పకారాతి అను పేరు కలిగెను.

శూర్పణఖ : ర॥ రావణుని చెలియలు. దీని మగడు విద్యుజ్జిహ్వుడు కొడుకు జంబు కుమారుడు. రాముడు దండకారణ్యమున ఉండునపుఁడు ఒకనాడు ఈ శూర్పణఖ అతని పర్ణశాలకు వచ్చి అతఁడు తన్ను పెండ్లాడవలయు నను తలపున సీతాదేవిని మ్రింగబోగా లక్ష్మణుఁడు దీని ముక్కు చెవులు గోసి తఱిమెను. అంతట ఇది జనస్థానమునందున్న తన పినతల్లి కొడుకులు అగు ఖరుడు మొదలగు రక్కసులతో తన అవమానపుపాటు చెప్పుకోగా ఆ రక్కసులు రామునితో పెనుయుద్ధము సలిపిరి. అందు పదునాలుగు కోట్ల రక్కసులు మడిసిరి. ఆవల శూర్పణఖ లంకకుపోయి రావణునికి తన భంగపాటు తెలిపి సీతమీద కామము కలుఁగ బోధించి సీతను వాడు ఎత్తుకొనిపోవునట్లు చేసెను.

(రామా)

## శృ

శృంగి : రు॥ శమీకుని కొడుకు చూ॥ పరీక్షిత్తు.

శృంగిబేరము : ఇది రాముని చెలికాడు అగు గుహుఁడు అను ఎరుకు రాజుయొక్క పట్టణము. గంగాతీరమున ఉండును.

(రామా)

శృంగులు : పుష్యమిత్రుని వంశస్థులు అగు మగధదేశపురాజులు. వీరు పదుగురు నూటపండ్రెండు సంవత్సరములు రాజ్యము ఏలిరి.

## శే

శేషుఁడు : ఆదిశేషువు

## శై

**శైబ్య** : (1) విదేహరాజు కూతురు. ఈమె మహాపతివ్రత. తన భర్త అగు శతధనుడు అను రాజు తొల్లిటి జన్మమందు విష్ణుపూజాదురంధరుడై ఒకప్పుడు భాగీరథియందు స్నానము ఆచరించి నియమముతో ఇంటికి ఏతెంచు నవసరమున ఒక పాషండునితో మాటలాడినందున మఱుజన్మమున శ్వానముగాను అవల సృగాలముగాను పిదప వృకముగాను వెనుక గృధ్ర కాక బక మయూరములుగాను ఒకటికి వెనుక ఒకటి అయి క్రమముగాపుట్టి అనంతరము మానుష జన్మము ఎత్తెను. ఇవి ఎల్ల పూర్వజన్మవాసన వలన ఈ శైబ్య తెలిసికొని తన పురుషుడు మానుష జన్మము ఎత్తునంతదాక తాను వివాహములేక యుండి తదనంతరము అతనినే వివాహమాడి సుఖముగ ఉండెను. (2) జ్యామఘుని భార్య. విదర్భుని తల్లి.

**శైబ్యులు** : ఉసీనరుని కొడుకైన శిబి యొక్క వంశస్థులు

**శైవ** : అనిలుని భార్య.

**శైవము** : (1) ఒక పురాణము. ఇది వాయుదేవప్రోక్తము. శ్వేతవరాహకల్ప విచార శివమాహాత్మ్యదులు కలది. దీని గ్రంథ సంఖ్య ౧౨౦౦౦.

(2) శివప్రాశస్త్యమును తెలిపెడు మతము. ఈ మతస్థులు శైవులు అనబడుదురు.

**శైశునాగులు** : శిశునాగుని వంశస్థులు. వీరు పదుగురు ప్రద్యోతులకు అనంతరము మగధదేశమునకు 362 సంవత్సరములు రాజులు అయి ఉండిరి.

## శో

**శోణ** : ఒక నది. ఇది మైనాకపర్వతమునందు ఉత్పత్తి అయి గంగతో సంగమించును. విశ్వామిత్రాశ్రమము లేక సిద్ధాశ్రమమునుండి మిథిలకు పోవు మార్గమున ఉండునట్టి మఱియొక నది ఈ పేరుచే పరగుచు ఉన్నది. అది మగధ దేశమున ప్రవహించుటచే మాగధి అనియు అనబడును. ఇది ఎఱ్ఱని కాంతి కలది కనుక దీనికి శోణ అను నామము కలిగెను. ఇందుండియే శోణభద్ర వినాయక మూర్తులను ఎత్తుదురు.

**శోణపురము** : బాణాసురుని రాజధాని. (భార)

## శౌ

**శౌనకుఁడు** : రు॥ శునకుని పుత్రుడు, కృత్స్నమదుని పౌత్రుడు. ఈమహాత్ముఁడు తపోనియతుఁడు అయి చనియెను. (భార)

**శౌరసేని** : శూరసేనదేశమునందలి ప్రాకృత భాష.

**శౌరి** : కృష్ణునికి నామము. శూరుని కొడుకు అయిన వసుదేవునికి పుట్టినందున ఈ పేరు కలిగెను.

## శ్యా

**శ్యామకుఁడు** : య॥ వసుదేవుని తమ్ముడు.

**శ్యామరస్మి** : రు॥ కపిలుని శిష్యుఁడు. ఇతఁడు వేదమునందలి అనాదరముచే కపిలునితో వాదించి అతని వలన సమస్తమునకు వేదములే ప్రమాణములు అని ఎఱిగెను.

**శ్యామలాదేవి** : యముని భార్య.

**శ్యామలాదేవి** : (ఉచ్ఛిష్ట) చూ॥ మతంగుఁడు.

**శ్యేని** : అనూరుని భార్య. ఈమె కొడుకులు సంపాతి, జటాయువు. (భార)

## శ్ర

**శ్రద్ధ** : (1, ధర్ముని భార్య. శముని తల్లి. (2) వైవస్వతుని భార్య. (భాగ)

**శ్రద్ధావతి** : వరుణుని రాజధాని.

**శ్రవణద్వాదశి** : శ్రవణ నక్షత్రముతో కూడిన ద్వాదశి. ఈదినమున విష్ణువు వామనమూర్తి అయి అవతరించినందున లోకులు వ్రతము ఆచరింతురు.

**శ్రవణుడు** : ద॥ మురాసురుని కొడుకు. కృష్ణునిచే చంపబడెను.

శ్రాద్ధదేవుఁడు : సూర్యునికి సంజ్ఞాదేవి యందు పుట్టిన కొడుకు.

శ్రాద్ధము : పితృకర్మ శ్రద్ధతో చేయబడునది శ్రాద్ధము అని భావము ఇది పితృదేవతల తృప్త్యర్థము చేయబడినది. మఱియుదీనిని కవ్యముఅనియు చెప్పుదురు. శ్రాద్ధము శుభకార్యముల యందును, అశుభకార్యముల యందును చేయబడును. శుభకార్యముల యందు చేయబడునది నాంది అనియు అభ్యుదయము అనియు చెప్పబడును. అశుభశ్రాద్ధములు అనేకములుగ ఉండును. అందు 1. ప్రేతశ్రాద్ధము ఇది ప్రేతతృప్త్యర్థము ప్రేతత్వ విముక్త్యర్థము చేయబడును. ఇది నగ్ననవ ఏకోద్దిష్ట షోడశ సపిండీకరణశ్రాద్ధములు అనబడును. 2. పైతృక శ్రాద్ధము ఇదిపితృదేవతల తృప్త్యర్థము చేయబడునది. పితృదేవతలు వసురుద్రాదిత్యరూపులు అయి ఉందురు. మఱియు ఇందు పిండ తర్పణములు కలిగినవి కొన్ని, లేనివి మఱికొన్ని. కాశీ, గయ, ప్రయాగ, కురుక్షేత్రము, గోకర్ణము, కురుజాంగలము విశేష నదీతీర్థములు, (అందు) పుష్కరక్షేత్రములు ఇవి శ్రాద్ధకర్తవ్య దేశములు. అందు గయా శ్రాద్ధము మిక్కిలి విశేషము. మృతాహము, అమావాస్య (సూర్యేందు సంగమ దినము అష్టకలు (మార్గశీర్షము మొదలు నాలుగు మాసములయందు బహుళాష్టమి), సంక్రమణ దినములు. మహాలయపక్షము ఇవి ముఖ్యశ్రాద్ధకాలములు. మఱియు పుత్ర జన్మాది వృద్ధియందును, శ్రుతాధ్యయన సంపన్నుడు అయిన బ్రాహ్మణ సంపత్తియందును, వ్యతీపాత మహావ్యతీపాత యోగముల యందును, యుగాది మన్వాది దినములయందును, గ్రహణాది పుణ్యకాలములయందును, పితృశ్రాద్ధము చెప్పబడి ఉన్నది. ఇవి గాక కామ్యశ్రాద్ధకాలములు అనేకములు ఉన్నవి.

శ్రావితము : రాముని కొడుకు అగు లవుని రాజధాని.

శ్రీకంఠుడు : 1. శివుడు. 2. చూ॥ భవభూతి.

శ్రీఖండము : మలయపర్వతము.

శ్రీదేవి : 1. లక్ష్మీదేవి. 2. దేవకుని కూతురు. వసుదేవుని భార్య, దేవకి తోడబుట్టువు.

శ్రీధరాచార్యులు : ఒక పండితుఁడు. ఈయన సంస్కృత భాగవత మునకును విష్ణు పురాణమునకును అద్వైత వ్యాఖ్యానమును చేసెను.

శ్రీనాథుడు : ఒక ఆంధ్ర కవి. బమ్మెర పోతనకు బావమరది. ఇతడు కొండ వీటి దొర అగు అన వేమారెడ్డి యొద్ద ఆస్థానపండితుడు అయి ఉండెను. ఇతనిచే రచియింపబడిన కావ్యములు శృంగార నైషధము, స్కాంధపురాణముతోచేరిన కాశీ ఖండము, భీమేశ్వర పురాణము, మరుద్రాది చరిత్రము, హరవిలాసము, శాలివాహన సప్తశతి వీధినాటకము చూ॥ పోతన.

శ్రీనివాసకవి : (కొడిచేర్ల) ఒకానొక ఆంధ్రకవి. ఇతడు శేషధర్మమును తెనిగించెను.

శ్రీరంగము : ఒక దివ్యక్షేత్రము. కావేరి కొల్లడములకు నడుమ ఉండును. దీనికి నాథుడు అయి సంపన్న ఇందలి విష్ణుమూర్తి, శ్రీరంగనాథుడు అనబడును. రావణాసురుని తమ్ముడు అగు విభీషణుడు ప్రతిదినము లంకనుండి ఇచటికి తొలసి తీసికొనివచ్చి ఈ రంగనాథుని అర్చించి పోవుచు ఉండెను.

శ్రీరామనవమి : చైత్ర శుక్ల నవమి. ఈ దినమునందు విష్ణువు రాముడుగ అవత రించిన దున ఇది వ్రతదినము అయి ఉన్నది.

శ్రీశైలము : నా॥ శిరి ధరము.

శ్రీహర్షుడు : శేష ధర్మమును రచియించిన ఒక సంస్కృత కవి.

శ్రుతకీర్తి : 1. అర్జునునకు ద్రౌపది యందు జన్మించిన పుత్రుడు. 2. వసుదేవుని చెలియలు కేకయరాజైన ధృష్టకేతుని భార్య. ఈమె కొడుకులు. ప్రతర్దనాదులు అయిదుగురు. (3) విక్రమార్కుని మాతామహుడు. ఇతనికి పుత్రులు లేసందున దౌహిత్రుడు అయిన విక్రమార్కుడు ఇతని రాజ్యము అగు ఉజ్జయినికి రాజు అయెను. (4) శత్రుఘ్నుని భార్య. కుశధ్వజుని కూతురు.
(భార) (భాగ) (బ్రహ్మ)

శ్రుతదేవ : వసుదేవుని చెలియలు. వృద్ధశర్మని భార్య. దంతవక్త్రుని తల్లి.
(భాగ)

శ్రుతదేవుడు : 1. మిథిలయందు ఉండిన ఒక విష్ణుభక్తుడు చూ॥బహుళాశ్వుడు. 2. విష్ణు పరిచరులలో ఒకడు.
(భాగ)

శ్రుతముఖ్యుడు : వసుదేవుని కొడుకులలో ఒకడు. తల్లి సహదేవి.

శ్రుతవర్మ : దుర్యోధనుని తమ్ముడు. (భార)

శ్రుతశ్రవ : వసుదేవుని చెలియలు. చేదిదేశపు రాజైన దమఘోషుని భార్య. శిశుపాలుని తల్లి. నా॥ సాత్వతి. (భాగ)

శ్రుతశ్రవుడు : రు॥ సోమశ్రవుని తండ్రి. ఇతడు జనమేజయుని కాలమున ఉండెను [భార]

శ్రుతసేనుడు : 1. సహదేవునికి ద్రౌపదియందు పుట్టిన కొడుకు 2. అభిమన్యుని పౌత్రుడు. జనమేజయుని తమ్ముడు. (భార)

శ్రుతసోముడు : భీమునికి ద్రౌపతియందు పుట్టిన కొడుకు,

శ్రుతాయుధుడు : ఒకానొక రాజు. ఇతడు వరుణుని పుత్రుడు అందురు. వరుణుడు ఇతనికి ఒక గద ఇచ్చి దానిని ధరించువాడు యెల్లవారికి అజేయుడు అగును. అనియు. దాని పోటు ఎక్కించుకొనని వానిని అది చంపక వెనుకను మరలి, తన్ను ధరించు వానినే చంపును అని చెప్పెను. భారతయుద్ధమునందు ఈతడు అర్జునునితో పోరుచు ఉండి ఆగదను కృష్ణుని మీద ప్రయోగింపగా అది కృష్ణునికి పూలమాలవలె అలంకారభూతమై తన్ను ప్రయోగించిన ఇతని మీద మరలి పడి ఇతనినే చంపెను. (భార)

శృతాయువు : 1. పురూరవుని కొడుకు. నా॥ వసుమంతుడు. 2. కళింగదేశపు రాజు ఇతడు భారతయుద్ధమున భ్రాతృపుత్రసహితముగ భీమునిచే చంపబడెను. 3. మి॥ అరిష్టనేమి కొడుకు. (భార)

శ్రుతిగీతలు : జగదవసానసమయమున అనేకశక్తియుతుడుఅయి యోగనిద్రా వశుడు అయిన సర్వేశ్వరుని వేదములు చేసిన స్తోత్రము. ఇది పరమతత్వార్థప్రతిపాదకము అయి ఉండును! చూ॥ నారాయణాఖ్యానము.

శ్రుతుడు : ఇ॥ నా॥ సుహోత్రుడు. భగీరథుని కొడుకు.

శ్రుతులు : చూ॥ వేదములు.

# శ్వ

శ్వఫల్కుడు : య॥ పృశ్ని పెద్దకొడుకు ఇతనికి కాందిని యందు పన్నిద్దరు పుత్రులు కిలిగిరి. అందు జ్యేష్ఠుడు అక్రూరుడు. ఇతనికి సుచారువు అని ఒక కూతురు కలదు. [హరి]

శ్వస : ప్రజాపతి భార్య, అనిలుడు అను వసువు యొక్క తల్లి. [భార]

శ్వాహితుడు : య॥ వృజనవంతుని కొడుకు.

శ్వేతకి : ఒక రాజర్షి. ఇతని యొక్క నియమనిష్ఠలకు మెచ్చి బ్రహ్మదేవుడు ఇతడుచేయనున్న యజ్ఞమునకు దూర్వాసుని ఋత్విక్కునిగా నిచ్చెను. ఈతడు బ్రహ్మచర్యమున పండ్రెండు ఏండ్లు నిరంతర ఘృతధారచే అగ్నిని తృప్తుని చేసెను. దానచేసి అగ్నిదేవునకు అగ్నిమాంద్యమును తేజోహీనతయు, దప్పియు కలిగెను. ఆవ్యాధి నివారణము కొఱకే ఖాండవ వనమును దహించెను. [భార]

శ్వేతకేతుడు : 1. ఋ॥ అష్టావక్రుని మేనమామ. ఇతడు ఒకప్పుడు క్రోధముచే తనపుత్రుని, యముని చూడ పొమ్ము అన. ఆతడు అట్లుచేసి మరల భూమికి వచ్చెను. 2 . ఉద్దాలకుని కొడుకు. [భార]

శ్వేతుడు : 1. విరాటరాజు కొడుకు. ఉత్తరుని యన్న. 2. ఒకానొకరాజర్షి. ఇతడు ఒకప్పుడు కాళాంజనము అను తీర్థమున శివుని గూర్చి తపము చేయుచు ఉండగా, ఇతని, యముడు పట్టి. కట్టి, కొంపోవ శివుడు చూచి కోపించి యముని తన్నెను. 3. విదర్భదేశపురాజు. తండ్రి సుదేవుడు. సోదరుడు సురథుడు. ఇతడు చిరకాలము రాజధర్మము తప్పక రాజ్యముచేసి వెనుక అతి నిష్ఠతో తపము ఆచరించి దేవత్వమును పొందియు అన్నదానము చేయనందున ఆకలి విడువక బాధింపగా బ్రహ్మ యొద్దకు పోయి తన దుఃఖమును చెప్పుకొనెను. అప్పుడు బ్రహ్మ నీవు అన్నదానము లేశమైన చేయని నిమిత్తమున నీకు ఈబాధ కలిగెను. కనుక ముందు నీవు భూలోకమునందు వదలి వచ్చిన నీదేహమును భక్షించి ఆకలి తీర్చుకొనుచు ఉండుము. ఆదేహము చిరకాలము

చెడక ఉండుటయేకాక నీవు కోసి తినిన అవయవములును మరల ఎప్పటివలె ఏర్పడుచుండును అని చెప్పెను. అది విని ఇతఁడు అట్లే చేయుచు బహుకాలము గడపి కడపట అగస్త్యమహర్షికి తన మెడలోని మణులు కూర్చిన తులసి పూసల పేరు ఇచ్చి అకలి పోగొట్టుకొనెను. [ఉ.రా] [భార] [బ్రహ్మ]

## ష

షట్చక్రవర్తులు : హరిశ్చంద్రుడు, నలుఁడు, పురుకుత్సుడు, పురూరవుడు, సగరుడు కార్తవీర్యార్జునుడు అనువారు.

షణ్ముఖుడు : షడాననుడు. కుమారస్వామి.

## షో

షోడశమహారాజులు: గయుఁడు, శశిబిందువు, పృథువు, సహోత్రుడు, భరతుడు, దిలీపుడు, రంతిదేవుడు, మాంధాత, అంగుడు, శిబి, అంబరీషుడు, మరుత్తు, రుగుడు, రాముడు యయాతి, భగీరథుడు అనువారు.

## స

సంకటుడు : ధర్మునికి కకుద్దేవి యందు పుట్టిన కొడుకు.

సంకర్షణుడు : చూ॥ నా॥ బలరాముఁడు. ఇతఁడు దేవకీ గర్భమున ఉండగా యోగమాయాదేవి సంకర్షించి రోహిణీగర్భమునందు చేర్చెను. కనుక ఇతనికి ఈ పేరు కలిగెను.

సంకల్ప : ధర్ముని భార్యలలో ఒకతె, కొడుకు సంకల్పుడు.

సంకల్ప సూర్యోదయము : ఒకానొక సంస్కృత నాటకము. ఇది నారాయణాచార్యులు అను కవిచే రచియింపబడినది. విశిష్టాద్వైత మత ప్రతిపాదకము.

సంకల్పుఁడు : 1, బ్రహ్మమానస పుత్రులలో ఒకడు. 2, ధర్మునికి సంకల యందున పుట్టినకొడుకు.

శసంకృతి : పు॥ మూడవ నరుని కొడుకు. కొడుకులు గురుడు రంతిదేవుడు. (భాగ)

**సంక్రమణము** : సూర్యుడు మేషాది రాసులయందు ప్రవేశించుట. నా॥ సంక్రాంతి. ఇవి పన్నెండు. చూ॥ రాసులు. అందు ముఖ్యములు మేష, కటక, తులా, ధను స్సంక్రమణములు నాలుగు.

**సంజయుడు** : 1. ధృతరాష్ట్రునికి ఆప్తుడు అగు ఒక సూతపుత్రుడు. ఇతడు వ్యాస ప్రసాదముచే తత్వవేత్తయు, నీతి పరుడును అయి సుగతిని పడసెను. భారతయుద్ధ ప్రకారము అంతయు ఇతనిచేతనే ధృతరాష్ట్రునకు చెప్పబడెను. 2. పురూరవుని వంశస్థుడు. క్షత్ర వృద్ధుని పౌత్రుడు. (భార)

**సంజ్ఞాదేవి** : నా॥ ప్రభావతి. సూర్యుని భార్య. చూ॥ త్వష్టి. (బ్రహ్మ)

**సంధ్య** : సాలకటంకుల తల్లి.

**సంపాతి** : 1. అనూరుని పెద్దకొడుకు. తల్లి శ్యేని. తమ్ముడు జటాయువు. కొడుకు సుపార్శ్వుడు. ఒకప్పుడు ఇతడును ఇతని తమ్ముడు అగు జటాయువును తమదమ శక్తి కొలదిని ఎఱుగకోరి అంతరిక్షమునకు ఎగసి పైకిపోవుచు సూర్య మండలమును సమీపింపగా జటాయువు సూర్యుని వేడిమికి తాళచాలక క్రిందికి ఒరగగా ఇతఁడు తన రెక్కలచేత అతనిని కప్పెను. అపుడు సూర్యకిరణముల వేడిమిచే అతని రెక్కలు కాలిపోయెను. అంతట మింట నిలువనేరక ఇతడు సముద్రమునను జటాయువు దండకారణ్యమునందలి జనస్థానమునను పడిరి పిమ్మట ఇతఁడు హనుమదాదులకు సీత లంకలో ఉంకు వృత్తాంతమును తెలిపి ఆసుకృతాతిశయముచే మరల రెక్కలు మొలవగా తన ఉనికిపట్టు అగు హిమ వంతమునకు పోయి చేరెను. 2. ర॥ మాలి కొడుకు. విభీషణుని మంత్రి. (రామా) (మత్స్య) (ఉ. రా)

**సంప్రీతి** : శముని భార్య.

**సంభవాశ్వుడు** : నా॥ బర్హినాశ్వుడు.

**సంభూతి** : 1. నా॥ సుమనసుడు. 2. నా॥ త్రిధన్వుడు.

**సంయమని** : యముని రాజధాని.

**సంయాతి** : 1 నహుషుని కొడుకు. యయాతి తమ్ముడు. 2. పు॥ నా॥ శర్యాతి. బహుగంతుని కొడుకు. భార్య వరాంగి. (భార)

**సంవరణుఁడు** : 1, అజమీఢుని కొడుకులలో ఒకడు. ఇతడు సూర్యుని కూతురు అయిన తపతిని వివాహము అయి కురువు అను పుత్రుని పడసెను. 2 పు॥ రుక్షుని పుత్రుడు. (భార)

**సవర్తుఁడు**
**సంవర్తుఁడు** } : అంగిరసుని కొడుకు. బృహస్పతి తమ్ముఁడు. నా॥ ఉతథ్యుఁడు

**సంశప్తకులు** : త్రిగర్తాధీశ్వరుఁడు అగు సుశర్మయు అతని అనుజులు సత్యరథుఁడు, సత్యసేనుఁడు, సత్యకర్ముఁడు, సత్యవర్ముఁడు మొదలుఅగు రథికముఖ్యులు కొందఱును. వీరు అర్జునుని చంపుదము, చంపలేకున్న అతనిచేత చత్తుము. ఇంతియే కాని వెఱచిమాఱుమొగము పెట్టితిమేనిగో బ్రాహ్మణాది వధచేసిన పాపమును అనుభవింప కలవారము అని ప్రతిన పట్టి బింకము వదలక మెలగిన రథికులు. వీరితో అర్జునుఁడు యుద్ధముచేయుసవసరముననే అభిమన్యుని కౌరవులు చంపిరి. (భార)

**సంస్కృతుఁడు** : మిధిల వంశస్థుడు అగు ఒకరాజు.

**సంహతాశ్వుఁడు** : నా॥ బర్హిణాశ్వుఁడు.

**సంహ్రాది** : ర॥ సుమాలి కొడుకు.

**సంహ్లాదుఁడు** : ది॥ ప్రహ్లాదుని తమ్ముఁడు. హిరణ్యకశిపుని కొడుకు. (భాగ, మత్స్య, భార)

**సక్తుప్రస్థుఁడు** : కురుక్షేత్రమునందున్న ఒకానొక బ్రాహ్మణుఁడు. ఇతఁడు తాను చేసెడి అతిధిపూజచే, యముని సంతోషపరచి సకుటుంబముగా బ్రహ్మలోకమునకు పోయెను. (భార)

**సగరుఁడు** : ఇ॥ షట్చక్రవర్తులలో ఒకఁడు. బాహుకుని కొడుకు. ఇతనికి భార్యలు ఇరువురు. అందుపెద్దది విదర్భరాజు కూతురు అగు కేశిని, రెండవది అరిష్టనేమి కూతురు అగు సుమతి. ఒకప్పుఁడు ఇతఁడు అశ్వమేధయాగముచేయు నపుడు ఇంద్రుఁడు అశ్వమును దొంగిలించెను. ఆ యశ్వమును తన రెండవ భార్యయొక్క కొడుకులు అఱువది వేవురు వెదకుచు పుడమియందు ఎచ్చోటను

కానక భూమిని త్రవ్వి పాతాళము ప్రవేశించి అందు కపిల మహామునిని తిరస్కరింపగా అతని కోపదృష్టిచే నీఱు అయిరి. వారికి పుణ్య లోకముకలుగు నిమిత్తము ఇతని ముని మనుమడు అయిన భగీరథుఁడు గంగను తెచ్చివారు త్రవ్విన దారిని పాతాళమునకు ప్రవహింపచేయ అది అపుడు సముద్రము ఆయెను. ఇందు వలననే సముద్రమునకు సాగరము అను పేరును గంగకు భాగీరథి అను పేరును కలిగెను.

(బ్రహ్మ, బ్రహ్మో)

**సత్యకర్ముడు** : అం॥ దృఢవ్రతుని తండ్రి. (భార)

**సత్యకీర్తి** : హరిశ్చంద్రుని మంత్రి

**సత్యకుఁడు** : రెండవ శిని పుత్రుఁడు. యాదవులలో వృష్ణి వంశస్థుడు (హర)

**సత్యకేతువు** : కా॥ సుకేతుని పౌత్రుడు. విభువు తండ్రి.

**సత్యజిత్తు** : (1) య॥ వసుదేవుని తమ్ముడు అయిన కంకుని రెండవ కొడుకు (2) ద్రుపదుని యన్న. (భార)

**సత్యధృతి** : (1) నా॥ శరద్వంతుఁడు. శతానందుని కొడుకు. ఇతఁడు ధనుర్వేద విశారదుడు. ఒకనాడు వనమున ఊర్వశిని కని ఇతనికి రేతఃపాతము అయి ఆ వీర్యము ఒకశర స్తంభమున చేర్చ దానివలన ఒక మగశిశువును, ఒక ఆడుశిశువును జనించెను. అపుడు శంతనుఁడు ఆ మార్గముగ వనమున వేటాడబోవుచు శిశువు యుగమును పొడగని కృపతో తెచ్చి పెంచెను. దాన జేసి ఆశిశువులు కృపుడు, కృపియు అన బరగిరి. ఆకృపి పిదప ద్రోణాచార్యులకు భార్య అయ్యెను. (భార)

(2) పు॥ కృతిమంతుని కొడుకు (3) మి॥ మహావీర్యుని కొడుకు. (భాగ)

**సత్యభామ** ; సత్రాజిత్తుకూతురు. కృష్ణుని అష్టభార్యలలో ఒకతె. ఈమె కృష్ణునకు మిక్కిలి ప్రియురాలు కనుక అతనిని ఎడబాయక చరించుచు ఉండును. మఱియు ఈమె రూపరేఖాలావణ్యమున మిగుల అతిశయించినది. ఒకప్పుడు ఈమె పారిజాతవృక్షము తనకు కావలయును అని పెనిమిటిని అడుగగా అతఁడు దానిని స్వర్గమునుండి తెచ్చియిచ్చెను. ఆకథను తెలుపునట్టి గ్రంథము పారిజాతాపహరణము అనబడును.

(భాగ)

**సత్యవంతుడు** : మద్రదేశపురాజు అగుద్యుమత్సేనుని కొడుకు. నా॥ చిత్రాశ్వుడు. సావిత్రిభర్త. చూ॥ సావిత్రి. (భార)

**సత్యవతి** : (1) దాశరాజునకు పెంపుడు కూతురు. వ్యాసుని తల్లి. శంతనుని భార్య. శంతనుని వలన ఈమె కనిన కొడుకులు చిత్రాంగదుడు విచిత్ర వీర్యుడు ఈమె ఉపరిచర వసువు వీర్యమున శాపముచే మత్స్యమై యమునానదియందు అద్రిక అను అప్సరసకు జనించెను. మరియు ఈమెకు యోజనగంధి మత్స్యగంధి అనునామములు కలవు. ఈమ కన్యాత్వమున పరాశరమహర్షివలన సద్యోగర్భము ధరించి కృష్ణద్వైపాయనుని (వ్యాసుని) కనెను చూ॥ అచ్ఛోద. (2) నా॥ కౌశికి. గాధి కూతురు. ఋచికుని భార్య ఈమె కొడుకు జమదగ్ని. ఈమె తనభర్తతో కూడ సహగమనముచేసి అవల కౌశికీనది అయ్యెను. (భార)

**సత్యవ్రతుడు** : (1) త్రిశంకుని పూర్వనామము (2) ఒకానొకరాజు. ఇతఁడు పోయిన కల్పమున ద్రవిడ దేశపురాజుగా ఉండి ప్రళయకాలమున నారాయణ ప్రేరితము అయిన ఒక నావయందు హరిధ్యానముచేయుచు ఉండి ఈ కల్పమున వైవస్వత మనువుగా జనించెను. (భార, మార్క)

**సత్యశ్రవుఁడు** : (1) ఋగ్వేదాధ్యాపకుఁడు అగు ఒక ఋషి (2) వరి॥ వీతిహోత్రుని కొడుకు.

**సత్యసేనుడు** : కర్ణుని కొడుకు. (భార)

**సత్యహితుడు** : కు॥ ఉపరిచర వసువు వంశస్థుడు.

**సత్రాజిత్తు** : యాదవులలో వృష్ణివంశస్థుడు అగు నిమ్నుని కొడుకు. సత్యభామ తండ్రి. ఇతడు సత్యభామను కృష్ణునికి యిచ్చినందులకై అక్రూరుడును, కృతవర్మయు శతధన్వునికి రోషముకలుగ బోధించిరి. అంత ఇతనిని నిద్రపోవుచుండు తఱినిశతధన్వుడు వచ్చి చంపిపోయెను. అది తెలిసి సత్యభామ దుఃఖింపగా ఆమె యొక్క ప్రీతికొఱకు కృష్ణుడు శతధన్వుని చంపెను. చూ॥ శమంతకమణి (భాగ)

**సదశ్వుడు** : బా॥ సమరుని కొడుకు.

**సదాకాంత**
**సదావీర** } పారిపత్ర పర్వతమున ఉత్పత్తి అగు నదులు.

**సనందనుఁడు**
**సనకుఁడు** } దే॥ రు॥ బ్రహ్మమానస పుత్రులు.

సనత్కుమారము : ఉపపురాణములలో ఒకటి.

సనత్కుమారుఁడు : బ్రహ్మమానస పుత్రులలో ఒకడు. సనకాదులు ఎల్లలోకముల యందు సంచరింప శక్తికలవారు కనుక యితడు తనకు అత్యంత భక్తుడు అగు విదురునిచే ప్రార్థింపబడి ధృతరాష్ట్రుని ఒద్దకువచ్చి అతనికి అధ్యాత్మ విద్యను ఉపదేశించి చనియెను. (బ్రహ్మ)

సనాజిత్తు : య॥ హైహయుని పౌత్రుడు అగు కుంతి కొడుకు. ఇతనికి శోభంజి అనియు నామము కలదు.

సన్నతమంతుడు : పు॥ నాలవసుమతి కొడుకు. కృతి తండ్రి.

సన్నతి : (1) కా॥ అలర్కుని కొడుకు. సునీతుని తండ్రి. (2) క్రతువుభార్య దక్షప్రజాపతికూతురు. వాలఖిల్యమహర్షుల తల్లి. (బ్రహ్మ)

సప్తకులాచలములు: చూ॥ కులపర్వతములు.

సప్తద్వీపములు ; జంబూ, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మల, పుష్కర ద్వీపములు. చూ॥ ప్రియవ్రతుఁడు. ఈ సప్తద్వీపములకు నడుమ జంబూద్వీపము ఉండును. దానిచుట్టు లవణ సముద్రమును దానిచుట్టి ప్లక్షద్వీపమును, ఆవల ఇక్షు సముద్రమును పిదప శాల్మలద్వీపమును తదనంతరము సురోదధియు వెనుక కుశ ద్వీపమును వెనుక ఘృత సముద్రమును దానిచుట్టి క్రౌంచద్వీపమును ఆక్రౌంచ ద్వీపమును చుట్టిదధి సముద్రమును దాని పరివేష్టించి శాకద్వీపమును ఉండును. ఆశాకద్వీపమునకు వెనుక పాలసముద్రమును, దానికి అనంతరము పుష్కరద్వీపమును, దానిచుట్టి మంచినీళ్ల సముద్రమును ఉండును అట్లు జంబూద్వీపమును చుట్టి ఉండు ద్వీపములు అనుక్రమముగ ఒకటి కంటె ఒకటి రెండింతల పరిమాణము కలదై అనేక పర్వతములును నదులును కలిగి ఉండును

సముద్రుఁడు : చూ॥ సగరుడు.

సప్తర్షులు : మరీచి, అంగిరసుఁడు, పులహుఁడు, వసిష్ఠుడు, అత్రి, పులస్త్యుడు, క్రతువు. అనువారు కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, వసిష్ఠుడు, అనువారు ఏడ్వురును సప్తర్షులు అని కొందఱు వాడెదరు.

సప్తలోకములు : భూలోకము, భువర్లోకము, స్వర్గలోకము, మహోలోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము అను ఊర్ధ్వలోకములు. ఈ ఏడు లోకములలోను జీవులు వారివారి కర్మఫల ప్రాప్తికి అనుగుణ్యము అయిన దానియందు ఉందురు. భూలోకమునందు మనుష్యులును భువర్లోకమునందు యక్ష రాక్షస గంధర్వ కిన్నర కింపురుషులు మున్నగువారును, స్వర్గలోకమునందు దేవతలును, (అందే చంద్రలోకమును పితృలోకమును కలవు) దానికి పైని వారివారి పుణ్యోదయ విశేషమున పై పై లోకములయందు వారివారికి పై యంతస్థు కలవారును ఉందురు. భూలోకము మేరువునకు దక్షిణమున ఉండును. తక్కిన లోకములు భూమియొక్క మేరువునకు ఉత్తరమునను ఆయాయి లోకమున ఉండు మేరువునకు దక్షిణమునను ఉండును. ఆయినను అన్నిటికి పైది సత్యలోకము ఆదే బ్రహ్మ లోకము. ఈ లోకమునకు పోవుటకు రెండుమార్గములు అర్చిరాది మార్గము ఒకటి. ధూమాది మార్గము ఒకటి. కేవల బ్రహ్మజ్ఞానము కలవారు అర్చిరాది మార్గముగపోదురు. సగుణబ్రహ్మోపాసనా యోగాభ్యాసమును చేయువారు ధూమాది మార్గమున బ్రహ్మలోకమును పొందుదురు. కైలాసము, వైకుంఠము అను నీరెండును బ్రహ్మలోకముతో చేరినవియే కాని వేరుఐనవి కావు. ఫలాభిసంధితో కర్మానుష్ఠానము కలవారు స్వర్గలోకమున తమతమ పుణ్యమునకు అనుగుణము అగు ఫలమును అనుభవించి మరల భూలోకమునకు వత్తురు. ఇట్లే అధోలోకములును ఏడు కలవు. అవి అతలము, వితలము, సుతలము, తలాతలము, రసాతలము, మహాతలము, పాతాళము అనబడును. ఈ సప్తలోకములకు క్రింద మాయ మొదలగు నరకములు ఉండును. వీని కన్నిటికిని ఆధారముగ విష్ణ్వంశ సంభూతుడు అగు ఆదిశేషుడు నిలిచిఉండును. ఈ శేషుని విషజ్వాలామయ ముఖములనుండి యముడు పుట్టి జనులను శిక్షించుచు ఉండును. ఈ లోకములు అన్నియు చేరి పదునాలుగు లోకములు అనబడును. స్వర్గ మర్త్య పాతాళములు మూడును త్రిలోకములు అనబడును.

సప్తసముద్రములు : లవణేక్షు సురాసర్పిర్దధి క్షీరజలార్ణవములు.

సప్తసారస్వతము : ఒక పుణ్యక్షేత్రము. ఇందు వసిష్ఠాది మహర్షులు చేసిన సవనములయందు సరస్వతీనది నారీవేషయుక్త అయి సుప్రభ కనకాక్షి విశాల సురతన్వ అమోఘమాల సువేని విమలోదక అను నామములచే యజమానుని

చేతను సకల దేవమునుల చేతను సంభావన పడసెను. (భాగ.భార బ్రహ్మ.బ్ర.వై)

సభానలుఁడు : యయాతి పౌత్రుఁడు. అణువు పెద్ద కొడుకు.

సమరుఁడు : బా॥ నీపుని జ్యేష్ఠ పుత్రుఁడు. ఇతఁడు కాంపిల్యాధిపతి అయ్యెను. ఇతనికి పారుఁడు సుపారుఁడు సదశ్వుఁడు అని ముగ్వురు కొడుకులు.

సమీచి : ఒక అప్సరస. చూ॥ నారీతీర్థములు

సర : చూ॥ నా॥ (2) పార్వతి.

సరమ : విభీషణుని భార్య సీత రావణునిచే పట్టువడి అశోకవనమున ఉండు కాలమున ఈమె సీతను మిగుల ఆదరించుచు ఉండుటయే కాక యుద్ధకాలమపుడు లంకయందు జరుగు వృత్తాంతమును అంతయు అప్పుడప్పుడు సీతాదేవికి తెలుపుచు ఉండును. ఈమె శైలూషుడు అను గంధర్వరాజు కూతురు. ఈమెయొక్క కూతురు త్రిజట. (రామా)

సరయువు : ఒక నది. ఇది అయోధ్యకు పశ్చిమోత్తర ప్రాగ్దిక్కుల యందు ప్రవహించుచు ఉండును. ఇప్పుడు ఈనదిని గోగ్రా అని వాడుదురు,(రామా)

సరస్వతి : (1) బ్రహ్మభార్య ఈమె బ్రహ్మచే సృజింపబడి అతనినే పెండ్లాడెను. విద్యకు అధిష్ఠానదేవత. ఈమెను జనులు శరదృతువునందు పూజింతురు. కనుక శారద అనియు అందురు. మఱియు ఈమెకు నాలుగు హస్తములు కలవు. అనియు, ఆ నాలుగింటి యందును అక్షమాల, చిలుక, కమలము, పుస్తకము వరుసగా ఉండును అనియు, సంగీతము సాహిత్యము అను నీ రెండును ఈమెకు రెండు స్తనములు అనియు చెప్పుదురు. (2) అంతిసారుని భార్య. (3) ఒకనది. ఇది బ్రహ్మావర్తమునకు ఎల్లయై ఉండును,

సర్వంకషము : మాఘమునకు వ్యాఖ్య.

సర్వకాముడు : ఇ॥ ఋతుపర్ణుని కొడుకు, సుదాసుని తండ్రి (బ్రహ్మ)

సర్వతేజస్సు : వ్యుష్టి కొడుకు. ఇతనితల్లి పుష్కరిణి. భార్య ఆకూతి. కొడుకు చక్షుర్మనువు.

సర్వపది : భట్టి కావ్యమునకు మల్లినాథకవి చేసిన వ్యాఖ్య.

సర్వర్ధి : వత్సరుని భార్య. పుష్పార్ణుని తల్లి.

సవనుడు : ప్రియవ్రతుని కొడుకులలో ఒకడు. ఇతనికి పుష్కరద్వీపము యియ్యబడెను. కొడుకులు యిరువురు. (బ్రహ్మ)

సహదేవి : వసుదేవుని భార్య. దేవకుని కూతురు.

సహదేవుడు :(సహాదేవుడు) (1) పా॥ సుదాసుని కొడుకు. సోమకుని తండ్రి (2) పాండురాజు కొడుకు. ధర్మరాజుయొక్క కడగొట్టు తమ్ముడు. ఇతనితల్లి మాద్రి. అశ్వనీ దేవతల ప్రసాదమున ఇతడు జనించెను. ఇతనికి విజయ అను భార్యయందు సుహోత్రుడు అను కొడుకు పుట్టెను. (3) జరాసంధునికొడుకు. (భాగ) భార)

సహ సక్షిత్తు : (1) యదువుయొక్క పెద్దకొడుకు. చూ॥ యాదవులు (2) య॥ భజమానుని కొడుకులలో ఒకడు. (భాగ)

సహస్రపాదుడు : రు॥ ఖగముఖుని సహాధ్యాయుడు. ఇతడు ఎగతాళికి తన సహాధ్యాయుని మీద గడ్డితోచేసిన పామును వేయగా అతడు అదిరిపడి కోపించి సర్పము అగునట్లు ఇతనికి శాపము యిచ్చెను. అంతట ఇతడు డుండుభము అను సర్పము అయి చిరకాలము ఉండి, రురుని చూడగానే ఆ శాపమువలన విముక్తుడు అయ్యెను. (భార)

సహ్యము : ఒకానొక కొండ. ఇది పడమటి కనుమలయొక్క యుత్తర భాగము అయి ఉండును

## సా

సాంకాశ్యపురి : కుశధ్వజుని ముఖ్యపట్టణము. ఇది ఇక్షుమతీ నదీతీరమున ఉండెను.

సాంఖ్యము : ఒకానొక యోగము. ఇది ఆత్మతత్వవిచారమునందు అనుష్ఠింపబడును. సేశ్వర సాంఖ్యము అనియు, నిరీశ్వర సాంఖ్యము అనియు సాంఖ్యము ఇరు తెరగులు. అందు అద్వైత మతానుష్ఠానము కలవారిది సేశ్వర సాంఖ్యము. కాపిల మతస్థులది నిరీశ్వర సాంఖ్యము. ఈ యోగము మోక్షసాధకము.

**సాంఖ్యాయనుడు** : ఋగ్వేదాధ్యాపకుడు అయిన ఒక ఋషి.

**సాందీపుడు** : బలరామ కృష్ణులకు గురువు. ఇతనియొక్క నివాసస్థానము అవంతి. ఒకానొకప్పుడు ఇతని కొడుకు ప్రభాస తీర్థమున స్నానము ఆచరించుచు ఉండగా వానిని ఒక దానవుఁడు నీటిలోనికి తీసికొనిపోయి చంపెను. అట్లు చచ్చిన పుత్రుని రామకృష్ణులు మరల యమపురమునందుండి తెచ్చి గురునకు దక్షిణగా యిచ్చిరి.

**సాంబుడు** : (1) కృష్ణుని కొడుకు. తల్లి జాంబవతి (2) శివునికి నామాంతరము. (కాశీ)

**సాకేతపురి** : నా॥ అయోధ్య. శ్రీరాముని రాజధాని.

**సాగరుడు** : చూ॥ సగరుడు.

**సాత్యకి** : య॥ సత్యకుని కొడుకు. నా॥ యుయుధానుడు. శిని మనుమడు అయినందున యితనిని శైనేయుడు అనియు అందురు. చూ॥ భూరిశ్రవుడు. (భాగ)

**సాత్వతి** : చూ॥ శ్రుతశ్రవ.

**సాత్వతుడు** : (1) విష్ణుపరిచరులలో ఒక్కడు. (2) విదర్భుని రెండవకొడుకు అగు కృథుని వంశస్థుడు. ఇతనికి పుత్రులు ఏడుగురు. (భాగ)

**సాధ్య** : ధర్ముని భార్యలలో ఒకతె. ఈమె పుత్రులు సాధ్యులు.

**సాధ్యులు** : గణదేవతాభేదము. ధర్మునికి సాధ్యయందు పుట్టినవారు. సిద్ధిగలవారు అని శబ్దార్థము. వీరు పన్నిద్దరు.

**సాయుఁడు** : ధాతకు కుహూదేవియందు జనించిన కొడుకు.

**సారణుఁడు** : (1) య। రోహిణియందు వసుదేవునికి పుట్టిన సుతుఁడు. (భాగ) (2) రావణుని చారులలో ఒకఁడు.

**సారమేయుఁడు** : య॥ అక్రూరుని తమ్ముఁడు.

**సారస్వతము** : (1) సరస్వతీనదీతీరదేశము (2) సంస్కృత సంధిని తెలిపెడు వ్యాకరణ సంగ్రహము.

సారస్వతుఁడు : దధీచియొక్క వీర్యమున సరస్వతినదియందు ఉదయించిన మహర్షి. [బ్రహ్మ]

సారస్వతులు : సరస్వతీ నదీతీరదేశస్థులు. వీరు పంచగౌడులలో ఒక్కరు.

సార్వభౌమము : ఉత్తర దిక్కునందలి మగఏనుగు.

సార్వభౌముఁడు : కు॥ విదూరథుని కొడుకు. [భార]

సాలకటంకట : విద్యుత్కేశుని భార్య. సుకేశుని తల్లి. ఈమె వంశమున జనించిన వారు సాలకటంకటేయులు అనబడుదురు.

సాలగ్రామము : (1) ఒకానొక పుణ్యక్షేత్రము. ఇది గండకీనది పుట్టినచోటు. (2) పూజింపతగిన విష్ణుమూర్తి రూపకశిల. ఇది వేణుగోపాలమూర్తి. సంతాన గోపాలమూర్తి. ఉగ్రనారసింహమూర్తి, లక్ష్మీనృసింహమూర్తి, రామమూర్తి, త్రివిక్రమమూర్తి, సుదర్శనమూర్తి, అని బహురూపులుగా ఉండును. ఈ సాలగ్రామములు స్థలజన్యములు, జలజన్యములు అని ద్వివిధములు. వీనికి ముఖ్యము లగు ఉత్పత్తి స్థానములు హిమవత్పర్వత సమీపమున ద్వాదశ యోజనాంతరత భూమియు సాలగ్రామాది తీర్థములును అగును.

సాలపోతకుఁడు : ఇతఁడు ఒకనాగరాజు. చూ॥ నంద. [మార్క]

సాళ్వుఁడు : (1) శిశుపాలుని తమ్ముఁడు. కృష్ణుఁడు రుక్మిణిని కొనిపోవుటయు, శిశుపాలుని చంపుటయు తలపోసి శివునిగూర్చి తపము ఆచరించి సకలమాయలను కల్పించు శక్తియు. ఆకాశమున చరించునట్టి సౌంభకము అను విమానమును పడసి యాదవులను హింసించుచుండగా, కృష్ణుఁడు దండెత్తిపోయి వీనిని సంహరించెను. [భార]

(2) య॥ వసుదేవుని తమ్ముఁడు అగు వృకుని మూడవ కొడుకు.

సావర్ణి : ఒకపౌరాణికుఁడు.

సావిత్రి : అశ్వపతికూతురు. ఈమె తల్లిమాళవి. ఈమె మహాపతివ్రత. సాళ్వపతి అగు ద్యుమత్సేనునికొడుకు అయిన సత్యవంతుఁడు, గుణవంతుడు రూపవంతుఁడు అని విని, వాని యందు మనసు కలదై ఉండఁగా ఆద్యుమత్సేనుఁడు విగతచక్షుఁడై

వైరులచే రాజ్యమును కోల్పడి, తనకొడుకుతోడను భార్యతోడను అడవియందుచేరి మునివృత్తిని ఉండుట వినియు, పెండ్లి అయిన సంవత్సరమునకు సత్యవంతుఁడు మృతుఁడు అగును అని తెలిసియు, ఒకనిని అంటిన మనసును మరియొకనిపై పారనియ్యరాదు అని ఆసత్యవంతునినే వివాహమై తనపాతివ్రత్యముచే యముని మెప్పించి అతనిచే తన మామ లబ్ధచక్షుఁడు అగునట్లును, వైరులచే అపహృతమైన రాజ్యము మరల తమ్ము పొందునట్లును, తన తండ్రి అగు అశ్వపతి పుత్రశత మును పడయునట్లును, మృతుఁడైన తనభర్త పునర్జీవితుఁడు అగునట్లును వర ములు పొంది అత్తమామలచేతను, తల్లితండ్రులచేతను మన్ననలు పడసి లోకులు ఎల్ల మహాసాధ్వి అని తన్ను కొనియాడ చిరకాలము భర్తకు ప్రియురాలై సుఖించెను. కనుక ఈమెయొక్క పాతివ్రత్యము మహాప్రసిద్ధము అయి ఉండును. [భార]

**సాహిత్యరత్నాకరము** } ఒక అలంకార శాస్త్ర గ్రంథము. ఇది ధర్మసూరిచే రచింపబడినది.

**సాళ్వము** : ఒకానొక దేశము ఇది అర్యావర్తమునందలి మధ్య దేశములలో ఒకటి.

## సి

**సింగన** : ఒకానొక ఆంధ్రకవి. ఇతఁడు వాసిష్ఠ రామాయణమును తెనిగించెను. ఇతఁడే పద్మపురాణమును తెనిగించెను అని కొందరుచెప్పుదురు.

**సింధుద్వీపుఁడు** : ఇ॥ అయుతాయువు తండ్రి. [వరా]

**సింహబలుఁడు** ; నా॥ కీచకుఁడు. చూ॥ కీచకులు. [భార]

**సింహిక** : (1) దితి కూతురు, విప్రచిత్తిభార్య. ఈమె దక్షునికూతురు అనియు కశ్యపునిభార్య అనియు భారతమునందు చెప్పబడి ఉన్నది.

(2) హిరణ్యకశిపుని కూతురు.

(3) ఒకానొక రాక్షసి. నా॥ ఛాయాగ్రాహిని. హనుమంతుఁడు లంకకుపోవునపుడు దీనిచే నీడవలన పట్టుకోబడి నిలిచి దీనికడుపునదూరి దేహమును పెంచి॥ కడుపుచించుకొని బయటికి వచ్చెను. [భాగ] [భార]

**సితధ్వజుఁడు** : మి॥ అజుని కొడుకు. కుని తండ్రి.

**సిద్ధాంతకౌముది** : ఇదిపాణినిచేసిన సంస్కృత వ్యాకరణమునకు వ్యాఖ్య.

**సిద్ధాశ్రమము** : ఒకపుణ్యాశ్రమము. ఇందు వామనావతారమునకు ముందు విష్ణువు బహుసంవత్సరములు తపము ఆచరించెను. ఇది తాటక ఉండిన వనమునకు కొంత దవ్వున ఉండును. ఇదియే విశ్వామిత్రుని యాశ్రమము. ఇచట తపము ఆచరించు వారికి ఫలప్రాప్తి తప్పక కలుగును. కాన దీనికి సిద్ధాశ్రమము అను పేరు కలిగెను.

**సిద్ధులు** : దేవతలలో ఒకతెగవారు. అణిమాది సిద్ధిగలవారు అని వ్యుత్పత్తి.

**సినీవాలి** : ధాత భార్యలలో ఒకతె.

## సీ

**సీత** : రాముని భార్య. జనకమహారాజు కూతురు. ఈమె పూర్వజన్మమున వేదవతి అను కన్యగా ఉండి విష్ణువును పెండ్లాడ వలయును అని తపము ఆచరించుచు ఉండ, రావణుఁడు తన తపోవిఘ్నము కావించెను. అంత ఆమె అగ్నిప్రవేశము చేసి అయోనిజయై పుట్టెను. చూ। వేదవతి మారీచుఁడు (రామా)

**సీరధ్వజుఁడు** : నా॥ జనకుఁడు.

## సు

**సుందరి** : మాల్యవంతుని భార్య. నర్మద అనెడు గంధర్వ స్త్రీయొక్క కూతురు. (ఉ.రా)

**సుందుఁడు** : ఒక యక్షుఁడు, తాటక మగఁడు. మారీచ సుబాహుల తండ్రి.

**సుందోప సుందులు** : ది॥ హిరణ్యకశిపు వంశమున పుట్టిన నికుంభుఁడు అనువాని కొడుకులు. ఈ అన్నతమ్ములు ఇద్దరు మిగుల ఘోరమైన తపము సలిపి బ్రహ్మ వలన కామరూపత్వమును. కామగమనత్వమును సకల మాయావి

త్వమును, అన్యులచేత అవధ్య త్వమును కలుగ వరములను పడసి జనులకు కష్ట బాధకులుగ ఉండిరి. అపుడు విష్ణువు విశ్వకర్మచే రూపరేఖా సంపన్నఅగు ఒక కన్యకను సృజింపచేసి వీరియొద్దకు పంపెను. అప్పుడు ఈ యిరువురును దానివలన మోహితులు అయి నీవు మాలో ఎవనిని వరించెదవు అని అడుగగా మీరు ఇరువురును నా యెదుట యుద్ధము సలిపితిరేని మీలో జయశాలి అగువానిని నేను వరించెదను అని చెప్పెను అంతట వారు ఇరువురు దానికై పొందొరులతో పోరాడి మడిసిరి. వీరి కొడుకులు శుంభనిశుంభులు. (భార)

సుకన్య : వైవస్వత మనువు కొడుకు అయిన శర్యాతి కూతురు. చ్యవన మహర్షి భార్య. ప్రమతి తల్లి. ఒకప్పుడు ఈమె శర్యాతితో కూడ తపోవనమున ఉండువేళ అచట ఒక పుట్టలోనుండి వెలుగుచున్న రెండు జ్యోతులను పొడగని ముల్లుకొని వాని పొడిచెను. అంత ఆమెకు నోటి రక్తము స్రవించుటయే కాక మలమూత్ర బంధమును అయ్యెను. దాని చూచి శర్యాతి అతి భీతుడు అయి కూతును తోడ్కొని వల్మీకము కడకు వచ్చి అందులో తపము చేయుచున్న చ్యవనుని కని తన నేర్పున అతని ప్రసన్నునిగా చేసికొని అతని చిత్తానుసారముగ తన పుత్రికను ఇచ్చి ఆ మునీశ్వరుని తోడ్కొని ఆశ్రమమునకు ఏతెంచెను. అనంత రము ఆ చ్యవనుడు అశ్వినీ దేవతల ప్రసాదము వలన యౌవనమును సౌందర్య మును పొంది శర్యాతి యాగముచేయు తరిని సోమపానములేని ఆ దేవతలకు తన తపోబలమున సోమపానము కల్పించి ఇచ్చెను. (భార, భాగ)

సుకర్ముడు : ర॥ జైమిని మహర్షి పుత్రుడు అగు సుమంతుని పుత్రుడు.

సుకుమారుడు : క॥ సువిభు కొడుకు. ధృష్టకేతుని తండ్రి.

సుకృతి : బా॥ పృథువు కొడుకు.

సుకేతుడు : 1. ఒక యక్షుడు. తాటక తండ్రి. 2. చూ॥ నవరాత్రి. (రామా)

సుకేతుడు . 1. మిథిలుని పుత్రుని పౌత్రుడు 2. కా॥ క్షేముని కొడుకు, (విష్ణు)

సుకేశిని : సగరుని మొదటి భార్య. అసమంజసుని తల్లి.

సుకేశుడు : ర॥ విద్యుత్కేశుని కొడుకు. మాల్యవదాదుల తండ్రి. ఇతని భార్య దేవతి. (ఉ. రా.)

సుక్రీనఁడు : బార్హద్రధ వంశస్థుఁడు అగు రిపుంజయుని మంత్రి. చూ॥ రిపుం జయుఁడు.

సుగుణుఁడు : పాండు పుత్రుఁడు అగు భీమసేనునకు జలధర అను దానియందు పుట్టిన కొడుకు.

సుగ్రీవుఁడు : వాలి తమ్ముఁడు. తండ్రి ఋక్షవిరఁజుడు. భార్య రుమ. తొల్లి ఒకప్పుడు బ్రహ్మ యోగాభ్యాసమున ఉండువేళ అతని కంటినుండి ఒక జల బిందువు పడి అది ఒక వానరరూపము అయ్యెను. ఆవానరమునకు ఋక్షవిరజుఁడు అని బ్రహ్మనామకరణము చేసెను. ఆనంతరము ఆ వానరము సమస్తదేశముల యందును, వనములయందును సంచరించుచు మేరుపర్వతమునకు పోయి అచ్చట ఒక కొలనిలో తోచిన తన ప్రతిబింబమును పొడగని అది తన్నెదిరింప వచ్చిన మరియొక కోతి అను తలపున దానితో పోరాడ ఆ కొలని నీటిలో ఉరికెను. అందు మున్ను ఒకప్పుడు పార్వతి స్నానముచేయుచు ఉండగా కొందరు కామ రూపులు అగు రాక్షసులు స్త్రీవేషము ధరించి వచ్చి స్నానము చేయవచ్చిన వారి వలె నీళ్ళలో దిగి విహరింప సాగిరి. అది ఆమె తెలిసికొని ఈ కొలనియందు ఇకను ఎవ్వరు క్రుంకినను వీరు ఎల్లరు స్త్రీలు అగుదురు గాక, వీరికి ఇంక పురుష త్వము రాకపోవుగాక, అని శాపము ఇచ్చి ఉండినందున అట్లు ఉరికిన ఈకోతియు తక్షణమే. మిక్కిలి మనోజ్ఞతకల ఒక ఆడుకోతి అయ్యెను. ఆకాలమునందు ఇంద్ర సూర్యులు ఆమార్గమున పోవుచు దీని లావణ్యాతిశయమును చూచి చిత్తము చలింపగా వారికి రేతస్కంధము అయి ఇంద్రుని రేతస్సు దాని వాల ప్రదేశము నందును సూర్యుని రేతస్సు, దాని గ్రీవ ప్రదేశమునందును పడెను. అపుడు వాల ప్రదేశమున పడిన రేతస్సు వలన వాలియు, గ్రీవ ప్రదేశమున పడిన రేతస్సు వలన సుగ్రీవుఁడును పుట్టిరి. వీరిరువురును మహాబలపరాక్రమ సంపన్నులు. వీరిలో వాలికి ఇంద్రుఁడు తన మెడను ఉన్న హేమమాలికను ఇచ్చి యేవీరుఁడు నిన్ను ఎదిరించినను, ఎదిరించిన వాని బలమున సగము నీకు రాగలఁదు; దాన జేసి ఎల్లవారికి అజేయుఁడై వెలయగలవు అని వరము ఇచ్చి పోయెను, కనుకనే రాముఁడు వాలిని చెట్టుమఱుగున ఉండి చంపెను అందురు. ఒకప్పుడు మాయావి అను దనుజునితో పోరాడపోయి ఉండిన తన యన్న అగు వాలి, ఆ మాయావిచేత చంపబడెను అని ఇతఁడు తలఁచి రాజ్యమును కొనెను. అది కారణముగ అన్న

దమ్ములకు ప్రబల విరోధము కలిగి వానిచే ఇతఁడు కిష్కింధనుండి తఱుమ కొట్టఁబడెను. అంత ఇతఁడు ఋష్యమూక పర్వతమున బహుకాలము ఉండి సీతను వెదకుటకై రాముఁడు వచ్చినప్పుడు అతనిచే వాలిని చంపించెను. చూ॥ ఋష్యమూకము, దుందుభి. (రామా)

సుజన్మకృత్తు : పా॥ సోమకుని కొడుకు. వృషదుని తండ్రి (భాగ)

సుజాత ; అష్టావక్రుని తల్లి. ఏకపాదుని భార్య. (భాగ)

సుతలము ; ఒక అధోలోకము. ఇది పచ్చని చాయకలది.

సుతపుఁడు : అ॥ హేముని కొడుకు. బలితండ్రి.

సుతీక్ష్ణుఁడు : రు॥ రాముఁడు వనవాసము చేయునపుడు ఇతని ఆశ్రమముకు వచ్చి ఇందుండి అగస్త్యాశ్రమమునకు పోయెను. ప్రకృతమున నాగపురికి సమీప మున రామటోకి అను పట్టణము కట్టఁబడినచోట ఈ ఆశ్రమము ఉండెను. (రామా)

సుత్రాముఁడు : దేవేంద్రునికి నామాంతరము.

సుదక్షిణ : దిలీపుని భార్య. (రామా)

సుదక్షిణుఁడు : పౌండ్రకవాసుదేవుని కొడుకు. ఇతఁడు తన తండ్రి కృష్ణునిచే చంపఁబడెను, అను మాత్సర్యముచే శివుని గూర్చి ఘోరతపము సలిపి అతఁడు నుడివిన రీతిని అభిచారహోమము ఒనరింప అందుండి ఒక భయంకరము అయిన కృత్తి వెడలి ద్వారకాపురము మీదికిరాగా కృష్ణుఁడు దాని నిలిపి వీని చంపి పురమును భస్మము కావించెను.

సుదర్శన : మనువంశస్థుఁడు అగు దుర్యోధనుఁడు అను రాజు యొక్క కూతురు. తల్లి నర్మద. ఈమె యందు అగ్నిదేవునికి ఆశకలిగి వివాహము అయెను. అతనికి ఈమె యందు సుదర్శనుఁడు అను రాజు పుట్టెను. (భార)

సుదర్శనుఁడు : 1. ఒక విద్యాధరుఁడు. ఇతఁడు అంగిరసుని చూచి నవ్వి అతనిచే సర్పము అగునట్లు శపింపఁబడెను. ఆశాపము కొంతకాలమునకు వెనుక కృష్ణుని

పాదతాడనమున వదలెను. 2. సుదర్శన కొడుకు. ఇతని మందిరమునకు ధర్మదేవత అతిథి అయి వచ్చెను. (భార) (దే బా)

సుదామ : వసుదేవుని తమ్ముఁడు అగు అనీకుని భార్య.

సుదాసుఁడు : 1. పా॥ మూడవ చ్యవనుని కొడుకు. సహదేవుని తండ్రి. 2. ఇ॥కల్మాషపాదుని తండ్రి.

సుదేవుఁడు : 1. య॥ దేవకుని కొడుకు. 2. ఇ॥చంపుని కొడుకు, విజయుని తండ్రి.

సుద్యుమ్నుఁడు : వైవస్వతమనువునకు యజ్ఞమందు మొదట స్త్రీగా ఉదయించి ఆవల వసిష్ఠుని ప్రయత్నమున పురుషత్వమును పొందినవాడు. స్త్రీరూపమునందు ఇతడు ఇల అని నామము కలిగి ఉండెను. చూ॥వైవస్వతుఁడు. ఈ సుద్యుమ్నునికి పురుషత్వమునందు ఉత్కలుఁడు, గయుడు, విహ్వలుఁడు అను ముగ్గురు పుత్రులును, స్త్రీత్వమునందు బుధుని వలన పురూరవుడును పుట్టిరి. ఆ పురూరవుడు ప్రతిష్ఠానపురమునకు అధిపతి అయ్యెను. [భాగ] [భార]

సుద్యువు : పు॥ చారువు కొడుకు. [భాగ]

సుధనుసు : కురువు యొక్క రెండవ కొడుకు.

సుధన్వానుఁడు : య॥ వసుదేవునికి శ్రీదేవి యందు ఉదయించిన మూడవ కొడుకు.

సుధన్వుడు : 1.) నలువురు లోకపాలకులలో ఒకడు. 2. త్రిగర్త దేశాధీశుఁడు అగు ఒక రాజు. సుశర్మ తండ్రి

సుదేష్ణ : 1. అనువు వంశస్థుడు అగు బలియొక్క భార్య. 2. విరాటరాజు భార్య కేకయరాజు కూతురు కీచకుల సహోదరి.

సునంద : దుష్యంతుని పుత్రుఁడు అగు భరతుని భార్య. (భార)

సునందుడు : విష్ణు పరిచరులలో ఒకడు.

సునస : పారిపత్ర పర్వతమున ఉత్పత్తి అగు ఒక నది.

సునాభుడు : ర॥ వజ్రనాభుని తమ్ముడు.

సునాముఁడు : య॥ కంసుని తమ్ముఁడు.

సునీతి : ఉత్తానపాదుని జ్యేష్ఠభార్య. ధ్రువునితల్లి. [భాగ]

సునీతుఁడు : కా॥ సన్నతి పుత్రుఁడు. అలర్కుని పౌత్రుఁడు. క్షేముని తండ్రి

సునీథ : అంగునిభార్య. మృత్యువు పెద్దకూతురు. వేనునితల్లి.

సునీథుడు : శిశుపాలుని సేనా నాయకుడు. [భార]

సుప్నాఁడు : అ॥ నా॥ సుప్రబహ్మడు. బలి కడపటి కొడుకు ఇతఁడు స్వాప్న నగరము నిర్మించెను.

సుపార్శ్వుడు : (1) సంపాతికొడుకు. (2) ర॥ సుమాలికొడుకు. (3) పు॥ ద్విమీఢుని వంశస్థుడు అగు దృఢనేమి కొడుకు. సుమతితండ్రి [రామా]

సుప్తఘ్నుడు : ర॥ మాల్యవంతుని కొడుకు.

సుప్రతీకము : ఈశాన్య దిక్కునందలి మగఏనుగు, [భాగ]

సుప్రతీకుడు : ఒకానొక బ్రాహ్మణుఁడు. ఇతఁడు పైతృక ధనమునకై కలహించి తన అన్నచే గజము అగునటుల శపింపబడియెను. చూ॥ గరుడుడు [భార]

సుప్రభ : మొదటి నాభాగుని భార్య. వైశ్యస్త్రీ. [మార్క]

సుప్రయోగ : సహ్యపర్వతమున ఉత్పత్తి అయి దక్షిణవాహిని అయి పాఱునట్టి ఒకఏఱు.

సుబంధుడు : విక్రమార్కుని కాలమున ఉండిన ఒక సంస్కృతకవి. ఇతడు వాసవదత్త అను గ్రంథమును రచియించెను.

సుబలుడు : గాంధారదేశపురాజు ఇతనికొడుకు శకుని, కూతురు గాంధారి. [భార]

సుబాహువు : (1) చేదిదేశాధిపతి, వీరబాహునికొడుకు. ఇతని సోదరి సునంద. (2) రామునితమ్ముఁడు అగు శత్రుఘ్నుని పెద్దకొడుకు (3) య॥ కృష్ణుని

వంశస్థుడు అగు ప్రతిబాహువుయొక్క కొడుకు. (4) ర॥ తాటకియొక్క కొడుకు. మారీచుని తమ్ముడు. వీడు రామునిచే విశ్వామిత్రుని యాగకాలమున చంపబడెను.

**సుబ్రహ్మణ్యుడు** : కుమారస్వామి.

**సుబ్రహ్మడు** : నా॥ సున్హుడు.

**సుభద్ర** : కృష్ణుని చెలియలు. అర్జునునిభార్య. అభిమన్యునితల్లి. [భార]

**సుభద్రుడు** : య॥ వసుదేవుని కొడుకు. తల్లిపౌరవి.

**సుభువు** : య॥ కంసుని తమ్ముడు.

**సుమంతుడు** : (1) రు॥ వ్యాసశిష్యుడు. అధర్వణ వేదాధ్యేత
(2) రు॥ సామవేదాధ్యేత అగు జైమిని మహర్షి సుతుడు. [భార]

**సుమంత్రుడు** : (1) పురూరవుని వంశస్థుడు అగు జహ్నుని కొడుకు.
(2) దశరథుని సారధియు ముఖ్యమంత్రియు అగువాడు. [రామా]

**సుమతి** : (1) ఇక్ష్వాకుని తమ్ముడు అగు నృగుని కొడుకు.
(2) ఋషభుని పుత్రుడు అగు భరతుని కొడుకు.
(3) పు॥ మతిసారుని కొడుకు. రైభ్యుని తండ్రి.
(4) పు॥ ద్విమీఢుని వంశస్థుడు అగు సుపార్శ్వుని కొడుకు సన్నతమంతుని తండ్రి
(5) సకలవేదశాస్త్ర పారగుడు అగుఒక పాఱుని కొడుకు. ఇతడు పూర్వ జన్మజ్ఞానము కలవాడై సంసారమునొల్లక తండ్రికి తత్త్వోపదేశము చేసెను. అది పితాపుత్ర సంవాదము అనడుబను
(6) అరిష్టనేమికూతురు. సగరుని రెండవభార్య ఈమెకు అరువది వేవుర కొడుకులు కలిగి కపిలుని కోపదృష్టిచే భస్మీభూతులు అయిరి.

[భాగ, మార్క, విష్ణు]

**సుమదుడు** : విశ్వామిత్రుని కొడుకు. (కల్కి బ్రహ్మ ని. తా.)

**సుమనసుడు** : (1) ఉల్ముకుని కొడుకు. అంగుని తమ్ముడు (2) ఇ॥ నా సంభూతి. తండ్రి హర్యశ్వుడు. కొడుకు ధన్వుడు. (మత్స్య)

సుమాలి : (1) ర॥ సుకేశుని కొడుకు. మాల్యవంతుని తమ్ముడు. రావణుని మాతామహుఁడు. (2) కంసుని తమ్ముడు. బలరామునిచే చంపబడెను. (రామా)

సుమిత్ర : దశరథుని రెండవభార్య. లక్ష్మణ, శత్రుఘ్నులకు. తల్లి (రామా)

సుమిత్రుడు : (1) య॥ భజమానుని పౌత్రుడు. వృష్ణి కొడుకు. (2) య॥ వసుదేవుని తమ్ముడుఅగు అనీకుని కొడుకు. (3) ఇక్ష్వాకు వంశము నందలి కడపటిరాజు. ఇతఁడు భారతయుద్ధమునందు అభిమన్యునిచే చంపబడిన బృహద్బలునికి ముప్పదియవరాజు. (భార) (భాగ)

సుయజ్ఞుడు : 1) దశరథునిచే పుత్రకామేష్టి చేయించిన ఋత్విక్కులలో ఒకడు (2) ఉశీనర దేశాధిపతి. ఇతఁడు శత్రువులచే యుద్ధమునందు నిహతుడు కాగా ఇతని బంధువర్గము కడు దుఃఖితులు అయి ఏడ్చుచు ఉండుతఱిని, యముఁడు ఒక బాల వేషమును ధరించుకొని వచ్చి వారికి తత్త్వోపదేశము చేసి పోయెను. అది ప్రేతబంధు యమసంవాదము అనబడును. (భాగ)

సురథుఁడు : పు॥ జహ్నుని కొడుకు.

సురథుఁడు : శ్వేతుని తమ్ముడు. శ్వేతునికి పిమ్మట విదర్భదేశమునకు వీడు రాజు ఆయెను. (ఉ. రా)

సుఃనిందలి యాలు : జ్యేష్ఠాదేవికిని వరుణునికిని జనించిన కూతురు. అధర్ముని చెలి (భార)

సురభి : నా॥ కపిల.

సురభువు : ఉగ్రసేనుని నాలవ కూతురు. శ్యామకునిభార్య.

సురస : (1) దక్షప్రజాపతి కూతురు. కశ్యపుని భార్య. (2) నాగుల తల్లి. హనుమంతుడు లంకకు సీతను వెదకుటకొరకు పోవునపుడు దేవతలచే పంప బడి రాక్షసి రూపముతో సముద్ర మధ్యమున అతనిని అడ్డగింప అతఁడు తన దేహమును మిగుల ఉరువుగాపెంచి మఱినిమిషమునకు అంగుష్ఠమాత్ర శరీరుడై ఈమె గర్భమున ప్రవేశించి బయలు వెడలి వచ్చెను. (రామా) (స్కాంద)

సురాష్ట్రుడు : (1) తామసమనువు తండ్రి (2) కాశ్యుని కొడుకు. దీర్ఘతముని తండ్రి. (మార్కం)

సురుచి : ఉత్తానపాదుని కనిష్ఠభార్య. ఉత్తముని తల్లి. (భాగ)

సులభ : పరమ తత్వార్థమును ఎఱిగిన ఒకానొక వనిత. ఈమె మహాను భావురాలు కనుక ఒకానొకప్పుడు విమలయోగ ధర్మలంపటుఁడు అగు జనకుని చిత్తశాంతిని పరీక్షింప అతనితో సంవాదము చేసెను. (భార)

సువర్ణష్ఠీవి : సృంజయుని కొడుకు. చూ॥ సృంజయుఁడు. (భార)

సువాము : నా॥ వామ. ఒకనది. దీనిని ఇపుడు రామగంగ అందురు.

సువీరుడు : (1) అ॥ శిబిచక్రవర్తి రెండవకొడుకు. ఇతని దేశము సౌవీరము. (2) య॥ వసుదేవుని తమ్ముడు అయిన దేవశ్రవసుని పెద్దకొడుకు. (3) పు॥ క్షేమ్యుని కొడుకు.

సువేలము : ఒకానొక కొండ. ఇది లంకాద్వీపమునందు ఉన్నది. రాముఁడు లంకమీద దండెత్తి పోయినప్పుడు దీని చరులయందు వానరసేనతో విడిసెను.

సువ్రతుఁడు : అ॥ ఉశీనరుని ఐదవ కొడుకు.

సుశర్మ : (1) త్రిగర్త దేశాధిపతి. సుధన్వుని కొడుకు. (2) ఒక బ్రాహ్మణుడు. ఇతని భార్యను బలాక్షుడు అను రక్కసుడు ఒకడు అపహరించుకొని పోగా, ఉత్తానపాదుని పుత్రుడు అగు ఉత్తముడు ఆమెను ఆ రాక్షసుని వలన విడిపించి మరల ఇతనికి తెచ్చి యిచ్చెను (3) కర్ణునికొడుకు. వీడు నకులునిచే చంపబడెను. (4) మగధ దేశపు రాజులు అగు కాన్వాయులలో కడపటివాడు. ఈతఁడు ఆంధ్ర భృత్యుఁడు అగు శూద్రకునిచే చంపబడెను (మార్క) (భార)

సుశాంతి : అజమీఢుని రెండవ కొడుకు అగు నీలుని పౌత్రుడు. (మార్క)

సుశోభ : మూడవ పరిక్షిత్తు భార్య. మండూకరాజు కూతురు [భార]

సుశ్రుతుఁడు : మిథిలాధి పతులలో ఒకఁడు. జయుని తండ్రి.

సుషేణుఁడు : (1) కర్ణుని కొడుకు సాత్యకిచే చంపబడెను. (2) కృష్ణునికి రుక్మిణియందు పుట్టిన పుత్రులలో ఒకడు (3) రుమ తండ్రి. సుగ్రీవుని మామ. ఇతడు వరుణుని వలన పుట్టెను (4) కంసునిచే చంపఁబడిన వసుదేవుని పుత్రులలో ఒకఁడు. (భార)

సుహోత్రుఁడు : 1) క్షత్రవృద్ధుని పెద్దకొడుకు. ఇతనికొడుకులు ముప్పురు. కాశ్యుఁడు, కుశుఁడు, కృత్స్నమదుఁడు (2) ...॥ బృహత్క్షత్రుని కొడుకు హస్తికుని తండ్రి. (5) కు॥ మనువు కొడుకు (4) ఇ॥ భగీరథుని కొడుకు నా॥ శ్రుతుడు (5) పురూరవుని పౌత్రుఁడు అగు భీముని పౌత్రుడు, జహ్నుని తండ్రి.

ఇతఁడు షోడశ మహారాజులలో ఒకఁడు. ఇతని రాజ్యము అగు కురుజాంగలమున యేటేట పర్జన్యుఁడు పసిఁడివాన కురియింపగా దానివలన కనకమయములు అయిన కర్కట, ఝష, నక్ర, కూర్మ చయములు పడుచు ఉండెను. అట్లు లభించు స్వర్ణమునంతయు ఇతఁడు అనేక యజ్ఞములు సలిపి ఆ యజ్ఞములయందు ఋత్విజులకు దక్షిణ యిచ్చుట మొదలగువానికిని పేదసాధులకు ఇచ్చుటకును సరిపెట్టెను. (భార)

(6) సహదేవునికి విజయయందు పుట్టినకొడుకు

## సూ

సూతుఁడు : రు॥ ఇతని యాశ్రమమున పాండవులు కొంతకాలము వనవాసము సలిపిరి.

సూత్రములు : శుభాశుభ కర్మలను గురించి యేర్పఱుపఁబడి ఉండువిధులు అవి పదునెనిమిది. బోధాయనము, ఆపస్తంభము, సత్యాషాఢము, ద్రాహ్యాయనము, అగస్త్యశాకల్యము, ఆశ్వలాయనము, శాంఖపీయము, కాత్యాయనము, వైఖానసము, శౌనకీయము, భరద్వాజము, అగ్నివైశ్యము. జైమినీయము, వాధూలము, మాధ్యందినము, కౌండిల్యము, కౌషీతకము. హిరణ్యకేశి.

సూరన : (1) (పింగళి) చూ॥ అమరణ సూరణ. (2) (ఆడిదము) చూ॥ అడిదము సూరణ.

సూర్యసావర్ణి : ఎనిమిదవ మనువు. సూర్యునికి ఛాయయందు పుట్టిన సుతుఁడు.

సూర్యారణ్యుడు : ఇ॥ త్రిధన్వుని కొడుకు. సత్యవ్రతుని లేక త్రిశంకుని తండ్రి. నా॥ త్రయారణ్యుడు.

సూర్యుడు : లోకమును ప్రకాశింప జేసెడు తేజోమయ దేవత నా॥ ఆదిత్యుడు. ఇతఁడు ప్రాతఃకాలమున బ్రహ్మస్వరూపుడును, మధ్యాహ్నమున శివస్వరూపుఁడును, సాయంకాలమున విష్ణుస్వరూపుడును అగును అని ప్రసిద్ధము. ఇతనిని సూర్యనారాయణుడు అందురు. (చూ॥ వివస్వతుడు. భగోళము) (బ్రహ్మ)

# సృ

సృంజయుఁడు : (1) ధర్మ్యాశ్వుని కొడుకులలో ఒకడు ఇతఁడు సంతానార్థి అయి భూసుర పూజలు సలుపుచు తన సఖుడు అగు నారదుని వరమున స్వర్ణమయములు అగునట్టి మూత్ర, పురీష, లాలా, ప్రస్వేదములు కల ఒక కుమారుని పడసి, వానికి సువర్ణష్ఠీవి అని పేరుపెట్టి పెంచుకొనుచు ఉండగా వీనియందు బంగారు ఉండునుఅని మ్రుచ్చులు వాని పట్టి చంపిరి. అనంతరము ఇతడు నారదానుగ్రహముచే కొడుకును పునర్జీవితుని చేసికొనెను. (2) య॥ వసుదేవుని తమ్ముడు (3) అ॥ కాలానలుని కొడుకు (భార) (భాగ)

సృగాలవాసుదేవుఁడు : మధురాపురమునకు కొంతదవ్వున ఉండు కరవీర పురమునకు రాజు. ఇతడు అనవరతము శ్రీకృష్ణునితో మచ్చరించుచు ఉండినందున కృష్ణుడు వీనిపై దండెత్తిపోయి చంపి, ఇతని కొడుకును ఆ రాజ్యమునకు రాజుగా చేసెను. (హరి)

సృష్ట్యాదిపత్య వివరణము : భూమికి పృథుచక్రవర్తిని, ఓషధీయజ్ఞ వ్రత నక్షత్రాదులకు చంద్రుని, ఉదకమునకు వరుణుని, ధనమునకును యక్షులకును, కుబేరుని, ద్వాదశాదిత్యులకు విష్ణువును, వసువులకు అగ్నిని, ప్రజాపతులకు దక్షుని, దేవతలకు శుక్రుని, దైత్య దానవులకు ప్రహ్లాదుని, పితరులకు యముని; పిశాచ, రక్షః, పశు, భూత, యక్ష, బేతాళములకు శివుని, పర్వతములకు హిమవంతుని, నదులకు సముద్రుని, గంధర్వ విద్యాధర కిన్నర కింపురుషులకు చిత్రరథుని, సర్పములకు వాసుకిని, దిగ్గజములకు ఐరావతమును, పక్షులకు గరుత్మంతుని, హయములకు ఉచ్చైశ్రవస్సును, మృగములకు సింహమును, అధిపులుగ సృష్ట్యాదియందే సర్వశక్తుఁడు అయిన ఈశ్వరుడు ఏర్పఱచెను.

సృష్టి : ప్రపంచమును కల్పించుట. ఆదిని పరబ్రహ్మ స్వరూపుడు అగు నారాయణుడు సృష్టియందు ఇచ్ఛను ఒంది ప్రళయాంధకారము మాన్పి జలార్ణవము ఆయి ఉండునెడల పరంజ్యోతిరూపము అగు హిరణ్మయము అయిన అండము ఒకటి కావించి అందు తాను ప్రవేశించి చతుర్ముఖ బ్రహ్మరూపమున వెలువడి వచ్చెను. అట్లు అతడు వచ్చునపుడు ఆ అండము రెండుగా చీలెను. అందు ఉపరిభాగము అంతరిక్షము అయ్యెను. అధోభాగము భూమి అయ్యెను. ఆవల ఆ పరబ్రహ్మము త్రిగుణాత్మక స్వరూపములు అయిన బుద్ధీంద్రియ మనో భూతములను పుట్టించి విరాట్స్వరూపుడు అయ్యెను. అందు సృష్టి స్థితి సంహారకులు వేరువేరుగా ఏర్పడిరి. వారలలో చతుర్ముఖబ్రహ్మ సృష్టికిపూని, నవవిధ సృష్టి కావించెను. వానిలో మొదటి మూడును ప్రాకృత సృష్టి అనియును కడపటిది కౌమార సృష్టిఅనియు చెప్పబడును. ఈ వైకారిక సృష్టిస్థావర, తిర్యగ్దేవ మనుష్య రూపములుగా ఉండును. చూ త్రిమూర్తులు.

## సే

సేతుఁడు : ద్రుహ్యుని పౌత్రుఁడు.

సేతువు : శ్రీరాముడు రావణాసురునితో యుద్ధము చేయుటకై లంకకు పోవు నవసరమున సముద్రమున కట్టించిన అడ్డకట్ట. ఇచ్చట జనులు సముద్ర స్నానము ఆచరించిన యడల మహాపాతకములు నశించును అనుట ప్రసిద్ధము.

సేనజితు : (1) ఇ॥ భాగవతమునందు కృశాశ్వుని కొడుకు అనియు రెండవ యువనాశ్వుని తండ్రిఅనియు చెప్పఁబడిఉన్నది. (2) బా॥ విశ్వజిత్తు కొడుకు. ఇతని కొడుకులు రుచిరాశ్వుఁడు, దృఢహనువు, కాశ్యుఁడు, వత్సుఁడు.

## సై

సైంధవుఁడు : నా॥ జయద్రథుఁడు. సింధుదేశపు రాజు. దుర్యోధనుని చెల్లెలు అగు దుస్సల మగఁడు. ఇతని తండ్రి వృద్ధక్షత్రుఁడు.

ఇతఁడు పాండవులు వనవాసము చేయు కాలమున తాను ఒక రాచకూతును వివాహము చేసికొని వారు ఉన్న వనముగుండ తన పట్టణమునకు పోవుచుండి ఆశ్రమమున ఏకాకియై ఉండిన వారిపత్ని అగు ద్రౌపదిని చూచి వారు లేకుండుట

తెలిసి బలాత్కారముగా పట్టి తన రథముమీద పెట్టుకొని పోవుచుండెను. ఇంతలో ఈ వర్తమానమును ఎఱిగి పాండవులువచ్చి వీనిని చక్కగ మర్దించి, అవమానించి పంపిరి. అంతట వీఁడు దానికి ప్రతీకారము చేయ సమకట్టి ఉగ్ర తపము సలిపి అర్జునుఁడు తక్క తక్కిన పాండవులను ఒక్కదినమున జయించునట్లు వరము పడసి భారతయుద్ధము జరుగునపుడు పాండవులను పద్మవ్యూహము ఛేదించిన అభిమన్యునికి తోడుపడకుండ అడ్డగించి గెలుపుకొనెను. కనుక పదుగురు యోధులు ఒక్కటిగాచేరి అభిమన్యుని చంపిరి. ఆ వృత్తాంతము సంశప్తకులతో పోరాడపోయి ఉండిన అర్జునుడు విని ఆమరునాడు సూర్యుడు అస్తమించునంతలో సైంధవుని తల నరకుదును, అని ప్రతిజ్ఞచేసి ఆప్రకారము నడపెను. మఱియు ఇతఁడు అర్భకుడై ఉండుకాలమున ఒకనాఁడు అశరీరవాణి వీఁడు సంగ్రామమున యేమరి తల తునుమఁబడును, అని ఆదేశింపగా అది అతని తండ్రిఅగు వృద్ధక్షత్రుఁడు విని ఎవఁడు వీని మస్తకమును మహిమీద పడవైచునో అట్టివాని శిరము సహస్ర శకలములు అగుగాక అని సకల జనుల వీనులకు గోచరము అగునట్లు పలికెను. ఆ హేతువును బట్టి భారతయుద్ధమున అర్జునుడు సైంధవుని తల శమంత పంచక సమీపమున తపము ఆచరించుచు ఉండిన వృద్ధక్షత్రుని గుండమహాతలమున పడునట్లు పాశుపతాస్త్ర ప్రయోగము చేసెను.

(భాగ)

## సో

**సోభంజి** : య॥ నా॥ సనాజిత్తు.

**సోమకుఁడు** : [1] పా॥ సహదేవుని పుత్రుడు, సుజన్మకృత్తు తండ్రి. పృషదుని పితామహుఁడు [2] ఒక రాజర్షి. ఇతనికి జంతువు అను ఒక కొడుకును పడసి ఆ ఒక్క పుత్రునితో తనియక బహుపుత్ర లాభము కలుగ వలయును అని తన ఋత్విజుని వేడగా అతఁడు ఇతని యనుమతిని జంతుని పశువుగా వధియించి తత్పశుహవ్యమున హవ్యవహుని తనిపెను. అంత ఇతని నూర్వురు భార్యలును నూర్గురు పుత్రులను కనిరి. అందు జంతుడును సౌవర్ణరక్షణలక్షిత సవ్య వామపార్శ్వుడై అందఱకు జ్యేష్ఠుడుగ పుట్టెను. [3] ఒకానొక అసురుఁడు ఇతడు బ్రహ్మ నిద్రపోవు నవసరమున వేదములను ఎత్తుకొనిపోయి సముద్రములో డాగిఉండెను. విష్ణువు మత్స్యావతారమును ఎత్తి ఆ వేదములను మరల ఎత్తుకొనివచ్చి బ్రహ్మకు ఇచ్చెను.

(భార)

**సోమతీర్థము** : నా।। ప్రభాసతీర్థము. ఇది ఘూర్జరదేశమున సోమనాథ పట్టణమునకు సామీప్యమున ఉండెను.

చంద్రుడు దక్షుని శాపమువలన కలిగిన క్షయరోగమును ఈ తీర్థమున స్నానముచేసి పోగొట్టుకొనెను. కనుక దీనికి ఈపేరు కలిగెను.

**సోమదత్తుడు** : కు।। శంతనుని భ్రాతఅగు బాహ్లికుని కొడుకు. ఇతడు భారత యుద్ధమందు చచ్చెను. ఇతనికి భూరి, భూరిశ్రవుడు, శలుడు అని ముగ్వురు కొడుకులు.

**సోమన** : (పిడుపర్తి) ఒకానొక తెనుగుకవి. ఇతడు బసవపురాణమును తెనిగించెను. (ఈ పురాణమును అనేకులు అనేక ప్రకారముల ఏర్పరచి ఉన్నారు.

**సోమశ్రవము** : ఒకానొక పుణ్యతీర్థము. ఇది పాంచాలదేశమునకు సమీపమున ఉన్నది. పాండవులు పాంచాలదేశమునకు పోవునపుడు దీనిసమీపమున అంగారపర్ణుడు అను గంధర్వుడు తమ్ము బెదరింపగా అర్జునుడు వానితో పోరి ఓడించెను. అంతట ఆ గంధర్వుడు చిత్రరథుడు అని మారుపేరు పెట్టుకొని అర్జునుని చెలిమి పడసి తన లోకమునకు పోయెను.

**సోమశ్రవసుడు** : శ్రుతశ్రవసుని కొడుకు. జనమేజయుని పురోహితుడు (భార)

**సోమసంస్థలు** : శ్రౌతాగ్నియందు వేల్చెడు యజ్ఞభేదములు ఇవి అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్యము, షోడశి, అతిరాత్రము అప్తోర్యామము. వాజపేయము అని ఏడువిధములు. (చూ।। యజ్ఞము)

**సోముడు** : (1) నా।। చంద్రుడు. ఇతడు అత్రికిని, అనసూయకును బ్రహ్మాంశమున పుట్టెను. ఇతని సహోదరులు దత్తాత్రేయుడు, దూర్వాసుడు. ఇతడు అనసూయ గర్భమున పుట్టెను, అనియు, పాలసముద్రమున పుట్టెను, అనియు చెప్పుట మన్వంతర భేదమునుపట్టి అని ఎఱుగునది. (2) శివునికి నామాంతరము. (3) అష్టవసువులలో ఒక్కడు. ప్రజాపతి కొడుకు. ఇతనిభార్య మనోహర. కొడుకులు పురోజవర్చుడు, ప్రాణుడు కరణుడు రమణుడు. కూతురు పృథ ఈమెకు పదుగురు గంధర్వులు పతులు అయిరి. (భార) (మత్స్య)

## సౌ

సౌంభకము : సాళ్వుని విమానము. దీనిని శివుని ఆజ్ఞచే మయుఁడు నిర్మించి సాళ్వునకు ఇచ్చెను. చూ॥ సాళ్వుడు. (భార)

సౌగంధికము : ఒకానొక సరోవరము. సౌగంధిక పుష్పములచే నిండి ఉండుటచే దీనికి ఈ పేరు కలిగెను. ఇది కుబేరుని ఉద్యానవనమున ఉండును. పాండవులు వనవాసము చేయుచు గంధమాదన పర్వత సమీపమున ఉండునపుడు ఒక్కనాడు ఈ కొలని యందలి పుష్పము ఒకటి వాయువశమున వచ్చి ఎదుట పడగా దాని ద్రౌపది చూచి అట్టి నానావిధ వర్ణమును పరిమళమునుకల కుసుమములను కొన్నిటికి తెచ్చియిమ్మని భీముని వేడగా అతడు అట్లకానిమ్మని ఆపువ్వులు ఉన్న కొలనికి పోయి వానిని తెచ్చి యిచ్చెను. అప్పుడు మార్గమధ్యమున భీముడు తన అగ్రజుడు అగు హనుమంతుని పొడగాంచి అతనిచే అనేక ధర్మములను ఎఱిగెను.

సౌనంద : చూ॥ ముదావతి.

సౌభరి : (1) ఒక ఋషి. మాంధాత యల్లుడు. ఇతడు యమునానదీ జలమునందు ద్వాదశ వర్షములు తపము సలిపి పిదప సంసారకాంక్ష కలిగి మాంధాతను ఒక కన్యక కావలయును అని వేడగా అతడు తన కొమార్తెలలో ఎవతె అతనిని వరించువో దానిని కైకొనుము అని చెప్పి తన ఏబండ్రు కూతులను చూపెను. అప్పుడు తపః ప్రభావముచే రూప యౌవన సంపన్నుడు అయి అతడు వారికి కనబడగా వారు అందఱును అతనిని మోహించి వరించిరి. అంత అతడు ఆ కన్యకలను వివాహము అయి అనేక సంవత్సరములు విషయ సుఖములను అనుభవించుచు ఉండెను. అనంతరము అతడు మృతినొందగా ఆ ఏబండ్రు కన్యకలును అతనితో కూడ సహగమనముచేసి దివ్యలోకమును పొందిరి. (2) రు॥ వేదమిత్రుని శిష్యుడు. ఇతని కొడుకు శాకల్యుడు. (విష్ణు) (భాగ)

సౌమ్యము : ఒక పురాణము.

సౌరభేయి : ఒక అప్సరస. చూ॥ నారీతీర్థములు.

సౌరము : ఒక ఉప పురాణము.

సౌరాష్ట్రము : ఒకానొక దేశము. ఇపుడు సూరాటు అనబడు పట్టణమునకు చుట్టుఉండు దేశము. దీనిని సురాష్ట్రము అనియు అందురు.

సౌవీరము : ఒకానొక దేశము. ఇది శిబి కొడుకు అగు సువీరునిచే ఏర్పరుప బడెను.

సౌహ్మము : ఒకానొక పట్టణము. బలి కొడుకు అయిన సుహ్మునిచే నిర్మింప బడిన పట్టణము.

# స్క

స్కందుడు : చూ॥ నా॥ కుమారస్వామి.

స్కాందము : (1) ఒక పురాణము. ఇది శివమహాత్మ్య ధర్మాది బోధకమును తత్పురుష కల్ప సంబంధమును స్కందప్రోక్తమును అయి ఉండును. దీని గ్రంథ సంఖ్య లక్ష. (2) ఉపపురాణములలో ఒకటి.

# స్థ

స్థూలకర్ణుడు : ఒక యక్షుడు. (చూ॥ శిఖండి) వీనివలన శిఖండి పురుషత్వమును పొందెను. మఱియు శిఖండికి ఆయువు కలంతకాలము వీడు కుబేర శాపముచే స్త్రీ (భార్య) రూపమును ధరించి ఉండెను.

స్థూలకేశుడు : ఋ॥ ప్రమద్వర పెంపుడు తండ్రి. చూ॥ ప్రమద్వర.

స్థూలశిరస్సు : కబంధునికి శాపము యిచ్చిన ఒక ఋషి.

# స్ను

స్నుష : జ్యామఘుని కోడలు. విదర్భునిభార్య.

# స్మృ

స్మృతి : (1) దక్షకన్య. మొదటి అంగిరసుని భార్య. ఈమెకు శ్రద్ధఅనియు (లేక) సుమతి అనువారు నామము కలదు. శినీవాలి, కుహువు, రాక, అనుమతి ఈమె కూతుర్లు. (2). ధర్మశాస్త్రములు. ఇవి వేదార్థ ప్రతిపాదక గ్రంథములు.

అందు మనుస్మృతి మిక్కిలి దొడ్డగ్రంథము. ఈ మానవ ధర్మశాస్త్రమున జగత్సృష్టి మొదలుకొని సర్వ విషయములును చెప్పబడి ఉన్నవి. ఇందు బ్రహ్మ, క్షత్రియ వైశ్య శూద్రులు అను చాతుర్వర్ణ్యాశ్రమ ధర్మములు, వివాహక్రమ, పంచమహా యజ్ఞాతిథిపూజా, పార్వణ, విధి, శ్రాద్ధవిధాన, భోజన నియమాదులు, స్త్రీ పుంధర్మములు, రాజధర్మములు, వ్యవహార ధర్మములు, ప్రాయశ్చిత్త నియమములు మొదలుగాగల హిందువుల వైదిక లౌకిక విషయములు అన్నియు వచింపబడి ఉండును. మఱియు స్మృతులు వేదముల వలెనే గౌరవింపబడును. కలియుగమునకు విహితములు అగు ధర్మములు పరాశర స్మృతియందు చెప్పబడి ఉన్నవి. వెండియు పురాణములవలె స్మృతులును పదునెనిమిది. అవి మనుస్మృతి, బృహస్పతిస్మృతి, దక్షస్మృతి, గౌతమస్మృతి, యమస్మృతి, అంగీరసస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, ప్రచేతస్మృతి, శతాతపస్మృతి, పరాశరస్మృతి, సంవర్త స్మృతి, వౌశనస స్మృతి, శంకరస్మృతి, లిఖితస్మృతి, ఆత్రేయస్మృతి, విష్ణుస్మృతి, ఆపస్తంబస్మృతి, హరీతస్మృతిఅనునవి ఇవికాక ఉపస్మృతులు పదునెనిమిది కలవు. అవి కన్వస్మృతి, కపిలస్మృతి, లోహితస్మృతి, దేవలస్మృతి, కాత్యాయన స్మృతి, లోకాక్షిస్మృతి, బుధస్మృతి, శతాతపస్మృతి, అత్రిస్మృతి, ప్రచేతస్మృతి, దక్షస్మృతి, విష్ణుస్మృతి, వృద్ధ విష్ణుస్మృతి, వృద్ధమనుస్మృతి, ధౌమ్యస్మృతి, నారదస్మృతి, పౌలస్త్యస్మృతి, ఉత్తరాంగిరస స్మృతి అనబడును.

# స్వ

స్వధ : పితృదేవతల భార్య.

స్వయంప్రభ : హేమ అను అప్సరస కూతురు. హనుమదాదులు సీతను వెదకుచు ఈమె ఉండు కాంచన బిలము ప్రవేశించి వెలువడు దారి కానక పరితపింపగా వారిని ఈమె తన తపోమాహాత్మ్యముచే బిలమునుండి వెడలించెను. (రామా)

స్వర్ణరోముడు : మి॥ మహారోముని కొడుకు. హ్రస్వరోముని తండ్రి.

స్వర్భానవి : ఆయువు భార్య. నహుషుని తల్లి. (భార)

స్వర్భానుఁడు : (1) దనువు పుత్రుడు. (2) విప్రచిత్తికొడుకు నా॥ రాహువు

స్వాయంభువుఁడు : ఒక మనువు. ఇతఁడు బ్రహ్మమానస పుత్రుడు. ఇతని భార్య శతరూప. కొడుకులు ప్రియవ్రతుఁడు, ఉత్తానపాదుఁడు. కొమార్తెలు ప్రసూతి, అకూతి, దేవహూతి.

స్వారోచిషుఁడు : ఒక మనువు. తండ్రి స్వరోచి. తల్లి మనోరమ. ఇతఁడు అనేక వేల సంవత్సరములు విష్ణువును గూర్చి తపము ఆచరించి అతని యనుగ్రహము వలన మనువుగా ఏర్పడి పిదప అతని సాలోక్యమును పొందెను. (మార్క)

స్వాహాదేవి : అగ్నిదేవుని భార్య. (భార)

## హ

హంస : మేరువునకు ఉత్తరమున ఉండెడు ఒకకొండ.

హంసగీత : హంసరూప ధరుఁడు అగు బ్రహ్మ సాధ్యులకు ఉపదేశించిన ధర్మప్రకారమును తెలిపెడు గ్రంథము.

హంసుఁడు : (1) య॥ వసుదేవునకు శ్రీదేవియందు ఉదయించిన ద్వితీయ పుత్రుఁడు. (2) డిచికుని సోదరుఁడు. జరాసంధుని చెలికాఁడు. నా॥ కౌశికుఁడ చూ॥ డిచికుఁడు.

(ఉ.హ) (భార)

హనుమంతుడు : ఒకానొక వానరుఁడు. సుగ్రీవుని మంత్రి. రామునిదూత. అతి బలశాలియు,అసహాయ శూరుఁడును అయినవాఁడు. ఇతఁడు వాయుదేవుని అనుగ్రహమున, శాపముచే అంజన అను వానరస్త్రీ అయి ఉండిన పుంజికస్థల అను అప్సరస్త్రీకి పుట్టినవాఁడు. ఇతఁడు పుట్టినతోడనే ఉదయము అగుచున్న సూర్యుని చూచి పండు అని తలచి అతనిని పట్టి భక్షింపపోగా దేవేంద్రుఁడు తన వజ్రాయుధముతో ఇతని వామహనువున కొట్టెను. అట్లు కొట్టబడిన హనువు కలవాఁడు అగుటచే ఇతనికి హనుమంతుఁడు అను నామము కలిగెను. ఆ చొప్పున ఇంద్రునిచే దెబ్బతిని మూర్ఛితుఁడు కాగా వాయువు చూచి కోపించి తన వ్యాప్తిని ఉపసంహరించెను. అది తెలిసి దేవతలు వాయుపుత్రుని మూర్ఛవలన తేర్చి బ్రహ్మాస్త్రముచే చావు లేకుండను, స్వచ్ఛంద మరణము కలుగను వరములు ఇచ్చి వాయుబంధకముచే బాధపడెడు లోకముల బాధను తొలగించిరి. అంత ఇతఁడు సూర్యునివద్దకు

పోయి తనకు చదువు నేర్పుము అని అడగగా, నేనెప్పుడును తిరుగుచు ఉందునే, నాతో యెట్లు చదివెదవు అని సూర్యుఁడు చెప్పఁగా అతడు రథముతో కూడ పరువిడ కుంద దేహమును పెంచి ఉదయ పర్వతము మీద ఒక కాలును, అస్తమయ పర్వతముమీద ఒక కాలును నిలిపి సూర్యుని వేడిమికి ఓర్చి విద్య అభ్యసించెను. మఱియు ఈతఁడు రామునికి ప్రియభక్తుఁడు, కామరూపి. రావణాసురుఁడు రాముని భార్యను అపహరించినపుడు ఈమె ఉండు స్థలమును కనిపెట్టుటకు పనుపఁబడిన వానరులలో ఇతఁడు మాత్రము సముద్రము దాటిపోయి లంకానగరము చొచ్చి సీతనుచూచి రావణుఁడు తన్ను అవమానించినందున ఆ లంకాపురమును కాల్చి సీత చేముద్రిక ఆనవాలుగా కొని ఆమె యనుజ్ఞ పడసి మరల రాముని యొద్దకు వచ్చి ఉంగరము ఇచ్చి నమస్కారముచేసి తాను పోయి వచ్చిన వర్తమానమును అంతయు ్రశతపఱచెను. ఈతడు చిరంజీవి అని చెప్పుదురు. (రామా) (భార)

హయగ్రీవుడు : (1) గుఱ్ఱపుమొగమును మనుష్యదేహమును ధరించి అవతరించిన విష్ణుమూర్తి. కల్కిమూర్తియు హయగ్రీవుడే అని అందురు. తొల్లి విష్ణువు యోగనిద్ర చేయు కాలమున మధుకైటభులు పుట్టి వేదములను అపహరించికొని పోయి పాతాళమున అణచివేయగా శ్రీమన్నారాయణుడు బ్రహ్మ ప్రార్థనచే నిద్ర విడిచి హయగ్రీవ రూపధారి అయి వేదములను తెచ్చి మరల బ్రహ్మకు యిచ్చెను.
(2) ఒక దానవుడు. నా॥ సోమకుడు. (దే.భా)

హయశిర : ద॥ వైశ్వానరుని కూతురు. క్రతువుభార్య.

హరి : విష్ణువునకు నామాంతరము. (భార)

హరికేశుడు : య॥ వసుదేవుని తమ్ముడు అయిన శ్యామకుని పెద్దకొడుకు. (భార)

హరిగ్రామము : విదర్భదేశము నందలి ఒక పట్టణము.

హరిణాంకుడు : చంద్రుడు. హరిణము చిహ్నముగాకలవాడు అని శబ్దార్థము.

హరిణి : ఒక అప్సరస.

హరితుఁడు : (1)ఇ॥ యౌవనాశ్వునికొడుకు. ఇతడు క్షత్రియుడు అయి ఉండియు తపోమహాత్మ్యముచే బ్రహ్మర్షి ఆయెను. కనుక ఇతని వంశస్థులు బ్రాహ్మణులు అయిరి. వారు హరితులు అనబడుదురు. వారి ప్రవర ఆంగీరసాంబరీష

యౌవనాశ్వ అనిచెప్పబడును (మాంధాతను ఆంగీరసుడు అనియుఅందురు.) ఇతడు విద్వజ్జనములకు ఉపదేశించిన మోక్షధర్మములు హారీత గీతలు అని ప్రసిద్ధికి ఎక్కి-ఉండును, (2)ఇ॥ లోహితాశ్వుని కొడుకు .చంపుని తండ్రి.

హరిద్వారము : నా॥ గంగాద్వారమున (విష్ణు) ఒక క్షేత్రము. ఆదికాలమున మహా శక్తి కలవాడు అయిన మధువును సంహరించిన విష్ణువు ఇందు సన్నిహితుడుఅయి ఈపురమును నిర్మించెను. ఆ అసురుడు మరణ కాలమున ఈస్థలము మహా పుణ్య క్షేత్రము కావలయును అని ప్రార్థింప అప్పుడు విష్ణువు అటుల అనుగ్రహించెను. కనుక ఇది మహా పుణ్య క్షేత్రము ఆయెను మఱియు ఇచ్చోట దక్షప్రజాపతి యజ్ఞము చేసెను అని వక్కాణింతురు.

హరిశ్చంద్రుడు : ఇ॥ ఒక చక్రవర్తి ఇతని తండ్రి త్రిశంకువు. భార్య చంద్రమతి కొడుకు లోహితాశ్వుడు. మంత్రి సత్యకీర్తి. ఇతడు మహాసత్యసంధుడు. ఒకనాడు దేవేంద్రుడు సుధర్మాభ్యంతరమున కొలువుతీరి ఉండి అప్పుడు అచట ఉండిన మహర్షులను కని ప్రపంచమున తాము ఎఱిగిన వారిలోపల సత్యసంధులు ఎవరు అని ప్రశ్న చేయగా వసిష్ఠమహర్షి హరిశ్చంద్రుడు అనిపలికెను ఆమాటకు విశ్వామిత్రుడు సహింపక హరిశ్చంద్రుడు అంతసత్యసంధుడా అతనిని బొంకించెదను చూడుము అని శపథముచేసి ఇతనికి పెక్కులు ఇడుమలు కలుగచేసెను. అది ఎట్లనిన తొలుత ఇతని రాజ్యమును దానరూపమున పరిగ్రహించి అనంతరము అంతకు ముందు ఇతడు తనయజ్ఞమునకై యిచ్చునట్లు వాగ్దత్తముచేసి ఉండిన ధనమును యిమ్మని నిర్బంధించి దానికి ఇతనిభార్యను అమ్మించి, చండాలుని కొలుచునట్లును, స్మశానభూమి యందు వసించునట్లును చేసి, ఇతని కొడుకును పాముచే కఱపించి చంపి, ఆవలనిరపరాధ అయిన ఇతనిభార్యపై శిశుహత్యా పాతకమును మోవజేసి, ఆమెను శిక్షార్హురాలు అగునట్లు చేయించి, ఎట్లును బొంకింప నేరక పోయెను. కడపట తన ప్రయత్నములుఎల్ల వ్యర్థములు అయిపోగా రుద్రాది దేవతలు ఈ హరిశ్చంద్రునికి ప్రత్యక్షము అయి ఇతని కొడుకును బ్రతికించి మరల మునుపటి యట్ల రాజ్యాధిపత్యము వహించునట్లు అనుగ్రహించిరి. అప్పుడు విశ్వామిత్రుడు తాను తీసికొన్న రాజ్యమును యిచ్చి బహుకాలము శ్రమకు ఓర్చి తపస్సుచేసి ఆర్జించిన మహాపుణ్యఫలమును ఇతనికి ధారపోసి చిరకాలము రాజ్య పదస్థుడవై సత్యహరిశ్చంద్రుడు అన విఖ్యాతిని పొందుము అనిఆశీర్వదించి చని పోయెను. కనుకనే సత్యమునందు హరిశ్చంద్రునికి మించినవారులేరు అని జగ

ద్విఖ్యాతి కలిగిఉన్నది. ఇట్లువిశ్వామిత్రుడు కారణము లేకయే హరిశ్చంద్రుని మిగుల ఇడుమలు పెట్టినందుకై వశిష్ఠుడు అతనిని బకముఅగునట్లు శాపము యిచ్చెను. అందుకు విశ్వామిత్రుడు అతనికి అదే అగునట్లు ప్రతిశాపము యిచ్చెను. ఇట్లు ఒండొరులు మాత్సర్యమున శపించుకొని పోరాడుచు ఉండు నవసరమున బ్రహ్మవారిని శాంతవచనములచే అనునయించి వారి పోరాటమును ఉడిపి, వారిపూర్వ రూపములను మరలవారికియిచ్చి ఇరువురకును మైత్రి కలుగజేసి పోయెను.

(మార్క) (భాగ

హరిహరరాయుడు: ఒకానొకరాజు. ఇతడు విద్యానగరమును స్థాపించినవాడు తుంగ భద్రా నదీతీరమునఉండిన అడవులను చక్కజేసి అచట తనరాజ్యమునుస్థాపించెను.

హరీతుడు : విశ్వామిత్రుని కొడుకు. ఇతని వంశజులుఅగు బ్రాహ్మణులు హరితులు అనబడుదురు.

హరుడు : (1) శివునకు నామాంతరము (2) ర॥ మాలికొడుకు. విభీషణుని మంత్రి.

హర్యంగుడు : అ॥ చంపునికొడుకు (విభీషణునిమంత్రి)

హర్యశ్వుడు : (1) ఇ॥ దృఢాశ్వునికొడుకు. (2)ఇ॥ అనరణ్యునికొడుకు సుమనస్సుతండ్రి. (3) మి॥ ధృష్టకేతునికొడుకు (4) పు॥నా॥ధర్మాశ్వుడు

(భాగ)

హర్షుడు : ధర్మునికి శ్రద్ధయందు పుట్టిన తృతీయపుత్రుడు. ఇతనిభార్య నంద. సోదరులు శముడు, కాముడు.

హలంధనుడు : నా॥ బలంధనుడు.

హవిర్ధానుడు : విజయాశ్వుని లేక అంతర్ధానునికి సభస్వతియందు పుట్టినకొడుకు. ఇతనికి బర్హిష్టదుడు లేక ప్రాచీనబర్హి, గయుడు, శుక్లుడు, కృష్ణుడు, సత్యుడు. లేక వ్యజుడు, జితవ్రతుడు. లేక అజనుడు అని ఆర్వురుకొడుకులు కలరు. అందు ప్రాచీన బర్హికి పదుగురు పుత్రులు పుట్టిరి. వారు ప్రచేతసులు అనబడుదురు. (మత్స్య)

హవిర్భుక్కు : నా॥ ప్రీతి. పులస్త్యునిభార్య ఈమెయందు అగస్త్యుడును, విశ్రవసుడును పుట్టిరి.

(భాగ)

హవిర్యజ్ఞములు. : శ్రౌతాగ్నియందు వేల్వబడు యజ్ఞభేదములు. అగ్న్యాధేయము, అగ్నిహోత్రము, ధర్మపూర్ణమానములు, ఆగ్రహాయనము, చాతుర్మాస్యము, నిరూఢపశబంధము, సౌత్రామని అని సప్తవిధముకలవి. చూ॥ యజ్ఞము.

హవ్యవాహనుడు : (1) చూ॥ నా॥ గృహపతి. (2) అగ్ని. శుచికొడుకు. (మత్స్య).

హస్తికుడు : ప్ర॥ సుహోత్రుని కొడుకు. ఈతనిపేర కౌరవుల పట్టణము హస్తినాపురము అని చెప్పబడును. ఇతని కొడుకులు అజమీఢుడు, ద్విమీఢుడు పురుమీఢుడు.

హస్తగిరి మహాత్మ్యము : ఒకానొక గ్రంథము. ఇది కాంచీక్షేత్ర మహాత్మ్యమును తెలుపును. కాంచీపట్టణము ఉండు స్థలము సత్యవ్రత క్షేత్రము అనియు ఇందు చతుర్ముఖు అశ్వమేధ యాగము సలిపెను అనియు ఈ గ్రంథమునందు చెప్పి ఉన్నది.

హస్తిపురము : నా॥ హస్తినాపురము. అజమీఢుని తండ్రిఅగు హస్తికుని వలన ఈ నామము కలిగెను. ఇది కౌరవులకు రాజధాని. ఇది ఇప్పుడు గంగానదిలో మునిగి ఉన్నది. ఢిల్లీ పట్టణమునకు తూర్పున ఇది అరువదిమైళ్ల దూరమున ఉండినట్లు తెలియును. ఒకప్పుడు దుర్యోధనుని కుమార్తెను వివాహము కాగోరి కృష్ణుని కొడుకుఅగు సాంబుఁడు యెత్తుకొనిపోవ కౌరవులు వానిబట్టి చెరసాలలో పెట్టిరి. అనంతరము వానిని విడిపించుకొని పోవుటకై బలరాముఁడు హస్తిపురికి వచ్చి మంచి మాటలచే ఎంతచెప్పినను కౌరవులు వినకపోగా బలరాముఁడు తన నాఁగేటిచే హస్తినాపురమును గంగలో త్రోయ సమకట్టెను అని ప్రసిద్ధి.

హస్తుఁడు : య॥ వసుదేవునకు రోచనయందు కలిగిన కొడుకు.

## హా

హార్దికుఁడు : య॥ నా॥ కృతవర్మ.

హా హూ : ఒక్క గంధర్వరాజు.

## హి

హిందూమతము : హిందూదేశస్థులు అవలంబించి ఉండు మతము. ఇది కర్మము వలన ఆత్మకు శరీరముతోడి సంబంధము కలుగుచు ఉన్నది అనియు కర్మములకు హేతువులు అహంకార మమకారములనియు దేహాను బంధములు అయిన గృహారామాదుల యందు అభిమానము ఉంచువారు సంసారమగ్నులు అయి విషయతృష్ణాపరులుఅయి సర్వతత్వముఅయిన ఈశ్వరుని మాని వివిధక్లేశ సంతాపములను పొందుచుదేహాంతరోత్పత్తిని పొందుచుందురు అనియు. దేహాత్మ వివేకముకల పండితులు దేహమునకు ఉత్పత్తి వినాశములు స్వభావసిద్ధము, ఆత్మకు జనన మరణాదులు లేవు అని యెరిగి సుఖ దుఃఖములను పొందక సమస్తమునకు ఉదాసీనులు అయి సర్వజ్ఞుడును సర్వశక్తుడును సర్వసముడును, సర్వకారణుడును సకల జీవ దయాపరుడును అగు పరమేశ్వరుని పరమ దయాళువు సిద్ధుడు క్రియాశూన్యుడు, నిస్సంగుడు, పరిపూర్ణుడు అని తెలిసికొని మోహమువదలి నిరస్త సమస్తాశులై అతి శీఘ్రమున ఉత్తమపదము చొత్తురు అనియు, అట్టి మోక్షమునకు భగవద్భక్తి ముఖ్య సాధకము అనియు, భగవద్భక్తి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు అనెడి అరిషడ్వర్గమును గెలిచి, ఇంద్రియములనుజిత పరచుకొని అహంకార మమకారములను మాని సర్వమును భగవదర్పణము చేయుట వలనకాని కలుగదు అనియు, అట్టి మనోనిశ్చయము వేద ప్రమాణముల యందలి విశ్వాసము వలననే కలుగవలయును అనియు ప్రతిపాదించును. ఈ వైదిక మతము అనేక విధములుగా ఉండును. అందు ముఖ్యములు నాలుగు స్మార్తము వైష్ణవము, శైవము, మాధ్వము, అనియు. శైవ. వైష్ణవమతములు విశిష్టాద్వైతములు అనియు, మాధ్వమతము ద్వైతము అనియు, చెప్పబడును.

హింస : నిర్‌ృతి కూతురు. అధర్ముని భార్య.

హిడింబ : ర। హిడింబాసురుని చెలియలు. ఇది భీముని పెండ్లాడి ఘటోత్కచుని కనెను. (ఖాది)

**హిడింబుఁడు** : ఒకనొక రాక్షసుఁడు. వీడు పాండవులు లక్కయింటినుండి తప్పించుకొని పోవుచు తన వనము చేరినప్పుడు వారిని హింసింపతలచి భీమునిచే చంపబడెను. (భార)

**హిమవంతుఁడు** : పర్వతరాజు. మేరువు కూఁతురైన మనోరమ లేక మేనకను పెండ్లాడి ఆమెయందు గంగయనియు, పార్వతి అనియు ఇరువురులను కూతురుల పడసెను. పార్వతికి ఉమ దుర్గ కాళి, శక్తి అని అనేక నామములు కలవు. చూ। పార్వతి. భద్రకాళి. (శివ)

**హిరణ్యకశిపుఁడు** : ఒకానొక రాక్షసరాజు. ఇతఁడు కశ్యపునకు దితియందు పుట్టిన కొడుకు. చూ॥ హిరణ్యాక్షుఁడు. ప్రహ్లాదుఁడు. (భాగ)

**హిరణ్యగర్భుఁడు** : చూ॥ బ్రహ్మ.

**హిరణ్యనాభుఁడు** : (1) శ్రీరాముని జ్యేష్ఠపుత్రుఁడు అయిన కుశుని వంశమున పుట్టినవాఁడు. ఇతఁడు జైమిని శిష్యుఁడు అయిన యాజ్ఞవల్క్యుని యొద్ద యోగ మార్గోపదేశము పొందెను. (2) చూ॥ మైనాకుఁడు.

**హిరణ్యపురము** : నివాత కవచ కాలకేయుల పట్టణము. ఇది సముద్రములోపల ఉండెను.

**హిరణ్యరోముఁడు** : నలువురు లోకపాలురలో ఒకఁడు.

**హిరణ్యాక్షుఁడు** : (1) హిరణ్యకశిపుని తమ్ముఁడు. తండ్రి కశ్యప ప్రజాపతి. తల్లి దితి. ఇతఁడును ఇతని అన్నయును సనకసనందుల శాపముచే రాక్షసులు అయి పుట్టిన విష్ణు ద్వారపాలకులు అగు జయ విజయులు. వీరు మహత్తరము అగు తపము సలిపి బ్రహ్మ రుద్రులవలన అనేక వరములను పడసి దేవతలకును, మనుష్యులకును పెక్కు బాధలు ఒనరించిరి. వీరిలో హిరణ్యాక్షుఁడు అనఁబరగిన వీనిని విష్ణువు సూకరాకారమున అవతరించియు, హిరణ్యకశిపుని నరసింహావతార మున అవతరించియు సంహరించెను. చూ ప్రహ్లాదుఁడు. దితి.

(2) యు। వసుదేవుని తమ్ముఁడు అయిన శ్యామకుని రెండవకొడుకు. (భాగ)

## హు

హుతాశనుడు : చూ నా॥ అగ్ని.

## హూ

హూ హూ : ఒకానొక గంధర్వుఁడు. ఇతఁడు దేవల ఋషి శాపముచే మకరి అయి పుట్టి అగస్త్య శాపమున గజరూపియైన ఇంద్రద్యుమ్నుని పట్టుకొని బాధించి విష్ణుచక్రముచే తల నఱకఁబడి శాపవిముక్తుఁడు అయెను. (భా.ర)

## హృ

హృదికుఁడు : య॥ భోజుని కొడుకు. ఇతని కొడుకులు దేవమీఢుఁడు. శతధన్వుఁడు. కృతవర్మ.

హృషీకేశుఁడు : విష్ణువు. ఇంద్రియ నియంతఅని శబ్దార్థము. (హరి)

## హే

హేతి : సృష్టి ఆదియందు బ్రహ్మచే సృజింపఁబడిన రాక్షసరాజు. ఇతని భార్య కాలభగిని అగు భయ. కొడుకు విద్యుత్కేశుఁడు. ఇతఁడు మాల్యవంతుఁడు మొదలగు రాక్షస వంశములకు మూలపురుషుఁడు. ఇతని సోదరుఁడు అగు ప్రహేతి మిగుల ధార్మికత్వమును వహించి సంసార సంగత్యాగియై తపస్సు చేయపోయెను. ఇతఁడు తాపసుఁడయి రాక్షస రాజ్యాధిపత్యము వహించెను. (వరా) (ఉరా)

హేమ : ఒక అప్సరస. (ఉ.రా)

హేమకూటము : మేరువునకు దక్షిణమున భూమ్యాగ్రమున ఉండు పర్వతములలో ఒకటి.

హేమచంద్రుఁడు : 1. విశాలుని కొడుకు. 2. ఒకానొక సంస్కృత పండితుఁడు. ఇతఁడు శాలివాహన శక 1100. సంవత్సరములప్పుడు ఉండినట్లు తెలియవచ్చుచున్నది. హేమచంద్ర కోశము అను నిఘంటువును ఇతఁడు రచించెను.

హేమనాభుఁడు : ఒకానొక పర్వతరాజు. నా॥మైనాకుఁడు

హేమాంగదుఁడు : య॥ వసుదేవునకు రోచనయందు కలిగిన రెండవకొడుకు.

హేముఁడు : అ। జయద్రధుని కొడుకు.బలిపితామహుఁడు.

హేహయుఁడు : య। శత్రుజిత్తు మూడవకొడుకు. (భాగ)

## హై

హైరంబము : ఒకానొక పర్వతము. మణిపురమునకు దక్షిణమున ఉండును. కపిలనది ఇందు ఉత్పత్తి అగుచున్నది.

హైహయము : కార్తవీర్యార్జునుఁడు ఏలుచుండిన దేశము. ఇది నర్మదానదీతీర ప్రదేశము.

## హ్ర

హ్రస్వరోముఁడు మి స్వర్ణరోముని కొడుకు. రెండవ జనకుని తండ్రి.

## హ్లా

హ్లాదుఁడు. : ది। హిరణ్యకశిపుని కొడుకు. ప్రహ్లాదుని తమ్ముఁడు. వీనిని అనుహ్లాదుఁడు అనియు అందురు. (భాగ)

# అనుబంధము

## 'అ'

అంధ్రుడు : పృథువు కుమారుడైన దృషదశ్వుని కొడుకు. యువనాశ్వుని తండ్రి (బ్రహ్మ)

అకృతవ్రణుడు : శాంతుడను మునిపుత్రుడు. ఇతడడవిలో దారి తప్పి తిరుగుచు పులివాత పడబోవు సమయమున యాదృచ్ఛికముగా పరశురాముడు వచ్చి కాపాడెను. అప్పటినుండి ఇతడాయనకు శిష్యుడై సదా వెన్నంటి యుండువాడు. ఇతడొకసారి మొసలి నోటపడి తప్పించుకొని ఆకోలనును శపించెను. ఆ శాపవశమున ధర్మరాజు యాగాశ్వము అందులో దిగి పులిగా మారెను. కాని కృష్ణుని అనుగ్రహమున యథారూపమును పొందెను [(బ్రహ్మో) (జై. భా)]

అక్షయ కుమారుడు : రావణుని కొడుకు. హనుమంతునిచే అశోకవనమున చంపబడెను. (రామా)

అగస్త్యాశ్రమము : 1. నాసికకు ఆగ్నేయముగా 24 మైళ్ల దూరమున నుండు అగస్తిపురి. 2. నాసికకు తూర్పున నుండు అకోల్హా. 3. కొల్హాపురము. 4. ఇట్టాకు నైఋతిగా 40 మైళ్ళ దూరములోని సరాయి అఘాటు లేదా సంకిసకు వాయవ్యయమున ఒక మైలు దూరమున నుండునది. 5. తిరునల్వేలి జిల్లాలో అగస్త్యకూట పర్వతముపై తామ్రపర్ణి పుట్టు ప్రదేశము. 6. ఘర్వాల జిల్లాలో రుద్రప్రయాగకు పండ్రెండుమైళ్ళ దూరమున నున్న అగస్త్యముని గ్రామము. 7. సాత్పురా పర్వతములు లేక వైదూర్య పర్వతము. ౮. వేదారణ్యము ఇవన్నియు అగస్త్యాశ్రమ ముండినచోట్లని జనశ్రుతిగల పేర్లు.

అగ్ని దైవత్యము : కృత్తిక నక్షత్రము. అగ్నితో సంగమించి

రను అపవాదువలన మునిభార్య లాగ్గను వెలిపడి పుణ్యస్థానమును కోరగా కుమారస్వామి వీరిని నక్షత్రములుగా చేసి నిలిపెను. (భార)

అగ్నివర్ణుడు : కల్మాషపాదుని పౌత్రుడగు సుదర్శనుని కొడుకు.

అజనాభము : భరతవర్షమునకున్న పూర్వనామము. భరతుని ఏలుబడికి ముందు పేరు. (భాగ)

అజముఖి : సురసకు కశ్యపునివలన జన్మించిన కూతురు. సుందర పురుషులనుబట్టి బలాత్కారముగ రమించెడిది. అట్లు దూర్వాసుని గూడి ఆమె అతనివలన వాతాపి ఇల్వలులను కనెను. (స్కాంద)

అతిధన్వుడు : ఒక ఋషి. శునకఋషి వంశములోనివాడు. శాండిల్యుని గురువు. ఉద్గీథ విద్య నాశ్రయించి ఉన్నంతవరకు అతను, అతని సంతతివారు సంపన్నులుగా నుందురని ఆయన శాండిల్యుని ఆశీర్వదించెను. (ఛాందో. ఉ)

అతిరథుడు : కర్ణుని పెంచిన సూతునికి మారుపేరు.

అతిసారుడు : నితంతుని పుత్రుడు. ఇతడును ఇతనిసోదరులు సాల్వేయాదులును కలిసి అజిత అను ఒక కాంతనే పెండ్లాడిరి.

అపవుడు : ఒక ముని. ఇతడుండిన వనమును హైహయుడు సూర్యున కాహారముగా నిచ్చెను. ఇతని ఆశ్రమము కాలిపోయెను. అందువలన కోపగించి హైహయుని వేయి చేతులను పరశురాముడు నరికి చంపునని శాపమిచ్చెను.

అభీరదేశము : (1) గుజరాతు ఆగ్నేయభాగము. నర్మదానది సముద్రములో కలియుచోటు. (2) అఖండసింధునదిచివర, అనగా డెల్టా ఏర్పడుటకు ముందు తూర్పున ఉండు ప్రదేశము. 3. అభీరులు గుజరాత్ లో సోమనాథ్ వద్ద సరస్వతీనది ఒడ్డున సముద్రతీరమువద్ద ఉండువారని ఒక అభిప్రాయము. 4. తపతినుండి దేవగఢము మధ్యనున్న పశ్చిమ భారతతీర ప్రాంతము. 5. గుజరా

తలో సూరతుచుట్టు ఉన్న ప్రదేశము. 6. బైబిలులో ఓఫిర్ (Ophir) అను పేరే ఆభీరమని కొందరందురు. 7. కొంకణము నుండి తపతివరకు నున్న సముద్ర ప్రాంతము అభీరము.

[(వి.పు.) (బ్రహ్మ) (మభార) (తారాతంత్ర)]

**అయోధ్య :** రామునికి రాజ్యమైన అవధ్. రామాయణ కాలంలో కోసల దక్షిణ సరిహద్దు గోమతీ (Gumti) గంగా మధ్యస్థనది యైన శ్యాందికనది లేక సాయినది. బుద్ధుల కాలమున అయోధ్య దక్షిణ కోసల ఉత్తరకోసల అను రెండు మండలములుగా సరయూ నదిచే విభజింపబడెను. ఉత్తరకోసల రాజధాని శ్రావస్తి; దక్షిణ కోసల రాజధాని సరయూనది ఒడ్డునగల అయోధ్య. బుద్ధుని కాలమున ప్రసేనజిత్తు జనకుడైన మహాకోసలుని రాజ్యము హిమాలయముల నుండి గంగవరకును, రామగంగనుండి గండకివరకును అయోధ్య రాజధానిగా విస్తరిల్లి యుండెను. రామాయణ మందలి ముఖ్యప్రదేశము లన్నియు అనగా రాముడు జన్మించిన జన్మస్థానము, దశరథుడు, ఋష్యశృంగుడు యజ్వగా పుత్రకామేష్టి నొనర్చిన క్షీరోదకము లేక క్షీరసాగరము, రాముడు స్వర్ణసీతతో అశ్వమేధము నొనర్చిన త్రేతకి ధాకూరు, సభాస్థలమైన రత్నమండపము, ఫైజాబాదునందు గల స్వర్గద్వారమనే రాముడు అవతారము చాలించిన స్థలము, సరయులో లక్ష్మణుడు ఐక్యమైన లక్ష్మణకుండము, దశరథుడు శ్రవణ కుమారుని చంపిన స్థలము— ఇందు గలవు. జైనతీర్థంకరుడైన ఆదినాథు డిచ్చటనే జన్మించెను. ఇచ్చటి పవిత్రస్థలముల నెన్నింటినో గుప్తరాజగు విక్రమాదిత్యుడు పునరుద్ధరించెను.

**అయుధ లేక యాధేయ :** వితస్తాసింధు నదీ మధ్యదేశము.

**అర్జునికి :** ధర్మవ్యాధుని కూతురు అత్తవారింట మృగములను చంపి

తినువారి కూతురనుమాట పడలేక పుట్టింటికి వెళ్ళెను. తలిదండ్రులు లీమెను మరల మెట్టినింటికి తెచ్చిరి. అక్కడ వ్యాధుని భోజనము చేయుమనగ నతడు ఏమి పెట్టుదురని అడిగెను. వియ్యపురాలు మతంగుని భార్య కందులు, గోధుమలు చేటలో వేసి చూపెను. వ్యాధుడు "ఛీ ఛీ, ఇన్ని వేల జీవులను ప్రతిదినము చంపుదురా. వీనిని నేను తినను" అని ఆక్షేపించి తన కూతురును నిందించుట పాడి కాదనెను.

**అర్యముడు :** అదితి కశ్యపుల కుమారుడు. ద్వాదశాదిత్యులలో ఒకడు. (భార)

**అర్వావసుడు :** రైభ్యుని పెద్ద కుమారుడు. పరావసుని సోదరుడు. బృహద్ద్యుమ్నుడను రాజుకు ఋత్విజుడు. (భార)

**అర్థి :** పృథు చక్రవర్తి కుమారుడు. ఇతనిభార్య శిఖండిని. పుత్రుడు హావిర్ధానుడు. (బ్రహ్మ)

**అరిష్టిషేణుడు :** ఒక ముని. ఇతని ఆశ్రమములో పాండవులు కొన్నాళ్ళుండిరి (భార)

**అలోలుడు :** గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు (భార)

**అవాచీనుడు :** జయత్సేనుని కుమారుడు. ఇతని భార్య మర్యాద. వీరి పుత్రుడు అరిహుడు (భార)

**అవిజ్ఞాతగతి :** అనిలుడను వసువు కుమారుడు (భార) (మత్స్య)

**అశ్వతరుడు :** నాగేంద్రుడు. ఇతని కుమారులు కువలయాశ్వుని స్నేహితులు. సరస్వతీ ప్రసాదమున గానవిద్య పడసెను. గాన విద్యతో శివుని మెప్పించి కువలయాశ్వుని మృతభార్యను బ్రతికించి కువలయాశ్వున కిచ్చెను.

**అవీక్షిత్తు :** ఇతని భార్య విశాల. స్వయంవరమున అధర్మ యుద్ధమున ఇతరరాజు లితని నోడించినను విశాలరాజు పుత్రి విశాల

ఇతనినే వరించెను. ఆమె చూచుచుండగా ఓటువడినందున మొదట ఆమెతో పరిణయమున కితడు సమ్మతింపలేదు. కాని తల్లితండ్రుల పట్టుదలపై పిదప పెండ్లాడెను. ఇతని కుమారుడైన మరుత్తు తాత తరువాత రాజ్యమునకు వచ్చెను. తాను వెనుక ఓడిపోతిని కనుక రాజ్యమున కనర్హుడనని అవీక్షిత్తు రాజ్యమును స్వీకరించలేదు. మునులను బాధించుచున్నందుకు ప్రతీకారముగా మరుత్తు సంవర్తాస్త్రముతో నాగలోకమును తపింపజేసెను. విశాల ఈసర్ప ఘాతమును మాన్పించుటకై కుమారునితో యుద్ధము చేసెను. మునులు యుద్ధము మాన్పించిరి. అవీక్షిత్తు కుమారుని దీవించి తపోవనమునకు పోయెను. (మార్క-౦)

అశ్మ : ప్రాచీశునిభార్య. సంయాతి తల్లి. (భార)

అశి : వారణాసియందలి ఒక నది.

అశిక్ని : చంద్రభాగానది. ఇప్పటి చీనాబ్.

అశ్వద్థ వృక్షము : అగ్ని ఇంద్రుని పనుపున శివపార్వతుల ఏకాం తమును భంగముచేయగా కోపించి పార్వతి దేవతలందరినీ చెట్లుగా మారుడని శపించెను. అప్పుడు విష్ణుమూర్తి అశ్వత్థవృక్షమయ్యెను. (పద్మ)

అశ్వద్థుడు : ఒక రాక్షసుడు. అశ్వత్థవృక్షరూపమున నుండి తన నీడకు వచ్చిన బ్రాహ్మణులను భక్షించువాడు. శనైశ్చరు డితనిని చంపెను. (బ్రహ్మ)

అశ్వని : ధరణీదక్షుల కూతురు. చంద్రుని భార్య. ఒక నక్షత్రము. (భార)

అశ్వలాయనుడు : ఒక ఋషి. శౌనకుని శిష్యుడు. గృహ్య సూత్రములను చేసెను.

అశ్వశిరుడు : ఇతడొక రాజు. ఇతడి యజ్ఞశాలకు కపిలుడు, జైగీష వ్యుడు అను మునులు వచ్చి మేమే నారాయణులము మన్మ

కొలువుమనిరి. రాజు యొక్క శంక నివృత్తి చేయుటకై వారు గరుడవాహన విష్ణురూపము దాల్చిరి. రాజు దీనిని మాయ యని అనుమానింప వారంతర్ధాన మొందిరి. యజ్ఞశాల దుష్టమృగమయ మయ్యెను. రాజు భయపడి ప్రార్థింప కనుపించి వారు సమస్త పదార్థములందును భగవంతుడు కలడు. సుజ్ఞానముకలిగి స్వజాతీయ ధర్మము పాటించినవాడు ముక్తుడగునని బోధింపగా అశ్వశిరుడు తన కుమారుడగు స్థూలశిరునకు రాజ్య మప్పగించి తపోవనమున కేగెను.

**అసిలోముడు :** ఒక దనుజుడు. దేవాసుర సంగ్రామమున వాయువుతో పోరాడెను. పిదప విష్ణువుతో పోరి అతనిచే చంపబడెను.

'ఆ'

**అంగరిష్ఠుడు :** ఒకరాజు. ధర్మార్థ కామ విషయములను గురించి కామందకుడను ముని నడిగి తెలిసికొనెను. (భార)

**అంగి :** అరిహుని భార్య. మహాభౌమునితల్లి. (భార)

**ఆతర్కరుడు :** కద్రువ కుమారుడు. (భార)

**ఆకాశరాజు :** సుధర్ముని కొడుకు—ఈతని కొమార్తె పద్మావతిని వేంకటేశ్వరుడు చూచి వలచెను. ఆకాశరాజు పద్మావతి నాతని కిచ్చి వివాహము చేసెను.

**అకూపారుడు :** ఒక ముసలి తాంబేలు, మార్కండేయుని కంటె పెద్దది. ఇంద్రలోకము నుండి భూలోకమునకు వచ్చిన ఇంద్రద్యుమ్నుడను రాజు నిదియే గుర్తుపట్టెను. (భార)

**ఆగ్నేయి :** ఊరుని భార్య. (మత్స్య)

**ఆటకి :** ఉషస్తియను వాని భార్య-కురుదేశమున నుండువారు. ఆ దేశమున పాషాణవర్షము కురిసి పైరులు నశించెను. క్షామము మిక్కుటముగ నుండెను. భర్త తనకొరకొక మావటివానినడిగి

తెచ్చిన అలచందలను దాచి యుంచి మరునాడు తన భర్త శక్తిలేక యున్నతరి వాని నతనికిచ్చెను. (ఛాన్దో. ఉరా)

ఆది గదాధరుడు : గయాసురుని స్థిరీకృతుని చేయుటకై మొదట విష్ణువే గదను ధరించుటచే అతని నిట్లందురు. (వాయు)

ఆదిత్య కేతువు : గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు. (భార)

ఆదివరాహము : భూమిని రసాతలము నుండి ఉద్ధరింప విష్ణువు దాల్చిన రూపము. (విష్ణు)

ఆనందుడు : చాక్షుషువు. విక్రాంతునింట పెరుగుచున్నప్పు డతనికి విక్రాంతుని భార్య పెట్టిన పేరు.

ఆప్రవానుడు : చ్యవనుని పుత్రుడు. ఇతనిభార్య ఋచి. ఈపుత్త్రుడు ఔర్వుడు. (బ్రహ్మ)

ఆర్యకుడు : ఒక భుజంగరాజు. ఇతని కుమారుడగు చికురుని గరుడుడు చంపి మనుమడగు సుముఖునికూడ చంపుదునని భయపెట్టెను. మాతలి అతనికి తనకూతురు నిచ్చి వివాహము చేయుటకువచ్చి, విషయము తెలిసి ఇంద్రుని వేడగా ఇంద్రుడు విష్ణువుతో చెప్పి వారిరువురును సుముఖుని చిరాయువుగా చేసిరి. ఆర్యకుడు సుముఖునకు మాతలికూతురు నిచ్చి పెండ్లి చేసెను. (భార)

ఆర్ష్టిషేణుడు : ఒక రాజు. భార్య జయ. కొడుకు భరుడు. పుత్రునికి రాజ్యమిచ్చి భార్యతో గంగాతీరమున కేగెను. అచ్చట యజ్ఞము చేయుచుండగా మధువను రాక్షసుడు ఋత్విజునితోసహా భార్యాభర్తలను రసాతలమున కెత్తుకొని పోయెను. వీరి నందరను ఋత్విజుని కుమారుడైన దేవాపి బైటకు తీసికొని వచ్చెను (బ్రహ్మ)

ఆషాఢభూతి : దేవశర్మయను లుబ్ధసన్యాసివద్ద శిష్యుడుగాచేరి నమ్మిక బుట్టించి అతని సొమ్ముగల బొంతసంచి నపహరించిన వాడు. (పంచ)

**ఆసందిపుడు :** ఒక బ్రాహ్మణ బాలుడు. వీని పెండ్లిముహూర్తము నకు ముందు ఒక రాక్షసి వీని నెత్తికొని పోయెను. అది బ్రాహ్మణ వేషముతో వానిని తన కుమారుడే అని చెప్పుచుండును. తన ఇష్ట ప్రకారము నడుచుకొననిచో వానిని చంపుదునని భయపెట్టెను. ఆ రాక్షసియే ఒక బ్రాహ్మణ బాలికను తెచ్చి వీనికి వివాహము చేసెను. ఆమెను చూచి ఆసందిపు డేడ్చెను. కారణము తెలిసి కొనిన అతనిభార్య గౌతమీతీరమున కేగి విష్ణువును ప్రార్థించినచో ఎట్టిభయ ముండదని చెప్పెను. వారట్లు చేయగా విష్ణువు ప్రస న్నుడై ఆరాక్షసిని చంపి వీరికి వరము లిచ్చెను. (బ్రహ్మ)

'ఇ'

**ఇంద్రపురము :** నేటి ఇండోరు.

**ఇంద్రవర్మ :** మాళవదేశపు రాజు. కురుక్షేత్రములో దుర్యోధన పక్షము వహించెను. ఇతని ఏనుగే అశ్వత్థామ. (భార)

**ఇంద్రసావర్ణి :** 14వ మనువు. ఇతని కాలమున ఇంద్రుడు శుచి అనబడువాడు. దేవతలు చాక్షుషాద్యులు.

**ఇడ :** పూర్వము బ్రహ్మ సృష్టి చేయదలచినపుడు సత్రయాగము చేసెను. అప్పుడు ఇడ అతని భార్య.

**ఇతర :** ఒక ఋషి భార్య. ఈమె కుమారుడు ఐతరేయుడు. ఒకనా డతడు తండ్రి తొడపై కూర్చుండగా తండ్రి లేవగొట్టెను. తండ్రికి అతని ఇతర భార్యల బిడ్డలయందే ప్రీతి. ఇతర తన పుత్రునకైన అనాదరణమునకై దుఃఖించి భూదేవిని ప్రార్థించెను. భూదేవి ప్రత్యక్షమై ఐతరేయుని సింహాసనముపై కూర్చుండబెట్టెను.

**ఇధ్మ జిహ్వుడు :** ప్రియవ్రతుని పుత్రుడు. ప్లక్ష ద్వీపమునకు రాజు. ఇతడు ప్లక్ష ద్వీపమును ఏడు భాగములు చేసి యొక్కొక్క దానికి తన ఏడ్వురు కుమారులైన శివుడు, యశస్యుడు, సుభద్రుడు,

శాంతుడు, క్షేముడు, భయుడు, అమృతుడు అను వారలను రాజుల చేసెను. (భార)

ఇర : కశ్యపుని భార్య. ఈమె యందు వృక్షలతాదులు జన్మించెను. (గరు. పు.)

ఇరావతి : ఉత్తరుని కుమార్తె. పరీక్షిత్తు భార్య. (భాగ)

ఇలావృతుడు : అగ్నీధ్రుని పుత్రుడు. ఈతడు జంబూద్వీపము నందలి ఒక వర్షమును పాలించినందున ఈతని పేరిట ఆ వర్షమునకు ఇలావర్షమని పేరు వచ్చెను. (విష్ణు)

ఇలావృత వర్షము : జంబూద్వీపమందొక దేశము. నిషేధ హేమకూట హిమవత్పర్వతముల కుత్తరమున యున్నది. (భాగ)

ఇల్వలాపురము : దౌలతాబాదునకు సమీపమందున్న ఎల్లోరా వాతాపి ఇల్వలుల నివాస ప్రదేశమని ఐతిహ్యము. ఏలాపురమని నామాంతరము. కొండలలో తొలిచి నిర్మింపబడిన కైలాస దేవాలయము. ఇతర గుహలు ప్రసిద్ధములు. కైలాస నిర్మాణ కాలము క్రీ. శ. 600 నుంచి 750 వరకు. నిర్మాత బాదామి చక్రవర్తియైన (మొదటి) కృష్ణ. దేవపర్వతమని కూడ నామాంతరము.

ఇక్షు : 1. ఆక్సస్ నది. శకద్వీపముగుండా ప్రవహించును. (విష్ణు)
2. నర్మద ఉపనది. (కూర్మ)

## ఉ

ఉంఛవృత్తి : ఒక బ్రాహ్మణుడు. ధర్మనిరతుడు సత్యవ్రతుడు. రాలిన గింజల నేరి తినువాడు. కొంతకాలము పయోవాయు భక్షణముల తోడనే కాలము గడపుచుండెడివాడు. ఇతడు మహాజ్యోతియై సూర్యుని కలిసెను.

ఉగ్రపాండ్యుడు : మధురానగరము నేలిన రాజు. తండ్రి సుందరేశ్వరుడు. తల్లి తటాతక. భార్య కాంతిమతి. కొడుకు వీరపాం

ద్యుడు. ఉగ్రపాండ్యుడు తొంబది తొమ్మిది యజ్ఞములు చేసెను. నూరవ యజ్ఞముకూడ చేసినచో ఇంద్రపదవి ఈతనికే వచ్చునని ఇంద్రు డతనికి ఆటంకములు కల్పించెను. ఇతని నగరమును సము ద్రములో ముంచుటకూ, ఇతని దేశమందు వర్షము కురువకుండ చేయుటకు ప్రయత్నించి విఫలు డయ్యెను. యుద్ధము చేసికూడ యోడిపోయెను.

**ఉచథ్యుడు :** సోముని యల్లుడు. ఇతడు యమునానదికి స్నాన మున కేగగా వరుణు డితని భార్య నపహరింపగా నాతడు దిక్పతి యగువాని కిది తగని పని యని నారదునిచే చెప్పించగా వరుణుడు లక్ష్యపెట్టలేదు. అంత ఉచథ్యుడు వరుణుని నగరమునకు వెళ్ళి అచటి జలమునంతయు నింకిపోజేసి పురమును ధూళి మయము జేయగా వరుణుడు వెరచి యుచథ్యుని భార్యను నతనికిచ్చెను (భార)

**ఉపకీచకులు :** కీచకుని తమ్ములు. విరాటరాజు బావమరదులు. కీచకుని మరణమునకు ద్రౌపదియే కారణమని సైరంధ్రిని జట్టి కీచ కుని శవమునకు గట్టి దహనము చేయబోవగా భీముడు దాపున నున్న వృక్షమును బెరికి వారందరనూ సంహరించెను. (భార)

**ఉపకోసలుడు :** కమలుని పుత్రుడు. సత్యకాముని శిష్యుడు. అందరికంటెను ఎక్కువ శ్రద్ధాభక్తులు కలిగి యున్నందున గురు వీతనికి బ్రహ్మవిద్య నేర్పగోరి వానికి వివాహమున కనుజ్ఞ నీయక తన గృహమునందే యుంచెను. గురువు నాజ్ఞ నీయకుండుటచే ఉపకోసలునికి కష్టము గలిగెను. గురు వీతనితో గారణము చెప్ప కుండె. మరియు గ్రామాంతర మేగుచు నగ్నులకు బరిచర్య చేయు చుండుమని వీనినే నియోగించెను. ఉపకోసలుడు గురునానాదర ణమునకు దుఃఖించి యన్నము దినుటమాని యగ్నులకు బరిచర్యలు చేయుచుండగా నగ్నులు సంప్రీతులై బ్రహ్మజ్ఞానము నెఱిగి

చేసిరి. సత్యకాముడు మరలి వచ్చి శిష్యుని చూచి నీ ముఖమున బ్రహ్మజ్ఞాన చిహ్నములు గలవు. నీకెవరు నేర్పిరని యడుగగా అగ్నులు నేర్పెనని యతడు చెప్పి బ్రహ్మజ్ఞానము గురువుల వలన నేర్చుకొనవలయును గాన సత్యకాముని గూడ దాని నుపదేశింపుమని కోరి యాతని వలన యుపదేశ మొందెను.

**ఉపబర్హణుడు :** ఒక గంధర్వుడు. విశ్వసృష్టయైన బ్రహ్మలు దేవసత్రమను యాగముచేయ నారాయణ కథలు గానము చేయుటకై గంధర్వగణముతో కొంతసేపు పాడి అప్సరసల జూచి మోహించి తొలుగగా శూద్రయోనిం బుట్టుమని బ్రహ్మలు శపించిరి. ఈతడొక దాసికి పుట్టి తరువాత భవంబున నారదుడయ్యెను. (భాగ)

**ఉపయాజి :** ఒక బ్రాహ్మణుడు. యాజి తమ్ముడు. ద్రుపదు డీతని కడకు వచ్చి పుత్రకామేష్టి యజ్ఞము చేయించిన లక్ష గోవుల నిచ్చెదనని వేడగా నేను ప్రతిఫల మాశించను అని చెప్పి ఐనను ద్రుపదుడు ఒదలకుండిన మరొక సంవత్సరము తన అన్నయగు యాజిని పురోహితునిగ గైకొనుమని చెప్పెను. (భార)

**ఉషస్తి :** ఒక ఋషి. ఇతని భార్య ఆటకి. కురుదేశమున పాషాణ వర్షము గురిసి కాటకమురాగా ఈతడు ఒక మావటివాని నుండి ఎంగిలికుండలోని యులవలను దిని జలము దిరస్కరించెను. ప్రాణములు నిలుపుకొనుటకై నేమితినినను దప్పులేదని అనెను. మరునాడు రాజువద్దకేగ రాజు యాగములో నార్త్విజ్య కృత్యము లితని అధీనము జేసి ఆతనికి ధనమిచ్చి పంపెను. (ఛాన్దో. ఉ.)

**ఉష్ట్రకర్ణిక :** దక్షిణమున నొక దేశము. దిగ్విజయార్థ మరిగిన సహదేవు డీదేశపురాజు కడనుండియు ధనము పుచ్చుకొనెను (భార)

## ఋ

**ఋక్ష విరజుడు :** వాలి సుగ్రీవుల తండ్రి. ఇతడే పార్వతి శపించిన కొలనులో దిగి స్త్రీ రూపమును బొంది వాలి సుగ్రీవులకు జన్మనిచ్చెను. ఇతడు బ్రహ్మ పుత్రుడు. బ్రహ్మ పనుపగా కిష్కింధ నేలెను.

## ఏ

**ఏకామ్ర కాననము :** కటకమునకు ఇరువది మైళ్ళ దూరములోని భువనేశ్వరము. గంధవతినదిపై నున్నది. క్రీ.పూ. ఆరవ శతాబ్దము నందు యయాతి కేసరి కాలము వరకు అనగా క్రీ.శ. అయిదవ శతాబ్దమువరకు కళింగనగరి పేరున ఒరిస్సా రాజధానిగా ఉండెను. నామాంతరము హరక్షేత్రము.

**ఏకాదశ రుద్రులు :** అజపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్ర్యంబకుడు, వృషాకపి, శంభుడు, జపాలి, రైవతుడు, హరుడు, బహురూపుడు, ఉగ్రుడు, విశ్వరూపుడు అనువారలు. వీరు సురభికి మార్తాండుని వలన జన్మించిరి. సనక సనందాదుల సృష్టి పిదప బ్రహ్మ సృష్టి పెంచుటకై స్త్రీ-పురుష రూపము గలవాడై నిలిచెను. పిమ్మట రెండు శరీరముల నేర్పరచెను. ఆ పురుషు డేకాదశ రూపములను దాల్చెను.

(భార, మార్కం.)

## ఓ

**ఓఘవంతుడు :** సుదర్శనుని పుత్రుడు. ఇతని కుమారుడు ఓఘరథుడు. ఓఘవంతుని కుమార్తె ఓఘవతి. ఓఘవంతుడు ఓఘవతికి తగిన వరుడు దొరుకక తండ్రియగు సుదర్శనునికిచ్చి వివాహము చేసెను.

(భార)

## ఔ

**ఔద్దాలకి :** ఈతడొక ముని. ఒకనాడు స్నానముచేసి దర్భలను నదియొడ్డున మరచి, తన కుమారుడైన అచికేతుని పంపి వానిని గొని రమ్మనెను. కాని దర్భలును గలశము నదిలో గొట్టుకొని పోగా

చుపి గనపడక యచికేతుడు జెప్పగా తండ్రి వానిని నీవు పోయి యముని దర్శింపుమని దిట్టెను. కోపనే కుమారుడు స్వగృహాతప్పి నేంపై బడియె. ఔద్దాలకుడు పశ్చాత్తాపము చెంది పుత్రునికై విల పించ మరునాడు పుత్రుడు నిద్రపోయినవానివలె లేచెను.

**శౌనికుంభుడు :** కాశీనగరములో నుండు నొక బ్రాహ్మణుడు. ఇతని కలలో నికుంభుడు కనబడి విశ్వేశ్వరునకు గుడి కట్టింపుమని చెప్పెను. ఇతడా సంగతి దివోదాసునితో జెప్పగా ఆతడు గుడి కట్టించెను.

## క

**కచ్ఛపి :** సరస్వతి యొక్క వీణ.

**కపోత తీర్థము :** గౌతమియం దొక తీర్థము. లుబ్ధకు డొకడు సుఖముగా గాపురము చేయుచున్న కపోతములలో వాడు దానిని బట్టుకొని పంజరమున బెట్టెను. మగపక్షి యా పంజరము జుట్టు తిరుగుచూ విలపించినాడు. పక్షి భర్తకు ధైర్యము జెప్పెను. ఐనను మగపక్షి యగ్నిహోత్రము దెచ్చి మంటజేసి అందులో బడియె. లుబ్ధకుడు జాలిచే నాడు పక్షిని విడువగా అదియు నగ్నిలో దూకెను. అంత లుబ్ధకుడు ఆ మిధునమునకు నమస్కరించి సన్మార్గము జూపించుమని వేడ నవి గౌతమిలో స్నానముజేసి దేవుని ప్రార్థించి ప్రాణములు వదలిన పుణ్యము గలుగునని జెప్పగా అట్లేచేసి స్వర్గమునకు జేరెను. ఆతడు ముక్తి నొందిన ప్రాంతమునకు కపోత తీర్థమని పేరు.

**కపిలవస్తు :** బుద్ధుని జన్మస్థలము.

**కరటక దమనకులు :** పంచ తంత్రమునందు "మిత్రభేదము"నందు చెప్పబడిన జంబుక సోదరులు. ఈ నక్కలు మృగరాజు కొలువున ఉండెడివి. వనములో విడువబడి తిరుగుచున్న సంజీవకుడను

వృషభమునకు పింగళకమునకు మైత్రి కలిగించి తిరిగి వారి మైత్రి జూచి ఓర్వలేక చెడగొట్టినవి. చివరకు సింహముచే వృషభమును జంపించినవి.

కర్మ నాశనము : త్రిశంకుని పాపములచే పంకిలమైన నది.

కర్కోటకుడు : కద్రువ కుమారుడు. మిగిలిన నాగము లన్నియు ధర్మహాని చేయనేరక నిరాకరించగా కర్కోటకుడు తల్లిని పందెములో గెలిపించుటకు ఉచ్చైశ్రవము నంటిపెట్టుకొని నల్లగ కనిపింపజేసెను. అగ్నిలోపడి దగ్ధము కాబోవుచూ నలునిచే రక్షింపబడియు నలునే కాటు వేసెను.

కళ్యాణపురము : కుంతలదేశమునకు రాజధాని.

కవేరుడు : ఒక బ్రహ్మర్షి. ఇతని కూతురు విష్ణుమాయ. ఈమె తపస్సుజేసి నదియై కావేరీ నది అయ్యెను. ఒక అంశము లోపాముద్ర అయ్యెను.

కా

కాకనాడ : భోపాలునందలి సాంచికి పాత పేరు.

కాకాసురుడు : ఒక రాక్షసుడు. మందాకినీ తీరమున సీత నిద్రించుచుండగా గాకాసురుడు కాకియై వచ్చి సీత పయ్యెద తొలగించి స్తనములను గోళ్ళతో గీరగా రాముడు జూచి యాకాకిని బాణముతో గొట్టెను. అంత అసురుడా బాధ కాగలేక రాముని ప్రార్థింపయొక్క అంగ మిచ్చిన బాణము బలమాగునని రాముడు జెప్పగా కాకాసురుడు తన నేత్ర మిచ్చెను.

కాలంజనము : ఒక గిరి. అచ్చట దేవళము పూజారి దేవబ్రాహ్మణధన మపహరించి శునకమై బుట్టి యొక భిక్షుకుడు కొట్టగా నది శ్రీరామునితో మొఱ పెట్టుకుని యా భిక్షుకుని యా దేవళమునకు బంపుటే తగిన శిక్ష యని జెప్పెను.

**కాలకేతుడు :** రావణుని సారథి. (రామా)

**కాలాంతకుడు :** ఘంటాకర్ణుని సోదరుడు. కుబేరుని బంటు. (హరి)

**కాలడి లేక కాలటి :** కేరళ యందలి ఈ పట్టణమున ఆది శంకరాచార్యులు పుట్టిరి.

**కాలకుండము :** నైజామునందలి గోల్కొండ. మాధవాచార్యులిచ్చట పుట్టెను. ఇతడు సర్వదర్శన సారసంగ్రహమును రచించెను.

**కింపురుష దేశము :** నేపాలు.

**కిరాట దేశము :** త్రిపుర దేశము.

**కీకటము :** మగధదేశము.

**కుంచము :** బల్లేసు మల్లయ్య యను వర్తకునకు చాల నష్టము రాగా శివు నారాధింపక భుజింపనని తన కుంచమునే శివలింగముగ భావించి కొండగోగుతో పూజింప సాగెను. ఒకనాడు తోడి వర్తకులు కుంచమడుగగా నతడు అది స్థిరరూప మయ్యెనన వారు జూడగా గుంచము లింగమై అది యుండిన చోటు గోపురమయ్యెను. (బస)

**కుండశాయి :** గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు.

**కుండాశి :** గాంధారీ ధృతరాష్ట్రుల పుత్రుడు.

**కుమార తీర్థము :** గంగానదిలో నొక తీర్థము. కుమారస్వామి విషయాసక్తుడై దేవతాస్త్రీలను వలచిపోగ పార్వతి వారి రూపములను ధరించి వచ్చెను. కుమారస్వామి ఇది తెలిసి స్త్రీ లందరూ తల్లితో సమానులని గ్రహించి బుద్ధిమతియై యీ తీర్థములో స్నానము చేసి పుణ్యమును బొందెను. అందువలననే ఈ తీర్థమునకీ పేరు వచ్చెను. (బ్ర. వై.)

**కులశేఖరుడు :** మధురానగరము నిర్మించిన రాజు. ఈతని పుత్రుడు మలయధ్వజుడు. (స్కాంద)

**కుసుమశ్రేష్ఠి :** కన్యకాంబ తండ్రి. ఈతని గృహమునకు వచ్చిన విష్ణువర్ధనుడను రాజు కన్యకాంబను జూచి మోహించి తన కిమ్మని శ్రేష్ఠి వలదనెను గాని రాక్షస వివాహము జేసికొందునని రాజును టచే భయపడి తన కూతు నిత్తుననియె. కాని తరువాత పెద్దల యాలోచన ప్రకారము రాజునకు ఆమె నీయనని వర్తమానమంపి రాజు యుద్ధ సన్నద్ధుడై రాకబూర్వమే చితి పేర్చి తానును, తన కూతురును, కోడలును జితి నెక్కిరి. ఈతడు పూర్వభవమున నలకూబరుడు. శతజిహ్వుడను రాక్షసునితో యుద్ధము జేయునందున బ్రహ్మ కోపించి పిరికివానివి గావున వైశ్యుడవై బుట్టుమని శపించెను.

**కృపావతి :** ఒక గోరువంక కుక్కలచేత తరుమబడి క్రిందపడగా సురథుడను రాజర్షి దానిని గాపాడెను. అతని యంగ యష్టివలన గుమారిక జన్మించె. ఆమెయే కృపావతి. ఈమె తన స్నేహితు రాండ్రతో వశిష్ఠు నాశ్రమముకడ నాడుచుండ వశిష్ఠుడు వీరి అల్లరికి గోపించి వైశ్యబాలికై జన్మించుమని ఆమెకు శాప మిచ్చెను. ఆమె మునిని వేడ్కొనగా నీకు గుమారుడు బుట్టి యతడు యుద్ధము చేసిన తరువాత నీ వైశ్యత్వము పోవునని చెప్పెను. ఈమెయే సుప్రభయై జన్మించెను.

**క్షేమదర్శి :** ఒక రాజు. కోసల దేశమును పాలించెను. ఇతని తండ్రికి సఖుడగు కాలక వృక్షీయుడను ముని కాకి నొకదానిని తీసికొని వచ్చి అది త్రికాలవేదియనియు రాజ్యమందలి పట్టుబడని చోరు లను చెప్పగలదనియు చెప్ప రాజభటులు తమ గుట్టులు బైలుపడు నని భయపడి కాకిని జంపిరి. ఇతని రాజ్యమున చోరు లున్నా రనుట కిదియే దృష్టాంతమని ముని చెప్పగా రాజు వారిని దం డించెను.

కొంగదేశము : ఈనాటి కోయంబత్తూరు, సేలములు.

కొంగమదేశము : కొంకణము. దీనినే పరశురామ క్షేత్రమనియు అందురు. పడమటి కనుమలు, అరేబియా సముద్రముల మధ్యగల తీర దేశము.

కొంకణపురము : తుంగభద్రాతీరమున గల ఆనగంది. కొంకణమున కిది రాజధాని. బొంబాయి సమీపమున బెస్సీన్ అని కొందరి మతము.

కోణాదిత్యము : కోణార్కము.

కోలాహలపురము : పరశురామునిచే కార్తవీర్యార్జునుడు చంప బడిన ప్రదేశము. ఇది ఇప్పటి మైసూరునందలి కోలారు. దీనినే కోలాల పురమనియు అందురు.

కోడదేశము : నేటి కూర్గు కొడగు.

## గ

గజాసురుడు : మహిషాసురుని కుమారుడు. శివుని గూర్చి తపము చేసెను. పిమ్మట దేవతలను బాధించెడివాడు. దేవతలు శివునితో మొర పెట్టుకొనగా శివుడితని శిక్షించుటకు వచ్చెను. దేవా! నీ చేతిలో చావు పొందవలెనని కోరినందువలన ఇట్లు జేయుచుంటి. నే మరణించిన పిదప నా చర్మము నీవు ధరింపుము. నీకపుడు కృత్తి వాసుడను పేరు వచ్చును. ఇదియే నాకోరిక యని ఇతడు వేడగా శివుడట్లే చేసెను.

గజేంద్రుడు : ఒక యేనుగు. ఒకనాడు తన కోటివారితో ఒక కొలనులోనికి ప్రవేశింప మొసలి యొకటి దీని కాలును బట్టు కొనెను. యేనుగు ఎంత లాగినను విడువకుండెను. యేనుగు బయ టకు, మొసలి లోనికి లాగుచుండ పెక్కు సంవత్సరములు పోరా టము జరిగెను. అంతకంతకు గజము శక్తి తగ్గెను. అపుడిది విష్ణు మూర్తినే ధ్యానించగా దీని దీనాలాపములు వినినతోడనే విష్ణువు

లక్ష్మిని విడచి తన భక్తుని వద్దకు వచ్చెను. అతని వెనుక చక్రము వచ్చెను. దానితో మకరమును సంహరించి యేనుగును విడిపించెను. పూర్వజన్మమున ఆ మకరము హూహూ యను గంధర్వుడు. మరియు గజేంద్రుడు ఇంద్రద్యుమ్నుడను ద్రవిడాధీశుడు. అగస్త్యుడాతనిని శపించగా గజేంద్ర మయ్యెను.

**గరుడాచలము :** ఒక పర్వతము. విష్ణుమూర్తి వరహావతారము దాల్చిన పిమ్మట ఆరూపముతో స్వర్గమునకు వెళ్ళిన లక్ష్మి యాక్షేపించుననని, స్వర్గము నుండి తన క్రీడాచలమును దెమ్మని గరుత్మంతునిబంప గరుడుడు దానిం దెచ్చెను. ఆ పర్వతమే గరుడాచలము. దీనినే వేంకటాచలమనియు నందురు.

**గంధవతి :** సిప్రానది పాయ. దీని ఒడ్డున ఉజ్జయిని యందలి మహాకాలుని ఆలయము కలదు.

**గార్గి :** ఒక బ్రాహ్మణవనిత. మిక్కిలి విద్యావంతురాలు. జనకుడు తన సభలో మిక్కిలి బుద్ధిమంతునకు ధనము నీయ దానిని యాజ్ఞవల్క్యుడు గైకొనెను. ఆ యాజ్ఞవల్క్యునే యీయామె వేదాంత విషయమున బ్రశ్నించి వానితో వాదించెను.

**గిరిక :** శుక్తిమతి కుమారితె. కోలాహల మీయామె తండ్రి. వసువను రాజుచే భార్యగ గ్రహింప బడియె.

**గిరిభద్ర :** మిత్రుడను రాజు భార్య. చాక్షుషమను వీమెకు జన్మించెను. శిశువు పుట్టిన నాఁటవనా డీమె ఆశిశువును ముద్దాడుచుండ వాడు ఫక్కున నవ్వ యీయామె "నీవింకను గన్నులు తెరువని పాపవే; ఏల ఇట్లు నవ్వెద"వని ఆమె యడుగ, "జాతహారిణి అను పిల్లి నన్ను తినుటకు సిద్ధముగ యున్నది, నేను నీకేమి యుపకారము జేసితినని ఇంత హర్ష మొందుచుంటి"వనె. అంత ఆమెకు కోపము వచ్చి అచ్చటి నుండి పోవగ జాతహారిణి వచ్చి శిశువు నెత్తుకుని పోయెను.

**గోదావరి :** గౌతమి.

**గోబిలుడు :** దేవదత్తుడను బ్రాహ్మణునికి యజ్ఞమం దుద్గాత. ఇతడు స్వరము తప్పుజెప్పగా దేవదత్తు డితని మూర్ఖాయని నిందింప నాతనికి గోపము వచ్చి నీకు మూర్ఖుడగు కుమారుడు పుట్టునని దేవదత్తుని శపించెను. దేవదత్తుడు క్షమింపమని వేడగా కొంత కాలమునకు నీ పుత్రుడు కవి యగునని అనుగ్రహించెను. (దే.భా)

**గోపకవనము :** నేటి గోవా. దీనినే గోపక పట్టణము, గోపుకపుర మందురు.

## చ

**చండిక :** 1. ఉద్దాలకుడను బ్రాహ్మణుని భార్య. భర్త చెప్పినదానికి వ్యతిరేకముగ జేయుచుండును. భర్త తనకు కావలసిన దానికి వ్యతిరేకముగ జెప్పి చేయించుకొనువాడు. తన తండ్రి పితృ కార్యమున పారణము గోవునకు పెట్టుమన ఆమె దానిని పెంటపై పారవేయగా వింధ్యాటవి యందు శిలవై యుండుమని అతడు శపించెను. ధర్మజుని యాగాశ్వము త్రొక్కగా ఈమెకు శాప విమోచన మయ్యెను. (జై.భా)

2. చండుడను రాక్షసుని సంహరించుటచే పార్వతి శరీరము నుండి పుట్టిన దేవికీ పేరు వచ్చెను. (మార్క)

**చంద్రహాసుడు :** కేరళదేశరాజు పుత్రుడు. తల్లితండ్రులు పోగా ఇతడనాథుడై కుంతలదేశమునకు వచ్చెను. అచ్చటి జ్యోతిష్కులు ఈ బాలుడు రాజ చిహ్నములు గలవాడని చెప్పగా మంత్రియగు దుష్టబుద్ధి తన కుమారునే రాజుగా చేయదలిచి యున్నవాడు గాన ఈతని సంహరించుట కనేక ప్రయత్నములు జేసెగాని యవి యన్నియు నితనినే గొట్టెను. చంద్రహాసుడు దుష్టబుద్ధి కూతురగు విషయను రాజపుత్రియగు చంపకమాలను గూడ బెండ్లి యాడి

ఆ రాజ్యమును పొందెను. దుష్టబుద్ధి కుమారుడు సంహరింపబడెను. దుష్టబుద్ధి గూడ గుండె బ్రద్దలై మరణించెను. చంద్రహాసుడు చండికను ప్రార్థించి వారిరువురను బ్రతికించెను. ఈతనికి మకరధ్వజుడు, పద్మాక్షుడు అను పుత్రులు కల్గిరి. (జై. భా)

**చక్రము :** విష్ణువు ఆయుధము. దీనిని పంపినచో ఎంత బలవంతుడైనను తరిమి సంహరించి మరల వచ్చును. విశ్వకర్మ సూర్యుని సానబట్టునప్పుడు రాలిన తేజస్సును ప్రోగుచేసి చక్రముగ జేసెను. చక్రము దధీచి అస్థులతో చేయ బడెననియు నందురు.

**చతుర్వ్యూహములు :** పరమేశ్వరు డొకానొకప్పుడు చతుర్విధ రూపములతో యుండెను. వాసుదేవ ప్రద్యుమ్న సిద్ధ సంకర్షణులు చతుర్వ్యూహములు. మనోబుద్ధి చిత్తాహంకారములే ఇట్టి నామముల బరగును.

**చాణిక్యుడు :** ఒక బ్రాహ్మణుడు. మిక్కిలి తంత్రజ్ఞుడు. నందులపై పగపట్టి వారిని రూపుమాపి చంద్రగుప్తుని పాటలీపుత్రమునకు చక్రవర్తిగ జేసెను. నందులకు విశ్వాసపాత్రుడు, సమర్థుడు అగు రాక్షసుని ఈతనికి మంత్రిగ నియమించెను. తన కార్యము నెరవేరగనే తపోవనమునకు పోయెను. ఇతడు మహారాజనీతి తంత్రజ్ఞుడు.

**చంపాపురము :** పూర్వపు అంగదేశపు రాజధాని.

**చరిత్రపురము :** ఒరిస్సాయందలి పూరి.

**చిత్రవర్మ :** ఒక రాజు. ఇతని కెనమండుగురు పుత్రుల తరువాత సీమంతిని యను పుత్రిక పుట్టెను. జ్యోతిష్కు లామెకు వైధవ్యము వచ్చునని జెప్పిరి. ఇతడామెను చంద్రాంగదుడను రాజపుత్రున కిచ్చి పెండ్లిచేసి ఇల్లరిక ముంచుకొనెను. ఒకనాడు చంద్రాంగదుడు పడవపై సముద్రములో వెళ్లుచుండ పెనుగాలికి

ఓడ ముక్కలై పోయెను. ఇతడు మునిగి పాతాళమునకు బోయి చిత్రవర్మ స్నేహితుడైన నాగేంద్రునిచే గానుకలు బొంది తిరిగి వచ్చెను. (స్కాంద, బ్రహ్మో)

చిరుతొండడు : కాంచీనగరమున నొక వైశ్యుడు. పూర్వజన్మమున తుంబురుడు. దూర్వాసుని శాపవశమున నిట్లు జన్మించెను. ఇతనిభార్య తిరువెంగణాంచి. కొడుకు సిరియాళుడు. వీరు శివ భక్తులు. వీరి భక్తిని పరీక్షింప పార్వతీ పరమేశ్వరులు వృద్ధ దంపతుల రూపమున వచ్చి వ్రత ఉద్యాపన పేర అతని కుమారుని మాంసమును మీ దంపతు లిరువురు ఇష్టముతో వండి పెట్టవలెనని, అట్లే జేసి వడ్డించిన బిదప బుత్రులు లేని ఇంట భుజింపము అనిరి. వారి పనుపున అతడు సిరియాళాయని గుమారుని బిలువ అతడు వీధిలో నుండి వచ్చి వారికి నమస్కరించెను. పార్వతీ పరమేశ్వరులు వారి భక్తికి మెచ్చి వారికి శాప విమోచనము కల్గించిరి.

చిత్రోత్పల : మహానదికి ఉపనది.

## ఛ

ఛాయ : సూర్యుని భార్యయైన సంజ్ఞ, అతని తేజస్సును తాళలేక తన ఛాయను దీసి అతని వద్దనుంచి పుట్టింటి కేగెను. సూర్యునికి భేదము దెలియక ఛాయతో గాపురము జేయుచుండెను. ఈమెకు శ్రుతకర్మ, శృతశ్రవుడు, శని, సావర్ణి బుట్టిరి. ఒకనా డీమెకును సంజ్ఞ పుత్రునకు వివాద మయ్యెను. అతడీమెను కాలితో తన్నెను. అతని పాదము విరిగి నేలబడునని యామె శపింప ఇతడు తండ్రితో తన సవతితల్లి తన్న నాదరణ జేయుచున్నదని జెప్పెను. అప్పుడు సూర్యునకు నిజము దెలిసెను. (మార్క)

## జ

జంబూద్వీపము : మేరు పర్వతమునకు దక్షిణమున గల ద్వీపము.

అందున్న జంబూవృక్షమును బట్టి ఈ పేరు వచ్చెను. ఈ వృక్షము నకు సుదర్శనమనియు పేరుకలదు. కాన దీనికి సుదర్శనద్వీప మనియు పేరు వచ్చెను. ఇందు వర్షములనుపేర తొమ్మిది ఖండములుకలవు. అవి ఐరావతము, హైరణ్మయము, రమణకము, ఇలావృతము, భద్రాశ్వము, కేతుమాలము, హరివర్షము, భారత వర్షము అను నవి. (భార)

జంబూనది : జంబూవృక్ష ఫలములు రాలి వాని రసములు నదియై ప్రవహించెను. ఈ నది నీరుసోకిన చోటెల్ల బంగార మగును. ఈ నీరు త్రాగిన వారికి ముదిమియు, దప్పియు, వ్యాధియు నుండవు. (భార)

జగన్మోహిని : పాల సముద్రమందు అమృతము బుట్టిన పిదప రాక్షసులా అమృతమును గ్రహింపకుండ వారిని సమ్మోహితులను జేసి దేవతలకే అంతయు బంచిపెట్టుటకై నారాయణుడు స్త్రీరూప మొంది జగన్మోహినిగా యవతార మెత్తెను. శివుడు ఈమెను జూచి మోహించి ఈమెతో రతి సల్పెను. అపు డీమెకు వచ్చిన చెమటయే గండకీనది యయ్యెను.

జబాల : ఒక బ్రాహ్మణుని భార్య. సత్యకాముని తల్లి. సత్యకా ముడు విద్య నభ్యసింప బోవుచు తన తండ్రిపేరు చెప్పుమన ఆమె నేను పడుచు తనమున విచ్చలవిడిగ దిరిగితిని, నీ తండ్రి యెవ్వరో చెప్పజాలను, జబాల పుత్రుడనని చెప్పుకొను మని యాతనితో జెప్పెను.

జయ : పుష్పదంతుడను విద్యాధరుని భార్య. పార్వతికి రహస్య ముగా శివుడు చెప్పిన కథను చాటునుండి విని పుష్పదంతు డీమెకు చెప్పగా నూరకొనక ఈమె ఆకథను పార్వతికే చెప్ప, ఆమె పుష్ప దంతుని శపించెను.

జరా : (చూడుము జరాసంధుడు)

జలంధరుడు : ఒక రాక్షసరాజు. సముద్రుని కుమారుడు. కాలనేమి పుత్రికయైన వృందను వివాహ మయ్యెను. ఇతనితో యుద్ధము చేయలేక, నారాయణుడు లక్ష్మితోకూడ ఇతని యింట ఉండెను. ఇతడు పార్వతి నిమిత్తము శివునితో పోరుచుండ విష్ణువు బృందను వంచించెను. శివునిచే మడియింప బడెను. (శివ)

జలసంధుడు : మగధరాజు. దుర్యోధనుని పక్షమున పోరి సాత్యకిచే సంహరింప బడెను.

జానపది : ఒక సుందరి. శరద్వంతుని తపోభంగమునకై ఈ రూపవతి పంపబడెను. (భార)

జానశ్రుతి : జనశ్రుతి అను రాజు కుమారుని పౌత్రుడు. బ్రాహ్మణ భక్తుడు. రైక్వఋషికి తన కుమార్తెను, వేయి గోవులను, ధనమును తెచ్చి ఇవ్వగా, వాటిని పరిగ్రహించి రైక్వుడు అతనికి బ్రహ్మజ్ఞానము నుపదేశించెను. (ఛా.ఉ)

## త

తెలంగాణము : గోదావరీ కృష్ణవేణుల మధ్యగల దేశము. దీనినే త్రికలింగమనియు, తిలింగమనియు అందురు. దీని రాజధాని కోలుకొండ లేక గోల్కొండ. (సేర.పురా)

## ద

దండధారుడు : మగధరాజు. భారత యుద్ధమందు అర్జునుడు వీనిని వీని యేనుగును జంపెను. (భార)

దత్తిలుడు : ఒక సంగీత శాస్త్రకర్త.

దధ్యంగుడు : అధ్వర్యుని కొడుకు. ఇతని కింద్రుడు మధువిద్యను బ్రహ్మవిద్యను నేర్పి దాని నెవరికైన జెప్పినచో వానితల ఖండింతునని భయపెట్టెను. అశ్వినులు దధ్యంగుని తలను తీసి దాచి గుర్రము

తల అమర్చి వాని యొద్ద విద్యలు నేర్చుకొనిరి. ఇంద్రుడీతని తలను ఖండించెను. అంత అశ్వినులు వాని పూర్వపు శిరమును నతికించిరి.

**దంభుడు :** విప్రజిత్తు కుమారుడు. పుత్రులకై నితడు ఘోరముగ తపము జేయుటచే లోకము లన్నియు గంపించెను. దేవతలందరు విష్ణుమూర్తి వద్దకు పోయిరి. విష్ణువు వారి కభయమిచ్చి దంభునికి ప్రత్యక్షమై దంభుకు కోరిన వరము నిచ్చెను. దంభునకు శంఖ చూడుడను కుమారుడు పుట్టెను. (శివ)

**దంభోద్భవుడు :** ఒక రాజు. గంధమాదనముపై దపస్సు చేసి కొనుచుండిన నరనారాయణుల కడకు బోయి గర్వితుడై వారిని రణమునకు బిలచి వారితో నోడెను. (భార)

**దమఘోషుడు :** చేది దేశపురాజు. కృష్ణుని మేనత్త సాత్వతి ఇతని భార్య. శిశుపాలుడు, సాల్వుడు ఈతని పుత్రులు.

**దమని :** వాతాపి ఇల్వలుల తల్లి. హ్లాదుని భార్య. (భాగ)

**దమనుడు :** ఒక ముని. ఇతనిని సేవించి ఇతడిచ్చిన వరమువల్ల విదర్భరాజైన భీముడు దమయంతి యను కూతును దమ దాంత దమనులను పుత్రులను బడసెను. (భార)

**దముడు :** అరిందముడను రాజు పుత్రుడు. ఇతడు పూర్వజన్మ మందు యజ్ఞదత్తుడను బ్రాహ్మణుని కుమారుడు. రాజ్యమేలుచు గుడులయందు దీపారాధన చేయించుచుండెడివాడు. కాశిలో విశ్వేశ్వరుని బ్రార్థింప శివ పార్వతులు ప్రత్యక్షమైరి. ఈశ్వరుని తేజము చూడలేకుండిన వానిం జూచు శక్తిని పరమేశ్వరుడు దమున కిచ్చెను. దమునకు ముందు పార్వతి కనిపించగా ఆమెను వర్ణింప ఆమెకు కోపము వచ్చి వీని కన్ను బద్దలయ్యెను. ఇతడు భక్తుడు; పుత్రునివంటి వాడు; కరుణింపుమని ఈశ్వరుడు చెప్పెను. దృష్టి చెడకుండ వరమిచ్చి అలకాపట్టణమును దమునకిచ్చెను. (శివ)

**దర్భలు :** గరుత్మంతుడు తెచ్చిన యమృతమును సర్పముల కిచ్చుటకై సర్పములు. స్నానముచేసి వచ్చువరకు దర్భలపై బెట్టెను. అందువలననే దర్భలకు పవిత్రత కల్గెను. వీటిని నాకుట వలననే పాముల నాలుకలు చీలి రెండయ్యెను. కుమారస్వామి దర్భల మధ్యనే పెరిగెను. (భార)

**దలుడు :** సుశోభనా పరీక్షిత్తుల కుమారుడు. శలుని తమ్ముడు. శలుని మరణము తర్వాత నితడు రాజయ్యెను. శలునికడ నున్న వామదేవుడను బ్రాహ్మణుని గుర్రములు వామదేవుని కిచ్చుటకతడు నిరాకరించి ఆతనిని చంపబోయెను. అంత నా బ్రాహ్మణుని తపఃప్రభావముచే నాతని హస్తములు స్తంభించెను. అతని పుత్రుడు మరణించెను. అపుడు నగర ప్రజలు ఆ బ్రాహ్మణుని పాదములపై బడిరి. ఆ బ్రాహ్మణుని వేడుకొనుమని రాజుతో జెప్పిరి. దలుడును వామదేవుని బ్రార్థించి యతని తురంగముల నతని కిచ్చెను. (భార)

**దశార్ణ :** గాంధారి తోబుట్టువు ధృతరాష్ట్రుని భార్య.

**దశార్ణము :** ఈ పేరున రెండు దేశములు కలవు. నకులుడు జయించిన పశ్చిమ దేశము. దీనికి రాజధాని విదిశ. అశోకుని కాలమునాడు దీని రాజధాని చైత్యగిరి. తూర్పు దశార్ణము ఇప్పటి మధ్య పరగణాలు, పాట్నాలోని దేశీయ రాజ్యములు.

**దశార్ణుడు :** క్రోష్టువంశమువాడైన ధృష్టుని పుత్రుడు.

**దక్షసావర్ణి :** దక్షతనయుడు. ఇతడు తొమ్మిదవ మనువు. ఇతని మన్వంతరమున కుమారస్వామి అద్భుతుండను పేరుతో ఇంద్రుడయ్యె. మేధాతిథి, వసువు, సత్యుడు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు, సవనుడు, హవ్యవాహను డనువారు సప్తర్షులైరి.

**దక్షిణ గంగ :** (1) గోదావరి (2) కావేరి (3) నర్మద (4) తుంగభద్ర. ఇవన్నియు ఈ పేరుతో పిలువబడును.

**దక్షిణాపథము :** నర్మదకు దక్షిణమున నున్న భారత దేశము.

**దాక్షాయణ :** ప్రచేతసులు పదిమందుగురకు ఈమె ఒక్కతియే భార్య. (భార)

**దారకుడు :** ఒక బోయవాడు. పింగాక్షుని పినతండ్రి. (కాశీ)

**దాశరాజు :** సత్యవతి తండ్రి. శంతనుని మామ.

2. నిషాదదేశపురాజు. మిక్కిలి దురాచారుడైనను శివభక్తుడు. ఇతడు పూర్వభవమున యొక శునకము. మహాశివరాత్రినాడు భక్తులు శివుని గుడిలో పెట్టిన దీపమును జూచెను. బలిని తినబోగ భక్తులు కొట్టిరి. అందుచే ఉపవాస ఫలముకూడ కలిగెను. ఆ పుణ్యముచేత పూర్వజ్ఞానము కలిగి యుండెను. ఇతని భార్య కుముద్వతి. (బ్రహ్మ. స్కాం)

**దాశార్హుడు :** ఒక రాజు. కాశీరాజు కుమారిత యగు కళావతిని పెండ్లాడ ఆమె ఇతనిని పాపుడని చేర రాలేదు. ఆమె దుర్వాసుని వలన పంచాక్షరీ మంత్రముపదేశము పొందెను. ఇతడు భార్యను తన కుపదేశింపు మని కోర భార్య భర్తకుపదేశము జేయరాదని ఆమె చెప్పెను. అంత నతడు గర్గుడను మునివలన మంత్రి ముపదేశము పొందెను.

**దిక్కన్యలు :** బ్రహ్మ సృష్టి చేయదలచుకొని, ఆలోచనలో మునిగి యుండగ నతని కర్ణము నుండి పూర్వ, ఉత్తర, దక్షిణ మొదలగు దిక్కులు పుట్టిరి. మీరు తాము నిలుచుటకు తగిన స్థలము చూపుమన ఇది బ్రహ్మాండము, మీ ఇష్టమువచ్చిన చోటున నుండుడు. మీకు భర్తల నచ్చటికే పంపుదునని బ్రహ్మ చెప్పెను. వారు వెళ్ళిరి. వారు నిలచిన స్థానములకు వారి పేరులను బట్టియే పూర్వ

దిక్కు, ఉత్తరదిక్కు మొదలగు పేరులు వచ్చెను. బ్రహ్మ ఇంద్రాది దిక్పాలకుల నాయా దిక్కులకు బంపెను.

**దీర్ఘబాహుడు :** ఒక రాజు. విద్యలన్నియు నేర్చినను గర్వమధికముగ నుండెను. బ్రాహ్మణులను దూషించుచుండెను. అందువలన కొందరు బ్రాహ్మణులు నీవు పెద్దపులివి కమ్మని శపించిరి. అతని శాపాంతముగ "నీవు ఒక బ్రాహ్మణుని తినబోవ ఆ బ్రాహ్మణుడు నారాయణుని స్మరించగనే నొక బోయవాడు నిన్ను చంపును. ఆ నారాయణ నామమువలన నీకు శాప విమోచన కలుగు" ననిరి. అట్లే రాజు పులియై అరుణి అను మునిని దినబోవగ నాతడు నారాయణ అని స్మరించుచు పారిపోగ ఆ పులియు బోయవానిచే గొట్టబడియె. అప్పుడీరాజుకు శాపవిమోచన మయ్యెను.

**దీర్ఘశ్రివసుడు :** ఉశజుని కుమారుడు. ఒక ముని ఐనను ఇతడు వర్తకము చేసెను.

**దీర్ఘాయువు :** అయుతాయువు కుమారుడు. అర్జునునితో పోరి ఓటువడియెను. (భార)

**దుందుభి :** ఒక గంధర్వకాంత. ఈమెను, కుబ్జరూపమున మందర యను పేర భూలోకమున జన్మించి, దేవకార్యములు నిర్వహించుమని పరమేష్టి పంపెను. (భార)

**దుర్గుడు :** ఒక రాక్షసుడు. వాడు బాధపెట్టుచుండగ మును లీశ్వరునితో జెప్పిరి. ఈశ్వరుడు పార్వతితో జెప్ప ఆమె వింధ్యకుబోయి తపస్సుచేసి కాళరాత్రియను శక్తిని వాని కడకు పంపగా వాడు ఆ శక్తిని బంధింపబోయెను. అంత శక్తి పార్వతికడకు పరుగిడి వచ్చెను. ఆమెను తరుముకుని వచ్చిన దుర్గునితో పార్వతి యుద్ధము జేసి సంహారించెను. (కాశీ)

**దుర్జయ :** దనువు కుమార్తె. (భార)

**దుర్జయలింగము :** డార్జిలింగ్. ఇచ్చట మహా దేవాలయము కలను.

**దుర్దమ్నుడు :** ఒక బోయవాడు. యుధాజిత్తుతో భరద్వాజాశ్రమమునకు బోయెను. (దే. భా)

**దుష్టబుద్ధి :** కుంతల దేశపు రాజు మంత్రి. ఇతనికి విషయ యను కూతురును మదనుడను గుమారుడు కలరు. చూ॥ చంద్రహాసుడు. (జై. భా)

**దృఢధన్వుడు :** ఒక రాజు. ఉత్పలావతి తండ్రి. (మార్క)

**దృఢరథుడు :** 1. గాంధారీ పుత్రుడు. 2. కక్షేయుని వంశస్థుడు. జయద్రథుని కుమారుడు.

**దృఢాయువు :** ఊర్వశీ పురూరవుల పుత్రుడు.

**దృహి :** శర్మిష్ఠయందు యయాతికి పుట్టిన కొడుకు. తన ముసలితనమును తీసుకొనలేదను కోపమున ఇతడును, ఇతడి వంశస్థులు రాజ్యార్హులు కారనియు, ముదిమి రాకుండగనే చనిపోదురని యయాతి శపించెను. (భార)

**దేవకుల్య :** గంగ కూతురు. (భార)

**దేవబండారము :** గుజరాతునందలి డయ్యు.

**దేవగిరి :** నిజాము (సంస్థానము) నందలి దౌలతాబాదు. 2 ఆరావళీ పర్వత పంక్తులలో ఒక భాగము.

**దేవతాజిత్తు :** సుమతి యొక్క కుమారుడు. ఇతడు ధేనుమతిని పెండ్లాడెను. కొడుకు పరమేష్ఠి. (భాగ)

**దేవదత్తుడు :** ఇతడు పుత్రార్థియై యజ్ఞము జేయుచుండెను ఆ యజ్ఞమందు గోబిలుడు ఉద్గాత. దేవదత్తుడు అతడిని మూర్ఖా యని తిట్టెను. ఇతనికి కుమారుడు పుట్టి మూర్ఖుడై యుండెను. అత డెల్లప్పుడును సత్యము చెప్పుటచే సత్యవ్రతుడను పేరు వచ్చెను.

దేవద్యుతి : సుమిత్రుడను ముని కుమారుడు. మాఘ ఏకాదశినాడు విష్ణుమూర్తిని స్తుతించి యాతని జూడగలిగెను. చిత్రసేనుడను రాజు పాపకర్మలచే పిశాచముకాగ నతనిని జూచి వానికి విష్ణు మహాత్మ్య మెరింగించెను.

దేవరూపిణి : ఒక శిల. ధర్మవ్రత యను నామె శాపవశమున శిలయై యీ పేరును పొందెను. గయాసురుడు కదలకుండగ ఈ శిలను వాని శిరముపై బెట్టి విష్ణువు దీనిపై నెక్కి నిలుచుండెను.

దేవశర్మ : ఒక ముని. ఇంద్రుడీతని భార్యయైన రుచిని కామించి తిరుగుచుండెను. దేవశర్మ యాగార్థ మరుగుచు నింద్రుని వలన భయము లేకుండ భార్యను గాపాడుచుండుమని తన శిష్యుడు విపులుని నింటియొద్ద ఉంచెను.

దేవాపి : చూ ఆర్ష్టిషేణుడు.

దేవి : ప్రహ్లాదుని భార్య, విరోచనుని తల్లి. (భాగ)

దేవిక : ధర్మరాజు భార్య. యౌధేయుని తల్లి. (భార)

దేవుడు : ఒక మనువు. ప్రజాపతి తండ్రి. (భార)

ద్రవిళుడు : ఒక దనుజుడు. వీ డుగ్రసేనుని భార్యను వలచెగాని, ఆమెను పొందలేక యుగ్రసేనుని రూపు ధరించి స్నానమునకు వచ్చిన యామెతో రమించెను. ఆమె తరువాత వాడు దనుజుడనియు, తన్ను మోసగించెననియు తెలిసి వానివలన జన్మించిన వాడు దనుజుడై వారి వంశమున జన్మించినవానిచే మరణించునని పల్కెను. ఆ దనుజునివలన కంసుడు బుట్టెను. (హరి)

ద్రుమసేనుడు : ఇతడు యుద్ధములో కర్ణుని కుమారుని చంపుటచే కర్ణుడీతని జంపెను. (భా౦)

ద్రుమిళుడు : కన్యాకుబ్జ దేశమండలి యొక గోపకుడు. ఇతని

భార్య కళావతి. బ్రహ్మచే శూద్రయోనిం బుట్టుమని శపించబడిన ఉపబర్హణుడు కళావతి గర్భమున జన్మించెను.

## ధ

**ధన్య :** 1. ధృవుని భార్య. శిష్టుని తల్లి. (మత్స్య)
2. దక్షుని మనుమరాలు. స్వధకూతురు. మేనక, కళావతి తోబుట్టువులు.

**ధనకటకము :** ధరణికోట. కృష్ణా గుంటూరు మండలముల సమీపమున గలదు. ఆంధ్రభృత్యులయు, శాతవాహనులయు రాజధాని. మహాయాన బౌద్ధకర్త యగు నాగార్జునుని విశ్వవిద్యాలయమునకు నిలయము.

**ధనుష్కోటి తీర్థము, ధనుతీర్థము :** రామేశ్వరమునకు తూర్పు కొనయందు లక్ష్మణుని ధనుస్సు కొనచే త్రొలవబడిన దగుటచే నీ పేరు వచ్చెను. రామేశ్వరాలయమునకు పండ్రెండు మైళ్ళ దూరమున కలదు.

**ధర :** ద్రోణుని భార్య. విష్ణుమూర్తికై ఈ దంపతులిద్దరు తపము జేసినను ప్రత్యక్షము కాకుండుటచే వీరు అగ్నికుండమందు బడిరి. ముందు జన్మమున విష్ణు వీమె కుమారుడగునని ఆకాశవాణి పల్కెను. ఈమె మరుజన్మమున యశోదగా పుట్టెను. (బ. వై.)

**ధరణి :** దక్షుని భార్య. బ్రహ్మ వామాంగుష్ఠమున బుట్టిన స్త్రీ. దితి, అదితి మొదలగు నేబదిమంది కూతులును, వేవురు పుత్రులును బుట్టిరి. (భార)

**ధరాపుత్రుడు :** శుక్రుని పుత్రుడు (భార)

**ధరుడు :** అష్టవసువులలో నొకడు. ధూమ్ర ప్రజాపతుల కుమారుడు. ఇతని భార్య కల్యాణి. ద్రవిణుడు, హుతహవ్యుడు ప్రాణుడు, హవ్యవహుడు, రమణుడు, శిశిరుడు ఇతని కుమారులు.

(మత్స్య, భార)

**ధర్మకీర్తి :** ఒక చంద్రవంశపు రాజు. దేశము సధర్మముగ బాలించుచుండెను. ఒకనాడు వేటకు బోయి మార్గము దప్పి తన పరివారమును వెదకుచూ రేవా తీరమునకు వచ్చి యచ్చట నేకాదశీ వ్రతము జేయువారిని జూచి తానును చేయగా నతనికి పుణ్య లోకములు వచ్చెను. తరువాతి జన్మమున నితడు భద్రశీలుడను నామమున గాలవుడను వాని పుత్రుడుగ బుట్టెను.

**ధర్మపట్టణము :** ఉత్తరకోసల రాజధాని యగు శ్రావస్తికి పేరు.

**ధర్మగుప్తుడు :** సత్యరథుడను రాజు కుమారుడు. ఇతని బాల్యమున తండ్రి యుద్ధములోనను, తల్లి మొసలి ఈడ్చుకొని పోవుట చేతను మరణించిరి. ఈ ఏడ్చుచున్న బాలుని ఒక బ్రాహ్మణ స్త్రీ కౌండిల్య నగరమునకు గొంపోయి తన కుమారునితో పాటు చదువు చెప్పించెను. ఇతడు చిత్రరథుడను గంధర్వరాజు కూతును ప్రేమించి పెండ్లాడెను. అతని మామ సహాయముచే తన తండ్రిని సంహరించిన దుర్మరషునిపై దండెత్తి గెలిచి రాజయ్యెను. (బ్రహ్మ. స్కాంద)

**ధాతకి :** పుష్కర ద్వీపమునకు రాజైన సవనుని పుత్రుడు. ఇతనిని బట్టియే ఆ ద్వీపమునకు ధాతకీ ఖండమను పేరు వచ్చెను, (బ్రహ్మ)

**ధుంధుమారుడు :** 1. బృహదశ్వుని కుమారుడు. ఇతని పేరు కువలాశ్వుడు. ధుంధువను రాక్షసుని జంపుటచే నీ పేరు వచ్చెను. ధుంధువు ఉత్తంకుని ఆశ్రమమునకు సమీపమునుండి తపోభంగము కలుగజేయుచుండ నతడు బృహదశ్వుని శరణు వేడెను. బృహదశ్వుడు తపోవనమునకు పోనుద్యుక్తుండై యుండి శరములు ముట్టక యుండగోరి రాక్షస సంహారమునకై తన కుమారుని బంపెను. ధుంధుమారుడు ఉత్తంకుని సహాయముచే దనుజుని సంహరించెను.

2. ఒక హైహయ రాజు. ఇతడు వేటకు బోయి మృగమను కొని ఒక మునికుమారుని జంపి కడు చింతించి ఇంటికిబోయి తన వారితో జరిగిన వృత్తాంత మెరిగించెను. వారు ఈతనిని తార్క్ష్య డను ముని యాశ్రమమునకు గొంపోయి సమస్తమును తెలిపి దానికి ప్రతీకారము తెలుపుమనిరి. తార్క్ష్యుడు తన ఆశ్రమమున మృతి యనునది యుండబోదని తన కుమారుని పిలిచెను. ఆ వచ్చిన కుమా రుడే రాజుచే చంపబడినవాడు. ఆ బాలుడెట్లు మరల బ్రతికెనని ధుంధుమారుడు అడుగ సచ్ఛీలత్వమే కారణమని ముని చెప్పెను.

ధూతపాప : ఒక నది. పంచనదములలో ఒకటి. వేదశిరుడను మునికి ఒక అప్సరస పుట్టినది. ఈమె తండ్రి అనుజ్ఞ వడసి బ్రహ్మకొరకు తపస్సుచేసి తన నన్ని పదార్థములకన్న పవిత్రమైన దానిగ జేయు మని బ్రహ్మను కోరి సర్వ తీర్థములలోను పావని అయ్యెను. ఈ మెను ధర్ముడు కామించగా, తాను స్వతంత్ర కాదనియు తన తండ్రి అనుజ్ఞ వేడుమని ఆమె చెప్పెను. కాని ధర్ముడు అంగీకరింపక తన్ను గాంధర్వమున కలియుమని బలవంతముజేయ ఆమె ధర్ముని నదికమ్మని శపించెను. ధర్ము డీమెను శిల కమ్మని ప్రతి శాప మిచ్చెను. అంత ఆమె తండ్రి ధర్ముని శాపము తప్పదని చెప్పి "నీవు చంద్రకాంత శిలవయి చంద్రోదయము తరువాత నదము వగుదువు. అపుడు ధర్ముడు నీకు భర్త యగు"నని చెప్పెను. (కాశీ).

## న

నందిని : వశిష్టుని హోమధేనువు; దక్ష ప్రజాపతి పుత్రియైన సురభి దీని తల్లి. కశ్యపుడు తండ్రి. దాని పాలు త్రావిన వారు ఏడువేల సంవత్సరములు జరామరణములు లేక యుందురు. వసువులొకసారి నందినిని తస్కరించిరి.

నాగ్నజితి : కోసల దేశాధిపతియైన నగ్నజితి కుమారిత. ఈ రాజు తన నగరమునందు ప్రజలకపకారము జేయు వృషభములను బట్టిన వానికి తన కూతు నిత్తునని ప్రకటించెను. కృష్ణు డావృషభములను వధించి నాగ్నజితిని పరిణయ మయ్యెను. ఈమె కృష్ణుని అష్ట భార్యలలో నొకతె.

నాచికేతుడు : 1. వాజశ్రవసుని కొడుకు.

2. ఔద్దాలకి యను ముని పుత్రుడు.

నాడీజంఘుడు : ఒక బకము. బ్రాహ్మణు డొకడు దుర్మార్గుడై స్వధర్మము వీడి బోయవనితను పెండ్లాడి, మద్య మాంసములు భక్షించుచు ధనము కొరకు తిరుగుచుండెను. ఒకనాడు వీడు మత్తకరి తరుముకొని రాగ పరుగిడి మర్రిచెట్టుక్రింద దాగుకొనెను. అచ్చటకు నాడీజంఘుడు వచ్చి అతనికి ఆతిథ్య మిచ్చి ఆ బ్రాహ్మణుని మధువ్రజ పురమున విరూపాక్షుడను దనుజుని వద్దకు ధన మిచ్చునని చెప్పి పంపెను. దనుజు డిష్టము లేకున్నను మిత్రుడగు నాడీజంఘుని మాట తీసివేయలేక బ్రాహ్మణునకు ధన మిచ్చెను. బ్రాహ్మణుడా ధనముతో బకము వద్దకు వచ్చి భార మచ్చట దింపి నిదురపోగా బకము సేవలుచేసి పిదప తానును నిదించెను. అంత బ్రాహ్మణుడు లేచి నిద్రపోవుచున్న బకమును జంపి తినెను. మరునాడు విరూపాక్షుని కడకు యథాప్రకారము నాడీజంఘుడు రాకపోవుటచే విరూపాక్షుడు దూతలద్వారా విషయము తెలిసికొని ఆ బ్రాహ్మణుని పట్టి తెప్పించి అతనిని భక్షింపు మని తన శునకములకు ఆనతిచ్చెను. వాడు కృతఘ్నుడు కాన వానిని శునకములు కూడ ముట్టలేదు. విరూపాక్షుడు తన మిత్రుని కళేబరమును జితిపై పెట్టించి యుండ నింతలో ఇంద్రుడు వచ్చెను. నాడీజంఘుడు బ్రహ్మకు మిత్రుడగుటచే బ్రహ్మ కొంపోయెనని

ఇంద్రుడు చెప్పెను. ఆ చితి సమీపమున సురభి దూడకు పాలిచ్చు చుండ ఆ దూడ మూతిపైని నురుగు చితిపై బడినంతనే నాడీ జంఘుడు లేచి వచ్చెను. అది బ్రహ్మ ప్రభావమే యని వారు తెలిసికొనిరి. నాడీజంఘుడు బ్రాహ్మణుని విడిపించి ధనము నిచ్చి పంపెను. నాడీజంఘుడు, అతని మిత్రుడు సుఖంబున నుండిరి.

నిచుళపురము : మద్రాసు రాష్ట్రమందలి తిరుచునాపల్లి.

నితంతుడు : ఒక రాజర్షి. సాల్వేయుడు, శూరసేనుడు, శ్రుత సేనుడు, బిందుసారుడు, అతిసారుడు ఇతని కుమారులు. వీరందరును అజిత యను నొక కాంతనే వివాహమాడిరి.

నీతిశాస్త్రము : శుక్రనీతి శాస్త్రము. శుక్రుడను మహర్షి రచించి నది. వేయి అధ్యాయములు గల గ్రంధము. కృత యుగమున ఎవరి ధర్మము వారు నడపుకొనుచుండిరిగాన ధర్మరక్షణకు రాజు యొక్క అవసరమే లేకుండెను. ఆకాలమున రాజు లేడు. తరువాత యుగములందు ప్రజలు స్వార్ధపరులై ధర్మము తప్పినందున విష్ణువు నూరువేల అధ్యాయముల నీతి శాస్త్రమును ప్రజల ఏలుబడికై ఇచ్చెను. విరూపాక్షుడు దానిని పదివేల అధ్యాయములకు, ఇంద్రుడు ఐదువేల అధ్యాయములకు, బృహస్పతి మూడువేల అధ్యాయము లకు కుదించి తిరుగవ్రాసిరి. శుక్రుడు వీనినింకను కుదించి వేయి అధ్యాయములకు వ్రాసెను.

నీల : మిథిలా నగరములో నున్న కుంభకుడను గొల్లవాని కూతురు. కృష్ణుని భార్య.

నీలధ్వజుడు : మాహిష్మతీ పురాధిపతి. ఇతని పెద్దభార్య జ్వాల యందు కలిగిన స్వాహా యను కుమార్తెని అగ్నిని స్వయంవరమున వరించెను. నీలధ్వజుడు ధర్మజుని యాగాశ్వమును కట్టివేసెను.

అగ్ని అర్జునునికి, నీలధ్వజునకు సఖ్యము కుదిర్చి యాగాశ్వమును విడిపింప జూచెను. నీలధ్వజుని రెండవ భార్య "పట్టిన యశ్వము నట్లిత్తురా? అది క్షత్రియ పౌరుషమా" అని ఆక్షేపించెను. అంత నీలధ్వజుడు మరల యుద్ధము చేసెను. కాని ఓడిపోయి గుర్రము నిచ్చెను. పౌరుషహీనుడని నిందించి రెండవ భార్య పుట్టినింటికి పోయెను. (జై.భా)

నీలాచలము : 1. పూరి యందలి జగన్నాథుని ఆలయము గల ఒక కొండ. 2. అస్సాము నందలి గౌహతిలో కామాక్షీ దేవి వేంచేసిన ఆలయము గల ఒక కొండ. 3. హరిద్వారము నందలి కొండలకు కూడ ఈ పేరే కలదు.

పంచనదము : (1) ధూతపాప, కిరణానది, ధర్మనది, గంగ, యమున నదులు కలిసి పంచనద మనబడును.

పంజాబు : (2) శతద్రు, విపాశ, ఇరావతి, చంద్రభాగ, వితస్త అను అయిదు నదులున్న దేశము.

పంచకేదారము : కేదారనాథము, తుంగనాథము, రుద్రనాథము, మధ్యమేశ్వరము, కల్పేశ్వరము అనునవి హిమవత్పర్వతభాగము లందుండును. ఇవన్నియు కలిసి పంచకేదార మనబడును. అర్జునునికి భయపడి పారిన సదాశివుడు, కేదారనాథమున మహిష రూపము ధరించి దాగుకొనెను. వాని భయమున ముందుభాగ మును భూమిలో దాచుకొనినందున ఈ పుణ్యస్థలమున వెనుక భాగమునే పూజింతురు. మిగిలిన శరీరభాగములు మిగత నాలుగు చోట్ల అనగా తుంగనాథమున బాహువులు, రుద్రనాథమున ముఖము, మధ్యమేశ్వరమున నాభి, కల్పేశ్వరమున జటలు పూజింతురు.

పంచప్రయాగ : (1) దేవప్రయాగ, (2) కర్ణప్రయాగ, (3) రుద్ర

ప్రయాగ, (4) నంద ప్రయాగ, (5) విష్ణు ప్రయాగ. ఈ పంచ ధారల సంగమమే గంగానది అనబడును.

పంచతీర్థము : (1) అమృత కుండము, (2) తప్త కుండము, (3) సీతా కుండము, (4) రామ కుండము, (5) సూర్య కుండము లను నీ అయిదు సరస్సులను కలిపి పంచతీర్థ మందురు.

పద్మ : అనరణ్యుడను రాజు కూతురు. ఈమె నరణ్యములో జూచిన ముసలి మునియైన పిప్పలాదుడు రాజుకడకు బోయి ఆమెను తనకిమ్మనెను. రాజు భయపడి అతనికి తన కూతునిచ్చి వివాహము చేసెను. ఒకనాడు ధర్ముడు నృపరూపమున పద్మకడకు వచ్చి ఈ ముసలివాడు నీ చక్కదనమునకు తగడు; వానిని విడువుము, నిన్ను నా రాణిని చేసెదనని పలుక నామె వీనికి బుద్ధి చెప్పెను. ఆమె పతిభక్తికి మెచ్చి ధర్ముడు నిజ రూపము చూపించి ఆమెకు వరము లిచ్చెను.

పద్మక్షేత్రము : కోణార్కము. పూరికి సమీపమున నున్నది. కుష్ఠురోగ నివృత్తిని పొంది కృష్ణుని కొడుకగు సాంబుడిక్కడ సూర్య దేవాలయమును నిర్మించెను.

పద్ముడు : ఒక నాగరాజు. మహాపద్మమను మడుగు తీరమున నుండువాడు. ఇతడు సూర్యుని రథమును లాగుచుండెడివాడు. భృగుమహర్షి ఈతని వద్దకు ఆత్మతత్వము తెలిసికొనగోరి వచ్చెను. పద్ముడతనికి తాను చూసిన విశేషములను చెప్పెను. "సూర్యుడే వర్షములు కల్పించి సూర్యుడే జలముల శోషింపజేయును. సర్వ శక్తులతనియందే యుండును. ఆకాశమున కనబడిన ఒకానొక జ్యోతి ఒకటి సూర్యుడు దగ్గరవగనే అతనియందు ప్రవేశించెను. సూర్యుడు ఆజ్యోతి - ఉంఛవృత్తి యను బ్రాహ్మణునిదని. అతని

మహాత్మ్యమును తెల్పెను." అని పద్మ్ముడు చెప్పెను. ఆత్మ తత్వము చెప్పితివి, ఇదియే నే గోరితినని భృగుడు చెప్పి చనెను. (భార)

పరసువు : ఒక రాక్షసుడు. కామరూపి. బ్రాహ్మణ హంతకుడు. వీడొక నాడు బ్రాహ్మణ రూపమున శాకల్య ముని యాశ్రమము లోనికి వెళ్ళి నా కాకలి యగుచున్నది, ఆహారము పెట్టుమని కోరెను. రాక్షసుడు అతను వడ్డించినదానితో తృప్తిపడక, మునిని మ్రింగబోగ ఆ ముని వేయి తలలు, రెండువేల చేతులు కలవానిగ రాక్షసునకు కనపడెను. పరశువు భయపడి తనకు జ్ఞానమిమ్మని మునిని ప్రార్థింపగ గౌతమీనదిలో స్నానముచేసి సుస్వతిని ప్రార్థింపుమని శాకల్యముని చెప్పెను. (బ్రహ్మ)

పర్ణాదుడు : ఒక బ్రాహ్మణుడు. నలుని వెదకుటకై దమయంతి చేత పంపబడినవాడు. (భార)

పాణి ప్రస్థము : దుర్యోధనుని ధర్మరాజడిగిన అయిదు గ్రామము లలో నొకటి. మిగిలినవి శోణప్రస్థము, ఇంద్రప్రస్థము, తిలాప్రస్థము, భగప్రస్థము.

పాపఘ్ని : నందిదుర్గ పర్వతములలో పుట్టు దక్షిణ పినాకిని.

పాపప్రణాశనము : ఒక తీర్థము. ధృతవ్రతుడను బ్రాహ్మణుడు మరణింప నతని భార్య మహి సనజ్జాతుడను కుమారుని గాలవుని ఆశ్రమమందు వదిలి స్వైరిణి అయ్యెను. కుమారుడు దుర్వృత్తుడై చివరకు తల్లినే కలిసి సుఖించెను. తరువాత మాతాసుతులని తెలిసి దుఃఖించి గాలవుని ఉపదేశముచే గౌతమిలో స్నానముచేసి ముక్తి నొందిరి. ఆచోటే పాప ప్రణాశనము.

పింగాక్షకుడు : ఒక బోయవాడు. ఎన్నడు జీవహింస చేయక ధర్మపరుడై యుండెను. పరోపకారము చేయుటలో మరణించినందున వీనికి పుణ్యలోకము వచ్చెను. ఇతడే నిరృతి యయ్యెను. (కాశీ)

పిప్పలాదుడు : (1) దధీచి కుమారుడు. లోపాముద్ర పిప్పల వృక్షముల క్రింద ఆమె ఇతనిని కని మరణించగా ఆ వృక్షములే శిశువును పెంచినందున వానికా పేరు వచ్చెను.

(2) పిప్పలాదుని తల్లి సువర్చ. దధీచి భార్య. దధీచి తన ఎముకలను దేవతల కిచ్చుటకై ప్రాణములను వదిలినప్పుడు సువర్చ గర్భవతి. ఆమె సహగమనము చేయగోరెను. అశరీరవాణి ఆమె గర్భమందు బాలుడున్న విషయము చెప్పి వారించెను. అయినను ఆమె చితినెక్కెను. అప్పుడు పిప్పలాదుడు పుట్టెను. అతడు దేవతలపై పగతీర్చుకొనుటకై శివుని సహాయమున కృత్య యను శక్తిని పంపెను. దేవతలు శివుని శరణు వేడిరి. శివుడు పిప్పలాదుని ఓదార్చి, కృత్యను బడబానల రూపమున గంగలో ఉంచెను. ఆమె దానిని యమునా సరస్వతులలో నుంచెను. ఆ దరకు భరించలేక మువ్వురూ సముద్రమునకు తీసుకొని పోయిరి. పిప్పలాదుడు అనరణ్యుని కూతురైన పద్మను పెండ్లాడెను. (శివ)

పీవరి : (1) విభ్రాజులను దేవతల పుత్రిక. శ్రీశుకు డీమె భర్త. (దే.భా., మత్స్య)

(2) వేదశిరుని భార్య.

పుండరీకక్షేత్రము : పాండుపురము. జైమిని ప్రతిష్ఠించిన మహాదేవలింగ మొకటి యిచ్చట కలదు.

పుండరీయము : పూర్వరమునందలి శత్రుంజయ పర్వతము. జైనుల పవిత్ర పర్వతము లైదింటిలో నొకటి.

పురుషపురము : పెషావరు. గాంధార దేశపు రాజధాని. కనిష్కు డిచ్చట పెద్ద గోపురమును కొయ్యతో నిర్మించెను. దాని శిథిలములు నేటికిని కానవచ్చును.

పురంజనుడు : ఒక రాజు. విజ్ఞాతుడను వానికి మిత్రుడు. ప్రమ

దోత్తమ యను దానిని పెండ్లాడెను. ఆమె హిమవత్పర్వత దక్షిణ సానువులందు రమణీయ కాంచనమయ వివిధ గృహములతో మించు నవద్వారములు కలిగిన పురమునకు రాణి. పురంజనుడు తన రాణియే పరమార్థముగ జీవించుచుండెను. ఇట్లుండగా చండవేగుడను గంధర్వుడు గంధర్వసేనతో ఈ నగరముపై బడెను. పురాధ్యక్షుడు ప్రజాగరుడను వాడు గంధర్వరాజును ఓడించెను. అచిరకాలముననే భయుడను యవనేశ్వరుడును, కాలపుత్రికయును ఈతని పురమును ప్రవేశించిరి. పురంజనుడు కాలపుత్రికి వశుడయ్యెను. ప్రజ్వారుడను భయుని సోదరుడు నగరమును తగులబెట్టెను. పురంజనుడు పురము విడిచి ఇతరచోట్ల జీవించి చివరకు భార్యనే తలుచుకొనుచు ప్రాణములు విడిచెను. పూర్వమున ఇతనిచే హింసింపబడిన యజ్ఞపశువులు నరకలోకమునకు వచ్చిన ఇతనిని కఠారములతో నరికెను.

**పౌండ్రక వాసుదేవుడు :** కరూశాధిపతి. పౌండ్రకుని కృష్ణుడు యుద్ధములో వధించెను. (భార)

**పౌష్య మహాదేవి:** పౌష్య మహారాజు భార్య. (భార)

**ప్రదేషిణి :** దీర్ఘతముని భార్య.

**ప్రవాహణుడు :** జీబలుని పుత్రుడు. రాజర్షి. ఉద్గీథజ్ఞానము కలవాడు. "జీవము మేఘరూపమై జలరూపమై ఓషధులై జీవులచే భక్షింపబడి తిరిగి జన్మలొందును. అవి పోవును." అని శ్వేతకేతుని తండ్రికి జ్ఞానబోధ చేసెను. (ఛాం.ఉ.)

**ప్రస్రవణగిరి :** (1) గోదావరి యొడ్డున జనస్థానమునందలి పర్వతము. ఈ కొండలలో ఒక శిఖరముపైననే జటాయువు నివసించెను. (2) నేటి ఆనగొంది సమీపమున గల కిష్కింధయందు తుంగభద్రాతీరమున మరియొక ప్రస్రవణగిరి యున్నటుల రామాయణమున చెప్పి యున్నది. దీనినే మలయ వనగిరి అనియు అందురు.

ప్రియ : దక్షుని కుమార్తె. బ్రహ్మ కీయబడినది. ఈమెయందు నారదు డుదయించెను.

బ

బకదాల్భ్యుడు : ఒక ముని. ధర్మరాజు అడవిలో దుఃఖించుచుండగా అతని నోదార్చెను.. (భార)

బలహరి : తుంగభద్రానదికి దక్షిణమునగల నేటి బళ్ళారి.

బాలధి : ఒక ముని. చిరంజీవి యగు మేధావి అను పుత్రుని, దేవతల వేడి పడసెను.

బాహువు : వృకుని కుమారుడు. సగరుని తండ్రి (విష్ణు)

బిందు సరోవరము : స్వాయంభువు తన కుమార్తెకు తగిన వరుని వెదకుచు తిరిగి తిరిగి కర్దముని జూచి మిక్కిలి ఆనందమొందెను. ఆనంద బాష్పములు రాలి సరోవరమయ్యెను. అదియే బిందు సరోవరము. (భాగ)

బుద్బుద : ఒక అప్సరస. ఒక మునిని జూచి ఈమెయు, ఈమె చెలికత్తెలు నవహసింపగా వీరి నాతడు మొసళ్ళు కండని శపించెను వీరున్న తీర్థములకు నారీ తీర్థములని పేరు. అర్జునుడు వీనిని గట్టున పారవేయగా, వీనికి శాపవిమోచన మయ్యెను. (భార)

బేతాళుడు : పిశాచములకు నాథుడు. చూ। పుష్పదంతుడు.

బోధుడు : విశాల గ్రామమున ఉన్న బ్రాహ్మణుడు. ఇతని భార్య ప్రసవించిన శిశువును బిడాలమెత్తుకొనిపోయి, వాని స్థానమున వికారిరూపని శిశువునుంచెను. బోధుడు వానినే కొడుకని చైత్రుడని పేరుపెట్టి పెంచెను. (మార్కం)

బ్రహ్మకల్పము : సృష్టియుండాక కాలము. (బ్ర.వై)

బ్రహ్మతీర్థము : (1) బ్రహ్మ ఐదవ ముఖమును శివుడు ఖండించినపుడది పడిన ప్రదేశము. (బ్రహ్మ)

(2) రాజస్థానమునందలి పుష్కర సరోవరము.

బ్రహ్మపుత్ర : హరివర్షమందలి ఒక నది.

## భ

భనందుడు : (1) కన్యాకుబ్జము నేలిన రాజు. ఇతని కూతురు కళావతి వృషభానుని భార్య. (బ్ర.వై.)

(2) నాభాగుని కుమారుడు. ఇతని తల్లి యొక వైశ్యుని పుత్రిక యగు సుప్రభ. నాభాగుడు వైశ్య వృత్తుల నవలంబించి యుండెను. భనందుడు తల్లి కడకేగి నేనేమి చేయువాడ ననెను. ఆమె గోవును పాలించుచుండు మనెను. గోరూపధారిణియైన భూమిని రాజులు పాలించుచున్నారని అత డామెతో చెప్పెను. హిమాలయ పర్వతమున నీపునివద్ద శస్త్రవిద్య నేర్వుమనెను. ఇత డట్లు శస్త్ర విద్యలు నేర్చుకొని వెళ్ళి తన పినతండ్రి కుమారుడగు వసురాతుని తన భాగము రాజ్య మిమ్మనెను. నీవు కోమటి వైతివి. రాజ్యార్హుడవు కావు అని అతడనెను. భనందుడు యుద్ధముచేసి గెలిచి (మార్క-ం) ఆ రాజ్యమునకు రాజయ్యెను. (భాగ)

భయుడు : ఒక యవనేశ్వరుడు.

భల్లాణుడు : సింధు కటక దేశమునకు రాజు. ఇత డిష్టదానవ్రతము పట్టి ఎవరేది కోరినను ఇత్తుననియె. ఇతనిని పరీక్షింపగోరి శివుడతిథియై వచ్చి ఒక వేశ్యను కోరెను. రాజునకు నగరమం దొక్క వేశ్యయును కనపడక తన భార్యనే పంపెను. శివుడు మెచ్చుకొని నిజరూపమున ప్రత్యక్షమై వరము లిచ్చెను. (స్కాంద)

భానుకోపుడు : శూర పద్మాసురుని పుత్రుడు.

భారతి : భరతుని కూతురు. శంయుని మనుమరాలు.

భృంగి : శివుని ద్వారపాలకుడు. ఇతని సోదరుడు మహాకాళి. పార్వతి శాపమున వీరు భైరవుడుగను, భేతాళుడుగను పుట్టిరి.

భృంగి మరుసటి జన్మమున అంధకాసురుడై పుట్టి తుదకు శివుని చేరెను. (కాశి)

భ్రమి : శింశుమారుడను రాజు కూతురు. ధృవుని భార్య. కల్పుడు, వత్సరుడు ఈమె కొడుకులు. (భాగ)

## మ

మందరము : క్షీరసాగర మథనమందు కవ్వముగా నుపయోగింప బడిన ఒక పర్వతము. (భాగ)

మదయంతి : కల్మాషపాదుని భార్య. ఈమె అశుచిగ నుండిన వారికి కనపడదు. ఈమె నుండియే ఉదంకుడు కుండలముల నడిగి తెచ్చి గౌతమునికిచ్చెను. కల్మాషపాదునకు సతీసంగమ మొందినప్పుడు మరణించునని శాప ముండుటచే, ఈమె వశిష్ఠునివలన అశ్మకుడను పుత్రుని కనెను.

మయరాష్ట్రము } మయరాత్రు } మీరట్. మయ తనయ యగు మండోదరి ఇచ్చట విశ్వేశ్వర మహాదేవుని పూజించెను.

మనోహర : సోముడను వసువు భార్య. వర్చసుడు, శిశిరుడు, ప్రాణుడు, రమణుడు ఈమె కుమారులు. పృథ కూతురు. (భార)

మన్యువు : భరద్వాజుని కొడుకు. భయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు కొడుకులు. రంతిదేవు డితని మనుమడు.

మర్యాద : (1) అవాచీనుని భార్య, అరిహుని తల్లి.
(2) విదేహరాజు పుత్రిక. దేవాతిథి భార్య. ఋచికుని తల్లి. (భార)

మహానది : 1) గంజాం మండలమునందలి పెద్ద నది.
2) ఒఢ్రదేశమునందలి ఒక నది.

మహానంది : కర్నూలు మండలమునందలి ఒక పుణ్యతీర్థము.

మహోకాయుడు : రావణుని ముఖ్య సేనాధిపతులలో నొకడు. (రామా)

మహాశని : ఒక రాక్షసుడు. హిరణ్యుడనువాని పుత్రుడు. శివుడు వీనిని జంపెను. (బ్రహ్మ)

మహీదాసుడు : ఒక ఋషి. పురుష యజ్ఞజ్ఞాన విశిష్టుడు. (ఛా)

మహోదధి : బంగాళా ఖాతము.

మాండకర్ణి : ఒక ముని. మహా తపశ్శాలి. (రామా)

మానిని : రాజ్యవర్ధనుని భార్య.

మానుపాదము : ఒక వృషభము. దీని చర్మముతో చేయబడిన భేరులు జరాసంధుని చైత్రకగిరి శృంగములం దుంచబడి ఆనగ రమునందెవ్వరైన ప్రవేశించినచో తమంతట తామే మ్రోగెడివి.

మార్తాండుడు : (1) సూర్యుడు. అదితికి సూర్యునివలన పుట్టిన వాడు. (మార్క)

(2) మార్తాండుడు బ్రహ్మాండము మృతి నొందినపుడు (రెండు శకలములైనపుడు) పుట్టెను. అందువలన ఆ పేరు వచ్చెను.

మాలావతి : 1) ఉపబర్హణుని భార్య.

2) కృశధ్వజుని భార్య. వేదవతి తల్లి. (బ్ర. వై)

మిత్రవింద : అవంతి దేశాధీశ్వరులైన విందాను విందుల చెలియలు. కృష్ణుని భార్య. (భాగ)

మిధి : జనకుడు.

మేఘవర్ణుడు : ఘటోత్కచుని కుమారుడు. (జై. భా)

మైత్రేయి : యాజ్ఞవల్క్యుని భార్య. అతడు తపోవనముల కేగ బోవుచు ఈమెను పిలచెను. ఈమె ఎంత ధనమిచ్చినను శాశ్వతము కాదు. మాకు శాశ్వతానందము నిచ్చుదానిని బోధింపుము అని భర్తతో ఆధ్యాత్మిక విషయములను గూర్చి వాదించెను.

## య

**యజ్ఞవరాహము :** ఒరిస్సాయందలి యజ్ఞపురము లేక జయపురము నందలి ప్రసిద్ధమైన వరాహ దేవాలయము.

**యజ్ఞపురము :** ఒరిస్సాయందలి వైతరిణీ నదీతటమున గల జయపురము అను నగరము. దీనికే యయాతి పురమనియు నామము కలదు. వైతరణి నది గట్టున గల దశాశ్వమేధ ఘట్టమున బ్రహ్మ పది అశ్వమేధములు చేయుటచే దీనికీ పేరు వచ్చెను.

**యమి :** యముని భార్య. వీరే ఆది దంపతులు. వారి కాలమున సర్వదా పగలేకాని రాత్రిలేదు. యముడు చనిపోగా ఆమె సదా, ఈ దినమే నాభర్త పోయెనని యేడ్చుచుండెను. ఎంత చెప్పినను ఆమె మరచినది కాదు. అంత దేవతలాలోచించి రాత్రిని కల్పించిరి. మరునాడు యమి భర్తను మరచినది.

**యయాతి నగరము :** ఒరిస్సా యందలి కటకమునకు నామాంతరము.

**యవద్వీపము :** జావాద్వీపము (బ్రహ్మ) పూర్వర దేశపు రాజగు అజిశకుడు మొదటగా ఈ ద్వీపమును వలసగా గొనెనుకాని అచ్చట నిలువలేక తిరిగి వచ్చెను. దీనినే సువర్ణ ద్వీపము అనియు అందురు.

**యశోధర :** హస్తికుని భార్య. వికుంఠనుని తల్లి. (భార)

**యామినీ పూర్ణతిలక :** బిల్హణుని భార్య. (భార)

**యుయుత్సుడు :** ధృతరాష్ట్రునకు వైశ్యయందు పుట్టిన కుమారుడు. పాండవ పక్షమున చేరినవాడు. యుద్ధమునందు మరణించని వీతడొక్కడే.

**యోనితీర్థము :** భీమస్థానము. ఇచ్చట భీమాదేవి ఆలయము కలదు. పురుష పురమునకు సమీపమున కలదు. యుధిష్ఠురు డిచ్చటికి యాత్ర చేసెనని అందురు.

**యోనిద్వారము :** గయలో గల బ్రహ్మయోని పర్వతము నందలి పవిత్ర స్థలము. (పద్మపు)

## ర

రంతిపురము : గోమతీ తీరమందలి ఒక పట్టణము. గోవులను దాన మిచ్చుచున్నా ఉండిన రంతిదేవుని నగరము.

రతి : ప్రజాపతి భార్య. నహుషుని తల్లి.

రత్నమాల : బలి కుమార్తె. ఈమె తరువాత జన్మమున పూతకి అయ్యెను. (బ్ర. వై)

రత్నద్వీపము : సింహళము.

రత్నపురము : దక్షిణ కోసల రాజధాని. మయూరధ్వజునియు, అతని కొడుకు తామ్రధ్వజునియు రాజధాని. అశ్వమేధయాగ సమయమున కృష్ణార్జునులతో పోరిరి. (జై. భా)

రథంతరి : దుష్యంతుని తల్లి. ఈలిసుని భార్య.

రభ్యుడు : ఒక రాజు. ఇతని భార్య రుక్మరేఖ. ఇతని పుత్రిక ఏకావళి. (దే. భా)

రమణ్వతుడు : జమదగ్ని పెద్ద కొడుకు.

రమ్యుడు : అగ్నీధ్రుని కుమారుడు. ఇతడు పాలించిన దేశము రమ్యక వర్షమనబడెను. (విష్ణు)

రసాతలము : తార్తార దేశపు పశ్చిమభాగము దీనిలో తుర్కస్థానము, కాస్పియను సముద్రపు ఉత్తరభాగము చేరి యున్నవి. ఇది హూణుల దేశము. దీనినే పాతాళము అనియు అందురు. ఈ దేశమునందలి పరగణాలను ఏడింటిని హూణులు, శకులజాతులను బట్టి 1. అతలము 2. వితలము 3. నితలము 4. తలాతలము 5. మహాతలము 6. సుతలము 7. రసాతలము (పాతాళము) అని పిలువబడుచున్నవి. రసనదిగట్టున నున్నందున దీనికీ పేరు వచ్చెనందురు. హూణులును శకులును నాగులనబడిరి. శేషుడు, వాసుకి, తక్షకుడు, అశ్వతరుడు, తిత్తిరి మొదలగు నాగుల స్థానము. ఇది దానవుల ఉనికి యనియు అందురు.

**రహూగణుడు :** సింధుదేశపు రాజు. వేదాంతము నేర్చుకొనుటకై కపిలునివద్దకు పోవుచుండెను. అతడు తన సవారిని మోయుచున్న బ్రాహ్మణుని (ఋషభుని కుమారుని) కఠినముగ దూషించెను. అంత బ్రాహ్మణుడు "రాజా! దూషణము, కోపము అనునవి శరీరమునకే కాని ఆత్మకు లేవుసుమీ" అని శాంతముగపలికి వేదాంత సారము బోధించెను. రాజు సవారి దిగి నీవే వేదాంతివని నమస్కరించెను, (భాగ)

**రాజగృహపురము :** జరాసంధుని పౌత్రుడగు మేఘనందుని రాజధాని. (భార)

**రాజపురము :** కళింగము యొక్క రాజధాని. మహేంద్ర దేవునిచే నిర్మింపబడినది. రాజమహేంద్రికి పురాతననామము. (భార)

**రామగిరి :** రాముడు శంబూకుని వధించిన చోటు. నాగపురమునకు సమీపమున కలదు.

**రామహ్రదము :** స్థానేశ్వరమున కుత్తరమునగల పవిత్ర సరోవరము. దీని మధ్యభాగమున చంద్రకూపమను నూయి కలదు. అందువలన దీనిని ద్వైపాయన హ్రదమందురు. బ్రహ్మ తపస్సు చేసిన స్థలముగుట దీనిని బ్రహ్మసార మందురు. పరశురాముడు క్షత్రియులను రూపుమాపి పితరులకు తర్పణము లిచ్చిన చోటగుటచే దీనిని రామహ్రదమందురు. కృష్ణుడు ఆడితప్పి భీష్ముని తన చక్రముచే సంహరింప బూనినందున దీనిని చక్రతీర్థమనియు అందురు. కురువు తపస్సు చేసినందున ఈ చుట్టును గల దేశమును కురుక్షేత్రమందురు. ఈ హ్రదము గట్టుననే పురూరవు డూర్వశిని తిరిగి పొందెను. మరియు ఇంద్రుడు వృత్రాసురుని వజ్రాయుధముచే సంహరించెను. (భార)

**రామణీయకము :** రామణీయము. ఆర్మీనియా దేశము.

**రామేశ్వరము :** సేతుబంధనము. భరతదేశమునకు సమీపమున

చిన్న సముద్రపు పాయచే వేరుచేయబడిన దీవి. ఇచ్చట శ్రీరా ముడు రామేశ్వరుని ప్రతిష్ఠించెను.

**రావణహ్రదము :** టిబెట్ సమీపమున హిమాలయములలో కలదు. రావణు డిచ్చట స్నాన మాచరించి కైలాసగిరియందలి మహా దేవుని, హోమకుండమను స్థలము వద్ద నుండి పూజించెడివా డందురు.

**రుక్మాంగదుడు :** సూర్యవంశపు రాజు. ఏకాదశీ వ్రతము నిష్ఠగా సలిపి పరమ భాగవతోత్తముడు అయ్యెను. ఇతని రాజధాని విదిశా పురము. భార్య సంధ్యావళి. కొడుకు ధర్మాంగదుడు.

(మార్క-౦)

**రుద్రసావర్ణి :** పంద్రెండవ మనువు.

**రోహ దేశము :** ఆఫ్గనిస్థానము. లోహ దేశము.

**రోరువము :** సౌవీర దేశపు రాజధాని.

## ల

**లవపురము :** లవకోలు లాహోరు రామచంద్రుని కొడుకు దీనిని చేసెను.

**లక్షణ :** 1) దుర్యోధనుని కుమార్తె. ఈమెను సాంబుడు పెండ్లాడెను.
2) మద్రదేశపు రాజగు బృహత్సేనుని కూతురు, కృష్ణుని అష్టభార్యలలో నొకతె.

**లక్ష్మణావతి :** గౌడదేశపు రాజధాని. గంగానది ఒడ్డున కలదు.

**లంక :** సింహళము.

**లిఖితుడు :** చూ. బాహుద.

**లాంగులిని :** శ్రీకాకుళము నగరము లాంగులీయ నది ఒడ్డుపై నిర్మింప బడియున్నది.

**లుంబినీ వనము :** నేపాల్ రాజ్యములోని తెరాయిలోని రుమెం దయ్. భగవాన్ పూర్ కుత్తరమున రెండుమైళ్ళ దూరములోను,

ఫదేరియాకు ఒక మైలు దూరములోను యిది ఉన్నది. బౌద్ధ క్షేత్రములలో నొకటి. బౌద్ధ క్షేత్రములు ముఖ్యముగా ఎనిమిది. (1) లుంబినీవనము-బుద్ధుని జన్మస్థలము; (2) బోధి వృక్షము-ఇది బుద్ధగయలోనిది. బుద్ధునికి జ్ఞానోదయమైన ప్రదేశము; (3) కాశీ వద్దనున్న మృగదావము (సారనాథ్). ఇక్కడ మొదటి పర్యాయము బుద్ధుడు బోధ చేసెను. (4) శ్రావస్తిలోని జేతవనము. ఇక్కడ బుద్ధుడు మహిమలను చూపెను (5) సంకాశ్యము. ఇది కనౌజ్ జిల్లాలోనిది. ఇక్కడ త్రైయస్ త్రింశ స్వర్గమునుండి అతడు భువికి దిగెను. (6) మగధలోని రాజగృహము. ఇక్కడ శిష్యులకు బోధ చేసెను. (7) వైశాలి. ఇక్కడ ఆనందునితో తన జీవ పరిమాణమును గూర్చి చెప్పెను. (8) కుశీనగరము. సాలవృక్షముల మధ్య నిక్కడ బుద్ధుడు మహాపరనిర్వాణము పొందెను.

**లోహా :** ప్రస్తుతపు ఆఫ్ఘనిస్థాన్ ప్రాంతము. క్రీస్తు శకము పదవ శతాబ్దమువరకు యిది హిందూరాజ్యమై యుండి పిదప మహమ్మదీయ రాజ్య మయ్యెను.

**లోహిత్య :** బ్రహ్మపుత్రానది పేరు. ఈ నదికి తూర్పునందలి ప్రాంతము. ప్రాగ్జ్యోతిష మనబడుచుండెను. (గౌహతి)

**లోహిత సరోవరము :** రావణ హ్రదము, బ్రహ్మపుత్రానది జనన స్థానము.

**లోహిత్య సరోవరము :** చంద్రభాగానది పుట్టుక స్థలము

## వ

**వంద :** ఒక అప్సరస నారీతీర్థమున మొసలియై అర్జునునిచే శాప విముక్తి నందెను. (భార)

**వజ్రాయుధము :** ఇంద్రుని ఆయుధము, దధీచిముని ఎముకవలన చేయబడినది.

**వనవాసి (బనవాసి) :** ఉత్తర కెనరా ప్రాంతము.

వన : ద్వాదశ వనములు. మధురా మండలము లేదా వజ్రమండలములోని ద్వాదశవనము లేవనగా మధువనము, తాళవనము, కుముదవనము, బదిరవనము, కామ్యకవనము, బహుళవనము, మహావనము, బిల్వవనము, లోహావనము, భాండీరవనము, భద్రవనము, బృందావనము.

కురుక్షేత్రమునం దున్న సప్తవనము లేవనగా కామ్యకవనము, అదితివనము, వ్యాసవనము, ఫలకివనము, సూర్యవనము, మధువనము, సితివనము.

వహాయు : అరేబియా.

వత్స్యదేశము : అలహాబాదుకు పడమరనున్న ప్రదేశము. కౌశాంబి దీని ముఖ్యపట్టణము. దీని నేలినవారిలో ఉదయనుడు, పరంతపుడు ప్రసిద్ధులు.

వమ్రి : ఒక కీటకము. ఎక్కుపెట్టియున్న వింటిపై విష్ణుమూర్తి నిదురించుచుండగా ఇది బ్రహ్మ పనుపునపోయి ఆవింటినారి కొరుకగా విష్ణుమూర్తి శిరమూడిపోయెను. (దే.భా)

వరదానము : ఒక తీర్థము. ఇచ్చట విష్ణువు దూర్వాసునకు ప్రత్యక్షమై వరమిచ్చుటచే దీనికాపేరు వచ్చెను. (భార)

వరాహతీర్థము : ఒక తీర్థము. ఇచ్చటనే విష్ణువు ఆదివరాహమయ్యెను.

వల్లభి : గుజరాతులోని భావనగర్‌కు పదునెనిమిదిమైళ్ళ దూరమున పశ్చిమోత్తరముగా గల ఒక సముద్రతీర పట్టణము. ఇది కొన్నినాళ్లు జైనుల కేంద్రముగాను, ఆ తరువాత బౌద్ధుల విద్యాకేంద్రముగాను ఉండెను. ఇది నలందా విశ్వవిద్యాలయముతో పోల్చదగినది, సరితూగునది.

వల్లభి ఒక రాజకులము. భర్తృహరి ఈవల్లభి రాజైన మొదటి శ్రీహరిసేనుని ఆస్థానమున ఉండెను. కల్పసూత్రములను రచించిన భద్రబాహు రెండవ ధ్రువసేనుని ఆస్థానమందు వల్లభిలో నుండెను.

**వసంతసేన :** ఒక వారకాంత. చారుదత్తుడను బ్రాహ్మణుని వరించి, అతనినే చివరకు పెండ్లాడెను. మృచ్ఛకటిక మందలి నాయిక. మృచ్ఛకటికము సంస్కృతములోని ప్రసిద్ధ నాటకము.

**వసుహోముడు :** అంగదేశపు రాజు. మాంధాతకు దండోత్పత్తి ప్రకార మెఱింగించెను. (భార)

**వాకాటక :** బంగాళాఖాతమునకు శ్రీశైలమునకు మధ్యనున్న ప్రాంతము. కైలకిల యవనులు ఈ రాజ్యమును పరిపాలించిరి. వింధ్యశక్తి యనువాడు వీరి ఆద్య ప్రభువు.

**వాతాపిపురము :** మహారాష్ట్రమునకు పూర్వ రాజధాని. బీజపుర జిల్లాలో కృష్ణపాయ అయిన మాలప్రభానది సమీపమున కలదు. ఇదియే బాదామి అను పేరుతో మొదటి పులకేశి రాజధానిగా నుండెను.

**వాత్స్యాయనుడు :** గౌతమ సూత్రములను భాష్యము చేసిన ముని. కామసూత్రములు వ్రాసినవాడు. మౌర్య సామ్రాజ్యము నాటివాడు.

**వాల్మీకి ఆశ్రమము :** కాన్పూరుకు పదునాలుగు మైళ్ళ దూరము లోని బిఠూరు. బిఠూరులో బ్రహ్మావర్త ఘట్టము సమీపమున నొక దేవళమునందు ఒక పెద్ద బరువైన లోహపు బాణపు చివర లేదా ఈటెమొన అనదగిన దానిని చూపింతురు. ఇది లవుడు రాముని గాయపరచిన బాణమని చెప్పుదురు. ఇది గంగానదిలో ఈ శతాబ్దారంభమున దొరికిన దండము.

**వార్ష్ణేయుడు :** నలుని రథసారథి. (భార)

**విక్రాంతుడు :** ఒక రాజు. ఇతని భార్య హైమిని. (మార్క)

విజయవాడ : తూర్పు చాళుక్యుల రాజధాని. ఇది కృష్ణానదీతీరమున కలదు.

విదిశ : భోపాల్ కిరవై ఆరు మైళ్ళ దూరములో నున్న భిల్సా ప్రాంతము. దశార్ణ రాజ్యమున కిది రాజధాని.

విద్యావతి : విశ్వావసుడను గంధర్వుని కూతురు. ఈమె మీనాక్షీ దేవిని ప్రార్థించి మనుజన్మయందు మలయధ్వజుని భార్య కాంచన మాల అయి మీనాక్షీ దేవిని కూతురుగా పొందెను. (స్కాంద)

విద్రుముడు : ఒక బ్రాహ్మణుడు. ఇతని కుమారుడు శివుని వరముచే పుంస్త్వము పొందెను. ఆ కుమారుని సముద్రములో స్నానము చేయుచుండ నొక మొసలి ఎత్తుకొని పోయెను. (క)

వినశనము : ఒక తీర్థము. ద్విజుడు నూతింబడి యజ్ఞము చేయగా సరస్వతీ నదీజల మానూతియందు ప్రవేశించెను. అది హీనజాతుల వారి కగపడదు.

విరజ : గోలోకమందొక వనిత. ఈమె కృష్ణుని వరించెను. ఈమె పుత్రిలు సప్తసముద్రములైరి. (బ్ర. వై)

విరాట : జైపూర్ ప్రాంతము.

విశాఖుడు : కుమారస్వామి దక్షిణ పార్శ్వమునుండి పుట్టినవాడు.

విశాఖ యూపుడు : కల్కి యొద్ద ధర్మములు నేర్చుకొనినవాడు. (క).

విశాలుడు : తృణబిందునకు అతని మనుమరాలైన నలంబుసయందు పుట్టిన కుమారుడు. ఇతనే వైశాలి యను నగరము నిర్మించి పాలించెను. ఇతని పుత్రుడు హేమచంద్రుడు. (విష్ణు. భార).

విష్టి : సూర్యుని కూతురు. కురూపి. సూర్యుడీమెను విశ్వరూపునకిచ్చి వివాహము చేసెను. వీరికి గండుడు, అతి గండుడు, రక్తాక్షుడు, క్రోధుడు, దుర్ముఖుడు అను కుమారులును, హర్షణ అను కూతురును కలిగిరి. (బ్రహ్మ).

విష్ణుయశుడు : శర్యాతి వంశమున పుట్టిన ఒక రాజు. ఇతనినే హయహయుడందురు. ఇతడు వత్స దేశమును పాలించెను.

వృంద : కాలనేమి పుత్రిక, జలంధరుని భార్య.

వృక్షక : భృగువు కుమార్తె. (పద్మ).

వృద్ధకాశి : మద్రాసు రాష్ట్రమందలి పుదుచేలి గోపుర క్షేత్రము.

వేంకటేశ్వరుడు : భృగువు విష్ణుమూర్తి నవమానముచేయగా నతడూరకుండెను. లక్ష్మికి కోపమువచ్చి కొల్హాపురము వెళ్ళిపోయెను. తరువాత విష్ణువు శేషాద్రికి వచ్చి యొక పుట్టలో నుండెను. అతడే వేంకటేశ్వరుడు. ఇతడాకాశరాజు కూతురగు పద్మావతిని లక్ష్మి యనుమతిన పెండ్లాడెను. అకాశరాజితనికి గుడికట్టించెను. తిరుపతి క్షేత్రము భారతీయ క్షేత్రములలో అత్యంతాదరము పొందిన దానిలో ఒకటి. "కలౌ వేంకటనాయకః" అను సూక్తి ప్రసిద్ధము. కలియుగమున అతని సాటి దేవుడు లేడని అందురు.

వేంగి : 1. వేంగి పట్టణము. 2. ఆంధ్రనగరము. ఆంధ్రదేశపు రాజధాని. గోదావరీ కృష్ణా నదుల మధ్య నేటి ఏలూరువద్ద కలదు.

వేత్రవతి : భోపాల్ రాజ్యములోని భేట్వానది.

వేదవతి : హగరీ నది. ఇది బళ్ళారికి సమీపమున కలదు.

వేదారణ్య : తంజావూరులోని అరణ్య ప్రదేశము. అగస్త్యని ఆశ్రమమిచ్చట నుండెను.

వైశాలి : ముజఫర్‌పూర్ (తిరుహుత్) జిల్లాలోని బెసాద్ ప్రాంతము. గండకీనది యెడమ ఒడ్డుపై హాజీపుర్‌కు పదునేనిమిది మైళ్ళ ఉత్తరముగా నున్నది.

రామాయణములో గంగానది ఉత్తరపు టొడ్డుపై విశాలరాజ్యమున్నట్లు కలదు. బాగ్లుమతీ ఒడ్డున ఉన్నట్లు మరికొందరి ఉద్దేశ్యము. వైశాలి బుద్ధుని కాలములో ఉన్నతస్థితి కలిగిన లిచ్ఛవు

లకు రాజధాని. వైశాలి కుత్తరమున విదేహా, దక్షిణమున మగధ ఉండెను. లిచ్ఛవులది గణరాజ్యము. బెసాద్‌కు రెండుమైళ్ళుత్త రానగల బాఖ్రా గ్రామమువద్ద పూర్వపు మర్కటహ్రద ముండెను. ఆ సరస్సుగట్టుపై బుద్ధుడు నివసించిన కూటాగారశాల యుండెను. ఈ ప్రాంతము మహా వనమనబడు చుండెను. దీని సమీపముననే కూటాగారమనెడు స్తూపముండెను. ఈ స్తూపమునందు ఆనందుని యొక్క అవశేషము లున్నవందురు. బెసాద్‌కు దక్షిణాన ఒక తోపు ఉండెను.

గంగ ఒడ్డుమీద ఛాప్రాకు తూర్పున ఏడు మైళ్ళ దూరములో నున్న ఛింరాత్ అనునది నాటి వైశాలి యని కొందరందురు.

**వైశాలిని :** విశాలరాజు కూతురు. నా॥ విసాల

**వైశ్య :** ధృతరాష్ట్రుని భార్య. ఈమె కుమారుడు యుయుత్సుడు.

**వ్యాఘ్రేశ్వరుడు :** శివుడు. కాశీక్షేత్రమున విశ్వేశ్వరుని గుడికి వచ్చు భక్తులను దుందుభి యను రాక్షసుడు సంహరించి భక్షించు చుండగా శివుడు వ్యాఘ్ర రూపమున వచ్చి ఈ దుందుభిని చంపెను. అట్లు వచ్చిన శివుడే వ్యాఘ్రేశ్వరుడు.

**వ్యాసకాశి :** చూ వ్యాసుడు.

**వ్యుషితాశ్వుడు :** పౌరవంశస్థుడైన రాజు. ఇతను నూరు క్రతువులు చేసెను. కాని నిరంతరము కామాసక్తుడగుటచే రోగపీడితుడై మరణించెను. ఇతని భార్య భద్ర యనునది సంతానము లేనిదే బ్రతుకజాలనని రోదించుచుండ శవమునుండి ఒక వాణి వెలువడి, ఆమె ఋతుమతియైన ఎనిమిది పదునాల్గవ దినముల భర్తను తలచు కొనిన ఆమెకు సంతానము కలుగునని చెప్పెను. ఆమె అట్లే చేసి శాక్షీవతి యను కూతుని కనెను.

## శ

**శంఖములు :** శివునిచే చంపబడిన శంఖచూడుని అస్థికలనుండి పుట్టినవి. (బ్రి.నై)

**శంబళపురము :** కలియుగమున విష్ణుమూర్తి విష్ణువర్మ యను పేరుతో నవతరించు పట్టణము, ఢిల్లికి తూర్పున మొరాదాబాదు లో 80 మైళ్ళ దూరమున ఉన్నది. (భార)

**శంబూకాశ్రమము :** నాగపూరు సమీపమునందలి రామ్‌టేకి. కాళిదాసు మేఘదూతములోని రామగిరి కూడ ఇదియె.

**శకద్వీపము :** టర్కీలో కలిపిన తార్తారు రాజ్యము. మధ్య ఆసియా ప్రాంతము. బొఖారా సమర్ఖందులకు మధ్యనున్న పామీరు ప్రాంతము. భారత విష్ణు పురాణములలో పేర్కొనబడిన నదులు పర్వతములు దేశములు టాలమీ (గ్రీకు ప్రామాణిక భూగోళ శాస్త్రజ్ఞుడు—2వ శతాబ్దము) రచనలలో ఈ క్రింది రీతి సాపత్యము కలిగియున్నది.

| | |
|---|---|
| కుముద | కొమెదాయ్ |
| సుకుమార్ | కొమరాయ్ |
| జలద | గోలక్‌తో పుగోయ్ |
| జలంధర | సలటిరోయ్ లేక జరటోయ్ |
| మృగ | మార్జిని లేక మార్జియానా |
| మసక | మస్స గెటాయ్ |
| మందగ | మథై టిగోయ్ |
| సితా | సిర్దరియా |
| చక్షుర్వర్ధన | ఆక్సస్ |
| కుమారి | హ్వా లేక వోల్గా |
| మేరు పర్వతం | ఇమూస్ |
| మలయ పర్వతం | అలన |

| | |
|---|---|
| శ్యామగిరి | కాకసస్ (అవెస్టా గ్రంధములోని శ్యామక) |
| కుసుమోద | ఖోరస్మాయి |
| మాదాదీ | మార్ద్యో నోయ్ |
| ఇక్షు | అక్సస్ |
| అష్టగిరి | అస్కటంగ్క |
| దుర్గశైల | యల్ బుర్జ్ |
| మారాకండ | సామర్కండ్ |
| హిరణ్వతి హాటకనది | జరప్ షాన్ |

శక్తిమతి : సురభుడనురాజు పాలించిన పట్టణము. (జై. భా.)

శబళాశ్వులు:-అసిక్నియందు దమునికి బుట్టినకుమారులు. వీరు సృష్టి చేయుటకై పోవుచు నారదుని మాటలువిని సృష్టిచేయుట మాని తపోవనమున కేగిరి. (భాగ)

శశాదుడు:-ఇక్ష్వాకు పెద్దకుమారుడు. వీని పేరు వికుక్షి. ఇతడు శ్రాద్ధమునకై మాంసమునకై శశకములను వేటాడి ఒక శశక మును దినుటచే ఇక్ష్వాకుడు ఈతనిని నగరమునుండి బహిష్కరించెను. ఇతనికి శశాదుడని పేరువచ్చెను. శశాదుని కుమారుడు పురంజయుడు. (విష్ణు భాగ)

శశికళ : సుబాహువను కాశీరాజు కుమార్తె. ఈమె ధృవసింధుని కుమారుడైన సుదర్శనుని వలచెను. (మార్క)

శాకల:-మద్రదేశ రాజధాని. ప్రస్తుత పంజాబ్‌లోని అపగానిస్థానని సంగ్లావాలా - టిబా

శాకాంబరి: పశ్చిమ రాజపుత్రస్థానములోని శంభార గ్రామము. దేవయానిని శర్మిష్ఠ నూతిలో త్రోసినది ఇక్కడని, ప్రథ. దేవ దాని అను ఒకనూతిని దాని దృష్టాంతముగా చూపుదురు.

**శారదండాయని :** ఒక రాజు. ఇతని భార్య శ్రుతసేన. ఇతని క్షేత్రజ కుమారుడు తర్దముడు. (భార)

**శాలంకాయనుడు :** కన్యకాపురాణమును చెప్పిన ముని. (కన్య)

**శాల్మలీద్వీపము :** చాల్దియా. మెసపటోమియా లేక అస్సిరియా.

**శాస్త :** శివునికి జగన్మోహినియందు పుట్టిన కుమారుడు. దేవతలను రక్షించుచుండును. (స్కాంద)

**శిఖండిని :** 1. అర్థి భార్య. హవిర్ధానుని తల్లి.

2. విజితాశ్వుని భార్య. పాలకుడు, పవమానసుడు, శుచి యను త్రేతాగ్నులీమె గర్భమున బుట్టిరి. (బ్రహ్మ) (భాగ)

**శివదూతి దేవి :** ఈమెయే కౌశిక. శుంభనిశుంభులు దేవతలను బాధపెట్టుటచే దేవత లీశ్వరునితో జెప్పుకొనిరి. వారిని పాతాళ లోకమునకు బొమ్మనియు లేనిచో సంహరింప బడుదురని జెప్పుటకు గౌశిక దూతగ బంపబడెను. అందుచే నామెకు శివదూతి యని పేరు వచ్చెను. (మార్క)

**శిష్టి (శివుడు) :** శంభువునందు (ధన్యయందు) ధ్రువునకు బుట్టిన కుమారుడు. ఇతని భార్య సుచ్ఛాయ. (విష్ణు. మత్స్య)

**శుభాంగి :** కళింగాధిపతియైన చిత్రాంగదుడను రాజు కుమారిత. దుర్యోధనుడు స్వయంవరమున ఈమెను ఎత్తుకుని పోయెను. మిగిలిన రాజులందరిని కర్ణు డోడించెను. (భార)

**శుష్కుడు :** ఒక ముని. మహేంద్ర పర్వతముపై తపస్సు చేసికొనుచుండిన పరశురాముని కడకరిగి, సముద్రుడు గోకర్ణ క్షేత్రమును ముంచెను. నీవు దుష్ట సంహారమునకై తపస్సు భంగము జేసినను బాతకము రాదని పరశురాముని వేడెను. (బ్రహ్మ)

**శూరపద్మాసురుడు :** సురసయందు కశ్యపుని వలన జన్మించిన రాక్షసుడు. భార్య పద్మకోమల. కుమారుడు భానుకోపుడు.

శూర పద్మాసురుడు కుమారస్వామితో యుద్ధము చేసి మరణించెను. (స్కాంద)

**శౌనహోత్రుడు :** శునహోత్రుని పుత్రుడు. ఇతడు తరువాతి జన్మములందు గృత్సమదుడు, శౌనకుడుగ పుట్టెను. (భార)

**శ్రావస్తుడు :** యువనాశ్వుని కుమారుడు. ఇతడే శ్రావస్తియను పురమును నిర్మించెను. ఇతని కుమారుడు బృహదశ్వుడు. (భాగ)

**శ్రీకుండలుడు :** హేమకుండలుడను వైశ్యుని కుమారుడు. వీని సోదరుడు వికుండలుడును, ఈతడును దుర్వ్యర్తనులై నరకమునకు పోయిరి. కాని వికుండలుడు మాఘమాసములో స్నానముచేయుటచే స్వర్గమునకు చనెను. (పద్మ)

**శ్రీమతి :** ఇక్ష్వాకురాజు అగు అంబరీషుని కుమార్తె. ఈమె స్వయంవరమునందు విష్ణుమూర్తిని వరించెను. (లింగ)

**శ్రీక్షేత్రము :** పూరీ జగన్నాథక్షేత్రము.

**శిష్టి :** శిష్టి. (హరి)

**శ్వేతకర్ణుడు :** ఒకరాజు. సత్యకర్ణుని కుమారుడు. ఇతనిభార్య మాలిని. ఇతనికి అజ పార్శ్వుడను కుమారుడు కలిగెను.

## ష

**షడారణ్యము :** పాలార్ నది ప్రవహించు భూభాగములో కంచి వెల్లూరుల మధ్యనున్న ప్రదేశము.

## స

**సంకృతి :** మన్యువు కుమారుడైన నరుని పుత్రుడు. ఇతనికుమారుడు రంతిదేవుడు. (భాగ)

**సంవర్తనుడు :** అంగీరసుని పుత్రుడు. బృహస్పతి సోదరుడు.

**సత్యతపుడు :** జకటోరుపాడు. ఇతడు మార్గస్థుల హింసించి వారి ధనమపహరించి బ్రతుకుచుండువాడు. ఇతడు అరుణిశిష్యుడై శకట వృక్షములను తినక నిరాహారుడై ఎల్లప్పుడును సత్యముచే చెప్పుచుండెను.

**సత్యసేనుడు :** కర్ణుని కుమారుడు. భారత యుద్ధమున నకులునిచే చంపబడెను.

**సప్తద్వీపములు :** జంబు, ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శక, పుష్కర ద్వీపములు.

**సప్తగంగ :** గంగ, గోదావరి, కావేరి, తామ్రపర్ణి, సింధు, సరయు, నర్మద

**సప్తసాగరములు :** లవణ సముద్రము భారతదేశమును చుట్టిన సముద్రము. క్షీరసముద్రము - కాస్పియన్ సముద్రము. షిర్వాన్ సముద్రము అను పదభ్రంశము. సురా సముద్రము - స్రైన్ సముద్రము కాస్పియన్ సముద్రభాగము. ఘృత సముద్రము ఇరిత్రియన్ సముద్రము లేక పర్షియన్ గల్ఫ్. ఇక్షు సముద్రము ఆక్సస్‌నది. దధి సముద్రము ఆరల్ సముద్రము దాహె అను తెగ వారు నివశించు ప్రదేశము. జక్సార్టెస్ కుత్తరమున నున్నది. స్వాదుసముద్రము ఛాదున్ నది మంగోలియాలో ఒకనది.

**సప్తసింధు :** పంజాబ్. ఆర్యులు వలసచేరిన ప్రదేశము. ఇరావతి, చంద్రభాగ, వితస్తా, విపాశ, సింధు, సరస్వతి (లేక కాబూల్ నది) ఇది ఏడు నదులుండు ప్రదేశము.

**సరస్వతి :** 1) గంగకుపనది; 2) అంబాలలో ఉన్నఒకనది 3) ఆఫ్ఘన్‌స్థాన్‌లోని హెల్మాండ్. 4) ఆర్కోషియా. 5) గుజరాత్‌లోని రాణాక్షి.

**సర్పములు :** కశ్యపునివలన కద్రువకుపుట్టిన కుమారులు. సర్పములు వాసముచేయుటకు ప్రత్యేకము నాగలోకము కలదు.

**సర్వకర్ముడు :** సౌదాస వంశమునందు పుట్టినరాజు. పరశురాముని ధాటికాగలేక పరాశరుని ఆశ్రమమున ఇతడు తలదాచుకొనెను. వీని శూద్ర పరివర్తనంబున సర్వకర్మలను పరాశరుడు చేయించు

కొనెను. కాన వీనికి సర్వకర్ముడను పేరువచ్చినది. కశ్యపుడీతనికి రాజ్యమిచ్చెను. (భార)

**సహ్యాద్రి :** కావేరి కుత్తరమునన్నున్న పశ్చిమ కనుముల భాగమును సహ్యాద్రి అందురు. కావేరి దక్షిణభాగముననున్న పడమటి కనుమలను మలయగిరి అందురు. (బ్రహ్మ)

**సాహూర్జి :** ప్రియవ్రతుని కుమార్తె. (భార)

**సాహసికుడు :** బలిపుత్రుడు. ఇతడు కృష్ణునిగూర్చి తపస్సు చేసెను. ఇతడు గంధమాదన పర్వతముపై తిలోత్తమతో కూడియుండగా దూర్వాసుని వ్రతమునకు భంగము కలిగి అతడు వీనిని గాడిదవై రాక్షసుడవై యుండుమని శపించెను. సాహసికుడు శాపాంతముకై ప్రార్థింప దూర్వాసుడాతని కరుణించి 'నీవు బృందావనమునందు కృష్ణునిచే చంపబడి శాపవిముక్తుడవగుదు'వని చెప్పెను.

**సాలాతూర :** పాణిని జన్మస్థలము. పంజాబ్‌లో లాహోర్ గా గుర్తించుదురు.

**సాళ్వ :** కురుక్షేత్ర సమీపమందున్నది. సావిత్రీ సత్యవంతుల కథ లోని సత్యవంతుని రాజ్యము

**సాళ్వపురము :** ఆళ్వా.

**సీమంతిని :** చిత్రవర్మ అను రాజుకూతురు. చంద్రాంగదునిభార్య

**సుకుమారి :** సృంజయుడను రాజుకూతురు. ఈమెను నారదుడు పెండ్లాడెను. (భార)

**సుచ్ఛాయ :** అగ్నికుమార్తె. శిష్టిభార్య. (మత్స్య)

**సునందము :** విశ్వకర్మచే నిర్మింపబడినముసలాయుధము. కుజంభుడను రాక్షసుడు దీని ప్రభావముచే గెలుచుచుండెడివాడు. వీనికి స్త్రీస్పర్శ తగిలినచో దీని శక్తిపోవును. కుజంభునిచే నపహరింపబడిన ముదావతి దీనిని స్పృశించెను. (మార్క)

**సుబలుడు :** గాంధారి తండ్రి. ఇతనికి సత్యవ్రత, సత్యసేన, సుధేష్ణ, దశార్ణ మొదలయిన కుమార్తెలు కలరు. వీరందరిని దృతరాష్ట్రుని కిచ్చి వివాహము చేసెను. శకుని ఈతని కుమారుడు. (భార)

**సుముఖుడు :** ఆర్యకుడను భుజంగరాజు మనుమడు. చికురుని కుమారుడు. ఇతని భార్య గుణకేశి.

**సుయశ :** అనశ్వుని కుమారుడగు పరీక్షిత్తు భార్య. ఈమె కుమారుడు భీమసేనుడు. (భార)

**సువర్ణభూమి :** (శోణాపరాంతము) బర్మా

**సూరిశర్మ :** శివదత్తుడను ముని కుమారుడు. మనుజన్మయందు మృగమయ్యెను. పరశురామునితో బోయి అగస్త్యాశ్రమమున కృష్ణ స్తోత్రము విని స్వర్గము పొందెను. (బ్రహ్మ)

**సూర్యదత్తుడు :** విరాటరాజు తమ్ముడు. యుద్ధములో ద్రోణు డీతని సంహరించెను. (భార)

**సోమద :** ఊర్మిళయను గంధర్వాంగనకుమారిత. ఈమె చూలి యను మునివలన బ్రహ్మదత్తుడను పుత్రుని బడసెను. (రామా)

**సౌమిని :** ఒక బ్రాహ్మణస్త్రీ. ఈమె చెడ్డనడతచే మరుజన్మమున చండాల కన్యయై జన్మించి బిచ్చమెత్తుకొనుచుండెను. శివరాత్రి నాడు ముష్టియడుగ నొకడు ఒక దండ ఇచ్చెను. ఆమె కోపముతో దానిని విసిరివేయగా అది శివలింగముపై బడి ఆమెకు పుణ్యలోకములు వచ్చెను. (శివ)

**సౌవీరము :** గుజరాత్‌లో ఒక భాగము, బైబిలులోని ఓఫిర్ లేక సోఫిర్ కావచ్చునని కొందరందురు. సింధు జీలమ్‌ల మధ్యభాగమని కొందరందురు.

## హ

హంసకూటము : ఒకకొలను

హంసధ్వజుడు : 1) ఒకరాజు. ఇతని పుత్రులు సుధన్వుడు, సురథుడు అనువారలు (జై భా) 2) వృషధ్వజుని కుమారుడు. ధర్మధ్వజుడు, కృశధ్వజుడు ఇతని కుమారులు (బ్ర. వై.,)

హరిహర్షుడు : అగ్నీధ్రుని కుమారుడు. ఇతని పేరనే ఇతడు పాలించిన హరివర్షము పరగుచుండెను. (విష్ణు)

హరివాసము : ఉత్తరదేశమున నొక పురము. దిగ్విజయార్థమరిగిన అర్జునుడిచటికి చనెను. (భార)

హాటకదేశము : అర్జునుడు దిగ్విజయార్థము ఈదేశమునకుగూడ పోయెను. ఇచట మానసము అను కొలను కలదు. (భార)

హాలాశ్యము : ఒక పుణ్యక్షేత్రము. మధురానగరముయొక్క పూర్వపు పేరు. అచటి దేవుడు సుందరేశ్వరుడు. (స్కాంద)

హిరణ్యధన్వుడు : ఎఱుకలరాజు ఏకలవ్యుని తండ్రి. (భార)

హేమకుండలుడు : కృతయుగమునందు నైషధపురములోనున్న నొక వైశ్యుడు. ఇతనికి ధర్మశీలుడు, శ్రీకుండలుడు అనువారలు పుత్రులు. (పద్మ)

హేమవర్మ : 1) విరాటరాజు తమ్ముడు. 2) దశార్ణ దేశాధిపతి. ఇతని కుమారిణయే వంచనచే స్త్రీయైన శిఖండికి వివాహము చేయబడెను. (భార)

---

# స్వస్తి

శుభము శుభము నవభారత
నిర్మాతల కమను శుభము.
దేశభాగ్య మినుమడించు
శ్రామికులకు కలుగు సుఖము.

కరువు వరద పెను తుఫాను
ప్రజలపీడ తొలగవలెన్
వ్యవసాయం వాణిజ్యం
పరిశ్రమలు పెరుగవలెన్.

బ్రతుకు బరువు మోయలేక
నరుడెవడూ కృంగరాదు
అంకినంత ఆర్జించగ
జనులు నీతి తప్పరాదు.

నిర్జీవపు గర్భంవలె
గనిసంపద మూల్గరాదు
వ్యర్థముగా వలవలమని
నదులు కడలి కేగరాదు.

ఆనకట్ట లడుగడుగున
నదులమీద వెలయవలెన్
సీమ సీమ తనివి నదులు
నవజీవం పోయవలెన్.

శత్రు దుర్నిరీక్ష్య రక్ష
మన కెప్పుడు నిలువవలెన్
తిరుగులేని ప్రగతి నావ
ఎదురులేక సాగవలెన్.

సిరుల కళల మేటి యనగ
అవని మనల మెచ్చవలెన్
సకల జనులు సములుకాగ
భువిని న్యాయ మేలవలెన్.

శుభము శుభము నవభారత
నిర్మాతల కమను శుభము
దేశభాగ్య మినుమడించు
శ్రామికులకు కలుగు జయము.



# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 13 | విచిత్ర వీరుడు | విచిత్ర వీర్యుడు |
| | 24 | యుందుటవలన | యుండుటవలన |
| | | బ్రాహ్యణుల | బ్రాహ్మణుల |
| 3,4 | 1 | లోములు | లోకములు |
| 4 | 2 | అతదు | అతడు |
| 7 | 6 | అచ్యత కృష్ణానిధి | అచ్యుత కృష్ణానిధి |
| 8 | 5 | అజవీఢుడు | అజమీఢుడు |
| | 7 | విధిసారుదు | విధిసారుడు |
| 9 | 20 | అద్భుళ్యంతి | అదృశ్యంతి |
| 10 | 5 | వ్యావహారిక సత్త అని | వ్యావహారిక సత్తని |
| 11 | 8 | పంచధూతములను | పంచభూతములను |
| 13 | 2 | శాంచల్యము | చాంచల్యము |
| 15 | 20 | రుక్మిణి కూతునందు | రుక్మికూతునందు |
| 16 | 23 | వీశ్వేశ్వరుడు | విశ్వేశ్వరుడు |
| 18 | 26 | వానుకి | వాసుకి |
| 22 | 10 | అంధ్ర కలితా | ఆంధ్రకవితా |
| | 11 | నహితము | సహితము |
| 23 | 10 | అనునట్లు | అగునట్లు |
| 23 | 23 | అబడబారూపమును | అగు బడబారూపమును |
| 27 | 14 | దీనిదే | దీనినే |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 30 | 1 | ఇద | ఇది |
| 33 | 1 | ఆ వవ ఖాండేశ్వరుడు | ఆసవ ఖాండేశ్వరుడు |
| 33 | 22 | ఇం్రజిత్తు | ఇంద్రజిత్తు |
| 34 | 25 | ఇతటు | ఇతడు |
| 35 | 7 | ఇంద్రసేనును | ఇంద్రసేనుడు |
| 36 | 21 | అశ్వివీ దేవతలకు | అశ్వినీ దేవతలకు |
| 37 | 6 | ఇలబల | ఇలబిల |
| 38 | 20 | ఇద్రవాహనము | ఇంద్రవాహనము |
| 41 | 18 | విదిదల | విడిదల |
| | 24 | వినబదెది | వినబడెడి |
| | 27 | ఉస్మృతుల్లు | ఉపస్మృతులు |
| 42 | 3 | స్మృత్రి | స్మృతి |
| 43 | 4 | అనిరుద్ధు | అనిరుద్ధుడు |
| 53 | 6 | పౌన్పె | పాన్పె |
| | 57 | జ్యామషుడు | జ్యామఘుడు |
| 54 | 3 | కద్దమ | కర్దమ |
| | 20 | తుర్వనుని | తుర్వసుని |
| 55 | 13 | కన్యగాంనుడు | కన్యగానుండు |
| 57 | 16 | సంధ్యోపాషునాగ్ని | సంధ్యోపాసనాగ్ని |
| 59 | 19 | నితన | వినత |
| | 20 | క్రదుష | క్రదుష్ణ |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 63 | 13 | గోపాకులకు | గోపాలకులకు |
| 74 | 11 | విశ్వామిత్రుని | విశ్వామిత్రుని |
| 77 | 13 | వెనూఱు | ఏనూఱు |
| 79 | 1 | భగీరధుచి | భగీరధుని |
| | | తంత్రి | తండ్రి |
| 82 | 15 | షంత్రమును | మంత్రమును |
| 85 | 1 | అహారము | ఆహారము |
| | 9 | అంతటి | అంతట |
| 87 | 8 | దాతల | దానితల |
| 89 | 6 | అర్జునకు | అర్జునునికి |
| 89 | 20 | గరుదోద్భవ | గరుడోద్భవ |
| | | బ్రంహ్మాండ | బ్రహ్మాండ |
| 95 | 10 | ధ్యాసపర్వతమున | ధ్యానపరత్వమున |
| 117 | 6 | తయారణుడు | త్రయారణుడు |
| 120 | 1 | త్రిలోచనునుడు | త్రిలోచనుడు |
| 121 | 7 | ఛాయిూదేవి | ఛాయాదేవి |
| 122 | 8 | పదతాలిత్యం | పదలాలిత్యం |
| 123 | 18 | దర్పకుడు | చర్పకుడు |
| 124 | 2 | రుద్ధశర్మని | వృద్ధశర్మని |
| 129 | 18 | అత్రికిని | అత్రికిని |
| 131 | 9 | ఖోగములు | భోగములు |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 134 | 10 | బలమధ్యమున | జలమధ్యమున |
| 135 | 5 | ద్రవడ | ద్రవిడ |
| 137 | 22 | రాచీన | ప్రాచీన |
| 140 | 21 | వైవశ్వత | వైవస్వత |
| 142 | 13 | సత్యదృతి | సత్యధృతి |
| | 18 | ధ్రుష్జవర్మడు | ధృష్టవర్మడు |
| | 19 | దృడుడు | దృష్టుడు |
| | 20 | దాష్ట | దార్ష్టి |
| 143 | 10 | యామె | యామి |
| 144 | 10 | హారిశ్చంద్రుని | హరిశ్చంద్రుని |
| | 19 | పర్వములమ | పర్వములను |
| | 21 | తిక్కన పోమయాజి | తిక్కన సోమయాజి |
| 145 | 17 | కెలియ జేయకయే | తెలియజేయకయే |
| | 18 | ముంచుకు | ముందుకు |
| | 22 | కొనుకు | కొడుకు |
| 146 | 18 | అసురులలో | అసురులతో |
| 149 | 1 | యాయాత్యీ | యయాతి, |
| | 6 | అగస్త్యమ | అగస్త్యుడు |
| 150 | 19 | గ్రంబసంఖ్య | గ్రంధసంఖ్య |
| 152 | 18 | నాళీఇంఘుని | నాళీజంఘుని |
| | | సఖుడు | సఖుడు |
| 154 | 10 | ప్రాణుల | ప్రాణుల |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 154 | 10 | కనుతెబ్బ | కనుతెప్ప |
| 156 | 20 | బ్యాఖ్యానము | వ్యాఖ్యానము |
| 165 | 12 | దీనిభడు వామన | దీని భర్తవామనము |
| 166 | 2 | వీగు | వీరు |
| | 16 | పుంరీకాక్షుడు | పుండరీకాక్షుడు |
| 167 | 11 | క్రదుము | క్రమము |
| 168 | 24 | విశక్రవసు | విశ్రవసు |
| 169 | 21 | పుష్పవంతుడు | దీనిని వేరుపదముగా చదువు కొనవలెను |
| 170 | 5 | అగ్నిమితుడు | అగ్నిమిత్రుడు |
| 171 | 7 | ప్రధువు | పృధువు |
| 171 | 16 | స్వఫల్కురి | స్వఫల్కుని |
| 173 | 15 | వీమహిమ | నీమహిమ |
| 176 | 1 | దోషణగు | దోషగుణ |
| | 5 | వర్రుని | వజ్రుని |
| | 10 | రాటధాని | రాజధాని |
| | 13 | సునంభ | సునంద |
| 179 | 17 | పాచిన్వానుడు | ప్రాచిన్వానుడు |
| 180 | 6 | ప్రహ్ణోదుడు | ప్రహ్లోదుడు |
| 180 | 11 | కలడోకారము | కలదోంకారము |
| 187 | 24 | పసుదేవుని | వసుదేవుని |
| 188 | 10 | రెంని | రెండింటి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 189 | 19 | నియమింప్యబడి | నియమింపబడి |
| 192 | 25 | అచటి | అచట |
| 199 | 25 | మంతాంతర | మతాంతర |
| 202 | 17 | అంతార్థానము | అంతర్థానము |
| | 20 | జీవింసవలసిన | జీవింప వలసిన |
| 203 | 1 | బయటికిచ్చి | బయటకు వచ్చి |
| | 11 | ధర్మ్యైళుడు | ధర్మ్యైళ్వుడు |
| | 17 | మఱియు | మఱియు |
| 204 | 14 | భానుమంతుంతుకు | భానుమంతుడు |
| | 20 | నూదకము | సూచకము |
| | 22 | పాలడవులతో | పాండవులతో |
| 206 | 12 | బార్గభూమి | భార్గభూమి |
| | 22 | కోమట్లికు | కోమట్లకు |
| 207 | 24 | గ్రంధాటి | గ్రంధాది |
| 210 | 14 | అర్జునుము | అర్జునుడు |
| | 15 | అంతటి | అంతట |
| 213 | 8 | భమరాంబ | భ్రమరాంబ |
| 214 | 11 | మందవాహివి | మందవాహిని |
| 215 | 25 | అంతటి | అంతట |
| 219 | 12 | పదునలుగుదు | పదునలుగురు |
| 221 | 3 | నాగములు | యాగములు |
| 223 | 4 | మహాపద్మ్యుడు | మహాపద్మడు |
| | 23 | దక్షిము | దక్షిణమున |
| | 23 | కుత్తరమునన | కుత్తరమున |
| 231 | 7 | నజ | నిజ |
| 232 | 16 | నీరు | నీఱు |
| 233 | 2 | పితృ | పితౄ |
| 239 | 12 | క్రౌతాగ్ని | క్రౌఞ్చాగ్ని |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 15 | యజ్ఞధాన | యజ్ఞవిధాన |
| | 27 | యజ్ఞడు | యజ్ఞుడు |
| 241 | 4 | వృషపర్వని | వృషపర్వుని |
| 243 | 5 | యజుర్గణధిష్ఠిత | యజుర్గణాధిష్ఠిత |
| | 10 | వాదిననేయ | వాజసనేయ |
| 241 | 22 | వరాహకల్పము | వరాహకల్పము అని |
| | | చెప్పబడును. | యు. చెప్పబడును. |
| 255 | 14 | శ త్తమునందు | నె త్తమునందు |
| 256 | 9 | ప్రచిత్తి | విప్రచిత్తి |
| 257 | 11 | అవి | అని |
| 258 | 5,6 | పరమయోగులైన | పరమయోగులై |
| 261 | 18 | సుఖాషిత | సుభాషిత |
| 263 | 6 | లోపతి | లోపలి |
| 264 | 5 | హిరణ్య కశ్యపుని | హిరణ్యకశిపుని |
| 266 | 3 | వరాహమహిపలుడు | వరాహమిహిరుడు |
| 264 | 7 | దైృశ్యః | దైవ్యశ్యః |
| | | ఉరూ | ఊరూ |
| | 16 | పన్యాసము | సన్యాసము |
| 268 | 7 | దారు | వారు |
| | 18 | షక్తి | శక్తి |
| 271 | 1 | ఐకడు | ఒకడు |
| 267 | 16 | మృగము | మృగము |
| 290 | 3 | శ్యాంత్యాదులను | శాంత్యాదులను |
| | 14 | ప్రయత్యభి | ప్రయంత్యభి |
| | 15 | బ్రహ | బ్రహ్మ |
| | 16 | అకాశ | ఆకాశ |
| | | ఈస, | ఈశ |
| | 17 | భహ్మణం | బహ్మణం |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 22 | కల్పయతి | కల్పయంతి |
| | 24 | ప్రజామేయ | ప్రజాయేయ |
| 290 | 27 | త్యాగేనైకేన | త్యాగేనైకే |
| | 27 | సతం | సత్యం |
| | 28 | పరోక్షద్బ్రహ్మ | పరోక్షాద్బ్రహ్మ |
| 291 | 1 | ఆత్మ ఆకాశ | ఆత్మన ఆకాశ |
| | 14 | పట్టిరాగా | పట్టరాగా |
| 294 | 12 | వైశ్వదేశము | వైశ్వదేవము |
| 295 | 9 | ఖలడించి | ఖండించి |
| 303 | 12 | శక్తకర్తా | శకకర్తా |
| | | శావివాహనః | శాలివాహనః |
| 305 | 14 | తోబరుచుకొని | లోబరచుకొని |
| | 26 | బుభుక్షా | భుభుక్షా |
| 306 | 20 | భీష్ణ్మని | భీష్మని |
| 307 | 12 | ప్హ్లాదుని | హ్లాదుని |
| 316 | 8 | ద్రౌపతి | ద్రౌపది |
| 317 | 2 | అలదు | అందు |
| | 18 | తప్పుక | తప్పక |
| 318 | 20 | శసంకృతి | సంకృతి |
| 337 | 5 | కొషుకు | కొడుకు |
| 343 | 17 | అప్టోర్యామము | అష్టోర్యామము |
| 346 | 12 | వౌశనసస్మృతి | ఔశనసస్మృతి |
| | 16 | విష్ణుస్మృత్యీ | విష్ణుస్మృతి |
| 350 | 15 | ధృష్ణకేతుని | ధృష్టకేతుని |
| 351 | 3 | నిరూఢపశబంధము | నిరూఢపశుబంధము |



# ఈ గ్రంథం గురించి

★ పిల్లలలో బొత్తిగా నశిస్తున్న పౌరాణిక సంప్రదాయ పరిచయానికిది బాగా పనిచేస్తుంది.

★ రచయిత సాధు లక్ష్మీనరసింహ శర్మ గారు చాలా విద్యలలో ప్రవేశం గలవారు. సంస్కృత పండితులు, బహుభాషాకోవిదులునగుటచే లోకవ్యవహారంలో వ్యవహరింపబడు చాలా పదములకు, వేదములు మున్నగువాటికి అనేక ఉద్గ్రంథముల నుండి పూర్వవృత్తములను, సంప్రదాయ సిద్ధములగు విషయ విశేషములను ఈ గ్రంథంలో చేర్చారు.

★ ఈ గ్రంథంలో అనేకములగు విషయములు మనకు తెలియనివి, తెలుసుకోవలసినవి, ఆశ్చర్యజనకములైనవి కలవు. పురాణములందు పేర్కొనబడిన స్త్రీ పురుషులయు, తీర్థప్రదేశాదులయు, వివిధ మతముల సారాంశమును గూర్చియు - ఏ వ్యక్తి ఎవరు? ఏ ప్రదేశమెచ్చటనున్నది? దాని ప్రాముఖ్యమేమి? అను విషయములను క్షణికకాలంలో తెలుసుకొనవలయునన్న ఈ గ్రంథం మిక్కిలి ఉపయోగకరము.

★ సంస్కృతాంధ్రములయందలి కవులను గూర్చియు తత్కృతులను గూర్చియు సంగ్రహముగా చెప్పబడియున్నది. ఈ గ్రంథమునకు "పురాణ నామ సంగ్రహమను" పేరున్నను పురాణేతర నామములను గూర్చి గూడ నిది వివరించుచున్నది. కనుక ఈ గ్రంథం "పురాణా గాథా సముద్రమని" చెప్పదగినది.

కావున జిజ్ఞాసువులైన తెల్గు పాఠకులు ఈ గ్రంథాన్ని అవశ్యమూ పఠించి సమగ్ర జ్ఞానము పొందవచ్చును.